# క్రీస్తునాధుని అనుసరణము

క్రొత్తకూర్పు

కేగన్ పాల్ ఆంగ్లానువాదమునకు
ఆంధ్రీకరణము



ముద్రాపకులు :

సెయింట్ మైకల్స్ ఇండస్ట్రియల్ స్కూలు ప్రెస్,
గుంటూరు.

1951

# పీఠిక.

‘క్రీస్తునాథుని అనుసరణ’ మను ఈ పుస్తకము లతీను భాషలో మూడు శతాబ్దములకు ముందె ముద్రితమై, యూరపుభాష లన్నిటను అనువదింపబడి, వేదశాస్త్రుల మెప్పును, సత్క్రీస్తువుల పొగడ్తలను, అన్యమతస్థుల ఆదరణమును బొందిన గ్రంథరాజము. పరిశుద్ధ గ్రంథముల సారాంశము గావున దీనితో తులదూగగల దిదియే యని చెప్పవలసి యుండును. ఇట్టి యుత్తమ గ్రంథము ఆంధ్రమునలేని లోపమును దీర్ప, ఇంచుమించు వంద సంవత్సరముల క్రిందట నిది తమిళమునుండి తెనుగునకు తర్జుమా చేయబడినది.

పిమ్మట 1924 సం॥న ఫా॥ జాన్ ఆలెన్ స్వాములవారిచే నెల్లూరు నందు పునఃముద్రిత మొందినది. పురాతన కూర్పులో, తమిళభాషా సాంప్రదాయ మచ్చటచ్చట గన్పట్టుచుండుటకు వగచి, గుంటూరు పీఠాధిపతులగు మ॥ ఫా॥ యం. ఇగ్నేషియస్ మేత్రాణులవారు నేటికాల ఆంధ్రక్రీస్తువుల భాషాభిరుచుల కనువగు విధమున అనువదింపుమని “శక్రుని యేసుస్వామి చరితమును” భాషాంతరీకరించిన శ్రీ మారెళ్ల ఆదినారాయణగారికి ‘శేగన్ పాల్’ లతీను నుండి నూటిగా అనువదించిన ఆంగ్లప్రతి నిచ్చియుండిరి. వారు శ్రమ యనక దానిని టీక తాత్పర్యములతో సహా తెనిగించిరి. గ్రంథవిస్తరణ భీతిచే దానిని పలువురు గురువులు పట్టుదలతో సవరించి క్లుప్తపరచి, ఇప్పుడున్న రూపమునకు దెచ్చియున్నారు. ఇందలి గుణగణములను పాఠకులే గ్రహింతురుగాక!

భాషాభాగమటులుంచి, ఉత్తమ క్రీస్తువ జీవితమును జీవింపదలచువారి కీపుస్తక మెంతయును సహాయపడునని చెప్పగలము. ఇది గురువులకును మఠకన్యకలకేగాక, చదువగల ప్రతి కతోలిక యువతీ యువకులకును అత్యంతోపకారియై యుండును. మతేతరులుసైత మీగ్రంథ పఠనముచే అపారమగు ఆధ్యాత్మిక లాభమును పొందగలరు.

*Censor ad hoc :*
**Rev. Fr. B. Mariadas,**

*Imprimatur :*
\+ **Rt. Rev. M. Ignatius,**
*Bishop of Guntur.*
**15 August. 19[illegible]**

# విషయసూచిక

## భాగము I

# భాగము II

అధ్యా॥ | | పుట
---|---|---



# భాగము III

అధ్యా॥ పుట

# భాగము IV



# క్రీస్తునాధుని అనుసరణము

## మొదటి భాగము

### 1 వ అధ్యాయము

### క్రీస్తునాధుని వెంబడించుట, లోకడంబమును పరిత్యజించుట.

1. "నన్ను వెంబడించువాడు చీకటిలో నడువ" డని మనరక్షకుడగు జేసునాథస్వామి చెప్పియుండెను. (జ్వాన్నే: 8 అ. 12 వ) మనము జ్ఞానవంతులమై మనహృదయముల నావరించియున్న అంధకారమునుండి విముక్తులము గావలయునని ఆసింతుమేని, జేసునాథస్వామి ప్రపంచమున కౌదర్శముగ చూపిన తనజీవితమునందలి సౌశీల్యమును మన మనుసరించి, ప్రవర్తింప వలయునని పైవాక్యము మన కుపదేశించు చున్నది. కావున దైవకుమారుడగు జేసునాథుని పవిత్రజీవితమునుగూర్చి ధ్యానము చేయుట మన కవసరము.

2. జేసునాథుడు బోధించిన సత్యములు సకల పావనపురుషుల యుపదేశములకన్న మిగుల ప్రశస్తములై యున్నవి. జ్ఞానోదయమైన వారందరును జేసునాథుడు బోధించిన సత్యములం దణగియుండు జ్ఞానామృతమును గ్రహింపగలుగుదురు. జేసునాథుని దివ్యచరిత్రమును పలువురు వినుచున్నను, అందుమూలముగ నెక్కువప్రయోజనమును వారు పొందుటలేదు. ఏలయనగా వారు క్రీస్తునాథుని భావముగలిగి యుండుటలేదు. క్రీస్తునాథుని బోధనల సారాంశమును సంపూర్ణముగా గ్రహింపగోరువారు, తమ జీవితమునంతయును రక్షకుని జీవితము ననుసరించి యుండునటుల చేసికొనవలయును.

3. పరమత్రీత్వ రహస్యమునుగూర్చి ప్రావీణ్యతతో ప్రసంగింప సమర్థుడవైనను, వినయ ప్రవర్తన లేనివాడవై, సర్వేశ్వరునికి ప్రియుడవు

కానియెడల నీకు ప్రయోజనమేమి? శాస్త్రజ్ఞానమెవ్వనిని పవిత్రుని
చేయజాలదు. నీతి ప్రవర్తనము గలవాడే దైవప్రియుడగును.

పశ్చాత్తాపమను పదమందలి గూఢార్థమును నిర్ధారణము చేయుట
కొరకు శ్రమపడుటకన్న, నీపాపకృత్యములను గూర్చి పశ్చాత్తాపము
నొందుటయే నీకుమిక్కిలి శ్రేయస్కరము. పరిశుద్ధగ్రంథము నంతయును
తత్వవేత్తలు నిర్దేశించు నీతివాక్యము లన్నిటిని వల్లెవేసినవాడవైనను
దైవప్రేమను గలిగి దైవాశీర్వాదమును బడయలేని వాడవైనచో,
నీకేమియును ప్రయోజనములేదు.

4. "దేవుని ప్రేమించుట, దేవునికిమాత్రమే సేవచేయుట తప్ప, మిగి
లినదంతయు నిష్ప్రయోజనమును వ్యర్థములో వ్యర్థమునై యున్నది."
దేవునిరాజ్యముకొరకు పాటుపడుచు, ఐహికప్రపంచమును తిరస్కరిం
చుటే అత్యున్నతమగు జ్ఞానము.

కాబట్టి నశింపవలసియున్న ప్రాపంచక సంపదలకొరకై పాటు
పడుచు వానియందు నమ్మకముంచుట వ్యర్థము. కీర్తిగౌరముల నాశిం
చుచు, పెద్దపదవులకొరకు ప్రాకులాడుటయును వ్యర్థము. శరీరసంబంధ
మగు తుచ్ఛసుఖముల నాసించుట అంతకంటెను వ్యర్థము. మరులోక
మున నిన్ను కఠినశిక్షలకు గురిజేయువానిని వాంఛించుట వ్యర్థము. చిర
కాలము జీవింపవలయునని కోరుటయు, పవిత్రమగు జీవయాత్ర
సల్పుటకై లేశమాత్రమైనను ప్రయత్నములు సల్పకుండుటయు వ్యర్థమె.
తాత్కాలికమగు జీవితమును మాత్రము మదియందుంచుకొని, మరణము
నకు పిదప సంభవించువానిని గూర్చి ముందాలోచన చేయకుండుట
యును వ్యర్థమె. అతివేగముగ గతించిపోవువానిని అభిలషించుటయును,
నిత్యానంద నిలయముచేర పరుగు బారకుండుటయును వ్యర్థము.

5. "చూచెడి చూపులతో నేత్రము తృప్తిపొందదు. కేవలము వినుట
వలన వీనులును తృప్తినొందవు" అను వేదవాక్యమును పలుమారు జ్ఞప్తికి
దెచ్చుకొనుచుండుము. గోచరమగు వస్తు సముదాయమునుండి నీ దృష్టిని
మరల్చి, విషయాను రాగమునుండి నీ హృదయమును వెనుకకు త్రిప్పి,
నీ నేత్రముల కగోచరమగు దైవమునుగూర్చి ధ్యానించుట కభ్యసింపుము.

ఏలయన, ఎవ్వరు విషయాలోలురై మనుచుందురో, వారు తమ మనో సాక్షిని కల్మషపరచి తత్కారణముచే దైవకృపను గోల్పోవుదురు.

---

## సారాంశము

జేసునాధుని దివ్యబోధనల ననుసరించి సత్యస్వరూపుడగు సర్వేశ్వరుని పాదపీఠమును సమీపింపవలయుననిన, మనమందరమును త్యాగశీలురము కావలయును. దయాళత్వాదయులమై యున్నచో, దైవశరణ్యమును గాంచగలుదుము. జేసునాధుని ధర్మసూత్రముల యందలి భావమును చక్కగ గ్రహించి, వానిని రుచి చూడవలయుననిన మన మాతని ప్రవర్తనల ననుసరించి జీవింపవలయును. క్రీస్తునాధుని మన మాదర్శముగా నెన్నుకొనునప్పుడే, మన మాతనిచే బోధింపబడిన నీతులు అభ్యసింప గలుదుము. దేవునియెడల వినయ విశ్వాసములు గలవారమై యుండుటవలన, గంభీరమగు దైవ మాహాత్మ్యముల నెరుంగ జాలుదుము. సుశీలత వలననే మనము న్యాయప్రవర్తనులమై, పాపవిముక్తులమై, దైవమున కనుంగు బిడ్డలము కాగలుగుదుము. కేవలము శాస్త్రపరిజ్ఞానమును సంపాదించి, విద్యావంతుల మగునంత మాత్రమున దైవప్రేమను పొందజాలము. సర్వసంపదలను, ఘనతలను, అశాశ్వతిమగు ప్రాపంచిక సుఖభోగములను నిరసించినగాని, మోక్షమునందు ప్రవేశించుట కవసరమగు అర్హతనుగాని హక్కునుగాని కలిగియుండజాలము.

---

## 2 వ అధ్యాయము

### నిగర్వివై యుండవలయును.

1. ప్రత్యేకడును తాను శాస్త్రజ్ఞుడై యుండవల్లయునని యభిలషించుచుండును. కాని దైవముయెడల భయభక్తులతో ప్రవర్తింపని వానికి, కేవలము శాస్త్రజ్ఞానమువలన ప్రయోజనమేమి.?

ముక్తి మార్గమును గూర్చి మరపుజెంది, సూర్య చంద్ర నక్షత్రాదులగమనమును గూర్చి యోచించుచుండు గర్వియగు జ్యోతిశ్శాస్త్రజ్ఞుని

కన్న, పాలములయందు పాటుబడు వినమ్రుడును దైవసేవా నిరతుడు నగు సేద్యగాడు నిశ్చయముగ నెక్కువ యోగ్యుడనదగును.

తనను తాను చక్కగ గుర్తెరిగిన మానవుడు, తన దృష్టియందు తననొక నీచునిగ నెంచుకొనును. అట్టివాడు, పరులు తనను శ్లాఘించుచున్నను సంతసింపడు. స్వాభిమానము లేనివాడగుటచే, పరుల పొగడ్తలు అతనికి రుచింపవు.

ప్రాపంచిక విషయ జ్ఞానమును పూర్తిగ కలవాడనైయున్నను, ఔదార్యబుద్ధి లేనివాడనైన, నేను చేయు కర్మల ననుసరించి నన్ను విమర్శించు దేవుని దృష్టియందు వస్తుజ్ఞానమువలన నాకేమి లాభము కలుగును ?

2. పాండిత్యమునందలి యత్యాసను విడచివేయుము. ఏలయనగా, అట్టి యత్యాసవలన ఎక్కువగు పరధ్యానమేర్పడి నీవు మోసపోయెదవు.

పండితులనువారు తమపాండిత్య ప్రభావమును లోకులయెదుట ప్రదర్శింపవలయునని, తమ్మును ప్రపంచము పండితులనుగా పరిగణింపవలయునని కోరుకొనుచుందురు.

ప్రాపంచిక విషయ పరిజ్ఞానమువలన ఆత్మవికాసమున కేమియును ప్రయోజనము లేదు.

మోక్షప్రాప్తికొరకవసరములగు విషయములను విడచిపుచ్చి పరవిషయములనుగూర్చి యోచించువాడు శుద్ధయజ్ఞాని.

వాగాడంబరమువలన ఆత్మకు ఆవంతయు తృప్తికలుగదు. కాని పవిత్రమగు జీవితము ఆత్మకు శాంతినొడగూర్చును.

పవిత్రమగు ధర్మాధర్మ విచారణాశక్తి, దేవునియందు దృఢ విశ్వాసమును కలిగించును.

3. నీపాండిత్యమభివృద్ధి చెందునట్టుల, నీజీవితమునందలి పవిత్రతయు పెంపొందుచుండవలయును. అట్లుగానిచో కఠినముగా దండింపబడుదువు. కనుక నీపాండిత్య పరిజ్ఞానమునుగూర్చిగాని, నీ కళానైపుణ్యమునుగూర్చిగాని గర్వపడకుము. నీవు కలిగిన జ్ఞానమును తలచుకొనునపుడు భీతిజెందుము. నీ కెక్కువగ తెలియునని నీమానసమున కెక్కి

నపుడు, ప్రపంచమున నీకు తెలియని విషయములింక ననేకములు గలవని జ్ఞప్తికి తెచ్చుకొనుము.

నేనే తెలివిగలవాడనని గర్వపడక, నీయజ్ఞానము నంగీకరింపుము. వేదశాస్త్రములందు నీకన్న నెక్కువజ్ఞానము గలవారును, నేర్పరు లుండగా, నీవు యితరులకన్న ఘనుడవని యేలతలంచెదవు?

నీ వేదోక్త శాస్త్రమును అభ్యసింపవలసిన యవసరమేర్పడినపుడు, అది యితరులెవ్వరును తెలిసికొని, నిన్ను శ్లాఘింపకుండునటుల అభిలషింపుము.

4. మనలను మనము తెలిసికొని, మనయందలి దోషములకుగాను మనను మనమే ద్వేషించుకొనుటయే, మిక్కిలి యుత్కృష్టమును లాభకరమగునట్టి శాస్త్రమైయున్నది.

5. స్వాభిమానము లేకుండుటయు, పరులనుగూర్చి ఎల్లపుడును సదభిప్రాయము గలవారమై వారిని శ్లాఘించుటయు యను, నీ రెండు సుగుణములును ఉత్కృష్టమగు జ్ఞానము పరిపూర్ణ పవిత్రతయునై యున్నవి.

బహిరంగముగ నెవడైన ఏపాపమునుగాని, అక్రమమునుగాని చేయుచుండగా నీవు చూచినపుడు, అతనికంటె నీవు సాధుశీలుడవని నిన్ను నీవు శ్లాఘించుకొనకుము. ఏలయన, ఎంతకాలము మనము సన్మార్గమునందు స్థిరముగా నుండజాలుదుమో యెవరు చెప్పగలరు!

మనమందరమును దుర్బల మానసులమే. అందరికన్నను నీకు మనోదార్ఢ్యము తక్కువపడి యున్నదని తెలిసికొనుము.

---

## సారాంశము

పాండిత్యము గర్వమును గలిగించును. త్యాగము జ్ఞానోదయమును గావించును. ఏవ్యక్తియైనను తనకు సర్వవిషయజ్ఞానము కలదని యహంకారము వహించునెడల, తనకు తెలియని విషయములింక నెన్నియో యున్నవని గ్రహింపవలయును. దేవుని ప్రేమించువారల కీవిషయము గోచరమగును.

దైవ వాక్యములయందలి సత్యమును దెలిసికొన శ్రద్ధవహించి పాటుపడి పరిశ్రమ చేయుదము. ముక్తిసాధనములుగాని శాస్త్రములను కళలను శ్రద్ధతో పరిశీలన చేయవలసిన యగత్యమేమియును లేదు. మన యాత్మ పరిశోధనమును, ఆత్మజ్ఞానమును యితర విషయములకన్న నెక్కువ ప్రశస్తముకాదా! మనమెంత యెక్కువ యాత్మజ్ఞానముగల వారలమైన, అంతయెక్కువ వినమ్ర స్వభావులమై యుండగలము. సద్గుణములన్నిటియందును వినమ్రతయె నిగర్వమె పునాది యగుటచే సర్వ సుగుణములును గర్వలేమిపై యాధారపడియుండును. మనమెంత తుల్యమగు దైన్యస్వభావము గలవారమై యుండిన, అంతయెక్కువ దోష రాహిత్యమును పావనత్వమును పొందగలుగుదుము. ఈ రెంటి సహాయముచే మనము జ్ఞానజీవితమున నభివృద్ధి పొందుదుము.

---

## 3 వ. అధ్యాయము

### సత్యస్వరూపి బోధించునదే సత్యము.

1. అవకతవక యుపమాన అలంకారముల నుపయోగింపకయే, ఎవనికి సత్యము తన నిజస్థితిని తెలియపఱచునో వాఁడే ధన్యుడు. మన తెలివితేటలు మన యభిప్రాయములు పలుమారులు మనలను మోసగించుచుండును. ఇంద్రియజ్ఞానము నాధారము చేసికొని యెంతో ముందుకు పోవజాలము.

నిగూఢములును దుర్గ్రాహ్యములునగు విషయములను గూర్చి, వాదోపవాదములను చేయుటవలన లాభమేమియును లేదు. వానిని మనము తెలిసికొనక యున్నందులకు న్యాయతీర్పు దినమందు మనము శిక్షింపబడుటయును లేదు. అవసరములును ప్రయోజనకరములునగువాని నశ్రద్ధచేసి, వినోదకరములును అపాయకరములునగువాని నాశ్రయించుట యెంతటి బుద్ధిహీనత! కన్నులుండియు మనము చూచుట లేదు.

2. తత్వశాస్త్రవేత్తలము కావలయుననెడియగత్య మిసుమంతయును లేదు. సత్యస్వరూపి యెవ్వనితో సంభాషించునో, వానికభిప్రాయ భేదములతో నంతకంటెను పని లేదు.

సర్వజ్ఞుని (వార్త) వలన సర్వమును సృజింపబడెను. సర్వము నా సర్వజ్ఞునే చూపించుచున్నది. సృష్టికి మూలమగు ఆద్యంత రహితుడే మనతో ముచ్చటించుచున్నాడు. అతని సహాయము లేనిది యెవ్వడును యదార్థమును గ్రహింపజాలడు; చక్కగ తీర్మానించుకొనను జాలడు.

సర్వసృష్టి ఎవ్వనికి సర్వవ్యాప్తమగు సర్వేశ్వరుని చూపగలుగునో, ఎవ్వడట్టి సర్వేశ్వరుని సకలవస్తు సముదాయమునందు కనుగొనజాలునో, అట్టి మానవుడు మనోధైర్యముగలవాడై, సర్వేశ్వరునియందు సమాధాన చిత్తుడై మనగలడు.

సత్యస్వరూపుడవగు నా దైవమా! నీ యనంతప్రేమను నా యందు ప్రసరింపజేసి, నన్ను నీలో చేర్చుకొనుము. పలువిధములగు ప్రపంచ విషయములను పుస్తకములనుండి చదువుచు, పరులనుండి వినుచు, నేను మిగుల విసుగుజెంది యున్నాడను. నే నాసించి అభిలషించునదంతయూ నీ యందే గలదు. శాస్త్రులందరు తమ వాచాలత్వమును నా యొద్ద నాపి వేయుదురుగాక, ప్రాణులన్నియు నీ పాదసాన్నిధ్యమున సద్దుచేయక శాంతము వహించుగాక. దేవా! నీవే నాకు ఉపదేశింపుము.

3. బాహ్య విషయాలోలుడుగాక, ఎవ్వడు తాను ఎంత ఎక్కువగ నేకాంతవాసియై యుండునో, అట్టివాడెక్కువ శ్రమపడకయే ఉత్కృష్ట జ్ఞానమును పొంద శక్తిగలవాడగును. ఏలయనగా, నాతనికట్టి గ్రహణ శక్తిని మనోవికాసమును దైవమే దయచేయును.

పవిత్రమును నిరాడంబరమును నిష్కపటమును నిశ్చలమానసముగల వ్యక్తి, తన నావరించియున్న ప్రాపంచిక విషయములచే నాందోళమునకు లోనుగాడు.

ఏలయన నట్టి పవిత్ర హృదయుడు తాను చేయు కర్మలన్నిటిని దైవార్పితముగ నాచరించుచు, నిష్కాముడై అంతరంగ శాంతినిగలిగి విశ్రమించును.

నీ యెడల నీకుగల హృదయానురాగమును నీవు నాశనమొనర్చుకొనని యెడల, ఆ యనురాగమే నిన్నికట్టుల పాలుజేయును.

భక్తిపరుడు తాను బహిరంగముగ నాచరింపవలసిన కార్యమును, ముఖ్యముగ తన మానసమందున క్రమపరచుకొనును. అందువలన నాతని హృదయము దురాశాపాశములలో తగుల్కొనజాలదు. నీతి నియమముల కనుగుణ్యముగ తన కోరికలను క్రమపరచుకొనును.

తనను తాను జయింపవలెనని చేయు అంతరంగిక యుద్ధమునకన్న, కఠినమగు పోరాట మింకొకటి లేదు. మనలను మనము జయించుటే ముఖ్యమగు కార్యము.

మనయందు చెలరేగెడు కామక్రోధాది దుర్గుణములను, అణచి వేయునదే జయము. అట్టి జయమునకొరకు కవసరమగుబలమును దిన దినాభివృద్ధిని గావించుకొనుటకు ప్రబల ప్రయత్నములు చేయుట మన విధియైయున్నది.

4. ఈజీవితమున, దోషరహితులనబడు వారియందును కొన్నిదోషము లుండితీరును. పరిపూర్ణ లోపరాహిత్యమైనదని చెప్పతగినదేదియు నీ ప్రపంచమునలేదు. మనమెంత దూరదృష్టితో మెలగుచున్నను, అందు కొంత యజ్ఞానతిమిర మిమిడియే యుండును.

కఠినమగు శాస్త్ర పరిశోధనలకన్న, నిష్కపటమగు ఆత్మజ్ఞానమే నిన్ను దైవసన్నిధానమునకు సూటిగా కొనిపోవగల సురక్షితమగు మార్గము. దీనినిబట్టి శాస్త్రజ్ఞాన మనవసరమని చెప్పుటకాదు. శాస్త్ర జ్ఞానము నిందార్హముకాదు. కేవలవస్తు జ్ఞానమును దూషింపనురాదు. సృష్టి వస్తువులతో మనకవసరమగు పరిచయమును గల్గియుండుటే సర్వేశ్వరుని నిర్మితమైయున్నది. పవిత్రమగు మనస్సాక్షియును, దోషరహితమగు జీవితమును, రెండును సకల శాస్త్రజ్ఞానములకన్న నెన్నోమడుగులు యుత్తమమైనవని యందలి భావము. కాని అనేకులు పవిత్రజీవితమును జీవించుటకన్న, నెక్కువగా శాస్త్రజ్ఞానమును సంపాదించుటయే పరమా విధిగా నేర్పరచుకొనెదరు. అట్టివార లనేకసారులు మోసపోయి, పెడ మార్గమున పడుటయో, లేక స్వల్పలాభమును మాత్రము పొందుటయో జరుగుచున్నది.

అయ్యో ! ఎంతటి యాశ్చర్యము. మానవులు తమయందు పాదు కొని వ్రేళ్ళుపారియున్న దోషగుణములను, కూకటివ్రేళ్ళతో పెరికిపార

వేసి, వాటిస్థానములందు పవిత్రగుణములను నాటుకొనుటయందాసక్తి కలవారలైనచో, లోకమునందింతపాపముగాని, యింత దుర్మార్గత గాని, యిన్నికష్టములుగాని యుండవు. పరులనుగూర్చి యెట్టి యపవాదములను, దూషణలను, అపకీర్తికరమగు మాటలను వ్యాపింపజేయక యుందురు. మతజీవితమునందెన్నడును మాంద్యమునకవకాశముండదు.

నిశ్చయముగ న్యాయతీర్మాన దినమున. మనమేయే గ్రంథములను పఠించి, ఎట్టిజ్ఞానమును సంపాదించితిమను యంశము విచారింపబడదు. మనమేమి పుణ్యము, లేక పాపము చేసియుంటిమనునది మాత్రమే యాలోచింపబడును. మనమెంత పాండిత్యముతో ప్రసంగించితి మనునదిగాక, మనమెట్టి దైవనిర్ణయమగు నియమముల ననుసరించి, ఎట్టి జీవనయాత్ర సల్పియుంటిమను అంశముమాత్రమే లెక్కలోనికివచ్చును

సజీవులై యుండగా పండితులనియు, మహోపాధ్యాయులనియు ఖ్యాతినిబడసి ఇంకను నీయొరుకలోనున్న పండిత ప్రముఖు లిప్పుడెచ్చట నున్నారు.?

వారు విడిచిపెట్టి పోయిన నిక్షేపముల ననుభవించువారు నైతము వారినెప్పుడైనను తలచుచుందురేమో చెప్పజాలము. వారు జీవించియుండునపుడు ప్రవీణులుగా నెన్నబడిరి. ఇప్పుడు వారినిగూర్చి ప్రస్తావించువారు లేరు.

అక్కటా! ఐహికవిషయములవలన సంప్రాప్తమగు గౌరవమెంత శీఘ్రముగా గతించిపోవుచున్నది! వారల జీవితము వారిశాస్త్రజ్ఞానమునకు సమానమై యున్నయెడల, దైవమునకు ప్రీతికరముగ నుండెడిది కదా? అప్పుడు వారు చదివినదియు, నేర్చినదియు, ప్రయోజనకరమై యుండెడిదిసుమా.

సర్వేశ్వరుని సేవకొరకై లేశమాత్రమైనను సరకుచేయక, నుప్క పాండిత్యము కొఱకై ప్రయత్నములు సల్పుటలో నెంతమంది మానవులు మోసపోయియున్నారు.

వినమ్రులై నిగర్వులై యుండుటకు మారుగా, తాము ఘనులుగ గణింపబడవలయునను వాంఛతో వారు తమ మనోకల్పితమగు భ్రాంతులయందు తగుల్కొని భ్రష్టులగుచున్నారు.

ఎవ్వఁడు గొప్పత్యాగియో, యాతఁడే సత్యముగ యోగ్యుఁడు. తన్ను
తాను స్వల్పునిగా నెంచుకొనుచు, ఉన్నతమగు తనఘనతను చూచు
కొని యుబ్బిపోక, నిరసనభావముతో నుండునట్టి మానవుఁడే వాస్తవమగు
యోగ్యుఁడు.

దేవుని దయను సంపాదించుటకై యే మానవుఁడు, ప్రాంచిక వస్తు
సముదాయమును తృణప్రాయముగా చూచునో, యాతఁడే వాస్తవముగ
దూరదృష్టిగల వివేకి. తనమానస పోకడలను విసర్జించి, దేవునియుద్దేశ
ములననుసరించి, ప్రవర్తించు మానవుఁడే వాస్తవమగు పాండిత్య పటిమ
గలవాఁడు.

## సారాంశము

దైవము బోధించునది శాశ్వతమగునీతి. మానవకోటి కంతకును
జ్ఞానదాయకమగు దివ్యజ్యోతి. మన మానసముల నావరించియున్న
యజ్ఞానాంధకారమును నశింపజేయుటకొక పెద్ద తేజస్సు. అదియే
స్వతస్సిద్ధమగు సత్యము. ఆ వాక్య మితరులచే గల్పింపబడినదికాదు.
ఇతరబోధకులెవ్వరును లేరు. ఆ సత్యవాక్యమే దైవము. మనకు గోచర
మగుచున్న బాహ్యప్రపంచమంతయును భగవంతునిచే సృష్టింపబడినదియే.
ఈ ప్రపంచమనియెడు గ్రంథమును మనయెదుట బహిరంగముగ తెరచి
యుంచి, దానిద్వారా దైవమెల్లప్పుడును మనల విడనాడక, నీతిసూత్ర
ములను బోధించుచు, మనోవికాసమును గలిగించుచు, మనతో సంభా
షించుచున్నాఁడు. ఆతనిచే సృజింపబడిన ప్రతి జీవజంతువును, భగవం
తునిగూర్చి మనము గ్రహింపజాలునట్లుగా మనకు ప్రబోధమును
చేయుచున్నది.

సత్యమును తెలిసికొనవలెనను తాపత్రయమునకన్న, తెలిసిన
సత్యము ననుసరించుటయం దాసక్తి కలిగియుండుట శ్రేయోదాయకము.
నీ యాత్మగతక్షణమున కవసరమగు వానిని తెలిసికొనుటకన్న, నీవు
నేర్వగల గొప్పశాస్త్రమింకొకటి లేదు. ఆడంబరమగు వ్యర్థప్రసంగముల
వలన లాభమేమి? సత్యస్వరూపిని ఆరాధించుటయందు నిమగ్నుడవు
కమ్ము. అప్పుడే నీయాత్మకు శాంతిగల్గును.

## 4వ అధ్యాయము

### కర్మాచరణమందు మన కుండవలసిన దూరదృష్టి.

1. మనము వినియెడి విషయములన్నిటిని విశ్వసింపరాదు. మనకు కలుగు యోచనలన్నిటిని నమ్మనురాదు. జాగరూకతతో నెమ్మదిగా ప్రత్యేక విషయమును దైవసాన్నిధ్యమున ముందుగా పరిశీలింపవలయును.

ఇతరులనుగూర్చి ప్రస్తావన జేయునపుడు, వారియందలి దోషములను నిజమని నమ్మునంతటి సులభముగా, వారియందలి సద్గుణములను నమ్మము. అయ్యో! మనమెంత దుర్బలమానసులము!

దోషరహితులగు యుత్తమపురుషులు, తామువినిన విషయములన్నిటిని వెంటనే విశ్వసింపరు. ఏలయనగా, అట్టి సుబుద్ధులు మానవునియొక్క మానసిక దుర్బలతను చక్కగా నెరిగియున్నారు. వాచాలత్వము వక్రిమార్గమున బడిపోవుటాక వింతకాదని వారెరుగుదురు.

కర్మాచరణయందు దుడుకుతనము లేకుండుటయు, స్వాభిప్రాయములయందు మూర్ఖపుపట్టుదల లేకుండుటయు, ఉన్నతమగు జ్ఞానమైయున్నది. పరులు చెప్పినదానినెల్లను వెంటనే విశ్వసించి, విశ్వసించిన దానిని వెనువెంటనే పరులచెవులలో వేయకుండుటయును జ్ఞానమైయున్నది.

2. ధర్మాధర్మ విచారణశక్తిగల జ్ఞానులగువారి సలహాలను పొందుట శ్రేయము. మానసిక భ్రాంతులననుసరించి పోవుచుండుటకన్న, దేవుని దృష్టియందు ఉత్తమ జీవితము సల్పుచున్న మానవుడే జ్ఞాని; అట్టి వ్యక్తియే యనుభవశాలి. మానవుడెంత యెక్కువగా దీనత్వమును వహించి దైవమునకు విధేయుడైయుండునో, కర్మాచరణయందాతడంత యెక్కువ వివేకియై యెక్కువ శాంతము ననుభవించును.

---

### సారాంశము

సత్యాసత్య విచారణ చేసికొనకయే మనమొండొరులగూర్చి భావించెడు చెడ్డవదంతులకన్న, మనజీవితపవిత్రమునకు మరియొక గొప్ప

యాటంకమేమియు లేదు. ఇట్టివర్తనమే మోక్షమార్గమునకు మిక్కిలి యపాయకరమైనది. ఏలయనగా, ఒండొరులనుగూర్చి చేయు దుష్ప్రచారము మన మానసములను కలవరపరచును. మన హృదయములను తారుమారుచేయు దుష్టులవలన పరస్పర భేదమేర్పడి కలహములు పెరిగిపోవును. ఒండొరులయెడల వైరము ప్రారంభమై, వ్యసనకారణములేర్పడును. ఇట్టి పాపములను పరమపావనుడు సులభముగా క్షమించడు. మనము సృష్టికర్తచే క్షమింపబడవలయునను కాంక్షగలవారలమైనచో, మనచే యాచరింపబడిన పాపపరిహారార్థముగ తిరుగ యొండొరులతో విరోధములను ద్వేషములను పగలను మానుకొని, స్నేహభావముతోడ వర్తించుచుండెదమనియు; ఎవ్వరిని మనము తిరస్కరించి దూషించియుంటిమో, వారికి తగుకీతిని సమాధానము చెప్పుకొని, వారితోడ స్నేహభావముతో కలిసి మెలసి వర్తించెదమనియు, గురువులయొద్ద పాపవిమోచనార్థము మనమాచరించు పాపసంకీర్తనా సమయమున మనఃపూర్వకముగ ప్రతిజ్ఞ చేసికొనవలయును.

సోదరులారా! పరులనుగూర్చి మనమెప్పుడును, దుష్టవదంతులను వ్యాపింపచేయ తగదు. ఇతరులెవ్వరైనను మనసోదరులపై యట్టి వదంతులను వ్యాపింపజేసిన, వాటి నేమాత్రమును విశ్వసింపతగదు.

అట్టి చెడువదంతులను మీ చెవికెక్కనీయరాదు. మన పొరుగువారినిగూర్చి మనమేదైనను చెడుసమాచారమును వినుట తటస్థించునేని, దానిని మనమిత్రులతో ప్రస్తావింపకుండుటకై జాగరూకతను వహించియుండవలెను.

---

## 5వ అధ్యాయము.

## వేదగ్రంథ పఠనము.

సత్యముకొరకై, దివ్యగ్రంథమును వెదకుకొనవలసియున్నాము. వేదగ్రంథము పఠించునది సత్యమును గ్రహించుటకుగాని, వాక్పటిమ నలవరచుకొనుటకుగాదు.

వేదగ్రంథమెట్టియభిప్రాయముతో వ్రాయబడియున్నదో, అట్టి యభిప్రాయముతోడనే దానిని మనము పఠింపవలయును. దివ్యగ్రంథ

మును పఠింపదలచిన ప్రతి వ్యక్తియు, దానినుండి సత్యమును గ్రహింప వలయుననెడి భావముతో పఠింపవలయునుగాని, యందలిభాష సొంపును పదజాలమును పాటించుటకుగాదు.

ఉత్కృష్టమును గంభీరమగు గూఢాంశములను గలిగినట్టి గ్రంథముల నెంతయాశతో పఠింతువో, అంతశ్రద్ధతో భక్తిసంబంధమగు సామాన్య గ్రంథములను సైతము చదువవలయును.

నీవు చదువుచుండెడు గ్రంథమును రచించిన గ్రంథకర్త యొట్టి పాండిత్యము గలవాడను విషయమును గమనింపకుము. కేవల సత్యాన్వేషణ కొరకగు ప్రేమయే నిన్నాగ్రంథమును చదువుటకు ప్రేరేపింపనిమ్ము. ఎవరు వ్రాసిరను విషయముకాదు; ఏమి వ్రాసిరను నదియే గమనార్హము.

2. మానవులందరు గతించిపోవుదురు; దైవబోధితమగు సత్యము మాత్రము నిత్యముగా నిలచును. మోమోటములేక, మన యందరితోడను సత్యస్వరూపి పలువిధములుగ సంభాషించుచుండును. విమర్శ గావింపవలసిన యవసరమేమియులేక, సాగిపోనీయవలసిన యంశములను గూర్చి వాదప్రతివాదములు పెంచుకొని, వానిని గ్రహింపవలయునని మనము కోరుదుమేని, అట్టి జిజ్ఞాసవలన వేదగ్రంథపఠనమునకు మనకు పలుమారు లాటంకములు కలుగుచుండును.

వేదాధ్యాయనము వలన ప్రయోజనము పొందవలయునని యాపేక్షింతువేని, నిష్కపటముగను నమ్రభావముతోడను, విశ్వాసముతోడను చదువుము. గ్రంథపఠనమువలన పాండిత్య పతిమను, ఖ్యాతిని గాంచవలయునను ఉద్దేశమును మాత్రము యెప్పుడును కల్గియుండకుము.

పరిశుద్ధులు బోధించిన సత్యములను శాంతముగ నాలకించి, యందలి భావములంగూర్చి చక్కగా మనన జేసికొనుము. పూర్వీకులచే చెప్పబడిన నీతికథల యెడల నిరసన భావమును జూపకుము; వ్యర్థముగ నవి చెప్పబడియుండలేదు.

## సారాంశము

జ్ఞానముకొరకును, యుపదేశములకొరకును వేదగ్రంథమును పఠింపుము. పవిత్రరచనలుగల ప్రతిగ్రంథమునందును మనతో సంభా

షించుచుండునది మహోన్నత సర్వేశ్వరుడే. కనుక ఆ గ్రంథములను రచించుటకై దైవమెవ్వరిని నియమించెనో, వారలను గూర్చిన విమర్శనముతో మనకవసరము లేదు. నమ్రభావముతోడను నిరాడంబరముగను వినయస్వభావముతోడను విశ్వాసముతోడను ఆగ్రంథములను పఠించవలయును.

---

## 6 వ అధ్యాయము

## అత్యాశ, విషయానురాగము.

1. మానవుడెప్పు డత్యాశాపీడితుడగునో, అప్పుడేయాతడు మనోవ్యాకులత ననుభవించును. గర్వపోతులకును, లోభులకును ఎప్పటికిని మనోశాంతి యుండదు.

నిరుపేదలును, దీనస్వభావులును, శాంతమగు జీవయాత్రను సలుపుకొనజాలుదురు.

పూర్తిగ స్వార్థగుణము నణచివేయజాలని మానవుడు, స్వల్పవిషయములకు సైతము లొంగిపోయి, నీచకార్యములకు బానిసయైపోవుచున్నాడు. జ్ఞానమార్గమున దుర్బలమానసముగలిగి, యింకను విషయసుఖములయం దాశక్తిగలిగి యున్నట్టి మానవుడు, ప్రాపంచక విషయములనే వాంఛించుచు, పూర్తిగ ఐహికాను రాగములనుండి విముక్తి గాంచజాలకున్నాడు.

కనుక అతడు వాటిని విడిచినప్పుడెల్ల పరితపించుచున్నాడు. ఎవ్వడేని తననడ్డగించునప్పుడు నాతనియెడల క్రోధమును బూనుచున్నాడు.

2. తన నీచవాంఛల ననుసరించి మానవుడు ప్రవర్తించునేని, వెంటనే తన మనస్సాక్షి తానొనరించిన నేరములకొరకు తననుపట్టి పీడించును, అందువలన నాతడు పొందదలచిన శాంతమును సంపాదించుకొనజాలడు.

పై విషయములను బట్టిచూడ, కామక్రోధ మదమాత్సర్యాది మనోవికారములను మన మాటంకించుట వలననే మనమాసించు

హృదయశాంతమును కనుగొన జాలుదుము. కనుక ఐహిక వాంఛా లోలుడగు మానవునకు హృదయశాంతము కలుగదు. బాహ్యప్రపంచ విషయ లంపటుడగు వానికిని శాంతములేదు. గాఢమగు ఆధ్యాత్మికాభిలాషగల వ్యక్తియే అట్టిశాంతము ననుభవింపగలడు.

## సారాంశము

క్రమముతప్పక నియమముల ననుసరించి, జీవయాత్రను నల్పుచుండు మానవునకుమాత్రమే ఆత్మశాంతి లభించును. శాంతమూర్తియగు సర్వేశ్వరునికి, క్రమహీనత నియమభంగమను నీరెండును ప్రీతికరములు కావు.

శరీరము ఆత్మకును, ఆత్మ దైవమునకును, వశమైయున్నచో నెల్లెడలను శాంతమే నెలయుచుండును. అయితే యిట్టి నియమబద్ధమగు నేర్పాటునకు కామక్రోధాది మనోవికారముల వలనగాని, మితిమీరిన యాశలవలనగాని, భంగముగలిగినచో, శాంతము వెంటనే తరుమగొట్టబడి, దానిస్థలమును కష్టము లాక్రమించి రాజ్యమేలును. అందుచే నట్టిమానవుడు శాంతము లేనివాడగును.

మన మానసములందు దురాశ యే నిముషమున ప్రవేశించునో, యానిముసమునుండియే యా దురాశ మననెమ్మదికిభంగమొనర్చి క్షోభను కలిగించుచుండును. ఒకానొక సమయమున మనమట్టి వాంఛలను తృప్తి పరచుకొనజాలినను, మనస్సాక్షియొక్క యనుతాపమునకు మేరయుండదు.

స్థిరమగునట్టి శాంతమునం దాశగలవారలమైనచో, మన యక్రమ వాంఛలనణచియుంచి మనోవికారములపై దాడివెడలి, పోరాటము సల్పవలయును. మానసిక వికారములన్నిటిని తుదముట్ట నాశనమొనరింపవలయును.

తుచ్ఛవాంఛల నెంతవరకు తృప్తిపరుపవలెనని ప్రయత్నించుదుమో, అంతవరకు మనోసమాధానమును గోల్పోయెదము. ఎంతపట్టుదలతో పోరాడుదుమో, అంతస్థిరమగు శాంతము ననుభవింపగలము. దైవనియమము ననుసరించి మన కెట్టివిషయములు క్షేమకరములో, అట్టి విషయములనే మనము క్రమానుసారముగ ననుభవింపవలయును.

## 7 వ అధ్యాయము

## నిష్ప్రయోజనమగు ఆశను, గర్వమును విడువుము.

1. మానవునియందును తదితర ప్రాపంచిక విషయములందును, నమ్మకము కలిగియుండువాడు కేవలము వ్యర్థుడు. దేవునియొక్క పవిత్ర ప్రేమను సంపాదించుకొనుటకై పరులకు సేవచేయుము. ప్రాపంచకమునను నిరుపేదగ కనుపించుటకు సిగ్గుపడకుము.

నీ సామర్థ్యముపై నమ్మకము గలవాడవైయుండక, దైవముపై నాధారపడి యుండుము. నీ శక్తికొలది నీవు ప్రయత్నించుము; మంచి ప్రయత్నములకు దైవము తోడ్పడును.

నీకుగల జ్ఞానముమీదను ఇతరులకున్న కుశాగ్రబుద్ధిమీదను ఆధారపడియుండకుము. దీనులను రక్షించి, స్వాతిశయము గలవారిని శిక్షింప శక్తిగల సర్వేశ్వరునియందు నమ్మకము కలిగియుండుము.

2. ధనికుడవైనచో ధనమునుగూర్చిగాని, నీకు పరాక్రమ వంతులగు స్నేహితులున్నచో వారలను చూచుకొనిగాని, ఉప్పొంగకుము. నీకు సర్వమును సమకూర్చునట్టియు, సర్వమునకన్న మిన్నయగు సర్వేశ్వరుడు తమ్మునే నీకర్పింప సంసిద్ధుడై యున్నట్టి దైవమునందు నీనమ్మకముంచుము.

స్వల్పరోగముచే సైతము చెడి, కురూపిగా నయ్యెడు నీ శరీరౌన్నత్యమును గూర్చిగాని, సౌందర్య లావణ్యములను గూర్చిగాని గర్వింపకుము.

నీయందలి శక్తిసామర్థ్యమును, బుద్ధిచమత్కారమునుచూచి గర్వపడకుము. నీకు సహజముగా గల సుగుణములన్నియు సర్వేశ్వరుడొసగినవై యున్నందున, నాతని కప్రియమగును. ఆతడనుగ్రహించిన సుగుణములను నీవియని తలంచకుము.

3. ఇతరులకన్న నీవు ఘనుడవనుకొనుచు, నిన్ను నీవు గొప్పగా నెంచుకొనకుము. ఏలయనగా, ఏ మానవుడెట్టి వాడైనది సర్వసాక్షియగు సర్వేశ్వరునికే చక్కగా తెలియును. సర్వజ్ఞాని దృష్టిలో నీవే యథముడవేమో ఎవరు చెప్పగలరు?

నీచే యాచరింపబడు సత్కార్యములనుగూర్చి గర్వింపకుము. ఏలయన, సాధారణముగా కేవల మనుష్యమాత్రుల మెప్పును బడయునవి దైవమునకు ఒప్పిదముగా నుండజాలవు.

నీయందు లేశమాత్రమగు యోగ్యత యున్నయెడల, పరులయందు నీకన్న నెక్కువ యోగ్యత లుండవచ్చునని భావించుకొనుము. అట్టి భావన కలవారలే తమయందు నమ్రభావమును కాపాడుకొనగలుగుదురు.

అందరికన్నను నీవే యధముడవని యెన్నుకొనుటవలన నీకెట్టి నష్టము నుండబోదు. ఇతరులకన్న నీవే ఘనుడవని యెన్నుకొనినచో, నది నీకు హానికరమగును. దీనస్వభావులు మాత్రమే, శాశ్వతమగు శాంతమును కలిగియుందురు. గర్వపోతుల హృదయములయం దసూయయును, క్రోధమును పలుమారులు చెలరేగుచుండును.

---

## సారాంశము

మనయందు యోగ్యతలకన్న నయోగ్యతలే మిక్కుటముగ నున్నవి. సద్గుణములకన్న దుర్గుణములెక్కువ గలవు. గనుక మనము గర్వముచే యుప్పొంగవలసిన కారణములు గాన్పించుటలేదు. మనయందేవైన సద్గుణములున్నచో, దైవమహిమల ననుసరించి అట్టి సద్గుణములన్నియు సర్వగుణాలంకృతుడగు సర్వేశ్వరుని వలననే మనకు సంప్రాప్తమగుచున్నవి. గావున సర్వేశ్వరునే మనము శ్లాఘింపవలసి యున్నది. మానవుల జీవితమంతయు ప్రమాదములతోడను, తప్పిదముల తోడను, అసూయాది దుష్టభావములతోడను, అసత్యములతోడను నిండియున్నది. అందుచే మానవునికన్న నెక్కువ బలహీనమగునట్టియు, నమ్మకము లేనట్టియు, మనోనిశ్చయము లేనట్టియు ప్రాణి మరి యొకటి లేదు.

మనకున్నదంతయు దైవవరప్రసాదలబ్ధమే. మనకవసరమైన దంతయు దైవమునుండి పొందవలసియున్నది. గావున వారిదివ్యకటాక్ష సహాయమును పొందుటకై మన శక్తికొలది శ్రమపడి పనిచేయుట మన విధియైయున్నది. మనమెప్పుడును మనస్వశక్తిపైగాని పరులపైనిగాని

యాధారపడి యుండక, సర్వేశ్వరుడు మనకనుగ్రహించియున్న శక్తి సామర్థ్యములను సద్వినియోగము చేసికొనవలయును.

---

## 8. వ అధ్యాయము

### అతి పరిచయమును కలిగియుండ తగదు.

1. నీయంతరంగమును అందరియెదుటను తెరచిపెట్టకుము. దైవభీతిగల జ్ఞానికిమాత్రము నీహృదయము ఎరుకపరచి, ఆయనచెప్పు బుద్ధిమతుల ప్రకారము నీ కార్యములను చక్కపరచు కొనుము.

అనుభవములేని యవ్వనులతోడను, అపరిచితులతోడను తరచుగా కాలము వెళ్ళబుచ్చకుము. ధనవంతుల పంచల పడిగాపులుపడి యుండకుము. వారిని స్తుతించుటకు ప్రయత్నింపకుము. దీనులతోడను, నిగర్వుల తోడను, భక్తిపరులతోడను, గుణవంతులతోడను సఖ్యభావము కలిగి మెలగుచుండుము. శీల్యాతకాధారమగు విషయములను గూర్చి ముచ్చటించుము.

ఎట్టి స్త్రీతోడను అధికమగు పరిచయము కలిగియుండకుము. కాని మంచిప్రవర్తనగల స్త్రీలనందరిని దైవ మాశీర్వదించుచుండు గాక యని ప్రార్థించుము. దేవునితోడను దేవదూతలతోడను మాత్రము పరిచయము గలవాడవై యుండ నాశింపుము. లౌకికుడగు మానవునితోడి పరిచయమును మానుకొనుము.

2. మనమందరి యెడలను ప్రేమానురాగముతో ప్రవర్తింపవలసి యున్నను, అతిపరిచయ మనునదిమాత్ర మాసింప తగినదికాదు. తాము ముందెన్నడు చూచియుండని ఒకానొకనిగూర్చి, ఒకొక్కప్పుడు జనులు ఎంతోఘనముగా మాట్లాడు చుందురు. కాని కేవల మాతడు, తమకన్నుల యెదుట కనిపించినప్పుడు, ఆతని నడువడి వారల కసహ్యమును కలిగింపవచ్చును.

మన పరిచయమువలన యితరుల కానందమును గలుగచేయుచున్నట్లు మన మప్పుడప్పుడు తలంచవచ్చును. కాని మనలోనుండు లోపములను వారుకనుగొనునప్పుడు, వారలకసహ్యమును కలిగించును.

లౌకికులగు మానవులతోడి స్నేహము, ప్రయోజనకరములుగాని సంభాషణల మూలముగ, ప్రాపంచిక హృదయానురాగప్రవాహములు నీ హృదయమందు బయలుదేరి, నిన్ను దైవమునకు దూరము చేయును. ముక్తిసంపాదన కవసరమగు యాంతరంగిక శక్తిని పోగొట్టును. వాని వలన నీ కనర్థము ప్రాప్తించుచున్నదిగాన, వాటినన్నిటిని విసర్జించుటకై మనోనిశ్చయమును చేసికొనుము.

---

## సారాంశము

మంచి ప్రపంచానుభవము కలిగి, పవిత్రమైనట్టి సత్క్రమమార్గమున నడచుచు, పరులదూషణల కవకాశమియ్యని, జీవనయాత్ర సలుపు వారలతోడ మాత్రమే స్నేహము కలిగియుండుము. యోగ్యులగువారి జీవితమునను సరించి ప్రవర్తించుటచేత, నీవు పాపమార్గములందు బడక, వారివలెనే యోగ్యమగు జీవయాత్ర చేయజాలుదువు.

దూరదృష్టి కలవాడవై, యట్టిస్నేహితులకు మాత్రమే, నీ హృదయాంతరంగమునందలి విషయములను తెలియపరచుకొనుచు, వారిసలహాలను మాత్రము గ్రహించుచుండుము. జేసునాథునికి మించిన ప్రాణస్నేహితుడు లేడు. రక్షకుడు చూపిన పవిత్రమార్గమున, రక్షకునితో కలిసి, జీవింపుము. అప్పుడే నీ నడువడి నిత్యమోక్షమున కనువైనదై, నీ కానందమును గూర్పగలదు.

---

## 9 వ అధ్యాయము

### వినయ విధేయ వర్తనులమై యుండవలయును.

1. స్వతంత్రులమై మన యిచ్ఛవచ్చినరీతిని ప్రవర్తించుటకంటె, విధేయులమై పెద్దలకు వశవర్తులమై జీవించుట కడు శ్రేయస్కరము. అధికారమును హస్తగతముచేయు పదవియందుండుటకన్న, విధేయులమై ప్రవర్తింపవలసిన స్థితియందుండుటయే మిక్కిలి క్షేమకరము.

పలువురు తమ యవసరములనుబట్టి విధేయులగుచున్నారు. గాని దేవునియందలి ప్రేమకొరకు విధేయించడము లేదు. అట్టిమానవులు సంకటములపాలై, స్వల్పవిషయములందు సైతము సణుగుకొనుచుందురు.

హృదయపూర్వకముగ వారు కేవలము దైవప్రేమకొరకు లొంగియుండినగాని, వారికి మానసిక స్వాతంత్ర్యము లభించదు. మతాధిపతుల యేలుబడికి విధేయుడవై వర్తింపక, నీయిచ్ఛవచ్చిన రీతిని యటునిటు దిమ్మరివై గుమ్మరుచుందువేని, నీకు నిజమగు విశ్రాంతి లభించదు.

మనోభ్రాంతులకు లోనై ఒకయూరినుండి మరియొకయూరికి, ఒకవాసస్థానమునుండి మరియొక వాసస్థానమునకు దొరలుచుండు వారలనేకులు మోసపోయియున్నారు.

2. ప్రతిమానవుడును తనకునచ్చినరీతిని ప్రవర్తింప గోరుటయును, తన యభిప్రాయములతో నేకీభవించు వారలతోడను చెలిమిచేయ గోరుచుండుటయు, స్వాభావికలక్షణమై యుండగలదు. కాని దైవచిత్తానుసారముగ ప్రవర్తించుచు, శాంతి సంపాదనమునకై కొన్ని సమయములందు మన యభిప్రాయములను విసర్జించవలసియుండును.

3. సర్వవిషయములందును పరిపూర్ణజ్ఞానముకలవారు ఎవ్వరును లేరు. గనుక నీ యభిప్రాయమునందెక్కువ నమ్మకము గలిగియుండక, ఇతరుల భావములను సైతము నాలకించుటయందనురాగుడవుకమ్ము. నీయభిప్రాయము సరియైనదైననూ దైవభక్తి తత్పరుడవై, దానినివిడిచివైచి, ఇంకొకరి సూచన ననుసరించి నడతువేని, అందువలన నీవధికలాభమును పొందగలవు.

నీ యభిప్రాయము యుక్తమైన దైనప్పటికిని, అవసరమును అవకాశమునుబట్టి, ఇతరుల యభిప్రాయముతో నీ వేకీభవించ జాలనియెడల, నీవు గర్వపోతువనియు మూర్ఖుడవనియు చెప్పవలసియుండును.

---

## సారాంశము

మన యొక్క యుక్త వివేచనాశక్తి మిక్కిలి మితమైనది. మన హృదయములు చెడిపోయియున్నవి. గనుక మనము ముక్తికొంక్షులు

మగుచుమేని, అల్పమగు మనయోచనాశక్తిపై నాధారపడక, చపలమగు హృదయమును నమ్మక, స్వాభిమానమును విసర్జించి, మనకన్న యుత్తములగు వారి యుపదేశములకు విధేయులమై వర్తించుటయే మిగుల క్షేమకరము.

దివ్యమైన గుణములుగల్గి మనకన్న నెక్కువ యుత్తములగు వారియందును దైవముగలడను భావముతో, వారియందు వెలయుచుండు దైవప్రేమపై మన మాధారపడి యుండుట యెంతయో సంతోషకరము.

ఎల్లప్పుడును విధేయతా గుణము నభ్యాసము చేయజాలుట యెంత శ్లాఘాపాత్రమైనది. అయితే పరిపూర్ణ విధేయత నలవరచుకొనవలయు నన్న, మన మనసుహృదయములు, మనప్రవర్తనలో నేకీభవించవలయును. అట్టిసాధన మనఃపూర్వకమైనదై, మనచర్యలు మిగుల యుత్సాహ పూరితములై యుండవలయును. త్యాగమునకు శీలమునకును విధేయతే ప్రధానము. విధేయతయే అందరకు శాంతమును సంతోషమును చేకూర్చును. సర్వేశ్వరుడే హృదయాంతరాళమున వాసముచేయుచు, మన మనోవాక్కు క్రియలను చక్కదిద్దును. అంతకు మించి మనమాసింపదగునదేమి ?

---

## 10 వ అధ్యాయము

### అమిత సంభాషణ తగదు.

1. సాధ్యమైనంతవరకు ప్రాపంచక కలకలమునుండి తప్పించుకొని తొలగిపొమ్ము. ఏలయన, ప్రాపంచక విషయములనుగూర్చి ప్రస్తాపించుట దోషము గాక పోయినను, అది నిజ్ఞానజీవనమున కాటంకము కలుగచేయును. అందుమూలముగ ఎందుకును కొరగాని డంబాచారమునకు లోనై పలుమారు మనము భ్రష్టులమై పోవుదుము.

గతమున మితభాషినైయుండి, కొరగాని మానవులతో సహవాసము చేయకయున్నచో, నాకు క్షేమకరముగా నుండెడిదని నే నిప్పుడు తలపోయుచున్నాను. మనయంతఃకరణమునకు యేదొక హాని

లేకుండునట్టుల, పరులతోడ సంభాషణచేయుట మిక్కిలి యరుదై యున్నది.

ఒకరినొకరు యోదార్చుకొనుచు, వ్యసనములను బోనణచుకొనుచు, విసుగుజెందియున్న హృదయములకు విశ్రాంతిని సంపాదించుకొను నాశతో, మనమొండొరులతోడ సంభాషించు చుందుము.

మనము మిక్కిలి ప్రేమించి, యభిలషించు చుండు విషయములను గూర్చియో, లేక మనభావములకు వ్యతిరేకములై నవని మనమూహించెడు విషయములను గూర్చియో, మిక్కిలి శ్రద్ధావశులమై యోచించుచు భాషించుచుందుము.

2. అయితే అట్టి సంభాషణ మనేకపర్యాయములు, కేవలము వ్యర్థము నిష్ప్రయోజనము నై పోవుచున్నవి. ఏలయనగా, ఇట్టి బాహ్యమగు యోదార్పులు, దైవసంబంధమగు అంతరంగిక యోదార్పునకు నొక గొప్ప యంతరాయమగుచున్నది. కావున మన మతిజాగరూకతను వహించి మనకాలమంతేయును వ్యర్థముగ గతించిపోకుండునట్టుల దేవుని ప్రార్థింపవలయును. అయితే మనము సంభాషించుట యవసరమైయున్న పక్షమున, జ్ఞానాభివృద్ధిని గాంచు సద్విషయములను గూర్చియే సంభాషింపవలెను.

మన కలవడియున్న దుర్భ్యాసమును పారమార్థికాభివృద్ధియందలి అశ్రద్ధయునట్టి మన నాలుక మనవశము తప్పిపోవుచుండును.

ఆధ్యాత్మిక విషయములను గూర్చి కావింపబడు ప్రసంగములు పుణ్యాభివృద్ధికి మిక్కిలియెక్కువగా సహాయపడును. ముఖ్యముగ దైన్యమగు మానసమును, మనోభావములను కలిసి, దైవసేవయందైక్యమై యున్న వారవల కంటెకంటెను లాభకరములగును.

---

## సారాంశము

జ్ఞానసంపాదనయందు తీక్ష్ణులై, దేవునియందైక్యమైన పుణ్యపురుషులగు మానవులందరును, మౌనవ్రతమును సాధనచేయవలయునని మనకు బుద్ధిచెప్పుచుండగా, దైవమునకును లేక మనపొరుగువానికిని

మానసము నొచ్చుకుండునటుల మనము సామాన్యముగ సంభాషించుట లేదు.

ఐహిక వాంఛాలోలురగు మానవులు సాధారణముగా నెట్టి విషయములను గూర్చి ముచ్చటింతురు? తమపొరుగువారిని గూర్చి మాట్లాడునప్పుడు, వారియందు నిందారోపణలు చేయుదురు; గౌరవ లోపమును గావించెదరు; పరిహాసములు పలుకుదురు; ఈ విధముగ పొరుగువారి నపకీర్తి పాలు చేయుదురు. ప్రాపంచికమును గూర్చి సంభాషించుటలో తత్సంబంధమగు వేడుకలను గూర్చియు, నిస్సారములగు శుష్క విషయములను గూర్చియు శ్లాఘించుచు మెచ్చుకొందురు.

దేవుని గూర్చి దేవమూర్తులను గురించి నీతి నియమములను గూర్చి ప్రసంగములు సల్పునప్పుడు, కేవలము నుదాసీనతను కలిగియుండుటే గాక, అట్టివారియెడల బాహాటముగ తృణీకారమును పలుమారు ప్రకటించుచుందురు.

ఇట్టి దుష్ప్రసంగములతో కాలమును దుర్వినియోగముచేయు నయోగ్యులందు, భక్తిభావములు త్యాగబుద్ధియును దీనత్వమును నిరాడంబరముగా భద్రముగా నుండజాలవు.

## 11 వ అధ్యాయము

## పుణ్యాభివృద్ధికై మనోశాంతమును ఉత్సాహమును సంపాదించుకొనుము.

1. మనకు సంబంధింపని విషయములలో పరులు చెప్పుచుండెడు వార్తలను గురించిగాని, వారాచరించు పనులను గూర్చిగాని, అనవసర జోక్యమును మనము కల్పించుకొనకుందుమేని, మన కపరిమితమగు మనశ్శాంతి లభించును.

పరుల వ్యసనములయందు జోక్యమును కలిగించుకొని, చిక్కుబడియుండు మానవుడు ఎటుల చిరకాల మానసిక నెమ్మది ననుభవింప

గలడు? బాహ్యవిషయములకొరకై నలుదిక్కులను కనుపెట్టుకొని యుండు వాడు, ఆంతరంగిక జీవితమునందెట్టి వృద్ధిని గాంచగలడు?

నిష్కపట హృదయులే దైవాశీర్వాదమునకు పాత్రులు. ఏలయన అట్టివారలే మనోశాంతమును గలిగియుందురు.

2. పావన పురుషులలో కొందరు పరిపక్వమగు జ్ఞానసంపాదకులై, దైవ చింతనాశీలురై యుండుటకు కారణమేమి?

ప్రాపంచక విషయ వాంఛలనన్నిటిని పూర్తిగ పెరికి పారవైచుటయే తమ ముఖ్యమగు నభ్యాసముగ నేర్పరచుకొనినందున, వారు తమహృదయ పూర్వకముగ సర్వేశ్వరుని నాశ్రయించి, ధారాళముగ నాత్మవిచారణ గావించుకొనుటకు శక్తిగలవార లగుచున్నారు. మన మోయన, కామక్రోధ, మద, మాత్సర్యాది మనోవికారములయందు తగుల్కొని, అశాశ్వతములగు విషయములందు ఆతురత గలవారలమై యున్నాము. అందువలన మనయందు వ్యాపించియున్న దుర్గుణములలో, కనీస మొకదానినైనను పూర్తిగ విసర్జింపజాలకున్నాము. అదియును గాక, మనము జ్ఞానమార్గమున దినదినాభివృద్ధి నొందుటకై, నిష్కపటముగ మనఃపూర్తిగ యుద్యుక్తులమై యుండుటలేదు.

3. మనము పరిపూర్ణముగ అహంకారశూన్యులమై, మన హృదయ రంగమునందెట్టి మమకారముల తోడను చిక్కుబడకుంటిమేని, దైవ విషయమందలి మాధుర్యమును రుచిచూడగలవారలమై, దైవ ధ్యానము వలన కొంతయానందము ననుభవింపగలుగుదుము. పశువాంఛలకు బానిస లమై, మనము పావన పురుషు లవలంభించెడు పరిపూర్ణ జ్ఞానమార్గము ననుసరించుటకు తగిన ప్రయత్నములను సలుపకుండుటయే యీ అంత రాయమునకు కారణమైయున్నది.

4. స్వల్ప దుర్దశ ప్రాప్తించినక్లైన, వెంటనే మనము ఖిన్నులమై, దుఃఖోపశమనమును గావించుకొనుటకై పరులనుండి యోదార్పును పొందుటకు పరుగిడుదుము. వీరులవలె రణరంగమున ధైర్యమవలంభించి నిలిచితిమేని, దైవమే మనకు సత్వరము సహాయపడును.

ఏలయనగా, దైవానుగ్రహమునందు విశ్వాసముకలిగి, కామ క్రోధాది దుర్గుణములతో పోరాటము సల్పు వారలకు, సాయము చేయుటకు సర్వేశ్వరుడు సంసిద్ధుడై యుండును. పోరాడుటకై సమయములను సమకూర్చి, జయమును గాంచుటకై దైవమెల్లప్పు డాశించు చుండును.

కర్మానుష్ఠానములందు మాత్రమే మన జ్ఞానజీవన మభివృద్ధినొందు నను యభిప్రాయము గలవారలమైనచో, మన భక్తియంతయు నచిర కాలముననే అంతరించి పోవును.

కావున మనయందు ప్రవేళ్లుపారియున్న కామక్రోదాది దుర్గుణముల నన్నిటిని మొదలంట నరికివేసినగాని, మనము శాంతియుక్తముగు మానసములు కలవారలము కాజాలము.

5. సంవత్సరమునకొక్క దుర్గుణము చొప్పున నశింపచేయుచుందుమేని, యచిరకాలముననే పరిపూర్ణ పవిత్రుల మగుదుము. అయితే మన మటుల చేసియుండ లేదు.

మన ప్రస్తుత పరిస్థితి యెటులున్నదని పరిశోధింతుమేని, మతావలంబ కాలమున లేక మతప్రవేశమున మనము సంపాదించుకొనిన పుణ్యాభివృద్ధితప్ప, యీగడిచిపోయిన సంవత్సరములలో గాంచిన అభివృద్ధిశూన్యమని మనకు గోచరమగును.

పుణ్యజీవితమున మనయౌత్సుక్యము, యభివృద్ధియును దినదిన ప్రవర్ధమానము నొందుచుండ వలయును. అయితే ప్రస్తుతావస్థనుబట్టి చూచినయెడల, ప్రప్రధమమున మనకుగల యుత్సాహమునందు కొంత భాగమైన నిప్పుడు కలిగియుండజాలినయెడల, నదియే ఘనముగా నెంచు కొనవచ్చును.

మనయందు విజృంభించియున్న దుర్గుణములతో పోరాటము సల్పుటకు, ఆరంభముననే మనము కొంత కఠినత్వమును వహించినచో, తదుపరి మనము చేయవలసిన ప్రయత్నములన్నియు కడు సులభములును మిక్కిలి యుల్లాసకరములును కాగలవు.

6. మన మభ్యాసపడియున్న కార్యములను విసర్జించుట కష్టతరమే. అంతియెగాక మన మనోవాంఛల నతిక్రమించుట నంతకన్నను కష్ట

తరము. అయితే స్వల్పములు సులభముగ జయించుట కనుకూలమగు దుర్గుణముల నీవిప్పుడు జయించనిచో, పెద్దసంకటముల నెప్పుడు జయింపజాలుదువు! ఆరంభమునందే సహజవాంఛను ప్రతిఘటించుము. దుష్టాభ్యాసమును [illegible]. ఆరంభమున నీవట్లుచేయ ప్రయత్నింపనిచో, దానినణచివేయుట నానాటికి నీకష్ట మధికమగును.

సన్మార్గవర్తివై నడచునెడల, నీవు ఘనమగు మనశ్శాంతి ననుభవించుటేగాక, పరులకును మిక్కిలి సంతసము నొసగూర్చు సామర్థ్యము గలవాడవగుదువను విషయమును గ్రహించినయెడల, నీయాధ్యాత్మికాభివృద్ధికొరకై మిక్కిలి యాతురత గలవాడవగుదువు.

---

## సారాంశము

దృఢమగు హృదయశాంతి సంపాదనకు తగిన పలువిధమార్గములు తెలియన :

1. ఐహిక వాంఛాలోలురగు వారు ప్రాపంచిక విషయములనుగూర్చి చెప్పునదియును ఆచరించునదియును విశ్వసింపక, తృణీకరించి వైచుట.

2. మనకు సంబంధించిన విషయములందుతప్ప యితర విషయములందు జోక్యమును కలిగించుకొనకుండుట.

3. బాహ్య పటనలను మానివేయుట.

4. దైవమును గూర్చిన అంతరంగిక స్మరణను కాపాడుకొనుట.

5. దీనత్వమును వహించి నిరాడంబరియు, నిగర్వియునై యుండుట.

6. ప్రపంచ విషయాలోలుడై యుండకుండుట.

7. ఇంద్రియానుభవములను, మానసిక వికారములను, చిత్తమును చక్కగా సవరించుకొని మితపరచుకొనుట.

పైనుదహరించిన సత్ప్రవర్తన లన్నిటిని పెంపొందించుకొనుటకై సదా ప్రయత్నములు చేయుము.

ప్రథమున మనమొక దుర్గుణమును మానుకొనుటకై పోరాటము సల్పవలయును. తదుపరి మరియొక దుర్గుణరాహిత్యము

కొరకై పాటుపడ వలయును. ఈ రీతిని మనము వరుసగా ప్రతి దుర్గుణమును జయించి దానిని నిర్మూలము చేయజాలువఱకు విడువక పోరాడు చుండవలయును. అన్నిటికన్న మనమెక్కువగ చేయవలసినదేమియన, ఆరంభమునం దీపోరాటమున మనము కొంత కాఠిన్యమును వహింపవలయును. అందుచే మనము క్రమముగ పవిత్రతాభివృద్ధియందు ముందునకు సాగిపోవు చున్నటులను యెక్కువ జయశీలుర మగుచున్నటులను గ్రహింపజాలుదుము. పవిత్రతాభివృద్ధియందు మనకు మానసికశాంతి లభించుటయేగాక, మనతోడి వారలకందరకును సంతోషమును తృప్తిని కలిగించును.

---

## 12 వ అధ్యాయము

### దుర్దశల వలని ప్రయోజనములు.

1. కొన్ని సమయములందు కష్టములును కడగండ్లను సంప్రాప్తించు చుండుట మనమేలుకొరకే. ఏలయన, అట్టి సంకటముల వలనను, దుర్దశవలనను, మానవుడు తన్ను దానెరుంగజాలును. తాను పరదేశ వాసియనియు, ప్రాపంచక సంబంధమగు విషయములలో దేనిమీదను తానాధారపడి యుండరాదనియు తెలిసికొనగలుగును.

కొన్ని సమయములందు పరులు మనకువ్యతిరేకపరులై యుండుటయును మనము వారికి మంచిచేసినను, చేయవలయునని యుద్దేశించుచుండినను వారలు మనయెడల ద్వేషమును వహించి, చెడుగుగా చెప్పుకొనుచుండు టయును మనకు క్షేమకరమే.

అట్టి దూషణ వాక్యముల నాలకించుచుండుటచే మనము మిక్కిలి దీనభావము గలవారమై దైవమునం దాధారపడెదము. అప్పుడు ప్రాపంచక సంబంధమగు వ్యర్థడంభాచారములనుండి రక్షింపబడుదుము.

2. కనుక ప్రతిమానవుడును, ఐహికవిషయాలోలురగు మానవుల నుండి తానేమియు యాశింప నవసరములేనివాడై, దేవునియందే స్థిరవాసమేర్పరచు కొనును. చిత్తపారిశుద్ధతగల మానవుడొకానొక సమయమున ప్రాపంచక విషయములచే తొందరపెట్టబడినచో, లేక దుష్టతలం

ఫులచే వ్యసన పరుప బడినచో, నట్టిసమయమున దైవముతోడ తానెంత యవసరము కలిగియున్నదియు, ఆయనదయ తన యెడల లేకున్నచో, తాను చేయజాలెడు మంచికార్యమేమియు లేదనియు,చక్కగా గ్రహించగలడు. అటుపైని యాతడు తాననుభవించుచున్న కష్టములనుగూర్చి రోదనము చేయుచు, నిట్టూర్పులువిడచుచు తనను కాపాడుమని దీనుడై దేవునికి ప్రార్థనలు సల్పును. చిరకాల జీవితమందు విసుగుజెందినవాడై దైవమునం దైక్యమగుటకుగాను మరణముకొరకు ఎదురుచూచును. అంతియేగాక పరిపూర్ణ రక్షణమును, పరమశాంతము, నీప్రపంచమున కనుగొనజాలనని యనుభవపూర్వకముగ గ్రహించగలుగును.

---

## సారాంశము

తన్నుతాను తెలిసికొని, యీప్రపంచమునందొక దేశభ్రష్టునివలె నుంటిననియు, గర్వపిశాచము తన్నావహింప కుండునటుల తన్నుతాను జాగరూకతతో కాపాడుకొనుటయు, నిష్కపటమగు దీనస్వభావము కలిగియుండుటయు, యిత్యాది సత్ప్రవర్తనలు మానవున కెక్కువ లాభకరములు. ఇంతకన్న నెక్కువ ప్రయోజనకరములైన వేవియులేవు.

ఈ జీవితమునందు మనకు ప్రాప్తించిన, విఘ్నములు వ్యసనములు మనకు లభించిన వరములుగా భావింపుము. అందువలన మనము దేవునిపై నధికముగా నాధారపడియుందుము. ఈ ప్రపంచమున తామనుభవించుచున్న సంకటములను తమను మోసముచేయుచున్న మనోభ్రాంతులను గుర్తెరింగి, రోదనముచేయుచు, ఆట్టి సంకటములనుండియు మనోభ్రాంతులనుండియు తమను విముక్తులుగ చేయుమని కరుణామయుడగు దేవుని ప్రార్థించునటుల ప్రోత్సహించును.

జీవితమునందు విసుగునొంది, మరణమును ఆశించి దైవమునందైక్య మొందుట కాత్రతపడును.

---

# 13 వ అధ్యాయము

## మనోవికార హేతువుల నెదిరింపుము.

1. ఈ ప్రపంచమున మనము జీవించియుండు నంతకాలము సంకటములును, మనోవికారములును, తంత్రశోధనలు, గలుగుచుండును. అందువలననే జోబుని చరిత్రములో చెప్పబడినటుల ప్రాపంచమునందు మానవుని జీవితమొక పోరాటము. కనుక ప్రతి మానవుడును ఇట్టి మనోవికారములను గూర్చి జాగరూకుడై యుండవలెను. ప్రార్థనలను పట్టుదలతో సలుపవలయును. లేనిచో మోసపు పిశాచమునకు మంచి యవకాశము లభించును. ఏలయనగా, దుష్టపిశాచము ఎవని మోసముచేసి తనచే జిక్కించుకొనవచ్చునా యని, విశ్రాంతి విరామములేక వెదకుచు తిరుగాడు చుండును.

ప్రపంచమునం దెవ్వడును పరిపూర్ణ పావనత్వము పొందజాలడు. కొన్ని సమయములందైనను పావనులైనవారు సైతము మనోవికార హేతువులకు వశులుకాని వారులేరు. మనము పరిపూర్ణముగ ప్రాపంచక వ్యామోహములులేని వారలమై యుండజాలము.

2. వాటిచే మనకు సంకటములును, దుఃఖములును సంప్రాప్తించు చుండినను, పలు సందర్భములందవి మనకుగొప్ప ప్రయోజనకారులు సుమా ?

ఏలయన, వ్యామోహములందు తగుల్కొని, సంకటములను దుఃఖముల ననుభవించు నపుడే, మానవుడు దీనుడై, పవిత్రవంతుడై యట్టి యనుభవమువలన నీతిని నేర్చుకొనుచున్నాడు.

పావనపురుషులందరు అనేక సంకటములకు గురియై, అనేక ప్రాపంచక విషయాను రాగములందు తగుల్కొని, దుఃఖముల ననుభవించి, అట్టి యనుభవమువలన వారు కడపటకు లాభమును పొందియున్నారు.

ప్రాపంచక తంత్ర శోధనలకు నిలువజాలని దుర్భర మానసులు దుర్మార్గులై, కడపటకు పతితులై పాడైపోయినారు. ప్రపంచమునందు

పేరెన్నికగన్న పవిత్రమగు మఠములందును, ఏకాంతవాసములందును సైతము, శోధనలు కష్టములును కలిగియే యుండును.

3. మానవుడు జీవించియుండు నంతకాలమును వ్యామోహములందు చిక్కుపడక యుండుట అసాధ్యము. ఏలయనగా వ్యామోహముల యొక్క మూలాధారము మనయందేగలదు. మనము పాప వికారము లోనే జన్మించి యున్నాము.

ఒక వ్యామోహముగాని లేక కష్టముగాని గతించిపోయిన వెంటనే, మరియొకటియారంభ మగుచుండును. ఇటులనే మనమెప్పుడును వ్యామోహ కష్టపరంపరలచే బాధనొందవలసిన వారలమగుచున్నాము. ఏలయనగా, మానవజాతి పతనము మూలమున ఆదిని మనకొసగబడిన సుఖమును గోల్పోయి యున్నాము.

పలువురు వ్యామోహములనుండి తప్పించుకొని పరుగిడ ప్రయత్నించుదురుగాని, పాపము వారలింకను మిక్కుటమగు వ్యామోహములందు తగుల్కొని యెక్కువగ దుఃఖింతురు. కేవలము తంత్రిశోధనలకు భీతిల్లి పరుగిడి పోవుటవలన ప్రయోజనము లేదు. సహన శక్తివలనను దీనభావము వలనను మన విరోధులనందరిని జయింపగల బలము మనకు లభ్యమగును.

4. బాహ్యమునకు మాత్రము ప్రాపంచక విషయానురాగ వర్జితుని వలె నటించుచు, నట్టి విషయానురాగములను కూకటివ్రేళ్ళతో పెరకి వేయని మానవుడు, లేశమాత్రమైనను లాభమును పొందజాలడు. అంతియే గాక వ్యామోహములన్నియును వానిపై దాడివెడలి, వానిని ముట్టడించును. ఆతడింకను నెక్కువయగు దుస్థితియందు పడిపోవును. నీయుక్తికి తోచెడు కఠినమగు విధముల నిన్ను నీవు పీడించుచు, నిర్బంధపెట్టుచు, గద్దించుచుండుటచేత నీవ్యామోహములను జయింప ప్రయత్నించుటకన్న సహనశక్తివలనను, క్షమాగుణమువలనను ముఖ్యముగ దైవసహాయము చేతను విషయానురాగముల నెక్కువగ జయింపజాలుదువు.

ప్రపంప విషయానురాగములు మోహములు నీపై దాడివెడలు నప్పుడు, యోగ్యప్రవర్తనగల వారి సలహాలను పొందుచుండుము. అట్టి విషయానురాగములచే మోసగింపబడి యున్నవారియెడల కఠినవర్తన గలవాడవై యుండకుము. నీవును అటిస్థితియందే యుండునప్పు డితరులు

నీయెడల నెటుల ప్రవర్తింపవలయునని కోరుకొనుదువో, ఆరీతిని వారి యెడల నీవును ప్రవర్తించుచు వారినోదార్చుము.

5. మానసిక చంచలత్వము, దేవునియందు విశ్వాసము లేకపోవుట, ఈరెండు దుర్గుణములే వ్యామోహములకు మూలకారణములు. చుక్కానీ, లేని యోడ నీటితరంగములపై నటునిటు పలుదెసల కెటుల నొరలుచు కొట్టుకొని పోవుచుండునో, యారీతిని అజాగ్రత్తనుండి దృఢసంకల్పములేనట్టి మానవుడు తన జీవయాత్రయందు స్థిమితము లేనివాడై అటునిటు ప్రాకులాడుచు మోహములయందు మునిగిపోవుచున్నాడు. అగ్నితప్తమైన ఇనుము పరిశుద్ధమగునట్లు, వ్యామోహములచే నీతిమార్గవర్తనుడు పరిశోధించబడి పవిత్రుడగును. శోధింపబడినప్పుడే మన శక్తిసామర్థ్యములు మనకు తేటబడును.

6. వ్యామోహము లారంభింపగనే మన మతిజాగరూకులమై యుండవలయును. మన శత్రువు ఆత్మమందిరద్వారమున నిలిచి, తలుపునుకొట్టుట తోడనే యాతనిని లోపల ప్రవేశింపనీయక, నెదిరించి వెలుపలనే యాపివేయుటవలన మనమాశత్రువును సులభముగ జయింపజాలుదుము. అందువల్లనే ఆరంభముననే యాడ్డగించి పోరాడుము.

ప్రథమమునందు కేవలము తలంపులుమాత్రమే మన మానసమున తలయెత్తును. అటుపైని బలమగు యూహాలు భావములు బయలుదేరును. తదుపరి యా తలంపులు యూహాలనుగూర్చి యొకానొకవిధమగు నుల్లాసముగలుగును. అంతటితోనాగక, దుష్టవాంఛలును, ఆ వాంఛలను కొనసాగించుకొనుట కుద్యుక్తుడ వగుటయును సంభవించును.

ఈ విధముగ దుష్టవ్యామోహములు రానురాను మన మానసమును పూర్తిగ నరికట్టును. చెడుమోహానురాగములు మనలను మోసపుచ్చి, తమ స్వాధీనము జేసికొనును. ఆరంభముననే మన మీశత్రువు నడ్డగించి ఎదిరింపకుండుటవలన నిట్టి దురవస్థ మనకు సంప్రాప్తమగుచున్నది.

ఎంతకాలమువరకు మానవుడు తన యాత్మశత్రువు నెదుర్కొనక కాలవిలంబనము చేయుచుండునో, అంత యెక్కువగ నా మానవుడు బలహీనుడై పోవుచుండును. ఈతనిబలము సన్నగిలి పోవుకొలది శత్రువు

బలము అధికమగుచుండును. కొంతమంది తాము జ్ఞానమార్గము నవలంభింపగనే ప్రపంచ వ్యామోహములు పైకొనుచుండుటయును, మరికొందరకు కడాపటి స్థితియందటుల సంభవించుచుండుటయును గలదు.

మరికొందరు తాము జీవించియున్నంతకాలమును శోధనలచే సంకటముల ననుభవించుచుందురు. మరికొందరు మిగుల స్వల్పముగ మాత్రము పరిశోధింప బడుచున్నారు.

దైవనిర్ణయములందలి నీతిని జ్ఞానము ననుసరించి, యీరీతిని జరుగుచున్నది. ఏలయనగ దైవము మానవులయొక్క యోగ్యతలనుబట్టి వారిముక్తికొరకై ముందుగనే ఇట్టినిర్మాణక్రమ మవలంభించుచున్నాడు.

7. గనుక మనలను పరిశోధించుట కారంభించునప్పుడు నిరుత్సాహులమై నిరాశచెందక, మిక్కిలి పట్టుదలతో దేవుని ప్రార్థింపవలయును.

మనము పరిశోధింపబడునపుడు దైవసహాయముచే వాటినుండి మనమెటుల రక్షింపుకొనజాలుదుమో యను విషయమును అర్చ్యచిన్నప్పగారు చెప్పియున్నారు.

సర్వ పరిశోధనలయందును, సంకటములయందును మనము దేవునిపై నాధారపడి, దీనత్వమును వహించి, మన రక్షణభారమంతయు వారి దివ్యహస్తములం దుంచవలయును. ఏలయనగా దైవమే దీనజన రక్షకుడు. అతడు దీనులను కాపాడి యున్నతస్థితికి గొనిపోవును.

8. జ్ఞానమార్గమునందు మానవుడెంత యభివృద్ధిగాంచినాడను విషయము, యాతని నావరించు పరిశోధనలవలనను సంకటమువల్లను తెలియనగును. సంకటములందును వ్యామోహములందును మానవుడు చిక్కుపడియుండునప్పుడే, యాతని యోగ్యతయంతయును విశదమగును. సంకటములద్వారా వాని కధికవరములు లభించుటేగాక వాని పుణ్యములు అధిక కాంతితో వెలుగును.

9. కష్టములు కడగండ్లు పాలుగాని మానవుడు, భక్తిపరుడై యుండుటదొక గొప్ప విషయముకాదు. కాని కష్టములను శాంతముతో నోర్చుకొని యుండగల మానవుడు, తన జీవయాత్రయం దభివృద్ధి గాంచజాలునని నమ్మకముగా చెప్పవచ్చును. అగ్నిపరీక్షలకు గురికాని కొందరు,

సర్వసాధారణముగు స్వల్ప వ్యామోహములకు దాసు లగుచున్నారు. స్వల్పమగు పరిశోధనలయందు జయము గాంచజాలని వారలు, ఘోర పరిశోధనలయందు జయమును సాధింపజాలుదుమను యహంకార ప్రవర్తనమును విడిచి, దీనత్వమును వహించియుండుటయే యుత్తమము.

## సారాంశము

ప్రాపంచానురాగములకును మోహములకును మనము బానిసలమై పోవునట్టి దుస్థితి మనకు సంప్రాప్తించు నెడల, అవి మిక్కిలి యపాయకరములగును. అటులుగాక మనము వాటినన్నిటిని జయింప జాలునంతటి యదృష్టవంతుల మగుదుమేని, అట్టి వ్యామోహములు మనకు మిక్కిలి ప్రయోజనకరములగును. వ్యామోహములను జయింపగలుగుటకు ఈక్రింద నుదహరించిన విధమున ప్రవర్తింపవలయును.

1. జీవయాత్రయందు మిక్కిలి జాగరూకుడవై, యెడతెగక దైవ కటాక్షముకొరకై ప్రార్థింపుము.

2. జీవితమునందు మిక్కిలి దీనభావము కలిగియుండి, నీ క్షేమమంతయును దేవుని దివ్యహస్తములందుంచుము.

3. నీ స్వశక్తిపై నమ్మకము కలిగియుండకుము.

4. సర్వశక్తుడగు దైవమే, మన రక్షణ కర్తయనెడు విశ్వాసమును కలిగియుండుము.

5. లేశమాత్రమైనను యోచనలేనివారమై, ప్రపంచానురాగములు మనను ముట్టడించుటకు తగిన యవకాశములను మన జీవితకాలమున కలిగింపరాదు.

6. ప్రప్రథముననే మన శత్రువులగు వ్యామోహముల నెదరించి, అవి తమ బలమును మనపై ప్రయోగించకుండునటుల తగు జాగరూకతను వహింపుము.

## 14 వ అధ్యాయము

### త్వరపడి పరులను విమర్శింపకుము.

1. నీ ప్రవర్తనను గూర్చి ముందునీవు పరిశీలించుకొనుము. పరుల చర్యలను గూర్చి విమర్శనలు గావింపకుము. పరుల ప్రవర్తనా విమర్శలయందు మనము పడుశ్రమ యంతయును వ్యర్థము. అట్టి విమర్శలయందు మనము పలుమారులు పొరపడుచుందుము. అందుచే సులభముగా పాప మొనరించిన వారలమగుచున్నాము. స్వవిమర్శన గావించుకొనుచు, మనయందలి లోపములనుగూర్చి పరిశోధించుటకై, మనము తీసికొనెడి శ్రమవలన మనకు మంచి ఫలితము కలుగును. పలుమారులు మనము కలిగియుండెడి మనోభావముల ననుసరించియే, యొకానొక విషయమునుగూర్చి మనము విమర్శనలు గావించు చుందుము.

మన ప్రత్యేకాభిమానము ననుసరించి విమర్శించు చుండుటవలన మన విమర్శన సత్యమునకు దూరమైపోవును. దైవమే మన యాశలకాకరమైనప్పుడు మన యభిప్రాయము లెదుర్కొన బడినను మన మనోశాంతికి భంగము కలుగదు.

2. ఇచ్ఛవచ్చినరీతిని ప్రవర్తించుటకు మనను ప్రోత్సహించు గుణము కొన్నిసమయములందు బాహ్య విషయములవల్ల కలిగినను, సాధారణముగా నది మనయందే గలదు.

పలువురు తమకు తెలియకనే తాముచేయుచున్న కర్మలయందు స్వార్థానురాగులై మెలగుచుందురు. తమ యిష్టానుసారముగ తా మాచరించు కార్యములు కొనసాగి పోవుచుండు నంతకాలము, వారు శాంతమునను భవించుచుందురు. కాని ఆ కార్యములు తమకు ప్రతికూలముగ జరుగుట తటస్థించు నేని, వెంటనే కలతనొందిన మానసములు కలవారలై దుఃఖించెదరు. స్నేహితులయందును, యిరుగుపొరుగులయందును, తాపసులందును, దైవభక్తులయందును గూడ, ఒండొరులకుగల ప్రతికూలమగు వాంఛలవలన పలుమారులు వివాదము లేర్పడుచుండును.

1. దీర్ఘకాల మలవాటుపడియున్న ఆచారమును విసర్జించుటయన మిగుల కష్టతరము. ఎవ్వరును తమ యలవాటులకు వ్యతిరేకముగ పోవు.

టకు బుద్ధిపూర్వకముగ నంగీకరింపరు. జేసునాథుని దివ్యవరములపైగాక నీ వివేకము మీదను, యోచనాశక్తిమీదను నీవాధారపడి నమ్మియుంటి వేని, నీవెప్పటికిని జ్ఞానవంతుడవు కాజాలవు. ఏలయనగా; మనమందర మును తనకు మిగుల విధేయులమై ప్రేమాధిక్యతచేత మన వివేచనాశక్తిని విడనాడవలయునని తానాశించుచున్నాడు.

---

## సారాంశము

మనపాపపుణ్య కర్మలనుగూర్చి దైవసముఖమున జరుగబోయెడి న్యాయతీర్మానము మనకెక్కువ యనుకూలముగ నుండునటు లొనరించు కొనుటకై, యిప్పుడె మనజీవితమును మనమే మిగుల కఠినముగ విమ ర్శించు కొనవలయును. పొరుగువారి జీవితచర్యలను గూర్చిన నిరుప యోగకరమగునట్టి మీదుమిక్కిలి పాపమగునట్టి విమర్శనలను వదలి వేయుదము. పరులచర్యలను గూర్చి న్యాయతీర్పు చెప్పవలసినది లోక కర్తయేగాని పరులెవ్వరునుకారు. పరులవర్తనను గూర్చి న్యాయమగు తీర్మానమును చేయగలుగునంతటి నిష్పాక్షికపట్యము సరిశస్వభావము, శక్తిసామర్థ్యములును నరులకు లేవు. కావున విమర్శించువారలు సర్వ సాక్షియగు సర్వేశ్వరుని స్థానమును అన్యాయముగ నాక్రమించుకొనిన దోషమునకు పాత్రులగుదురు.

---

## 15 వ. అధ్యాయము

### దేవుని ముఖముచూచి ధర్మకార్యములను జేయుము.

1. మానవునియందు మనకుగల ప్రేమచేతగాని, మరేకారణము చేతగాని, చెడుకార్య మెన్నడును చేయరాదు. ఐతే దిక్కులేక దీనుడై యున్నవాని మేలుకొరకై కొన్నిసమయములందు ఒకానొక పుణ్య కార్యమును సైతము విడచివేయవచ్చును. లేక దానినంతకన్న నెక్కువ మంచికార్యముగ మార్పుచేయవలసి యుండును. అందుమూలముగ పుణ్యకార్యము వృథాకాక, అంతకంటెను మంచికార్యముగా మారి

పోవును. దైవప్రేమతో గాక, మెగమెప్పులకొరకై చేయు బాహ్య కర్మలవలన నేమాత్రమును ప్రయోజనములేదు. దైవప్రేమతో గావింపబడు కార్యమెంత స్వల్పమైనదైనను, ఎంత చులకనగా చూడబడునదైనను ప్రయోజనకరము కాగలదు. ఏలయనగా మనమేదైన నొక కార్యము చేయునపుడు, అది ఎంత గొప్పకార్యమను విషయమును దైవమెంచక, దానినెంతటి ప్రేమతోడ చేసితిమను విషయమును మాత్రము పాటించును.

2. ఏమానవుడెంత గొప్పభక్తిగలవాడైయున్న, అంతయెక్కువ పుణ్యకార్యము లాచరించిన వాడగును. తానొనరింప వలవసిన కార్యమును యోగ్యమగు భావముతో చేయువాడే యెక్కువ పుణ్యము నాచరించిన వాడగును. కర్మాచరణయందు స్వాభిమానమును విడచి, సర్వజనోపయోగమును కోరువాడే ధన్యుడు. అప్పుడప్పుడు స్వాభిమానముతో చేసినదియు దైవప్రేమతో చేసిన పుణ్యకార్యముగ గనిపించుచుండును. ఏలయనగా సహజమగు స్వాభిమానము ప్రతిఫలాపేక్ష, స్వలాభము మొదలగునవేవియును నట్టి కర్మాచరణయందు గాన్పింప కుండుట మిక్కిలి యరుదు.

3. వాస్తవమగు దైవభక్తుడు తానాచరించిన కర్మలయం దేమాత్రమును స్వార్థమును చొరనీయక, సర్వకార్యములందును సర్వేశ్వరుని దివ్యమహిమనే కోరుచుండును. అతడెవ్వరియెడలను అసూయాభావమును కలిగియుండడు. ఏలయన నాతడు స్వలాభాపేక్షాపరుడు కాడు. తన మేలులను తానుచూచుకొని, తనలో తాను సంతోషింప వలయునని కోరడు. సర్వమేలులయందును తాను దైవమునకు చేరికయై దైవమునందే తన సంతోషమును బడయవలయునని యాశించును.

తనకట్టి మేలులు కలిగినను దానినన్యులకెవ్వరికిని ఆరోపింపక, సకల మేలుల స్వరూపియగు సర్వేశ్వరునుండి వచ్చినవిగా భావించును. సకలమేలులకు సర్వేశ్వరుడే యాది; సరేశ్వరుడే అంత్యము; ఆతనియందే సకల పుణ్యాత్ములు నిత్యానందమును పొందుదురు.

వాస్తవముగ దైవప్రేమావేశమును గలిగియున్న మానవుడు, ప్రాపంచక విషయములన్నియు కేవలము నిష్ప్రయోజనములని నిస్సంశయముగ గ్రహింపగలుగును.

## సారాంశము

మెప్పులకొరకుచేయు గొప్పగొప్ప ధర్మములకన్న, భక్తితో జెట్టిన పట్టెడన్నమునకు పుణ్యమెక్కువ. లోకరక్షణార్థమై భూలోకమున కవతరించిన దివ్యాధికారియగు జేసునాథుని సకలధర్మసూత్రముల సారమేమన: సకలముకన్న సర్వేశ్వరునే యధికముగ ప్రేమించుచు, మనలను మనమెట్టుల ప్రేమించుకొనెదమో, యట్టులనే మనపొరుగు వారిని ప్రేమింపవలయుననియె. దైవప్రేమ యుతమగు కార్యమే పుణ్యము. ఎంతఘాడమగు ప్రేమతో చేయుదుమో అంతగొప్ప పుణ్యమగును. ఈ గీటురాయిపై పరీక్షింపబడి నిలుచునవే పుణ్యములు. కనుక మనమాచరించెడు ప్రతికర్మలయందును మనము దైవప్రేమ పూరితులమై యుండునట్టుల ప్రయత్నింపవలయును. దేవుని మహిమార్థమై మనము సర్వకర్మల నాచరించు చుందుముగాక.

---

## 16 వ అధ్యాయము

### పరుల లోపములను సహింపవలయును.

1. మనయందున్న లోపము సవరించుకొని చక్కబరచుకొన జాలనప్పుడు గాని, యితరులయందలి లోపములను సవరింప జాలనప్పుడు గాని, అట్టి లోపముల నన్నింటిని సర్వేశ్వరుడు తమ చిత్తానుసారముగ సవరించు నంతవరకు, మనము శాంతముగ నోర్చుకొని యుండవలయును.

అట్టి లోపములు మనయోగ్యతా పరిశీలనకొరకును, మనము సహన శక్తిని యలవరచు కొనుటకును, యుద్దేశింపబడి యుండవచ్చునని తలంపుము. ఏలయనగా సహనశక్తిలేక చేసిన కార్యములు ప్రశస్తములుగ పరిగణింపబడవు. ఐనను అట్టి ప్రతిబంధకములు కలుగునప్పుడు, సర్వేశ్వరుని సహాయమునకై ప్రార్థింపుము. దైవ సహాయముచే నీవా సంకటములను చక్కగ సహింపజాలుదువు.

2. ఏదొకనియందు లోపము కనబడినప్పుడు, నీవు వాని నొకటి రెండు సారులా లోపమునుగూర్చి చీవాట్లు పెట్టినను, ఆతడు సరకు

చేయకున్నచో, వానితో జగడము పెట్టుకొనకుము. దైవచిత్తానుసారముగ సర్వమును సానుకూలముగ పరిష్కరింపబడుటకు విడిచివేయుము. కీడును మేలుగా మార్చివేయజాలునట్టి సర్వశక్తిమంతుడు తన సేవకుల యందుమహిమ, పరుపబడును. ఇతరుల లోపములను దుర్గుణములను, యెంతగొప్పవైనను సరియె, తాలిమితో సహించియుండుటను నేర్చుకొనుము. అదేవిధముగ నీయందుండు లోపములను దుర్గుణములను ఇతరులుసహింప వలసియున్నదికదా !

నీయందలి లోపములను నీయిచ్ఛవచ్చినరీతిని సవరించుకొని,నిన్ను నీవే చక్కబరచుకొనజాలకున్నావు. నీకు నచ్చిన విధమున ఇతరులు తమలోపములను సవరించుకొనవలెనని ఏల యాశించెదవు ?

ఇతరులయందు లోపము లుండకూడదని మనమెక్కువగ కోరుచుందుము. కాని మనయందలి లోపములను మాత్రము మనము సవరించుకొనము.

3. పరులు తమలోపములను తప్పక సవరించుకొనవలయునని మనము కోరుదుము గాని, పరులు మనలోపములను సవరించుటకు మనముసహింపజాలము. పరులు మనయొద్ద స్వతంత్రముగ ప్రవర్తించునపుడు భరింపలేము. మనకోరికలన్నింటిని పరులు తీర్చజాలనియెడల సహింపలేము.

పరులు క్రమబద్ధులై యుండవలయునని కోరుదుము. కాని, మనకట్టి నియమమైనను అడ్డుతగులుటకు ఒప్పుకొనము. పరిస్థితులన్నిటిని పరిశీలించిచూచిన, మనపొరుగువారిని మనతో సమానులనుగా పరిగణించుటలేదని స్పష్టమగును.

మనమందరమును పరిపూర్ణ పవిత్రులమై యున్నచో, దైవప్రేమ కొరకై మన మితరులనుండి సహింపవలసిన దేమియు నుండదు.

4. మన మొండొరుల భారములను భరించుకొనుచు, యొకరికొకరము సహాయకారులమై ప్రవర్తింపవలయునని, దైవనియమమైయున్నది. ఎందుకన, లోపములేని మానవుడొకడైనను లేడు; ప్రతి మానవున కేదియో యొక లోపముండియే తీరును. ప్రతిమానవుడును తాను భరింపవలసిన భారమును కలిగియే యున్నాడు. ఎవ్వడును పరుల సాయమును కోర

కుండ నుండజాలదు. ఎవ్వనికిని తన కుండవలసినంత పరిపూర్ణ జ్ఞానము లేదు. మానవులందరును యొండొరులకు తోడునీడయై యుండవల యును. కష్టములు ప్రాప్తించునప్పుడు, యొండొరుల నాదరించు కొను చుండవలయును; ఒండొరులకు సాయము చేసికొనుచుండవల యును. తమకు తెలియని విషయముల నొకరికొకరు చక్కగ బోధించుకొను చుండవలయును. ఒండొరుల కొవిషయములను నేర్పు చుండవలయును. లోపములేవైన ఉన్నచో యొండొరులను గర్హించు కొనుచు సవరించుకొను చుండవలయును. మనము సంకటములయందు చిక్కుబడి యుండునపుడే, మనయందలి సద్గుణములు వెల్లడియగును. కష్ట కాలములు మానవుని దుర్బలమానసునిగా చేయవు. అతి డెట్టి బలముగల వాడైయున్నది, యెంత యుత్తమ ప్రవర్తన గలవాడైనది, బహిరంగ పరచును.

---

## సారాంశము

మన మెన్నివిధముల యోచించి చూచినను, పరుల లోపములను మనము మిక్కిలి తాలిమితో సహింపవలయునను పర్యవసానమునకే తీసికొని పోబడుదుము. ఇందలి యోచనా పూర్వకమగు భావము లేవియన :-

పరుల లోపములను సవరించుటకన్న, వాటిని శాంతముగ సహించి యుండుటయే శ్రేష్టము. మన మెంతకష్టములకు గురియగుదుమో అంతసులభముగ నితరుల లోపములను భరించగలుగుదుము. మన పొరుగు వారలకు సంకటములను కలిగింపజాలెడి లోపములను, మనయందును కలిగియున్నాముగాన, మన లోపములను గూర్చి, మన పొరుగువార లెంత తాలిమిని వహించి, యోర్చుకొని, యుండవలయునని మనము కోరు చుందుమో, వారు మనయెడల నెంతమంచిగ నుండవలయునని యూహించుదుమో, అదేరీతిని మనమును వారియందలి లోపములనంత తాలిమితో సహించుచు, వారి యెడల నంతమంచిగ ప్రవర్తించుచు నుండవలయును.

---

## 17 వ అధ్యాయము

## సన్యాసాశ్రమము లేక మఠజీవితము.

1. పరులతో శాంతముగను సుఖముగను జీవింప నభిలషింతువేని, పలు సందర్భములందు నీ స్వాభిప్రాయములను పరిత్యజింప నభ్యసింపుము. సన్యాసుల యాశ్రమములందుగాని, మఠములందుగాని నివసించుచు అనిందవర్తనుడవై, నిందారోపణలకు గురిగాకుండునటుల జీవితాంతము వరకు విశ్వాసపాత్రుడవై జీవింపగలుగుట స్వల్పవిషయముగాదు.

అట్టి యాశ్రమములందు ఏమానవుడు యోగ్యప్రవర్తనతో జీవితమును గడపి, దివ్యమగుమరణమును గాంచునో, యాతడే యదృష్టశాలి. నీ సన్యాసజీవితమందు పుణ్యాభివృద్ధిని గాంచవలయుననిన, నిన్ను నీవొక భ్రష్టునిగను యాత్రికునిగను భావించుకొనుము.

ఉత్తమ సన్యాసజీవితమును జీవింపదలచితివేని, జేసునాథుని కొరకై నీవొక పిచ్చివానివిగమ్ము.

2. సన్యాసచిహ్నములగు ప్రత్యేక వస్త్రధారణము శిరోముండనములు ముఖ్యములుగావు. ఈయాశ్రమ స్వీకారము చేయునప్పుడు నీయందు కలిగినమార్పును, కామక్రోధాది మనోవికారములను పూర్తిగా నశింపజేసికొనుటయందు నీవుచేసిన ప్రయత్నములును వాస్తవమగు దైవభక్తుని లక్షణములు.

ఈలోకమునందు కేవలము దైవమును ఆత్మముక్తిని వెదకుకొనుట తప్ప యితరము నాశించువాడు సంకటములను దుఃఖములను అనుభవింపక తప్పదు.

అందరికంటెను తానధమునిగ భావించి, అందరికిని విధేయుడై యుండుటకు శ్రమపడనివాడు, చిరకాలము శాంతిననుభవింప జాలడు.

3. పరులకు సేవచేయుటకొరకై యీ యాశ్రమమున నున్నావుగాని, పరులపై నీ యధికారమును చలాయించుటకుగాదు. నీవు కష్టముల ననుభవించుటకును, పరులకు సేవచేయుటకొరకును, దేవుడు నిన్ను ప్రపంచమున సృష్టించియున్నాడని తెలిసికొనుము.

సోమరిపోతువై కాలయాపనము చేయుటకును, శుష్కప్రసంగములతో నమూల్యమగు నీ కాలమును నష్టపరచుకొనుటకును, కాదని గ్రహింపుము.

కొలిమియందు స్ఫుటముచేయబడు సువర్ణమువలె, మానవుడీ ప్రపంచమున సంకటములందును, దుఃఖములందును పరిశోధింపబడును.

దైవప్రేమకొరకై ప్రతిమానవుడును, మనఃపూర్వకముగ దీనత్వమును వహించి ప్రవర్తింపడేని, అట్టివాడీ పరిశోధనలకు నిలువజాలడు.

---

## సారాంశము

జేసునాథస్వామియును, వారి శిష్యులును విశ్వాసముగలవారలకు బోధించియున్న యుపదేశ వాక్యములను యీ గ్రంథమునం దిప్పుడు మనము చదువుచున్న విషయములతో సరిపోల్చిచూచినచో, ఇవి యన్నియు నొకేవిధమగు నుపదేశములనియు, పాఠములనియు కనుగొనజాలుదుము.

సన్యాసులును దైవభక్తులును బహిరంగముగ నెట్టిమనోవృత్తులను కలిగియుందురో, అట్టివృత్తులనే ప్రతిక్రీస్తువుడును కలిగియుండవలయును.

"సమానభావమును కలిగియుండువారలే యాత్మశాంతి ననుభవింపగలరు. ఎవ్వడు తన సర్వస్వమును విసర్జింపజాలడో, యాతడు నా శిష్యుడుగ నుండుట కర్హుడుగాడు."

"నీవు నీ దుర్గుణముల నన్నిటిని సద్గుణములుగ మార్చుకొని, చిన్నబిడ్డలనుబోలి అమాయకుడవుగ నుండనిచో, మోక్షరాజ్యమున చేరజాలవు."

"మీలో నెవ్వడగ్రస్థానము అధిష్ఠింపవలయునని యాశించునో, యాతడందరికిని దాసుడై యుండవలయును."

"మీభారమును మోసికొనిపోవుటలో యొండొరులకు సాయముచేసికొనుడు. అటుల చేయుచుందురేని, మీరు జేసునాథుని యాజ్ఞలను నెరవేర్చిన వారలగుదురు."

"దేవునికొరకై ప్రతిమానవునను లోంగియుండుము"

దేవునియందు భక్తివిశ్వాసములను కలిగి, ప్రతియొకనిను నిందార్హుడు కానివాడై యుండవలయును. సోమరివైయుండక పాటుపడుచు, మిక్కిలి ఓపికగలవాడై యుండవలయును. స్వాభిమానమును చంపుకొని, దీనభావముగలవాడై ప్రవర్తింపవలయును. అట్టి జీవనయాత్ర జరుపువానికి ఆంతరంగిక శాంతిలభించును; తప్పక మోక్షమును సంపాదించుకొనజాలును.

---

## 18 వ అధ్యాయము

## పావన పురుషులే మన మార్గదర్శులు.

1. పరిపూర్ణ దైవభక్తితో ప్రకాశించుచున్న పావనపురుషులు చూపుచుండెడు, మనోహరములగు సుమాత్మకలను వీక్షింపుము. వారి ప్రవర్తనలయెదుట మనవర్తన లేమాత్రము నెంచతగినది కాదని గ్రహింపగలవు.

అయ్యో! వారిజీవితములతో మనజీవితములను సరిపోల్చుకొని చూచుకొనియెదమేని, మనము లేశమైనను కొరగానివారల మగుచున్నాము.

పరిశుద్ధులును పరమరక్షకుని హితులగువారలు ఆకలిదప్పులచే కృశించుచు, కట్టవస్త్రములులేక కష్టపడుచు, ప్రయాసములను అలసటల ననుభవించుచు, జాగరణలు యుపవాసములు చేయుచు, దైవధ్యానములు ప్రార్థనలు సల్పుచు, అవమానములకును వేదహింసలకును గురియగుచు, లేశమాత్రము చలింపక సర్వేశ్వరునికి సేవచేసియున్నారు.

2. అయ్యో! ఎంతమంది జేసునాథుని అడుగుజాడలలో నడుచుటకై, అపోస్తులును వేదసాక్షులును, వేదవ్యాపకులును పరిశుద్ధకన్నెలును తదితరు లందరును, ఎన్నిఘోర సంకటముల ననుభవించి యుండలేదు! అశాశ్వతమగు నీ ప్రపంచజీవితమును ద్వేషించి, నిత్యజీవితమును పొందుటకై యట్టికష్టముల ననుభవించియున్నారు.

పావనులగు వనవాసులు ప్రపంచాను రాగములన్నిటిని నిగ్రహించి, దీనులై యడవులయందు వశించుచు, ఎన్నియిడుములు బడలేదు! ఎంతటి దీర్ఘజపములు చేసియుండలేదు! ఎంతఘోరమగు వైరాగ్యమును బూనియుండలేదు! తమ జ్ఞానజీవనాభివృద్ధికొరకై ఎంతపట్టుదలను యుత్సాహమును మనఃపూర్వకతను కలవారలైయుండిరి. పాపమును జయించుటకొరకై నెంతతీవ్రమగు పోరాటమును సల్పియుండిరి. దేవుని గూర్చిన వారియుద్దేశ్యము లతి పవిత్రములైనవి; అత్యంత యదార్థమైనవి. పగటి కాలమున వారు కష్టపడి పనిచేసికొనుచు, రాత్రికాలములయందు చాలసేపటివరకు దైవప్రార్థనలను చేయుచుండెడువారు. కర్మాచరణయందు నిమగ్నులైయుండియును, మానసికముగ వారు దేవునిగూర్చి ధ్యానించుటను మానియుండరైరి.

3. వారు తమకాలమునంతయు నుపయోగకరమగు విధమున గడపుచువచ్చిరి. దైవ ప్రార్థనలయం దెంతకాలము వినియోగించినను అది వారలకు అత్యల్పకాలముగనే కనుపించుచుండెడిది. దైవచింతనలను సల్పుటయందు వారనుభవించెడి యానందముచే, తమ శరీర యలసటను తీర్చుకొనుటయందలి యవసరమును సైతము మరచుచుండెడివారు.

వారు తమ శిరిసంపదలను పేరుప్రతిష్టలను బంధుమిత్రుల యెడలి అనురాగములను విసర్జించియుండిరి. కేవలము ప్రాణమును మాత్రము నిలుపుకొనుట కవసరమగు ఆహారములను సైతము సరకుచేయరైరి. శరీరమును కాపాడుకొనవలసిన ముఖ్యావసరములందు సైతమును వారి కసహ్యముగ నుండెడిది. ప్రాపంచక దృష్టియందు మాత్రము వారు మిక్కిలి నిరుపేదలు; కాని దైవదృష్టియందు వారు అధిక సంపన్నులు. వారికిగల మహోన్నతమగు భాగ్యమేదియన; దైవప్రేమ, సుగుణసంపద.

బాహ్యమునకు మాత్రము వారు కడుబీదలు, అంతరంగికముగ వారికి పుష్కలమగు దైవాశీర్వాదవరమును, శాంతియును గలవు. ప్రాపంచకమునకు వారు పరాయి వారలుగ నున్నను, లోకకర్తయగు దేవునికి వారు దగ్గరి బంధువులు.

4. తమను తాము అల్పులుగా భావించుకొనుటచే, ప్రపంచము వారిని అసహ్యించుకొను చుండెడిది. దైవమునకు మాత్రము వారు మిక్కిలి

యుత్తమ పురుషులును ప్రేమపాత్రులునై యుండిరి. నిష్కాపట్యమగు దీనత్వమును గలిగి, నిగర్వులై సాధుత్వమును వహించి, విధేయ ప్రవర్తన గలవారలై త్యాగమును శాంతయుతమగు జీవనము చేయుచుండెడి వారు. అకారణముచే వారు పవిత్రతయందు దినదినాభివృద్ధినొందుచు, దేవునియొక్క మిగుల యతిశయమగు పరిపూర్ణానుగ్రహమును బడయ గలిగిరి.

దైవభక్తులకు నిదర్శనముగ వీరు మన మార్గదర్శకులు కావలయును. జ్ఞానాభివృద్ధియందు వెనుకబడియున్న పెక్కుమంది సోమరుల నిదర్శనముగ తీసికొని, వారివలనే మనమును భ్రష్టులమై పోవుటకన్న, పైవారి నిదర్శనముల ననుసరించుచు, ఉద్రేకపూరిత మానసులమై, యాధ్యాత్మికతయం దెక్కువ యభివృద్ధిని గాంచుటయే మిక్కిలి యుత్తమమగు కార్యము.

5. ఓహో ! పావన మతస్థాప నారంభమున యీ దైవభక్తులందరు మిక్కిలి గాఢమగు భక్తికలిగి యుండెడివారు. ప్రశస్తమైన భక్తితో ప్రార్థనలు సలిపెడివారు. వీరందరును మంచి క్రమశిక్షణము నవలంభించి, అందరియెడలను విధేయతతోడను ప్రేమతోడను ప్రవర్తించెడివారు. తమ మఠాధిపతి నాయకత్వముక్రింద పుణ్యాభివృద్ధిని గాంచియుండిరి.

వారు నిష్కళా పూర్వకముగ ప్రవర్తించి, చూపిన మార్గ చిహ్నములను చూచినచో, వారు నిశ్చయముగ పరిపూర్ణ జ్ఞానులనియు, పావన పురుషులనియు ఋజువుచేయవచ్చును. ఐహికవాంఛా పరంపరలతో వారు ఘోరముగ పోరాటమును సల్పి, కామక్రోధాది మనోవికారముల నణగిద్రొక్కియున్నారు.

ఈకాలమున ఆజ్ఞోల్లంఘనము చేయక, నియమ వర్తియై యుండు వాడును, తాను చేయబూనిన కార్యమును నిర్వహించుటయందు శాంతమునువహించి సాధించువాడును, ఘనుడని యెన్నబడుచున్నాడు.

6. అయ్యో! మనప్రవర్తనయందు మనమెంతఅలక్ష్యముగ నున్నాము. శ్రద్ధలేనివారలమై యుండుటచేతనే మనకారంభ దశయందున్న భక్తి విశ్వాసములు సన్నగిలిపోవుచు, తుదకు భ్రష్టులమగుచున్నాము. మన

మెంత సోమరిపోతులమై, మందమతులమై యున్నాము! ఇట్టిసోమరితనము తోడను, మందమతితోడను జీవించుటే విసుగును కలుగజేయుచున్నది.

ఆదర్శ ప్రాయులగు దైవభక్తుల నెందరినో మనము చూచి యున్నాముకదా ? మనయందు సుగుణాభివృద్ధి యగునంటి పోవకుండు నటుల దయార్ద్ర హృదయుడగు దైవము మనకనుగ్రహించుగాక యని వేడుకొను టవసరము.

---

## సారాంశము

పావనవర్తనులగువారు తామనుసరించి మనకు నిదర్శనముగ చూపి యున్న మార్గములకన్న, మనము పవిత్ర జీవనముచేయుట కంతతీవ్రముగ మనను ప్రేరేపింపజాలునవి ప్రపంచమునం దితరము లేవియును లేవు. ఒకానొక సద్గుణమును సాధనముచేయుట సుఖకరమని, పావనులుచూపిన నిదర్శనమార్గము మనకు నమ్మకము కలిగింపజాలును. అట్టి నిదర్శనమార్గమే సద్గుణసాధన సాధ్యమైనదనియును, సులభమైనదనియును తెలియ జేయును. అట్టిమార్గముల ననుసరించువారికి సద్గుణసంపద యెటుల ప్రాప్తించెనో యటులనే మనకును సద్గుణములు లభించును.

అర్చ్యశిష్టుల జీవిత చర్యలనుగూర్చి చదివినపుడును, లేక వారు నిదర్శనముగా చూపియుండు మార్గములను, కనులార గాంచునపుడును, సహజముగ మనలో మనమేమని తలంతుమో? ఇపుడు మన మాశించు చున్న మోక్షప్రాప్తికొరకై, మనబోటి పురుషులును, స్త్రీలును ఎంత యుత్తమకార్యములను నాచరించియున్నారు! అట్టి పుణ్యలోకమున ప్రవేశింపజాలుటకై యెన్ని కష్టముల ననుభవించి యున్నారు! ఐహిక సౌఖ్యముల నెంత బాహాటముగా ఉపేక్షించి త్యజించియున్నారు !

అయితే అట్టి పుణ్యలోక సంపాదనమునకై మనమేమి చేసి యున్నాము? వా రాచరించిన రీతినే వారికి లభించిన ప్రతిఫలము కొరకై, తగిన యర్హతగలవారల మగుటకై మనమేల శ్రమపడి ప్రయత్నము చేయరాదు?

---

## 19 వ అధ్యాయము

## యోగ్యుడగు దైవభక్తుని సాధనలు.

1. యోగ్యుడగు దైవభక్తుని జీవితము సర్వవిధ సద్గుణ సంపదను కలదై శ్రేష్ఠమైనదై, బాహ్యమున కతడెటుల కనుపించుచుండునో, అంతరంగమునను నాతడటులేయుండ వలయును. వాస్తవముగ యోచించి చూచినచో, ఆతడు బాహ్యమునకంటె అంతరంగమున నెక్కువ యోగ్యతకలవాడై యుండవలయును. ఏలయనగా, మన చేష్టలన్నిటికిని సాక్షీభూతుడై చూచుచున్నది సర్వేశ్వరుడు సుమా? మన మెచ్చుటనున్నను, దైవము యెడల మిగుల భయభక్తులుగల వారమై, పావనులగు దేవదూతలవలె మెలగవలయును. జ్ఞానమార్గమున ప్రవేశించుటకు ప్రథమ దినమున మనమెంత భక్తిశ్రద్ధలుగల వారలమై యుంటిమో, యట్టి శ్రద్ధలతో మన మనుదినమును, లోపములున్న యెడల సవరించుకొని, భక్తిని నూతనపరచుకొనుచు, నీక్రింది విధముగా దైవమునుగూర్చి ప్రార్థించుదము.

ఓ మా దైవమా! యోగ్యమగు మా నూతన సంకల్పములను కొనసాగించుకొనుటయందును, తమకు చేయవలసిన పవిత్ర సేవయందు చక్కగ ప్రవర్తించు నటులను నన్ను కరుణింపుము. ఈ దినముననే నా విధులను నేను సక్రమముగా నారంభించు నటుల నన్నాశీర్వదింపుము. ఏలయనగా ఇంతవరకును నేను చేసినదంతయును వ్యర్థము.

2. మన సంకల్పము ననుసరించియే మనయభివృద్ధియును పెంపగుచుండును. ఎక్కువ యభివృద్ధిని గాంచ వలయునని కోరు మానవుడు యెక్కువ శ్రద్ధగలవాడై పాటుపడ వలయును.

దృఢ సంకల్పములు కలవాడే పలుమారులు అపజయమును గాంచుచుండగా, మిక్కిలి యరుదుగా మాత్రమే సంకల్పములు చేసికొనుచుండునట్టియు, దృఢసంకల్పముల నేర్పరచు కొనకుండునట్టియు, మానవునిగూర్చి చెప్పవలసినదేమి గలదు?

మన సంకల్పముల యందలి యపజయములు పలువిధములుగ సంప్రాప్తించు చుండును. మన సాధనలయందు మనము చేయవలసిన

దంతయు చేయక, లేశమాత్రపు లోప మొనరించినను, అట్టి లోపము వలన నష్టము సంభవించియే తీరును.

నీతి ప్రవర్తనులు తమజ్ఞానముపై నాధారపడక, దైవానుగ్రహముపై యాధారపడియెదరు. తా మేకార్యములు చేయదలంచినను ఎల్లప్పుడును దేవునియందే పరిపూర్ణ విశ్వాసము గలవారలై యుందురు. ఏలయనగా! "తానొకటిదలచిన దైవమొకటి యొనర్చును." అనుసామెతను వారు గుర్తెరింగియున్నారు. మానవులయొక్క ప్రవర్తన మార్గములు మానవులకు స్వాధీనములైనవికావు.

3. కొన్ని సమయములయందు కేవలము భక్తికొరకుగాని, లేక మనతోటి మానవుని లాభము కొరకుగాని, మన కలవడియున్న జ్ఞాన సాధనను వర్జింపవలసి వచ్చును. అయినను ఆట్టిసాధనను తిరుగ ఆరంభించుట సులభము.

అయితే మన మానసమున కలిగెడు యసహ్యత వల్లనైనను, లేక అశ్రద్ధవల్లను జ్ఞానసాధనలందు లక్ష్యములేనివారలమై విడచివేయుట సంభవించునేని, అది గొప్ప తప్పిదమగుచున్నది. అంతియేగాక అందువలన మన కపాయమును సంభవింపవచ్చును. మనకు సాధ్యమైనంతవరకు ప్రయాసపడుచు ప్రయత్నములు చేసినను, మన మనేకవిషయములయందపజయమునే పొందవలసి యుండును.

అయినను మనమెల్లపు డేదియో యొక స్థిరమగు విషయమును గురించియే సంకల్ప మేర్పరచుకొనవలయును. ముఖ్యముగా మన మనుసరించి పోవుచున్న జ్ఞానమార్గమునందు, మన కభ్యంతరములు కలిగించెడు విషయములను గూర్చి, తగిన సంకల్పముల నేర్పరచుకొనవలయును.

మన బాహ్య ప్రవర్తనలను ఆంతరంగిక ప్రవర్తనలను చక్కగా విమర్శన గావించుకొనుచు, లోపములను సవరించుకొను చుండవలయును. ఏలయనగా! మనజ్ఞానాభివృద్ధికి బహిరంగప్రవర్తనయును, ఆంతరంగిక ప్రవర్తనయును, రెండును హితకరము లైనవియే.

4. నీవెల్లపుడును నీ యాత్మశోధనను చేసికొనజాలనిచో, అందుకొరకై నీకుతగిన యవకాశము లేనియెడల, అప్పుడప్పుడైనను యోచించు

కొనుచుండుము. తుదకు దినమున కొకమారైనను ఉదయమున గాని సాయం సమయమున గాని చేసికొనుము.

నీవనుసరింపవలసిన కార్యములను గూర్చి ప్రతిదినమును ఉదయమునందే సంకల్పించుకొనుము; నీవటు లేర్పరచుకొనిన సంకల్ప సాఫల్యతకొరకు నీవేమి యాచరించినదియు, ఆదినమున మనోవాక్కాయకర్మలయందు నీవెటుల ప్రవర్తించినదియు, సాయంసమయములందు విమర్శించుకొనుచుండుము.

ఏలయనగా ఉదయము మొదలు సాయంకాలము వరకు, నీ ప్రవర్తనలయందు దేవునికిని, నీ పొరుగువారికిని, విరుద్ధముగా చాల సారులు ప్రవర్తించి యుండవచ్చును.

పిశాచముయొక్క శోధనలను ఎదిరింప, యోధునివలె నడుముకట్టుము. సర్వావస్థలయందును సంసిద్ధుడవై యుండుము. తిండిబోతు తనమును అణచి యుంచితివేని, శరీరసంబంధమగు తుచ్ఛవాంఛల నతిసులభముగా నరికట్టగలవు.

విషయాసక్తతకును పరిపూర్ణమగు సోమరితనమునకును ఎన్నడును తావియ్యకుము. సద్గ్రంథములను చదువుటయో, లేక వ్రాయుటయో లేక దైవ ప్రార్థనలను సలుపుటయో, లేక దివ్యచింతన చేయుటయో లేక నీ తోడివారల కుపయోగకరములగు కార్యములందు పాటుపడుచుండుట యందునో, నీ కాలమును గడపుచుండుము.

అయినను దేహారోగ్యముకొరకవసరమగు వ్యాయామ సాధనలను యోచించుకొని, యుచితమగువాని ననుసరించుకొనవచ్చును. వ్యాయామ సాధనలయం దందరు నొకేరీతిని వర్తింపవలసిన యవసరము లేదు.

5. సర్వజనోపయోగములుగాని కార్యములను, బహిరంగముగ చేయరాదు. కొన్నికొన్ని కార్యముల నేకాంతముగను రహస్యముగను చేయుటయే ఎక్కువ క్షేమకరము. భక్తిమార్గమునకవసరమగు సాధనలను నెరవేర్చుటయందు మందగమనుడవై, నీకిష్టపడెడు ప్రత్యేక భక్తిసాధనలయందు మాత్రమే యెక్కువ చురుకుగలవాడవై యుండతగదు. ఈ విషయములను గూర్చి మిక్కిలి జాగరూకుడవై మెలగవలయును.

నీవు తప్పనిసరిగ అనుష్ఠింపవలసిన, అనుష్ఠింప నాజ్ఞాపింపబడిన విధులన్నిటిని పరిపూర్ణముగను, గాఢమగు విశ్వాసముతోడను అనుసరించిన పిదప, విరామకాలముండునేని, నీకు ప్రియమగు భక్తికార్యమును నెరవేర్చుకొనవచ్చును.

అందరు నొకే విధమగు సాధన ననుష్ఠింప, శక్తిగలవారలై యుండరు. ఒకానొక సాధన యొకరికిని, మరియొక సాధన మరియొకరికిని అనుకూలముగనుండును. అదియునుగాక కాలవ్యత్యాసమునుబట్టి వేరు వేరు సాధనములు వేరువేరు కాలములందు ప్రీతికరములుగ నుండును.

సంతోషకరమగు పండుగదినములలో, భక్తిసాధనల ననుష్ఠించుట కొందరికి ప్రియము. మరికొందరికి సాధారణ దినములలో ననుష్ఠించుటయే సులభము. మనోవికార హేతువులచే శోధింపబడు సమయము లందొక విధమగు సాధన ననుష్ఠింప వలయును.

శోధనలేక మానసిక శాంతమును విశ్రాంతిని కలిగియుండు సమయములందు, మరియొక విధమగు భక్తిసాధనములు చేయవలయును. మనము దుఃఖములో మునిగియుండునపుడు కొన్ని సాధనములనుగూర్చి మనఃపూర్వకముగ యోచింతుము.

భక్తిపరవశులమై యున్నప్పుడు, మరికొన్ని యనుష్ఠానములను గూర్చి యోచింతుము.

6. ముఖ్యమగు పండుగదినములలో మన సాధనలను పునఃప్రతిష్ఠ చేసికొని, మిక్కిలి భక్తిశ్రద్ధలతో అర్చ్యశిష్టులయొక్క ప్రార్థనల కొరకై వేడుకొనవలయును. ఒకపండుగదినము పోయి, మరియొకపండుగదినము వచ్చుటకుముందు, ఈప్రపంచమును విడిచి ఎప్పటికిని ముగియని నిత్యానందకరమగు యుత్సవమునకు పోవువారివలె, మనము మనసాధనలను ప్రతి యుత్సవదినమున నేర్పరచుకొను చుండవలయును.

స్వల్పకాలములోనే మన ప్రయాసలకన్నిటికిని, తగిన బహుమానమును దేవుడు మనకియ్యబోవుచున్నాడని యెంచుకొనుచు, ప్రార్థనాసమయముల కుచితమగు సరణిని మనము సిద్ధమై, మిక్కిలి భక్తిపూర్వకముగ యొండొరులతోడ సంభాషించుకొనుచు, యుక్తప్రవర్తనగల వారమై, దైవకటాక్షముకొరకెదురు చూచుకొని యుండవలయును.

7. మన మాశపడినరీతిని త్వరితకాలములోనే దైవకటాక్షము మనకు లభింపనియెడల, నిర్ణీతకాలమున దానిని పొందుటకు తగినరీతిని మనము సిద్ధము కాలేదనియు, తత్కారణముచే దైవకటాక్షమును పొందుటకు తగిన యర్హత మనయందింకను లేదనినమ్మి, ఈ ప్రపంచమును విడనాడి పోవుటకు నింక నెక్కువ యోగ్యతతో ప్రవర్తించుటకు ప్రయత్నింపవలయును.

ఏ సేవకుడు దైవపిలుపున కెదురుచూచుచు, మేల్కాని కనుపెట్టుకొని యుండునో, అతడే అదృష్టవంతుడు. అట్టి సేవకునకే సర్వేశ్వరుడు తన వశమునందుండెడు సర్వవరముల ననుగ్రహించునని లూకాసుగారి సువిశేషమున తెలియబరచి యున్నది.

---

## సారాంశము

మానవు లందరును తమ సర్వ జీవితావస్థలందును, సానుభూతితో నొండొరులకు గల భేదమును పాటింపక, దీనత్వమునువహించి నిగర్వులై స్వాభిమానమును నాశన మొనరించుకొని శ్రమలకోర్చుకొని సహనము కలవారలై, ప్రవర్తింపు చుండవలయును. దైవసేవ సల్పుటయందు మనఃపూర్వకమగు భక్తిగలవారలై, పరిపూర్ణప్రాప్తి కొరకై యత్యుత్సాహము కలవారలై యుండవలయును. కొన్ని సద్గుణములు సన్యాసాశ్రమములయం దుండువారలకు మాత్రమే యవసరములైనవిగా నూహించుట, కేవలము భ్రమ. అట్టియూహకలవారలు మోసపోవుచున్నారు.

దైవభక్తులయం దెట్టిసద్గుణము లుండవలయునని మన గ్రంథకర్త కోరుచున్నాడో, యట్టి సద్గుణములే సాగువర్తనగల సామాన్యమగు లౌకికునియందు సైత ముండితీరవలయునని జేసునాథస్వామి కోరుచున్నాడు. మానవ జీవితమును విడిచివైచి దైవజీవితమును జీవింపుము; అదియే నీకవసరము.

---

## 20 వ అ ధ్యా య ము

### ఏకాంతమును మౌనమును ప్రేమించుము.

1. బాహ్యప్రపంచ విషయాందోళమునుండి విరమించి, యేకాంతవాసివై ఆత్మపరిశీలనకు తగినసమయము నేర్పరచుకొని మౌనమువహించి, దైవముచే ననుగ్రహింపబడు వరములను గూర్చి ధ్యానింపుము.

వినోదకరమగు విషయములను విడిచివేయుము. నిన్ను కార్యనిమగ్నుని జేయు విషయములనుగూర్చి చదువుటకన్న, అయ్యో తప్పుచేసితినే యని వాస్తవముగ పశ్చాత్తాపమును నీయందు పురికొల్పెడు విషయములనుగూర్చి చదువుకొనుచుండుము.

అనావశ్యకమగు ప్రసంగములు చేయుట, ప్రొద్దుపుచ్చుటకై అనవసరమగువారిని దర్శించుచు వార్తలను వదంతులను వినుటయం దాసక్తిని విడిచివేయుదువేని, సౌాగ్యమగు దైవచింతనా పరుడవై యుండుటకు అనుకూలమగు విరామము కలవాడ వగుదువు.

గొప్ప పుణ్యాత్ములందరును తమకు సాధ్యమగు నంతవరకు పరసాంగత్యమును విసర్జించి, యేకాంతముగ దైవమహిమలను గూర్చి చింతించుచు, దైవమునందే నిమగ్నులై యుండవలయునని కోరుచుండెడివారు.

2. తానెన్ని పర్యాయములు ప్రజాసాంగత్యము చేయుచుండెనో, అంత యెక్కువగ తనయందలి మానవశక్తులు తగ్గిపోవుచుండెనని యొకానొక బుద్ధిమంతుడు చెప్పియున్నాడు. ఈనిమాటల యందలి సత్యమును, పరులతో మనమెక్కువకాలము సంభాషించి వచ్చునప్పు డనుభవపూర్వకముగ గ్రహింపజాలుదుము.

వ్యర్థప్రసంగములు చేయకుండుటకన్న, కేవలము మౌనముద్ర ధరించియుండుటయే ఎక్కువసులభము. పరులతో సంభాషించుచు అధికప్రసంగము చేయకుండుటకన్న, ఇంటియం దేకాంతముగ విశ్రమించియుండుట మిగులసులభము.

అంతరంగిక సంబంధమగునట్టియు ఆధ్యాత్మికా సంబంధమగు నట్టియు విషయములయం దాసక్తిగల మానవుడు, జనసమూహములతో చేరక, ఏకాంతవాసియై జేసునాథునిగూడి యుండవలయును.

• లౌకిక వ్యవహారములయందు నిమగ్నుడై, యెల్లప్పుడును వెలుపల తిరుగుచుండు మానవుని యవస్థ క్షేమకరముకాదు. మనఃపూర్వకతతో తన గృహమునం దేకాంతవాసియై దాగియుండెడివాడే సౌఖ్యవంతుడు.

మానమును ప్రేమించు మానవుడే యెట్టివిధమగు లోపములును లేకుండునట్టుల మాటలాడజాలునుగాని, తదితరులు సురక్షితముగను నిర్భయముగను మాటలాడ జాలరు.

హృదయపూర్వకముగ నితరులకు విధేయుడైయుండ నేర్చినవాడే, యితరులను సురక్షితముగ పరిపాలింపగలశక్తిగలవాడు. ఇతరులకు విధేయుడై చక్కగ ప్రవర్తింపజాలిన మానవుడే, పరులపై తన యధికారమును యోగ్యముగ నెరపగలడు.

3. మంచి అంతఃకరణము కలవాడే యదార్థమగు సంతోషము ననుభవింపజాలునుగాని, ఇతరుల కది సాధ్యముకాదు. పావనులగు అగ్రశిష్టులెల్లప్పుడును దైవభయమును కలిగి ప్రవర్తించుచుండుటచే తమపరిశుద్ధత్వమును పదిలపరచుకొనగలిగిరి.

సద్గుణములచేతను, దైవ మనుగ్రహించు వరప్రసాదములచేతను ప్రకాశించుచున్నను, వారు మిగుల జాగరూకతతో దీనభావమువహించి యుండిరి.

దుష్టవర్తనులు తమ గర్వముమీదను, స్వబలముమీదను ఆధారపడి, నిర్భయముగ ప్రవర్తించుచుందురు. అట్టి ప్రవర్తనవలన వారు తుదకు మోసపోవుదురు.

నీవు యోగ్యమగు భక్తునివలెను, వానప్రస్థునివలెను కనుపించుచుండినను, ప్రపంచమునందు నీవు మిక్కిలి సురక్షితముగ నుండజాలుదు వను నమ్మకమును కలవాడవై యుండకుము.

4. మిక్కిలియోగ్యులుగ ప్రపంచముచే భావింపబడినవా రనేకులు, తాము నిజముగ యోగ్యులమనియెడు నమ్మకముగలవారై, మిక్కిలి అపాయకరమగు స్థితికి లోనైపోయిరి.

అందుచేత మానవులకు బొత్తిగ శోధనలు లేకుండుటయును, వాటివలన నొత్తిడి కలుగకుండుటయును క్షేమకరముకాదు. అట్టిశోధనలవలన జాగరూకత కలవారమై యుందుము. లేనిచో గర్వపోతులై విజృంభించి, బాహ్యవిషయములవలన సౌఖ్యములకొరకై సులభముగా పెడత్రోవలం బడిపోవుట తటస్థించును.

క్షణభంగురములగు ప్రాపంచిక సౌఖ్యములకొరకై ప్రయత్నములు చేయక, ప్రపంచవిషయములం దెక్కువ జోక్యము పుచ్చుకొనకుండెడు మానవుడు, మిక్కిలి యోగ్యమగు మనస్సాక్షిగలవాడగును.

కొరగాని వ్యర్థచింతలను విడచిపైచి, దైవమహిమలనుగూర్చియు తన రక్షణమార్గమును గూర్చియు మాత్రమే యోచించుచు, దేవుని కరుణవల్లనే తనకు మోక్షప్రాప్తికలదను గాఢవిశ్వాసము కలవాడు శాంతమగు జీవయాత్రను చేయగలుగును.

5. ఏ మానవుడు తానొనరించిన దుష్కృత్యములనుగూర్చి అంతరంగికముగ పశ్చాత్తాపము నొందడో, యట్టివానికి దైవప్రసాదమగు ఆత్మ సమాధానము లభింపదు.

నీ వాచరించిన దుష్కృత్యములను గూర్చిన పరితాపము నీ హృదయమునందు కలుగవలయునని కోరుదువేని, నీ గృహాంతర్మందిరమునం దేకాంత వాసివై, ఐహిక సంబంధమగు గడబిడలను నీ మానసమున చొరనీయక, నీ మనోసాక్షి ననుసరించి యోచించుకొనుము.

“మీ యంతర్మందిరములయం దాసీనులై మీ పాపములంగూర్చి పరితపింపుడు” అని చెప్పబడియున్నది. పలుమారులు నీవు బాహ్యప్రపంచమున పోగొట్టుకొనిన దానిని, నీ గదియం దేకాంత వాసివై యుండునపుడు కనుగొందువు.

నీ గదియం దేకాంతవాసివై యుండుటను అభ్యాసము చేసికొని యెదవేని, నీ వాసస్థానము నీకు మిక్కిలియానంద నిలయమగును. ఇట్టి

యభ్యాసమున కవాంతరము లున్నచో, అందువలన నీకు విసుగును చీదరయును కలుగును.

6. భక్తిమార్గము నవలంభించుటకు మున్ముందుగ, నీ గదియం దేకాంతవాసివై యుండుట కలవడి, దానినిమిక్కిలి క్రమముగ నుంచు కొనుదు వేని, తనుపరి నీకది ప్రాణస్నేహితునివలె నుండి, నీ మానమునకు శాంతికరమగు నానందమును కలిగించును.

నీవు శాంతము కలవాడవై, యేకాంతవాసివై యుండునప్పుడే పవిత్రమగు నీ యాత్మ ముందుకుసాగి యభివృద్ధిజెందినదై, వేదగ్రంథ ములయందు గుప్తపరుపబడియున్న వేదరహస్యములను గ్రహింపగల్గును.

ప్రాపంచక గడబిడలనుండి తా నెంతదూరముగ తొలగిపోవునో, అంతయెక్కువగ తనస్పృష్టికర్తతోడ కలసిమెలిసి యుండగలుగుటకు గాను, ప్రతి రాత్రికాలమందును నీ యాత్మతనను పరిశుభ్రపరచుకొనుట కవసరమగు కన్నీళ్లను కార్చుచుండును.

ఏలయనగా, ఏమానవుడు తన స్నేహితులను పరిచయులను విడ నాడి దైవచింత నాలోలుడై యుండునో, యట్టి మానవుని సమీపము నకు దయామయుడగు దైవము తన పావన దూతలతోడ నేతెంచును.

తన యాత్మను అలక్ష్యముగ విడిచిపుచ్చి, యద్భుత క్రియలు చేయుటకంటె ప్రాపంచక విషయములనుండి దూరముగ తొలగి, యేకాంతవాసియై తన యాధ్యాత్మిక కాభివృద్ధికొరకై చింతించుటయే యుత్తమకార్యము.

ఎన్నడో కాని ఇల్లు విడువకుండుటయు, పరుల దృక్పథములందు బడకుండుటయును, పరులను చూడవలయునను కాంక్షను లేకుండుట యును, సన్యాసజీవము జీవించువారిలో మెచ్చదగిన విషయము.

7. నీవు పొందతగని వస్తువునేల చూడ నాశించెదవు? ప్రాపంచక మును దాని నావరించుకొనియున్న కామవికారములును గతించిపోవు నవే సుమా?

ఇంద్రియ సుఖాపేక్షతో గూడిన కోరికలు, నిన్ను బాహ్యప్రపం చమున కీడ్చుకొనిపోవుచున్నవి: అందుచే నీమనస్సాక్షి నెత్తిపైనొక భార

మును, హృదయమా లిన్యమును తప్ప యితర మేమియును లేదు. మనో వికారములచే సంతోషముగ ఇల్లువిడచి వెళ్లినవాడు,తరచుగా క్లేశమానసుడై గృహోన్ముఖుడై వచ్చుచున్నాడు. ఆనందముగ గడిపిన సాయంసమయము విచారపూరితమగు ఉదయమునకు హేతుభూత మగుచున్నది.

విషయాసక్తతయందలి యానందమంతయు నారంభమునమిక్కిలి మనోహరముగనే యుండును. కాని కడపట అందువల్లగలుగు ఫలితము పశ్చాత్తాపము, మరణము నైయున్నది.

నీ విచ్చట చూడజాలక, నితరస్థలముల చూడగలుగున దేమి గలదు? పరమండలమును, భూమండలమును, సకల భూతములను చూడుము. వీటినుండియే సర్వము నేర్పాటు చేయబడియున్నది.

8. ప్రపంచమున నెచ్చటైనను చిరకాలము నిలిచియుండజాలిన దానిని కనుగొనజాలుదువా? బహుశా నీవీ విషయములందు తృప్తిగాంచవలయునని తలంచెదవుగాని, లోకవస్తువు లేవియు నిన్ను తృప్తిపరుపజాలవు.

సకలవస్తు సముదాయము నొకేకాలమున నీ కన్నులయెదుట కనబడినను, కేవలమాదృశ్యము నైతము నిరర్థకమే యగును. ఉన్నతపరమండలమందుండు సర్వేశ్వరుని వైపు నీ చూపులనుమరల్చి, నీవాచరించియున్న పాపములనుగూర్చియు, లోపములనుగూర్చియు, దయార్ద్రహృదయముతో నిన్ను క్షమింపుమని దైవమును ప్రార్థింపుము.

ఆడంబరముగల విషయములను డంబాచారులకే విడిచివేయుము. దైవాజ్ఞచే నీవాచరించవలసిన విషయములను నీవు నెరవేర్చుము. నీ గదియందు నీ వేకాంతవాసివై కవాటములు బంధించుకొని, నీ ప్రేమపాత్రుడగు జేసునాథుని నీయొద్దకు రప్పించుకొనుము. నీ ప్రాణప్రియుడగు జేసునాథునితో వాసముచేయుము. అందువలన నీవు పొందజాలెడు ఘనమగు శాంతిని మరెచ్చటను పొందజాలవు.

నీవు వెలుపలిప్రపంచముతో జోక్యము కలిగించుకొనక, లౌకిక వ్యవహారములందు ప్రవేశింపక యున్నంతకాలము నీవు ఘనమగు శాంతబుద్ధిని కలిగియుందువు. కాని వింతవిశేషములకు నీవు చెవియొగ్గ నారంభించగనే, నీ హృదయనెమ్మదికి భంగము కలిగినవాడవై కలతనొందెదవు.

---

## సారాంశము

ఐహిక సంబంధమగు విషయములనుండి తొలగిపోయి, ఏకాంత వాసమున మౌనమును వహించియుండుట; యోగ్యమగు విషయములం గూర్చి యుపన్యసించుట; గాఢమగు పర్యాలోచన, దైవప్రార్థన దైవచింతనయనెడు యోగ్యతలు కేవలము దైవభక్తు లగువారికిమాత్రమే యుండవలసిన యవసరమని యూహించుట, మిక్కిలి యపాయకరమగు భ్రాంతి.

ప్రాపంచక వ్యవహారములందు జోక్యమును కలిగించుకొన నవసరము కలిగియున్న వారలకును, దేవునియందు విశ్వాసము కలిగి యుండు వారలకును నేదో యొకరీతిని పైనచెప్పిన సాధనలన్నియు నెక్కువ యవసరములై యున్నవి.

తపస్సు యొక్కయు, మానసిక పరితాపముయొక్కయు యభిప్రాయములను సాపి,తన పాపముల నణచివైచి వానినినిష్కల్మషపరచి పావనునిగా చేయజాలెడి యశ్రుధారలయొక్క ఫలితమును, మన మేకాంతవాసులమై యుండునప్పుడే గ్రహింపజాలుదుము.

ఏకాంత వాసులమై యున్నప్పుడె దేవుడు మనయాత్మలను యోగ్యమగు మార్గములందు నడుపుచు, ఆంతరంగికముగ మనయాత్మలతోడ సంభాషింపుచు, తా ననుగ్రహించెడి వరప్రసాదములచే యాత్మలను పోషించుచుండును.

---

## 21 వ. అధ్యాయము

### హృదయ పరితాపము.

1. పుణ్యమార్గమునం దభివృద్ధి గాంచవలయునను కాంక్షగలవాడ వైనచో, దైవభీతిగల వాడవైయుండుము. నీ యింద్రియములను, వాటి యిచ్ఛవచ్చిన రీతిని ప్రవర్తించునటుల స్వేచ్ఛగా విడిచివేయకుము. వాటిని తగిన క్రమశిక్షలయందుంచుము.

బుద్ధిహీనుడవై పరిహాసాస్పదమగు వైరియానందములందు మునిగిపోకుము. నీ వాచరించియున్న పాపములను గూర్చి హృదయపరితాపము నొందుటయందు శ్రమపడుము. అటులచేయుచుంటివేని, దైవభక్తిగలవాడ వగుదువు.

ఉత్తముడవు గావలయునని కోరుదువేని, పాపములనుగూర్చిహృదయపరితాపమునొందుటయే అందుకు చక్కని మార్గము. దుష్ప్రవర్తనలవలన మన యోగ్యతనంతయును కొలదికాలములోనే పోగొట్టుకొనియెదము.

ఈ ప్రపంచమునకు తానొక పరదేశియనియు, దిక్కుమాలిన యీ ప్రపంచజీవితమునందు తన యాత్మ కెక్కువ యపాయములు తటస్థింప నున్నవనియు, చక్కగా యోచించి గ్రహించు మానవుడు మనఃపూర్వకముగ నీ జీవితమునందే యెక్కువయానంద మనుభవింప గల్గునని తలంపజాలడు.

2. హృదయ చపలత్వమువలన మనయందలి లోపములగూర్చి యోచింపలేక పోవుటచేత, మనయాత్మ యనుభవించుచున్న దుఃఖము మన తలకెక్కుటలేదు. అట్టి పరిస్థితినిగూర్చి మనము విలపింపవలసియుండగా, అర్థములేని పిచ్చినవ్వులు నవ్వుచుండుట శోచనీయము.

యోగ్యమగు మనోస్సాక్షి గలవారలమై దైవభీతితో జీవించుట యందే, సత్యమగు స్వాతంత్ర్యమును ఆనందమును పొందగలము. పరి పరి మార్గములకు పరుగులెత్తుచుండెడి మానసమును, చక్కగ నిలువబెట్టి, పవిత్రమగు మనోసాక్షితో నైక్యపరచి పశ్చాత్తాపముతో ధ్యానముచేయు మానవుడే, యధార్థమగు శాంతిని ననుభవింపగలడు.

తన మనోస్సాక్షికి భారమును కలిగించునట్టిగాని, తన యాత్మను కలుషపరచునట్టిగాని, విషయములనుండి తొలగియుండు మానవుడే సుఖియనం బరగును.

ధీరునివలె దిట్టరివై యత్నములు సల్పుచుండుము. మనము అల వాటుపడియున్న ఏదొక యభ్యాసమును మరియొక యభ్యాసముచే జయింపనగును.

పరుల విషయములందు నీవేమియు జోక్యమును గలిగించుకొన కుందువేని, పరులును నీ విషయములందు జోక్యమును గలిగించుకొనరు.

ఇతరులకు సంబంధించిన వ్యవహారములందు నీవు చొరవబోకుము. నీ కన్న గొప్పవారలు పూనుకొనియున్న కార్యములందు నీవు ప్రవేశింపకుము.

3. అన్నిటికంటె ముందుగ నీ ప్రవర్తననుగురించి నీవు జాగ్రత పడుము. నీ లోపములనుగూర్చి నిన్ను నీవే చీవాట్లుపెట్టుకొనుచుండుము. నీ ప్రియస్నేహితుల కట్టి యవకాశము నీయకుము.

నీ తోడి మానవులు నీయెడల ప్రేమతో వర్తింపనియెడల, నీ దుస్థితిని తలంచుకొని దుఃఖింపకుము. అట్టి సమయములందు నీవాచరింపవలసినదేమన, దైవభక్తిగల జ్ఞానివలె దీనత్వము వహించి ప్రవర్తింపుము.

ఈ ప్రపంచజీవితమునందు ముఖ్యముగ శరీర సంబంధమగు వనేక సౌకర్యములు లేనివారమై యుండుటయే, మిక్కిలి క్షేమకరము. అయినప్పటికిని దైవప్రసాదమగు సౌఖ్యములు లేకుండుటయు, లేక యొకప్పుడుండినను, అట్టిది మిక్కిలి అరుదుగ మాత్రమే మనము పొందుచుండుటయు, మన స్వంతలోపములవల్లనే సాధారణముగ జరుగుచుండును. మనము చేయు దుష్కృత్యములగూర్చి హృదయపరితాపము పొందుటకై మన మేప్రయత్నములు చేయక; వ్యర్థమగునట్టి బాహ్యప్రపంచము నుండి పొందగల తృప్తిని మనము పూర్తిగ విసర్జించుటలేదు.

4. మనము సంకటములు ననుభవింప పాత్రులమై యుండి, దుఃఖోపశమనముకొరకు దేవునిచే ఆదరింపబడుటకు నెటుల ఆసింపగలము? మానవుడెప్పుడు పరిపూర్ణ హృదయపరితాపము నొందునో, అప్పుడుమాత్రమే యాతనికి ప్రపంచవిషయము లన్నియు మిగుల భారమయి, అసహ్యకరములుగ గనుపించును.

దుఃఖింప వలసినట్టియు, పరితాపము నొందవలసి నట్టియు కారణములను యోగ్యప్రవర్తనగలవాడు తనలో తానే కనుగొనును. తనను గూర్చిగాని, తన పొరుగువారలను గూర్చిగాని యోచించునపుడు, ఈ ప్రపంచమునందు సంకటములు లేనివా డెవ్వడును లేడని గ్రహింపగలును.

తననుగూర్చి ఎంతఎక్కువగ విమర్శన గావించుకొనునో, అంత యెక్కువగ దుఃఖించు అవసరము కనుగొనును. పశ్చాత్తాప పడవలసిన

పాపములందును లోపములందును మనము చిక్కుపడియుండి, మోక్ష సంబంధమగు విషయములపై మన మనసును నిలుపజాలకున్నాము.

5. చిరంజీవిరైయె యుందువను విషయమును గాక మరణమునుగూర్చి పలుమారులు జ్ఞప్తికి తెచ్చుకొను చుందువేని, నిస్సందేహముగ నీవు మిక్కిలి యాత్రతతో నీలోపములన్నియును సవరించుకొనెదవు.

నరకవేదనలను లేక యుత్తరించు స్థలబాధలనుగూర్చి మిక్కిలి గాఢముగా యోచించినయెడల, శ్రమలను, బాధలను సంతోషముగ సహింతువనియును, ఎట్టి తపఃక్రియలును నీకు భీతిగొలుపజాలవని నమ్మ వచ్చును.

6. అయితే, యిట్టి విషయములు మనహృదయమున ఘాటముగ నాటవు గావున, ముఖప్రీతిమాటలకు ఆనందింతుము గావున, ఆత్మ ఉత్సాహము మందగించి, సోమరితనము ఏర్పడుచున్నది.

నిర్భాగ్య భౌతికశరీరము అల్పవిషయమునకే అంతసులభముగ మొరలిడుచుండుటకు మనహృదయ దౌర్బల్యమే కారణమై యున్నది.

పాపములనుగూర్చి పరితపించెడు హృదయమును ప్రసాదింపుమని దీనుడవై దేవుని ప్రార్థింపుము. దీర్ఘదర్శితో కలిసి "దేవా! మాకన్నీటినే మాకు భోజనముగను, పుష్కలమగు కన్నీరే మాకు పానీయముగను ప్రసాదింపు"మని ప్రార్థింపుము.

---

## సారాంశము

అందరిమానవుల కవసరమగునదని కొనియాడబడెడు హృదయ పరితాపమన నేమనగా? ఉన్నత సర్వేశ్వరునికి చేసిన ద్రోహమునకై పాపపరిహార్థమై పడెడు మనఃక్లేశము.

ఇట్టి హృదయ పరితాపములేని మానవునియందు సత్యమగు దైవభక్తియు, స్థిరమగు పావనత్వమును నుండజాలవు. పాపములనుగూర్చి హృదయపరితాపమును పొందు మానవునకు, తన దివ్యయాదరణయు మనోశాంతమును ఆత్మశాంతమును ప్రసాదించెదమని దైవము వాగ్దానము చేసియు

న్నాడు. అట్టివారి దివ్యవరప్రసాదములను పొందుటకై మిక్కిలి యుద్రేకము గలవారలమై యుండవలెను.

మానవునియొక్క యంతిమ స్థితినిగూర్చియు నరకమందుగాని లేక యుత్తరించు స్థలమందుగాని మానవుడనుభవింపవలసిన శిక్షలనుగూర్చి మన దురవస్థలనుగూర్చి పుణ్యాకర్మాచరణలయందు మనకుగల హృదయ దౌర్బల్యమును గూర్చియు, భయభక్తులతో దేవుని సేవించుటకుగాను ప్రేరేపింపజాలెడి తలంపులను గూర్చి, గాఢముగా చింతింపవలయును.

దేవుని దివ్యవరప్రసాదములను సంపాదింపవలయు ననెడి యుద్రేకము గల వారలమై యుండవలయును.

---

## 22 వ అధ్యాయము

### మానవుని దౌర్భాగ్యస్థితినిగూర్చి యోచింపుము.

1. దేవుని వైపునకు నీ హృదయమును మగలించుకొని, వారి దయకొరకై ప్రయత్నముచేయుచు, తగురీతిని ప్రవర్తింపని యెడల, నీ వెచ్చటనున్నను ఏ యేదిక్కునకు పరుగిడినను నీవు నిర్భాగ్యుడవే సుమీ.

నీకోరిక ననుసరించి నీప్రయత్నములు కొనసాగ లేదని యేల మనోవ్యాకులత నొందెదవు? ఈ ప్రపంచమున తనకోరికల ప్రకారము కార్యసానుకూలతను పొందు మానవు డెవడైనను గలడా? నేనుగాని నీవుగాని మరెవ్వడుగాని అతుల జయమును గాంచలేదు.

తానొక సాంమ్రాజ్యాధికారియైనను పరిశుద్ధపాపుగారైనను విశాల ప్రపంచమునం దింకేమానవుడైనను, ఏదియో యొక కష్టముగాని, సంకటముగాని లేని మానవుడు లేడు.

అట్లయిన నీ ప్రపంచమునం దెవ్వడు సుఖియైయున్నాడని ప్రశ్నింతువా? నిస్సంశయముగ దేవుని ప్రేమకొరకై యే మానవుడు బుద్ధిపూర్వకముగ కష్టము లనుభవించుటకు సంసిద్ధుడై యుండునో, యట్టి భాగ్యశాలి మాత్రమే సౌఖ్యవంతుడని చెప్పవలయును.

2. దుర్బల మానసులగువారు తమకు తెలిసిన ధనవంతులు, బలవంతులు, రాజ్యాధికారులు మొదలగు వారల ప్రాపంచక యున్నతస్థితులను జూచి "ఓహో చూడుము! యాతడెంత సుఖజీవనము చేయుచున్నాడో, ఆతడెంత గొప్పవాడో, ఆతడెంత శక్తిసామర్థ్యములు గలవాడో" యని చెప్పుచు విభ్రాంతి నొందుదురు.

కాని, శాశ్వతమగు మోక్షభాగ్యములను గూర్చి యోచింతుమేని, ప్రాపంచక సంపదలన్నియు క్షణికమాత్రములును సంతాపకరములునై యున్నవని, శాంతికి భంగము కలిగించునట్టివని, వాని మనమెన్నడును నిర్భయముగను, సురక్షితముగను ననుభవింప జాలమని తెలిసికొందుము.

యథేష్టముగ అపారమగు అశాశ్వత సంపదలను కలిగి యున్నందు వలన సౌఖ్యములేదు. జీవితావసరములను దీర్చగలిగినవి యున్నచో చాలును. నిశ్చయముగ నీ ప్రాపంచక జీవనమొక దురవస్థయేకదా?

ఆధ్యాత్మికాభివృద్ధిని పొందవలయునని మానవుడెంత యెక్కువగ నభిలషించి, ప్రయత్నములు చేయుచుండునో, అంత యసహ్యముగ తానను భవించుచున్న జీవిత మాతని కగుపించు చుండును.

3. ఏలయన, పతన మానవ ప్రకృతియందలి మాలిన్యమును స్పష్టముగా చూచి, చక్కగా గ్రహించగలుగును. భక్తిపరాయణు డెపుడును పాపమును పూర్తిగా పరిహరించి, లోకమునుండి త్వరలో విడుదల కావలయునని ఆశించుచుండును. ఈ ప్రాపంచక వృత్తులయిన తినుట, త్రాగుట జాగరణచేయుట, నిదురపోవుట, విశ్రమించుట శ్రమపడుట, తనకు కావలసిన యితర పదార్థముల కొరకై అవసరములను కలిగి యుండుట మొదలగున వన్నియును, నిశ్చయముగ దైవభక్తునకు దుర వస్థలవలె తోచుచు, సంతాపకరములై యుండును.

ఈ ప్రపంచమున శరీర పోషణాదులకు కావలసిన యవసరము లన్నియు ఆంతరంగిక జీవనము చేయువానికి మిక్కిలి భారములై తోచు చుండును. అందుచేతనే దీర్ఘదర్శి, "ప్రభూ! ప్రాపంచక కలవరముల నుండి నన్ను విముక్తిని చేయుము" అని మిక్కిలి భక్తితో దేవుని వేడుకొను చున్నాడు.

తన దౌర్భాగ్యస్థితిని గ్రహింపలేకున్న మానవునికి అనర్థము. ఇక్కు మాలిన యీనీచ మానవజీవితమునం దెక్కువ మక్కువగలవాని గతి అంతకన్నను దుఃఖకరము.

కొందరు ఈ లోక భాగ్యములను అత్యధికముగ అపేక్షించు చున్నారు. ఎంత శ్రమపడినను, పరులను ఎంత యాచించినను తమ జీవితావసరములను సైతము సంపాదించుకొనజాలరు. అయినను వారీ లోకమునందెల్ల కాలము జీవింపగలిగి యున్నచో, పరలోకమును గూర్చి లేశమైనను మతింపకయుందురు.

4. మతిచెడి దైవమునందు విశ్వాసము లేక, నాస్తికులై దేవుడు లేడని వాదించెడు దరిద్రులారా! అశాశ్వతములై యసత్యములై, మోహమును గలిగించి మోసపుచ్చుచుండెడి ఐహిక విషయములందు లగ్నమై, నశించి పోయెడు శరీర సంబంధమగు విషయములుతప్ప యితరమేమియు మీకు రుచింపకున్నది!

దౌర్భాగ్యులు తుదకు తమ క్షేమమునంతయు కోల్పోయి, తామంత మిక్కుటముగ ప్రేమించుచు వచ్చిన ప్రాపంచక సౌఖ్యము లన్నియును, అల్పములును అశాశ్వతములును కడునీచములని తెలిసి కొందురు.

దైవభక్తు లందరు, జేసునాథుని ప్రియులందరు, శరీర సంబంధమగు సుఖములను గూర్చిగాని, అశాశ్వత వస్తుసమృద్ధిని గూర్చిగాని లేశ మాత్రమైనను లెక్కచేసియుండలేదు. శాశ్వతమగు సౌఖ్యములందే వారాశ పెట్టుకొనియుండి, అట్టి సౌఖ్యములనే వారు బుద్ధిపూర్వకముగ కోరుచుండిరి.

కనులకు కనబడుచున్న ప్రపంచవస్తువుల యందలి మమతను ప్రపంచవిషయములవైపు క్రిందికి లాగునేమోయను భీతిచేత, శాశ్వత మగునట్టియు అగోచరమగునట్టియు, సౌఖ్యములకొరకై వారి వాంఛ లన్నియును ఆకసము వైపునకు త్రిప్పి నిలిపిరి.

సోదరా! పుణ్యాభివృద్ధిని జెందజాలుదునను నమ్మకమును పోగొట్టుకొనకుము. ఇంకను నీకవకాశము కలిగియున్నది; నీ కాల మింకను గతించిపోలేదు.

5. నీ సంకల్పమును కొనసాగించుకొనక, యేల దినదినము వాయిదా వేయుచున్నావు? లెమ్ము: సిద్ధముకమ్ము. కార్యనిర్వహణమునకు పూనుకొనుము. ముందెప్పుడో చేయవచ్చునని యభిప్రాయపడకుము. ఈ నిమిషమునసే యారంభింపుము.

కార్యనిర్వహణమున కిదియే సమయము! పోరాడవలసిన సమయమిదియే. "నా జీవితము నందలి లోపములను సవరించుకొని తగిన మార్పులు గావించుకొనవలసిన కాలమిదియే" యని తలంపుము.

నీ వెప్పుడు సంకటములందు తగుల్కొని దుఃఖించెదవో, అప్పుడే నీవు పుణ్యఫలము సంపాదించుకొను కాలమని ఎరుంగుము.

నీవు విశ్రాంతి ననుభవించుటకుముందు, అగ్నియందును జలమునందును మునిగి తేలవలసినవాడవై యున్నావు.

నీదుష్కృత్యముల యెడల మిక్కిలి కఠినత్వమును వహించి ననే గాని, నీవు పాపమును జయింపజాలవు. ఈ దుర్బలమగు పాపిష్టి శరీరమును మన మెంతకాలము భరియింపవలసియుండునో, అంతకాలమును మనము పాపమునకు దూరముగ నుండజాలము. అంతేగాక మనము అలసటను దుఃఖమును లేక జీవింపజాలము. మనము ఎట్టి నిర్భాగ్యము లేక సుఖముగ నుండ ఆశించుచున్నాము.

ఆదిని పాపముద్వారా మానవజాతి పతనమై పోయినందున, వాస్తవమగు శాంతిని మనము గోల్పోయి యున్నాము. కావున ఓర్పుగలవారలమై పాపము నశించి, యనిత్యకాలము గతించి, శాశ్వతమగు జీవితము లభించువరకు దైవానుగ్రహము కొరకై వేచి యుండవలయును.

అయ్యో! మనమెంత దుర్బల మానసులము! పాపము దెసకే మన మనస్సు మననీడ్చుకొని పోవుచున్నది. నీ వాచరించిన పాపములను గూర్చి యీ దినమున నీవు పాపసంకీర్తనము చేయుచున్నావు, తిరుగ మరుసటి దినము ఆ పాపమునే చేయుచున్నావు.

ఇకమీదట నిట్టి పాపముచేయనని సంకల్పించుకొని, జాగరూకత వహించుచున్నావు; మరుక్షణమందే అట్టి సంకల్పమేదియును చేసికొని యుండని వానివలెనే ప్రవర్తించుచున్నావు.

అంతటి హృదయదౌర్బల్యము కలవారలమై చంచలమనస్కులమై యుండుటచేత, మనము మిక్కిలి దీనభావముగల వారలమై లవమాత్రమైనను స్వాతిశయము లేనివారలమై యుండవలసి యున్నది.

చిరకాలము శ్రమపడి దైవకటాక్షముచే సంపాదించుకొనజాలిన లేశమాత్రపు పుణ్యమును సైతము, మనయశ్రద్ధవలన శీఘ్రకాలములోనే పోగొట్టుకొనవచ్చును.

అయ్యో! యింతత్వరలోనే మనమింత నిరుత్సాహపరులమై, మందమతులమై పోవుచుండుటచే తుదకు మనగతి యేమిగానున్నదో కదా! మనవర్తనయందు వాస్తవమగు పవిత్రతాలక్షణము లేశమాత్రమైనను లేకపోయినను, మానసికశాంతమును పొంది, సురక్షితముగనున్నవారివలె భావించుకొని, విశ్రమింపవలయునని యత్నించితిమా, దుఃఖింపవలసినవారమే యగుదుము.

యోగ్యమగు మార్గముల ననుసరించి, ప్రవర్తించుటకై తిరుగ యిపుడు మనము నూతన యభ్యాసకులవలె యుపదేశములను పొందవలయును. మనమట్టుల చేయజాలుదుమేని, బహుశా మననడతలను చక్కబరుచుకొని, యెక్కువ పుణ్యాభివృద్ధిని పొందవచ్చును.

---

## సారాంశము

మానవులందరును తమవృత్తులయందు సుఖమునే కోరుచుందురు. ఐతే వాస్తవికసౌఖ్యము నశించి పోయెడు ప్రాపంచిక వస్తువులందు కనుగొనజాలమనియెడి సత్యము, దుఃఖకరమగు యనుభవమువలన వారికి తెలియవచ్చును. మన మీప్రపంచ జీవితమునందు సంపాదింపగల సంపదలన్నియును, వ్యర్థములును సారహీనములై యున్నవి.

మన మాంతరంగికముగ, బహిరంగముగ ననుభవించునవన్నియు పలువిధములగు దురవస్థలే సుమీ? ఈ శరీరమునుగూర్చి యోచించి చూచితిమా? సర్వవిధములగు కోర్కెలకును, అవసరములకును, రోగములకును, దుర్గుణములకును ఆలవాలమై యున్నది.

మానసమునుగూర్చి యోచించుకొనియెదమన్న, అది చంచలమై యస్థిరమై, నిముష నిముషమునకు మారిపోవుచున్నది. హృదయ స్వభావమునుగూర్చి తలంచుదమన్న, మనమాచరించిన అనేక దుష్కృత్యములచే క్రుళ్ళి చెడిపోయియున్నది. అంతియేగాక ఎల్లప్పుడును పాపకృత్యముల నాచరించుటకే మనల నెక్కువగ పురిగొల్పుచున్నది.

ఆత్మయొక్క స్థితినిగూర్చి విచారించుకొనియెదమన్న :— అది ఇంద్రియ సౌఖ్యలోలతచే చెరుపబడి, మిక్కిలి భారమైయున్న యీ భౌతిక శరీరముచే క్రిందికి లాగబడుచున్నది. ఈ శరీర నైజప్రభావముచే ఆత్మ ప్రాపంచక విషయములందే తగుల్కొని యుండవలయునని యెడియాశ కలదగుచున్నది. తత్కారణముచే భౌతికశరీరమున చిక్కులబడి యున్నయాత్మ, తలయెత్తి దేవునిగూర్చి చింతించుటకు అశక్తురాలై పోవుచున్నది.

అయ్యయ్యో! ఇవియన్నియును పాపాత్ము డనుభవింపవలసిన యెట్టి ఘోరమగు నాపత్తులకు మూలములగుచున్నవి! న్యాయవర్తియగు మానవుడీదుష్కృత్యముల నన్నిటినిగూర్చి చింతించును. దేవునియొక్క కరుణా ప్రభావముచే నీకష్టములను ఎగ్గులను మొదలగు వానినన్నిటిని మిక్కిలి శాంతముగ సహించును.

ఈపాప జీవితమునుండి ముక్తి గాంచవలయుననియే యాతడాశించును. కాని శాశ్వతానందమును తనకు ప్రసాదించుటకుగాను తన సంకటములనే తగిన పరికరములుగ నొనర్చి, తనకట్టి శాంతము చేకూరుటకు దైవమనుజ్ఞ నిడువరకు నెమ్మదిగ కనుపెట్టుకొని యుండును. అట్టి కాంక్షను మనము కలిగియుండవలయును. ఈదౌర్భాగ్యమగు దిక్కుమాలిన జీవితము నశించి, శాశ్వతానందముగల జీవితమును పొందవలయుననెడి కోరికతో జీవనయాత్ర గడపవలెను.

---

## 23 వ అధ్యాయము

## మరణమునుగూర్చి యోచనలు.

1. అచిరకాలముననే నీవీ ప్రపంచమును విడిచి పోవలసియున్నావు. కనుక, నీపరిస్థితు లెటులున్నవని గమనించుకొనుము.

మనము ఈ దినమున చూచుచున్న జీవి, రేపటి దినము మరణించి మన కన్నులకగపడకుండ నదృశ్యుడై పోవుచున్న వ్యక్తిని శీఘ్రకాలముననే మనము బొత్తుగా మరచిపోవుచున్నాము.

అక్కటా! మన హృదయములెంత మొండివి! ఎంత కఠినములై యున్నవి. తాత్కాలిక విషయమునుగూర్చి మాత్రమే యోచించుకొనుచున్నవిగాని,ముందు రానున్న వాటినిగూర్చి లవలేశమేనియు చింతించుట లేదు. మరణము నిన్ని నిమిషముననే గొనిపోవనున్నదని భావించి, నీ వాచరింపవలసిన ప్రతి కార్యమును, తలచెడి ప్రతి తలంపును చక్క బరచుకొనుము.

ఉత్తమమగు మనస్సాక్షిగల వాడవైనచో, మరణమును తలంచుకొని, భీతిల్లవలసిన పని లేదు. మరణమును దూరముగ పారద్రోలుటకై ప్రయత్నించుటకన్న పాపమునుండి దూరముగ పారిపొమ్ము.

మరణమన్న భీతిచెందకుండుటకై, యీ దినముననే నీవు సిద్ధముగా నుండజాలనిచో, రేపటి దినముమాత్ర మెటుల సంసిద్ధుడవు కాజాలుదువు? రేపటి దినమువరకు నీవు సజీవుడవై యుందువని నీ వెటుల చెప్పగలవు?

2. పుణ్యాభివృద్ధిని పొందజాలనియెడల, చిరకాలము జీవించుటందు వలన శ్రేయమేమి? అయ్యో! చిరంజీవులమై యున్నందువలన మన మెక్కువ పుణ్యమును సంపాదించుటకు మారుగా, ఎక్కువ పాపములనే చేయుచున్నాము.

మన జీవితకాలమున కనీస మొకదినమందైనను యోగ్యప్రవర్తన గలవారలమై యుంటిమేని ఎంతమేలు! పెక్కుమంది మరజీవితమున తాము గడిపిన సంవత్సరములను లెక్కించుకొనెదరు. తాము సంపాదించుకొనిన పుణ్యమును పరిశీలించినచో కడు స్వల్పమైయుండును.

మరణమన్న భీతికల్గునేని, చిరకాల జీవితమింకను ప్రమాదకరముగ నుండును. ప్రతి నిమిషమును మరణమునుగూర్చి స్మరణించుచు, దానికి సిద్ధముగనుండు నాతడే యదృష్టవంతుడు. ఏలయన తన నడతను చక్కజేసికొనుచు, మరణమునకు సిద్ధపడును. నీ వెప్పుడైనను మరణించుచున్నవానిని చూచిన యెడల, నీవును అకేవిధముగ మరణింపవలసిన వాడవేయని యోచించుకొనుము.

3. ప్రాతఃకాలమందు నీవు రాత్రికాలమువరకు జీవించియుండజాలనని తలంచుకొనుము. సాయంత్రమగుటతోడనే మరుసటి యుదయము వరకు జీవించియుందునను నమ్మకమును కలిగియుండకుము.

అటుల ఎల్లపుడును మరణమునకు సంసిద్ధుడవై ప్రవర్తించిన అకస్మాత్తుగా మరణము నిన్ను దాపురింపలేదు. చాలమంది తమ యజాగ్రత్త వలన అకస్మాత్తుగా మరణించుచున్నారు.

"జేసునాథుడు మన మనుకొనిన సమయమున మనకడ కేతెంచును" అవసానకాలము ఆసన్నమైనప్పుడు గతించిపోయిన నీ జీవితకాలమునుగూర్చి వేరువిధముగ చింతించుట కారంభించెదవు. నీ ప్రవర్తనయందలి యజాగ్రత్తలనుగూర్చి మిక్కిలి ఎక్కువగ దుఃఖించెదవు.

4. అవసానకాలమునందెటు లుండవలయునని తలంచునో, యటులే తన జీవితకాల మంతయు నుండుటకై ప్రబల ప్రయత్నములు చేయు దూరదృష్టిగల మానవుడే మిక్కిలి భాగ్యవంతుడు.

ఏలయన ఐహిక విషయములను సంపూర్ణముగ తృణీకరించి, యోగ్య ప్రవర్తనయం దభివృద్ధి గాంచవలయుననెడి మనఃపూర్వకమగు వాంఛతో తనప్రవర్తనయందు క్రమశిక్షణ కలవాడైయుండుట యందు మిగుల ప్రీతిగలవాడై, పాపపరిహారార్థము తపస్సు చేసికొనవలెననెడి భావము కలవాడై, అందరియెడలను విధేయుడై విరాగియై జేసునాథుని ప్రేమకొరకై సర్వవిధములగు సంకటములందు సహనము వహించి, యే మానవుడు ప్రవర్తించుచుండునో, యాతడు మాత్రమే నిర్భయముగ నానందముతో మరణింప గల్గుదునను గాఢనమ్మకము గలవాడగును. నీవుఆరోగ్యముగ నున్నపుడే మంచికార్యములను చేయగలవు. రోగపీడితుడవైనప్పుడు నీవు జేయజాలునది యేమియులేదు.

వ్యాధివలన పుణ్యాభివృద్ధి నొందినవార లరుదు. పర్యటించుచు, నటు నిటు గుమ్మరుచుండు వారలలో సైతము, పావనులైన వారలు మిక్కిలియరుదు.

5. నీస్నేహితులను బంధువులను నమ్మకుము. అదియునుగాక నీయాత్మ సంరక్షణమును ముందెప్పుడో గావించుకొన వచ్చునని, ప్రస్తుతకాలము నందు యుపేక్షించి యుండకుము. ఏలయనగా, నీవు ఊహింపలేనంత శీఘ్రముగనే నీ బంధుమిత్రాదులందరు నిన్ను మరచిపోవుదురు.

కనుక సకాలములో ఇప్పుడే నీవు తగిన రీతిని యోగ్యప్రవర్తన గలవాడవై, ముందెప్పుడో నీమరణాంతరమున ఇతరులు సాయము చేయుదురనియెడి నమ్మకము కలిగియుండక, నీ మరణమునకు పూర్వమే పుణ్య సంపాదనమును చేసి యుంచుకొనుము.

నీ మేలుకొరకై ఈ సమయమున నీవు జాగ్రత్తపడని యెడల, యికముందు నీక్షేమమునుగూర్చి శ్రద్ధను వహించువార లెవరు? ప్రస్తుత కాలమే మిక్కిలి యమూల్యమైనది, ఆదరణీయమైనది; నీ ముక్తి సంపాద్యమునకు మిక్కిలి యుక్తమగు సమయ మిదియే.

ఇట్టి యమూల్యమగు కాలమును మిక్కిలి ప్రయోజనకరమగు దానినిగ జేసికొన జాలకుండుటను చూడ, దుఃఖము కలుగుచున్నది. నీవీ సమయమున ఎక్కువ పుణ్యమును సంపాదించు కొనవచ్చును. అందు మూలముగా శాశ్వతకాలమును సుఖ మనుభవించ వచ్చును.

పుణ్యసంపాదనకై యొకదినము లేక నొకగడియకాలమైన నవకాశమి మ్మని నీవు వేడుకొనవలసిన సమయము రావచ్చును. అట్టి యవకాశము నీకు లభింపక పోవచ్చును.

6. ప్రియులారా! మీరిపుడు పాపభీతిగల వారలై మరణమున కెదురు చూచుచుండురేని మరియొక ఘోరమగు అపాయమునుండి భీతినుండి విముక్తులైన వారలగుదురు.

కనుక నట్టియోగ్యజీవితము గలవాడవై మనుటకు మిక్కిలి శ్రమ పడి ప్రయత్నింపుము. అటుల జీవింతురేని అవసానకాలమున భీతిజెందుటకు మారుగా నానందముగ నుందురు.

లౌకిక జీవనము మీలో నంతరించినపుడే, క్రీస్తు జీవనము మీ యందు ప్రారంభమగును. ప్రపంచానురాగములను తృణీకరించుట కభ్య సింపుము. అపుడు నీవు స్వేచ్ఛగా శ్రీ జేసునాధుని సన్నిధికి చేరగలుగుదువు.

తాపస చర్యచే నిపుడు నీ శరీరమునుదండించి, పవిత్రముగావించుకొనుము. అపుడు నీకు రక్షణమందు నమ్మకము గలుగును.

7. బుద్ధి హీనుడగు మానవుడా! నీ వీదినము జీవించియుందువను నమ్మకము లేనపుడు, చిరకాలము జీవింతునని యెటుల తలంపగలవు?

ఎంతమంది తాము చిరకాలము జీవించియుందుమని తలంచుచుండగా, ఆకస్మాత్తుగా మరణించియుండలేదు! ఒకడు కత్తిచే నరుకబడి, మరియొకడు నీటియందు మునిగి చచ్చెనని, ఇంకొక డున్నత ప్రదేశము నుండి క్రిందబడి మెడను విరుగగొట్టు కొనియెననియు, ఈ మానవుడు భోజనము చేయుచు మరణించెననియు, ఆమానవుడు ఆడుకొనుచుండగానే గతించెననియు లోకులు చెప్పుకొనుచుండగ నీవెన్నిసారులు వినియుండలేదు? కొందర గ్నియందుపడి దహనమైపోయిరి. కొందరు రణరంగమున కూలిపోయిరి. మరికొంద రంటురోగములకాహుతియైరి. మరికొందరు బందిపోటుదొంగల చేతులందుపడి మడసిరి.

ఈ విధముగ ప్రతిమానవునకును, చివరకు మరణమేగతి. నీడవలె మానవునియొక్క జీవితము ఆకస్మాత్తుగా నదృశ్యమై పోవును.

8. నీవు మరణించిన పిమ్మట, నిన్ను జ్ఞప్తియం దుంచుకొను వారలెవరు? నీకొరకై దేవుని ప్రార్థించువారలెవరు? ప్రియుడా! రక్షణము కొరకు నీచేతనైన దంతయును నీవే ఈ సమయముననే చేసికొనుము. ఏలయందువా? నీ వెపుడు మరణించునది నీకు తెలియదు. అంతియేగాక మరణాంతరము నీగతి యెటులుండు నదియును నీకు తెలియదు.

తరుణముండగనే నాశనములేని, శాశ్వతసంపదను కూడబెట్టుకొనుము. నీ మోక్షమునకు సంబంధించిన వాటినితప్ప యితరవిషయములను నీ మానసమున చొరనీయకుము. దైవసంబంధమగు వానియెడల ఆతురతకలిగి యుండుము.

పరమందున్న పావనులను ప్రార్థించుచు వారి స్నేహమును సంపాదింపుము. వారి ననుసరింపుము. నీ వీలోకమునువీడి పోవునపుడు, వారు నిన్ను శాశ్వతనిలయమునకు సంతోషముగా నహ్వానింతురు.

9. ఐహిక విషయములందు లేశమైన నాశలేని యాత్రికునివలెను, పరదేశీయునివలెను, ఈ ప్రపంచమునం దుండునంతకాలము ప్రవర్తింపు చుండుము.

నీ హృదయమును ఇంద్రియవిషయాను రాగములందు చొరనీయక, దైవముపైపునకు దానిని మరలింపుము. ఈ ప్రపంచమునందు నివశించుటకు నీకుస్థిరమగు పట్టణమేదియు లేదు. నీ పాపములను గూర్చి హృదయ పరితాపమునొంది, నిట్టూర్పులు విడచుచు, కన్నీళ్లను కార్చుచు, ప్రతిదినమును నీప్రార్థనలను పరమునకు బంపుచుండుము. అటుల చేయుచుండుట వలన మరణాంతరము నీ యాత్మ మిక్కిలి యానందముతో సర్వేశ్వరుని సన్నిధానమునకు చేరగలుగును.

---

## సారాంశము

మరణముకన్న రూఢియగునది మరొక్కటిలేదు. మరణ మెప్పుడెటుల ఆసన్నమగునో, మనమెరుగజాలము. మనము ప్రతిదినము వినుచున్నట్టి గాంచుచున్నట్టి ఆకస్మాత్తు మరణములను యోచించి చూచితిమేని, మరణమొక దొంగవలె వచ్చునను దైవవాక్కు నెరవేరుచున్నదని గ్రహింపగలము.

1. కావున మరణమున కాయత్తము కమ్ము.

2. దైవసన్నిధానమున కరుగుటకు మనమెప్పుడును సంసిద్ధులమై యుండవలయును.

3. మనము మరణశయ్యపై నుండునపుడు, మనమెట్టి పుణ్యాత్ములమై యుండవలయునని కోరుదుమో, అట్టి పుణ్యమును నేడే చేయుము.

గతించిపోయిన కాలమూ తిరుగ వచ్చుటలేదు. ముందురానున్న కాలమునుగూర్చి మనకేమియు గోచరమగుటలేదు. అతివేగముగ నదృశ్యమైపోవుచున్న వర్తమానకాలము మాత్రమే, మనమోక్షప్రాప్తి కొరకై

మనము శ్రమపడుటకుగాను దైవము మనకనుగ్రహించి యున్నాడు. కనుక మానవులారా! మనమీ యమూల్యమగు వర్తమానకాలమును మోక్షప్రాప్తికొరకై పాటుబడుటయందే తప్ప, ఇతరమునకు వినియోగింపరాదు.

క్షణికమాత్రపు వేడుకలకొరకును, భోగములకొరకును, అట్టి యమూల్యమగు వర్తమానకాలమును వ్యర్థపరచుకొని, అందుమూలముగ శాశ్వతానందమును పోగొట్టుకొనకుడు.

రోగ పీడనమువలన మనము పవిత్రుల మగుదుమను నమ్మకము లేదు. అట్టియవకాశము మనకు కలుగునను నిశ్చయమునులేదు. మనమరణాంతరమున మనయాత్మ రక్షణకొరకై యితరులెవ్వరైనను ప్రార్థనలు చేయుదురో లేదో చెప్పజాలము.

కావున దైవవరప్రసాద సహాయమువలన మనము మరణించుటకు ముందుగనే, మనము చేయజాలిన పుణ్యకార్యములన్నియు చేయుచు, ఆకస్మాత్తుమరణమువలన మన మధోగతిపాలు గాకుండునటుల జాగ్రత్త వహించి యుండుట క్షేమకరము.

---

## 24 వ. అధ్యాయము

## పాపులకు కలుగు దైవతీర్మానములు; దండనలు.

1. సకల విషయములందును, కడాపటకు నీగతి యెటులుండునో యని యోచించుకొనుము. సర్వము తెలిసిన సర్వేశ్వరుని సముఖమున లేశమాత్రమైనను కప్పిపెట్టజాలము. లంచములందుకొనక, క్షమాపణల నంగీకరింపక, న్యాయము ననుసరించి మాత్రము తీర్మానములుచేయు న్యాయాధిపతియెదుట, నీవెటుల నిలువగలవో, యాలోచించుకొనుము.

కోపముగల మానవునకే భయపడు ఓ బుద్ధిమాలినపాపీ! నీవాచరించియున్న పాపములన్నియును చక్కగ నెరింగియున్న నీదేవునియెదుట నీవేమి సమాధానము చెప్పుకొనియెదవు?

న్యాయతీర్పుదినమున శిక్షను తొలగించుకొనుటకై వాదించువారెవ్వరును నుండరు. ప్రత్యేకుడును తనంతటతానే తన జీవితచర్యను గూర్చి సమాధానము చెప్పుకొనవలసియున్నది. కాబట్టి అట్టి న్యాయతీర్పుదినమున నీకవసరమగు వానినన్నిటిని నీవేల మున్ముందుగానే సమకూర్చుకొని యుండరాదు?

ఈ సమయమున నీవు పడు శ్రమ నీకు మిక్కిలి లాభకరము. నీ పాపములకొరకు పడు పశ్చాత్తాపము, చిందు కన్నీళ్లు, విడుచు నిట్టూర్పులు అంగీకరింపబడును. నీ పరితాపములు, దుఃఖములు దేవుని తృప్తిపరచును. అందుచే నీ పాపముల నుండి నీవు పరిశుద్ధుడవు గావచ్చును.

2. పరులవలన తాను చెరుపు పొందుచుండియును, తానను భవించెడు అపకారములకన్న, పరుల పాపములనుగూర్చి పరితపించుచున్నట్టి, తన విరోధు లాచరించుచున్న పాపములను హృదయపూర్వకముగ క్షమించుచున్నట్టి, తా నెవరికైన నొక దోషము చేసియున్నయెడల తనను క్షమింపుమని వారిని వేడుకొనుచుండునట్టి; కోపమును తెచ్చుకొనుటకు మారుగ తాపమును చూపునట్టి, తానొనరించు పాపములనుగూర్చి తనను మిక్కిలి క్రూరముగ దండించుకొనునట్టి; ఇంద్రియానుగుణ్యముగ ప్రవర్తింప జూచెడు తన భౌతిక శరీరమును తనకు లోబరచుకొనగలిగినట్టి పుణ్యపురుషుడు, హితకరమగు పాపవిమోచనమును పొందును.

ముందెన్నడో ఉత్తరించు స్థలమున మన పాపపరిహారమును చేసికొనదలచుటకన్న, ఇపుడే మనము దానిని పోగొట్టుకొని మనయందలి దోషములనన్నిటిని, మొదలంట నరికివేయుటయే మిక్కిలి యుత్తమ కార్యము.

ఐహిక వాంఛలయందు మునిగితేలుచు, నిరుపయోగమగు శరీరముపై మితిమీరిన అనురాగముచే మనము నిశ్చయముగ మోసపోవుచున్నాము.

3. నీ పాపమువలన నీవు దేవుని యాగ్రహమనియెడు అగ్నికి గురియగుచున్నావు. పుణ్యాభివృద్ధికై పాటుపడక, యింద్రియ సుఖలోలుడవైన నీ వెంత ఎక్కువగ ప్రాపంచక విషయముల వెంట పరుగిడుదువో, అంతయెక్కువగు నరకాగ్నిని కూడబెట్టుకొని బాధల ననుభవించెదవు.

ఏ అవయవములందు మానవుడెంత ఎక్కువగా పాపము లాచరించి యుండునో, ఆ అవయవములలోనే ఘోరమగు బాధల ననుభవించువాడగును. నరకమునందు గనగన మండుచుండెడు యంకుశములతో సోమరిపోతులగు పాపులు పొడిచి యీడ్వబడియెదరు.

ఈ లోకమున నుండునపుడు త్యాగబుద్ధి లేశమాత్రమైనను లేక, భక్షింబరులై తమపొట్టలు విచ్చుకొని పోవునటుల మెక్కుచుండెడు తిండిపోతులందరును, నరకమునందు మితిమీరిన యాకలిబాధచేతను, దప్పిచేతను ఘోరముగ పీడింపబడియెదరు.

ఈ ప్రపంచమున భోగలోలసులై యింద్రియాది సుఖముల నెక్కువగ ప్రేమించుచుండెడు వారిపై, నరకమున మండుచుండెడి దుర్గంధ కంపు కొట్టుచుండెడు గంధకము వర్షించును.

పరులమేలును జూచియోర్వలేక, అసూయాగ్రస్తులై యుండెడు మత్సరమానసులందరును, దుఃఖముచే పిచ్చికుక్కలవలె మొరగుచుండెదరు.

4. పాపమునకు తగిన శిక్షరూపముగ, ఘోరబాధల ననుభవింపకుండ తప్పించుకొని పోవఁజాలెడి పాపియెవడును నుండడు. అహంకారులగు వారు అవమానముచెంది తబ్బిబ్బైపోవుదురు. పేరాశపీడితులగు లోభులందరును దిక్కుమాలిన స్థితియందు ఘోరలేమిడిచే కష్టదశల పాలగుదురు.

శతవత్సరము వీరాప్రపంచమున పాప పరిహార్థమై పడెడు గాఢమగు తాపసవృత్తికన్న, నరకమునందొక ఘడియసేపు అనుభవించెడు బాధయే యెక్కువ తీవ్రమైనది.

ఈ ప్రపంచమున ఎట్టికష్టములకైనను కొంతవిరామముండును; మనస్నేహితులు మనల నూరడించెదరు. కాని నరకదండనకు విశ్రాంతి గాని, యూరటగాని లేదు. కనుక పాపివగు ఓ మానవుడా! ప్రస్తుతకాలమున జాగరూకుడవై ప్రవర్తింపుము. నీ పాపములను గూర్చి పశ్చాత్తాపము నొందుచు, దుఃఖింపుము. అటులచేయ జాలితివేని న్యాయ తీర్పుదినమున పుణ్యవంతులతో గూడ నీవును సురక్షితముగ నుండవచ్చును.

న్యాయతీర్పుదినమున న్యాయప్రవర్తనగలవారలందరును, ప్రపంచమున తమను బాధలపాలు చేసిన వారియెదుట మిక్కిలి ధీరులై నిశ్చలత్వమును వహించి నిలుతురు.

భూలోకమందు దుష్టుల తీర్మానములకు దీనుడై లోబడియుండువాడు, న్యాయ తీర్పుదినమున దేవుడనుగ్రహించెడు న్యాయ తీర్మానము కొరకు ధైర్యముతో నిలిచియుండును. దైవసాన్నిధ్యమున బీదవారలును, దీనభావముగలవారలును, తమ కేవిధమగు దండనలును విధింపబడవను గాఢవిశ్వాసముతో నిశ్చితితో నిలిచియుండ, గర్వపోతులు భయకంపితులై యుందురు.

5. ఈ ప్రపంచమున జేసునాథునికొరకై, పిచ్చివానిగ మిక్కిలి నీచునిగ నెంచబడెడు విధమున ప్రవర్తించినవాడే జ్ఞానుడని తేటపడును. లోకమునందు శాంతముతో ననుభవించిన కష్టములన్నియు న్యాయ తీర్పుదినమున మిక్కిలి యానందదాయకములై యుండును. సైతానుని నోరుమూత బడిపోవును. పాపులు పరితాపముతో నుందురు.

ప్రపంచానందములందు మునిగితేలుచు మూఢు లనుభవించిన యానందముకన్న, శరీరసౌఖ్యములను నిగ్రహించి ప్రవర్తించుచు వచ్చినవారలే మిక్కుటమగు జయోత్సాహము కలవారలై యుందురు.

అందమగు దుస్తులన్ని అసహ్యకరములై పోవును. పేదదుస్తులు ప్రకాశింపుచుండును. అందముగ నలంకరింపబడియున్న రాజభవనము కన్న, దీనులగు నిరుపేదల పూరియిండ్లే ఘనముగ కొనియాడబడును.

ప్రపంచజీవితమున మానవుడు పరులపై చలాయించుచు వచ్చిన యధికారముకన్న, అందరియెడల అనుసరించుచు వచ్చిన ధైన్య గుణమే దైవసన్నిధానమున మిక్కిలి సహాయకారిగా నుండును.

6. ప్రాపంచిక సంబంధమగు కృత్రిమముకన్న, సామాన్య విధేయతయే శ్లాఘాపాత్రమగును. తత్వశాస్త్రమునందలి ప్రావీణతకన్న, పవిత్రమగునట్టి మనోసాక్షియే మిక్కిలి యానందము నిచ్చును.

ధనరాసులుగల కోటీశ్వరులుకన్న, ప్రపంచకసంపదలను పరిత్యజించిన పేద మానవుడే దేవునియెదుట న్యాయతీర్పు దినమున నెక్కువ యోగ్యుడుగ నెన్నబడును.

మిక్కిలి రుచికరమగు పదార్థములను భుజించుచు, సుఖియై యుంటివని తలంచుటవలనగాదు, దయామయుడగు దైవముయెడల భక్తి విశ్వాసములు కలవాడవై ప్రార్థనలు చేయుచున్నందులకు న్యాయతీర్పు దినమున నూరడిల్లుదువు.

శుష్కప్రియములగు ప్రసంగములు చేయుటకన్న, పవిత్రమగు కర్మలనాచరించుచు మౌనమును వహించియున్నందుకు,ఎక్కువగ నానందింతువు. పలువిధ ప్రపంచ భోగములవలని గలుగు నుల్లాసమునకన్న, కఠినమగు జీవనముచేయుచు గాఢమగు తాపస వృత్తి ననుసరించుటయే, యుల్లాసకరమగును.

ప్రపంచజీవితమున స్వల్పకష్టము ననుభవింప నభ్యాసము జేసికొనజాలితివా, ఘోరమగు కష్టమునుండి తొలగింపబడి రక్షింప బడియెదవు. నీవిపుడు స్వల్పకష్టములను సైతము ఓర్చుకొనజాలనియెడల, ముందు నీ పైబడనున్న శాశ్వతమగు హింసలనెటుల సహింపజాలుదువు?

ఇంతస్వల్పమగు బాధలకే నీ విపుడింత తబ్బిబ్బులైనచో, నరకమునందలి భీకరాగ్ని బాధల నెటుల సహింపగలుగుదువు? ఇపుడు ప్రపంచ సౌఖ్యములను నీ యిచ్చవచ్చిన విధమున ననుభవించుచు, అటుపిమ్మట జేసునాథునితోగూడి రాజ్యాధికారము వహింపవలయునన్న, నిశ్చయముగ నీ కది సాధ్యముకాదు. ఇహపరము లీయగల యానందములలో నేదో యొకటయే నీ వనుభవింప గలవు.

7. ఈ దినమువరకును నీ వందరివలన గౌరవింపబడుచు, భోగము లనుభవించుచున్నను, నీ విపుడొక్క నిముషములో మరణించవలసి యున్నచో నీ గతియేమి? దేవుని ప్రేమించి, సేవించుటతప్ప, యితరమంతయు వ్యర్థము.

దేవుని తన పూర్ణహృదయముతో ప్రేమించు మానవునకు మరణముగాని, న్యాయతీర్పుగాని, దండనగాని, నరకముగాని, లేశమాత్రమేనియు భీతినిగొల్పజాలవు. ఏలయన, దేవుని యెడల మనము చూపకలిగెడు పరిపూర్ణమగు ప్రేమయే మనలను సురక్షితముగ నాతని పాదసన్నిధికి గొనిపోవును.

ఐతే ఇంకను పాపమునందు ఉల్లాసముగల దౌర్భాగ్యుడు మరణమును, న్యాయతీర్పును గురించి భీతిచెందుట యొక వింతగాదు.

అయినప్పటికిని దేవుని యెడల ప్రేమ నిన్ను దుర్మార్గమునుండి త్రిప్పజాలనిచో, తుదకు నరకభయమైనను నిన్ను మంచిమార్గమునకు మరలింపజాలిన యెడల యుత్తమమే.

దేవుని యెడల భయభక్తులన్న సరకుచేయక యుపేక్షించువాడు, శీఘ్రకాలముననే పిశాచము వేయు వలలో తగులుకొని పతితుడై భ్రష్టుడైపోవును.

---

## సారాంశము

దుర్మార్గులాచరించెడు పాపములనుగూర్చి దేవుడు సర్వమునకు న్యాయతీర్పు చెప్పుననియు, వారి వారి పాపముల ననుసరించి శాశ్వత దండనలను విధించుననియు, మనమెల్లరమును విశ్వసించెడి విషయము. అయితే ప్రపంచ సంపదలనుగూర్చి, గౌరవమునుగూర్చి ప్రాపంచిక యింద్రియ భోగములనుగూర్చి మనము నివశించుచుండు భవనముల, మనము ధరించుచుండు దుస్తుల మనముసమకూర్చుకొని యుండు సామగ్రుల శృంగారమును, ఘనతనుగూర్చి మనమెట్టి యభిప్రాయములను గలిగి యుండవలయును?

మనమాడుచుండు జూదములనుగూర్చి మితిమీరిన భోజన పానీయాదులనుగూర్చి, తదితర ప్రాపంచక వినోదములగూర్చియు మనమేమి తలంప వలయును?

పేదరికము, దీనత్వము, భంగపాటులు, విఘ్నములు, బాధలు, నిష్ఠురతలు, పాపపరిహారార్థమై ఆచరించెడు తపోక్రియలు, సత్కార్యములు మొదలగువానిని గూర్చి మనము విచారించుకొనవలసిన అంశము లేవి?

ప్రస్తుత మీవిషయముల నన్నిటినిగూర్చి యొకే విధముగ తీర్మానము నిశ్చయించుకొందుము. సకాలములో యిప్పుడే మన మనుభవింప వలసియున్న బాధలను, శిక్ష విధింపబడియున్నవార లనుభవించుచున్న

శాశ్వత సంకటములతో సరిపోల్చుకొని చూచుకొన్నచో, మనమెట్టి తీర్మానమునకు వచ్చెదము?

ఈ జీవితమునకును పరలోక జీవితమునకును, సుఖముగ నుండెదమన్న సాధ్యముకాదు. కనుక మరులోకజీవితమున కష్టముల పాలగుటకన్న ఈ జీవితనమునందే కష్టము లనుభవించుట యెక్కువ లాభకరమని నిర్ధారణ చేసికొనియెదము.

---

## 25 వ అధ్యాయము

### నీ జీవితమును మనఃపూర్వకముగ సవరించుకొనుము.

1. దైవసేవయందు జాగరూకతగలవాడవై, శ్రద్ధతో పాటుపడుము. నీవీ ప్రపంచమునందేల జన్మించితివి? నీవేల తిరుగ నీప్రపంచము విడనాడి పోవలయునోయను విషయములను గూర్చి నీలో నీవు పలుమారులు యోచించు కొనుము.

దైవమునకు ప్రీతికరముగ ప్రవర్తించుచు, పుణ్యసంపాద్యముచు చేయుటకేగదా నీవు జన్మించియున్నావు! నీ ఆధ్యాత్మికాభివృద్ధికొరకై మనఃపూర్వకముగ ప్రయత్నింపుము. ఏలయనగా, కొలదికాలములోనే నీ శ్రమలన్నిటికిని తగిన ఫలమును పొందెదవు. అటుపైని దుఃఖమును, భీతియును నీదరికి చేరజాలవు.

ఈ జీవితమున కొంచెము కష్టించి పాటు పడినయెడల, ముందునకు యెక్కువగు విశ్రాంతిని, అంతేగాక నిత్యానందము ననుభవించెదవు. దేవునియందు విశ్వాసమును విడువక, మనఃపూర్వకతతో కర్మాచరణకు గడంగితివేని, నిస్సంశయముగ దైవము నీకు ఘనమగు బహుమానము ననుగ్రహించును.

నీ ప్రయత్నములందు తప్పక జయమును గాంచెదవనియెడి మంచి నమ్మకమును ఆశయును గలవాడవై యుండుము. సురక్షితముగ నుంటి నని యెంచుకొనుచు ఊరకుంటివేని, నీవు గర్వపోతువై యుపేక్షాభావముగల వాడవగుదువు.

2. ఒకానొకవ్యక్తి, పుణ్యసంపాద్యమునకై తానుచేయు ప్రయత్నములు సాఫల్యమగునా లేదాయను అనుమానముచే కలిగినభీతివలన, వ్యసనాక్రాంతుడై దేవాలయ దివ్య పీఠమునకు ముందు సాగిలపడి, తాను శాశ్వతానందము ననుభవించుటకై తన జీవితమునందలి దోషములను సవరించుకొనవలయునను సంకల్పముతో, "నేను మరణపర్యంతము పుణ్యములో స్థిరముగానుందునని నాకు తెలిసినచో, ఎంత భాగ్యవంతుడనై యుందునని" తనలో తాననుకొనుచుండగా "ఆసంగతి నీకు తెలిసియున్నయెడల నీవేమి చేసియుందువో, అదియే యిప్పుడు చేయుబూనుము. నీవు మిక్కిలి సురక్షితుడవై యుందువు" అను దైవప్రేరితమగు జవాబు అతని హృదయాంతర్భాగమున వినవచ్చెను.

ఇటుల అంతరంగికముగ దైవవాక్కును వినినతోడనే యాతడూరటచెంది, ధైర్యముగలవాడై దైవమునకు తనయాత్మను సమర్పణనుగావించుకొనియెను. వాని మనో చంచలమును, వ్యసనమును నిలిచిపోయెను.

ఇకమీదట తనకేమి సంభవించునోయని యెరుగవలెననెడి చింతను వదలిపెట్టెను. అదియునుగాక ప్రతి పుణ్యకార్యము ఆరంభించి పూర్తి జేయ, దేవునికి ఏది ప్రీతికరమును ఉత్తమము నైనదనియు, దేవునిచిత్తమేదనియు తెలిసికొన పట్టుదల గలవాడైయుండును.

3. దైవమునందు విశ్వాసము కలవాడవై, పుణ్యకార్యము లాచరించుచు, నీ ప్రపంచమున జీవింపుము. దాని సంపదలచే నీవు పోషింపబడుదువు అని ప్రవక్తబోధించియున్నాడు.

అనేకులు పుణ్యాభివృద్ధి నొందజాలకుండుటకును, తమ జీవితము అందలి దోషములను మనఃపూర్వకతతో సవరించుకొన జాలకుండుటకును నొక కారణము కలదు. అది యేదియనగ ? తమను తాము జయించుటకై సలుపవలసిన పోరాటములలో పొందవలసియున్న శ్రమకు భయపడుచున్నారు. తమ కధిక కంటక ప్రాయములును అనిష్టములునైన కార్యములను ధైర్యముతో జయించెడివారలు అందరికంటే ఎక్కువగ పుణ్యములో వర్ధిల్లుదురు.

మానవు డేవిషయము అందెక్కువగ తన్ను తాను జయించుకొని, నిగ్రహము కలవాడై దీనత్వము వహించియుండునో, ఆ విషయములందు మిక్కిలి యభివృద్ధిగలవాడై ఎక్కువగ దైవవరప్రసాదములను పొందును.

4. జయించుటకును, నిగ్రహించుటకును, అందరికిని ఒకే విధమైన ప్రతిబంధకములు లేవు. మానవుని ఆశాపాశములు ప్రపంచానురాగము లందరియందొకేతీరున లేవు. కామ క్రోధాది మనో వికారములను తక్కువగల వానికన్న, పుణ్య సంపాదనకొరకై మనఃపూర్వకతతో మిక్కుటముగు మనోవైకల్యము నెదురించుటయందు మిక్కిలి చురుకుదనముగలవాడు ఎక్కువ పుణ్యాభివృద్ధిని గాంచగల్గును.

పుణ్యాభివృద్ధికి ముఖ్యముగ రెండువిషయము లనుకూలమైయున్నవి. (1) పాపమువైపునీడ్చు మన స్వభావమును బలత్కారముతో జయించుట. (2) మనకెక్కువగ అవసరమైయున్న పుణ్యసంపాదనకొరకై, మనపూర్వకముగ ప్రయాసపడుట. నిన్ను పలుమారు కలవరపరచుచుండు పరుల దోషములను నీయందు ముందుగా సవరించుకొన శ్రద్ధబూనుము.

5. యోగ్యమగు నిదర్శనములను చూచినపుడుగాని, పవిత్ర ప్రవర్తనకు మార్గదర్శకులగు వారలను దర్శించినపుడుగాని, లేక వినినపుడుగాని, వారలననుసరించి ప్రవర్తించుటకు నుత్సాహముకలవాడవై, నీకు లభించు అవకాశములనన్నిటిని నీజ్ఞానాభివృద్ధికొరకై యుపయోగించుకొనుము.

నిందాస్పదమగు అంశములను నీవితరులలో గమనించుదువేని, అట్టివానిని నీవాచరింపకుండుటకొరకై జాగరూకత వహించుము. ఆచరించియుంటివా? తక్షణమే తగురీతిని నిన్ను నీవు సవరించుకొనుము.

పరుల చర్యలను నీవు గమనించుచుండునటుల, నీచర్యలను పరులును గమనించుచుందురు. మనతోడి మానవులందరును మనఃపూర్వకమగు భక్తిపరాయణులైయుండి, తమ జీవితములయందు క్రమముతప్పక నియమబద్ధులై ప్రవర్తించుట జూడగలిగినపుడు, మనకెంత మనోహరముగ నుండును?

ఐతే వారలు క్రమము తప్పి స్వేచ్ఛానుసారముగ ప్రవర్తించుటను చూచితిమా, మన కొవిషయమెంతో దుఃఖమును మనోసంకటమును గల్గించును.

సన్యాసాశ్రమ ధర్మములను అలక్ష్యముచేసి, తమకు సంబంధింపని విషయములను తలపోయుచుండుట యెంతయు నపాయకరము.

౬. నీ సంకల్పమును జ్ఞప్తియం దుంచుకొని, సిలువమ్రానిపై శిలలచే గొట్టబడిన జేసునాథుని దివ్యస్వరూపమును నీ కనుల యెదుట నిలుపుకొనుము. చిరకాలమునుండి నీవు భక్తిమార్గములందు నడచుచున్నను, ఇంకను నీ ప్రవర్తన జేసునాథుని జీవితమునకు సరిపోయి యుండునటుల సాధనచేసి యుండవలేదని, రక్షకుని దివ్య జీవితమును చక్కగా అర్థముచేసికొనినపుడు నీవు తెలిసికొని సిగ్గుపడియెదవు.

మన ప్రభువుని పావన జీవితమును, పాటులను అనుసరించి ప్రవర్తించుటకై, మనఃపూర్వకమగు సాధనలు చేయుచుండెడు దైవభక్తుడు, తన జీవితమున కవసరమగునట్టి లాభకరములగునట్టి విషయముల నందు కనుగొనజాలును.

రక్షకునికంటె ఉత్తమమగు మార్గదర్శికొరకై మనము వేరుగా వెదకికొన వలసిన యవసరములేదు. స్లీవమ్రానిపై కొట్టబడి కొరత వేయబడిన జేసునాథుని గూర్చిన చింతనలచేత మన హృదయముల నింపుకొని యున్న యెడల, మన మతిశీఘ్రముగనే జ్ఞానవంతుల మగుదుము.

7. తనకొజ్ఞాపింపబడిన దంతయును యదార్థమగు భక్తుడు హృదయపూర్వకమగు యోగ్యతతో స్వీకరించి సహించుకొనును. ఉపేక్షాభావముతో మందతనముతో ప్రవర్తించు ఆశ్రమవాసికి, కష్టమువెంట కష్టము సంప్రాప్తించు చుండును. అతని కన్నివైపులను బాధలు చుట్టుకొని యుండును.

ఏలయనగా, అతనికి హృదయమునం దూరటలేదు. ఇతరులనుండి యాదరణలను పొందుట కవకాశములేదు. నియమములను నిర్లక్ష్యము చేయు భక్తునకు, భయంకరమగు పతనము సంభవించును.

నియమము లేనివాడై, స్వేచ్ఛతో నుండకోరు మానవుని కెపుడును ఇక్కట్టులు కలుగుచుండును. వాని జీవితము శాంతిహీనమగును. ఏల

చర్యలు లేక, ఒక్క ఆత్మావసరములను మాత్రమే దీర్చుకొనుటయే యైనచో ధన్యుల మగుదుము.

అయ్యో ఆత్మరక్షణ కొరకై అవసరమగు విషయముల యందలి మాధుర్యమును మనము మిక్కిలి యరుదుగా మాత్రమే చవిచూచు చున్నాము.

10. సృష్టియందలి యే వస్తువునుండిగాని, తాను సౌఖ్యమును పొంద జాలనని గ్రహించి, సంపూర్ణముగ దేవుని మహిమలను గూర్చిన జ్ఞానమును రుచిచూచుట కెపుడు మానవుడారంభించునో, అప్పుడాతని కేమి సంభవించినను చింతనొందడు.

అట్టివానికి యెక్కువ ఫలితము చేకూరినదని ఉప్పొంగడు. ఆసించిన ఫలితము గలుగ లేదని ఆందోళనపడడు. మనఃపూర్వకముగ పూర్ణవిశ్వాసములతో, తన భారమంతయు దేవుని హస్తములందుంచును. ఏలయన, దైవమే యాతనికి సర్వస్వమై యున్నాడు.

సర్వము దైవ కరుణాప్రసాదము; ఆర్హతగలదేదియును అంతరింపదు. సర్వ వస్తువులును వారికొరకై జీవించి, వారి యాజ్ఞల ననుసరించుటకు సంసిద్ధమైయుండును.

11. నీ మరణమును సదా జ్ఞప్తియందుంచుకొనుము. గతించిపోయెడు కాలము తిరుగ నెన్నడును రాదు. శ్రద్ధవహించి పాటుపడి ప్రయత్నములు చేసిననేతప్ప, నీ వెప్పటికిని పుణ్యసంపూర్ణుడవు కాజాలవు. మందమతివై యుండుట కారంభించితివేని, అదియె నీ చెడుగున కారంభమగును.

పుణ్య సంపాదనకొరకై ఉత్సాహము కలవాడవగుచో, నీ కమోఘమగు శాంతము లభించును. దైవకరుణ వలనను పుణ్యము యెడల నీకు గల ప్రీతివలనను, నీ శ్రమలు నీకు కష్టములుగాతోచవు. గాఢమగు దైవభక్తిని చురుకుతనమునుగల మానవుడు సకల సత్కార్యముల నాచరించుట కెల్లప్పుడును సంసిద్ధుడై యుండును.

శరీరకష్టము పడుటకన్న, దుర్గుణములను, ఇంద్రియములను జయించుటయే మిక్కిలి కష్టకార్యము. చిన్నదోషములను ఎదురించుట కలవాటుపడని మానవుడు, క్రమముగ కడాపటకు పెద్ద దోషములకు గురియగును.

దినమంతయును నీవు లాభకరముగా సంఘటనల వినియోగించెద వేని, సాయంసమయమున నీవు మిక్కిలి యానందము కలవాడవగుదువు.

నీ చర్యలను నీవు చక్కగా గమనింపుము. సత్కార్యాచరణకు నిన్ను నీవే పురికొల్పు కొనుము. నీయందలి దోషములను గురించి నిన్ను నీవే దండించుకొనుము. ఇతరుల గతి యెట్టులున్నను, నిన్ను గూర్చి మాత్రము నీవు అజాగ్రత్తగా నుండకుము. నీయందలి దోషములను గురించి నీవెంత కఠినత్వమును వహించుదువో, పుణ్యమునం దంత యెక్కువ యభివృద్ధిని పొందగలవు.

---

## సారాంశము

మన మెందులకు క్రీస్తుభక్తులమై యున్నాము?

దేవ సేవాతత్పరులమగుట కారంభమున మన అంతిమ యవస్థ యేదియై యుండవలయునని యుపపాదించు కొనియున్నాము?

మన యారంభ యుత్సాహమునందు పట్టుదల గలవారమై యుండవలయునని కాంక్షించుచున్నామేని, మన మే విషయములను మానసమునందుంచుకొనవలయునో గ్రహించెదము. సంపూర్ణమగు పావన మార్గము నందెక్కువగ ముందుకు సాగిపోవుటకై, అన్ని యవకాశములను వినియోగపరచుకొనవలయును.

మన పొరుగు వారియందుండు దోషములు మనయందు లేకుండు నట్టుల చేసికొనుటకును, వారియందుండు సద్గుణములను మన మనుసరించుటకును తప్ప, యితరములగు సందర్భములయందు మన పొరుగువానిని గురించి మనము తలపోయరాదు.

మన నాయకుడును, మార్గదర్శియునగు జేసునాథస్వామి జీవితమును గూర్చియు, మరణమును గూర్చియు, ఆశయమును గూర్చియు హృదయమునం దెడతెగక చింతించుచుండుము.

దైవ కరుణాప్రసాదముచే మన యింద్రియములను జయించి, దుర్గుణనాశన మొనర్చుకొని, సద్గుణములను సాధనచేయగలము. పవిత్రి

మగు సన్యాసవృత్తి, ధర్మములయందలి విధులనన్నిటిని నెరవేర్చుకొని, సర్వసంగ పరిత్యాగ మొనర్చుకొనుదుము.

జాగరూకతతో కనుపెట్టుకొనియుండి, దేవునిగూర్చి ప్రార్థనలు సల్పుచు, నిరంతర ప్రయత్నములు చేయుచుందుము. అప్పుడే నీహృదయము శాంతిసుఖమొందును.

దైవశక్తి భక్తి మనలను సూటిగా తీసికొనిపోవుమార్గమున జీవనయాత్ర సల్పుచుండగ, కడపటను మనము దేవునిదయను సంపాదించుకొని, ధర్మము చేసినవారలమై సుఖముగ నుండుటయను నిశ్చయమును నిర్మలమగు స్వాంతము తెలియజేయుగాక!

ప్రథమ భాగము సమాప్తము.





# క్రీస్తునాథుని అనుసరణము

## రెండవ భాగము

### 1వ అధ్యాయము

### అంతరంగిక సంభాషణ.

1. దేవుని రాజ్యము నీయందే కలదు అని మనరక్షకుడు బోధించియుండెను. నీపూర్ణ హృదయముతో ఏలినవారియొద్దకు చేరితివేని, నీయాత్మకు నెమ్మది కలుగును (లూకా 17వ అ 21వ). నిర్భాగ్యప్రపంచమును పరిత్యజించి, బాహ్యవిషయములను విసర్జించి, అంతరంగిక విషయములను గూర్చి యోచించుకొన నేర్చుకొనుము. అప్పుడు దేవునిరాజ్యము నీయందు స్థాపితమగుటను గాంచుదువు. ఏలయన స్పిరితుసాంక్తు సర్వేశ్వరుని సమాధానము, సంతోషమును కలిగియుండుటయే దేవునిరాజ్యమై యున్నది. ఇది దుర్మార్గులకు లభింపదు.

నీయంతరంగమునందు క్రీస్తునాథునికి యోగ్యమైన నివాసమును సిద్ధముచేసితివేని, వారు నిన్ను యాదరించి నిన్ను సంతసింపచేయ నీయొద్దకేతెంచుదురు. వారి మహిమ సౌందర్యము లంతరంగికములైనవి. అచ్చటవారు ఆనందము ననుభవించెదరు. దైవచింతనా శక్తిగల మనుష్యుని దర్శింపవారు పలుమారులువచ్చి వానితో ముచ్చటించుచు, ఆనందకరమగు సద్బోధనలు సలుపుచుందురు. వారనుగ్రహించెడు యూరట మిక్కిలి యానందదాయకము. వారు కలుగజేసెడు సమాధానము అమోఘమైనది. ఆశ్చర్యకరమగు సన్నిహిత సాంగత్యమును నీకు కనుబరచెను.

2. నమ్మకముగల ఓయాత్మా! నీ నాథుడగు జేసునాథుడు నీయందు నివాసముచేయ చిత్తగించునట్లుగ నీహృదయమును సిద్ధపరచుకొనుము. ఎందుకనిన, వారిట్టుల బోధించియున్నారు. "నన్ను ప్రేమిం

చువాడు మేము బోధించినరీతిని ప్రవర్తించును. మేమాతనికడ కరుదెంచి ఆతనితోడ వాసముచేయుదుము" (14వ. అ॥ 23వ. జ్యాన్స్) కనుక నీహృదయమున వారికి స్థలమొసంగి, అచ్చటికి పరుల నెవ్వరిని రానీయకుము.

జేసునాథుడే నీహృదయవాసియై యున్నయెడల, నీవు మిక్కిలి భాగ్యశాలివయ్యెదవు. వారు నీకు వలసినవంతయు సమకూర్చెదరు. మానవులనెవ్వరిని నీవు నమ్మవలసిన యవసరము లేకుండునటుల, వారే నీకవసరమగు సర్వసంపదలను సమకూర్చి నీకనుగ్రహించెదరు.

ఏలయనగా? మానవులు అచిరకాలముననే మారఁబోవు స్వభావముగలవారు. కాని జేసునాథస్వామి శాశ్వతముగా నుండువారు సుమా! మన జీవితాంతమువరకును స్థిరమగు అండగానుండి మనను కాపాడి రక్షించుదురు.

3. దుర్బలుడును, చంచలుడునగు మానవుడు నీకెంత లాభకారిగను ప్రియుడుగనున్నను, ఆతనియందెక్కువ నమ్మకమును కలిగియుండకుము, ఆతడొకానొక సమయమున నీకు ప్రతికూలుడై, నిన్ను ఎదిరించినపుడు నీవు మిక్కిలి చింతనొందవలసిన యవసరముండదు.

నేడు నీకనుకూలముగ నుండువారే రేపు నీకు ప్రతికూలురు కావచ్చును. అంతేగాక, అనుకూలురుగా నుండకపోవుటకు మారుగా గాలివలెనే పలుమారు మారుచుందురు.

దేవునియందే నీ పరిపూర్ణ విశ్వాసము నుంచుము. వారియెడల భయభక్తులుగలవాడవై వారినే ప్రేమించుము. వారే నీ పక్షము పూని, నీ కొరకై చేయదగు యుక్తమగు దానినంతటిని చేయుదురు. ఈ ప్రపంచమునందెచ్చటను నీకు శాశ్వతమగు నిలయము లేదు.

నీ యంతరంగమున జేసునాథునితో నీవు ఐక్యమైయుండని యెడల, నీ వెక్కడనున్నను పరాయివాడవే సుమా! నీ వొక యాత్రికుడవే సుమా! నీ వెప్పుడును విశ్రాంతి ననుభవింపజాలవు.

4. ఇది నీవు విశ్రమించెడు స్థానముకాదు. నీ వేల నలుదిక్కులు చూచెదవు? నీ నివాసస్థానము మోక్షము నందుండవలయును. ఈ ప్రపంచ

వస్తువు లన్నియును అశాశ్వతములనియు, త్వరితగతిని యదృశ్యములై పోవుననియు పరిగణింప వలయును సుమా!

అన్ని వస్తువులును గతించిపోవు నవియే. నీవును వాటిని వెంబడించ వలసిన వాడవే. అయితే అటుల నశింపవలసియున్న వస్తువులను బట్టుకొని వ్రేలాడుచుండునటుల జాగ్రత్తపడుము. అటుల నమ్ముకొని యుందువేని, నీవు మోసపోయి, వ్యామోహములందు జిక్కుకొని నశించిపోవుదువు.

సర్వోన్నతుడగు దేవునిగూర్చి తలంచుకొనుచుండుము. ఎల్లప్పుడును జేసునాథస్వామిని ప్రార్థింపుము. ఉన్నతమైన పరలోక విషయములను గూర్చి నీ వెటుల ధ్యానించుచుండవలయునో, తెలియనివాడవైన యెడల, జేసునాథుని శ్రమలపై మనస్సు నిలిపి వారనుభవించిన పవిత్రమగు గాయములలో వాసము చేయుము. ఏలయన, ఆనవాలుగనున్న జేసునాథుని పరిశుద్ధ గాయములయందు నీవు భక్తితో శరణుజొచ్చిన యెడల, దుఃఖదురితములలో ఓదార్పును పొందగలవు. పరులచే నిరసింపబడినను లక్ష్యముచేయవు. పరులు నిన్నుగూర్చి పల్కెడు అపనిందలను, దూషణవాక్యములను సులభముగా సహింపజాలి యుందువు.

౫. జేసునాథుడు సైతము యీ ప్రపంచమున మానవులచే నీచముగ తృణీకరింపబడియెను. అత్యవసరమగు సమయమున, దుష్టులు తనను నిందించుచుండగా, తమ ప్రియ స్నేహితులు, పరిచితులును తనను త్యజించియుండిరి. జేసునాథుడే ఇన్ని బాధలను, మానవుల తిరస్కారముల ననుభవించి యుండగా, ఇతరులెవరైన నిన్ను కష్టపెట్టి తిరస్కరించిన యెడల, వారినిగూర్చి నీవు మొఱపెట్ట సాహసించెదవా?

జేసునాథునికి సైతము విరోధులుండిరి. వారిని దూషించిన వారుండిరి. అట్టి సందర్భములలో నీ కందరును స్నేహితులుగను, నీ క్షేమమునే కోరెడువారుగ నుండవలయునని ఏల ఆశింతువు? నీవు కష్టములను నవియే సంప్రాప్తింపని యెడల, నీ సహన గుణమునకు ఫలమెచ్చటనుండి పొందగలవు? ఎట్టి ప్రాతికూల్యము సహింప నీ కిష్టము లేని యెడల, జేసునాథుని కెటుల స్నేహితుడవై యుందువు? జేసునాథునితో గూడి రాజ్య

మేలదలచితివేని, వారితోఁగూడి వారికొరకు నీవును సంకటము లనుభ వింపవలయును.

6. నీ వొక్కమారు జేసునాథుని ఆంతరంగమున ప్రవేశించి, వారిలోఁ బొంగారుచున్న ప్రేమను యనుభవపూర్వకముగ రుచిచూడ గలిగినచోఁ, నటుపైని నీ యనుకూల ప్రతికూలములనుగూర్చి నీవు లక్ష్యము చేయవు. అంతేగాక, పరులు నిన్నుగూర్చి దూషణలు సల్పిన యెడల, నీవు మిక్కిలి సంతోషపడుచుందువు.

ఏలయనగా, జేసునాథుని యెడల నీకుగల ప్రేమయే, నిన్ను నీవు తిరస్కరించుకొనునటుల చేసివైచును. హృదయాంతరంగమునందు, ఆత్మీయముగ, ఎక్కువ జ్ఞానసంపన్నుడవై, సంతోషముగ విశ్రమింప గలవు. జేసునాథుని సత్యమును ప్రేమించు మానవుడును, మితిమీరిన యనురాగములను విసర్జించి ఆంతరంగిక జీవితముగల మానవుడును, నెట్టి యాటంకములు లేనివాడై బాహాటముగ దేవుని దిశకుమరలి ఆంతరంగికముగ నెటుల ప్రవర్తింపవలయునో, బాహ్యవిషయముల నెటుల లక్ష్యము చేయకుండవలయునో చక్కగా గుర్తెరిగినవాడై, భక్తిసాధనలు గావించుకొనుట కనువగు సమయములను, అనుకూల ప్రదేశములను వెతకుకొనవలసిన అవసరములేని వాడగును.

7. వస్తువులనుగూర్చి యితరులు భావించునటుల లేక వచించినటుల గాక, ఉన్నవి ఉన్నట్టుగనే గణించువాడు వివేకవంతుడు. అట్టివాడు మనుష్యులనుండి గాక దేవునినుండియే యెక్కువగ శిక్షణబొందు చున్నాడు. ఆంతరంగికమానవుడు బాహ్యవిషయములచే తన మానసము నంతయు లగ్నముచేయక, త్వరితముగ తనలోఁతాను యోచించుకొన వలసిన విషయములను వెంటనే స్ఫురణకు తెచ్చుకొని, వాటినిగూర్చి యోచించుకొనును.

తాత్కాలికముగ నప్పటికప్పుడవసరముగ నెరవేర్చుకొనవలసిన యేపనిని గాని, యితర లౌకిక వ్యవహారములుగాని, యాతని యాంతరంగిక యాలోచనలకెట్టి విఘ్నములను కలిగింపజాలవు. అట్టిపనులు సమకూడినపుడు, వాటికి తగినరీతిని, యుక్తమగు నేర్పాటులను గావించుకొని, సమర్థించుకొనుచుండును.

ఆంతరంగిక పవిత్రతను చక్కగ సమర్చుకొని, నియమ ప్రవర్తనగల మానవుడు ఇతరుల విపరీత దుష్టప్రవర్తనలను సరకుచేయడు. ఎంతయెక్కువగ లౌకిక వ్యవహారములం దనవసరముగ ప్రవేశించుచుండునో, అంతెమిక్కుటమగు విఘ్నములు కలవాడై, యట్టి వ్యవహారములవలన మతిభ్రమకలిగినవాడగును.

8. నీయందన్ని అంశములును క్రమపరుప బడియున్న యెడల, నీవు పూర్ణమగు నిర్మలత్వము గలవాడవైయున్న యెడల, సర్వ విషయములు నీకు మేలైనవిగను, లాభకరముగను, మారిపోవును. నీవు యింకను పూర్తిగ నీ ఆశాపాశములను తెగకోసికొనిన వాడవై యుండక, లోక వస్తువు లన్నిటిని విడువజాలకున్నావు. కనుకనే నీకు పలుకార్యములు అనిష్టములై తరచు నిన్ను కలతపెట్టుచున్నవి.

మానవుని హృదయము నెక్కువగ కలుషపరచి, చిక్కులుపాలు చేయునది ప్రపంచ విషయములం దాతనికిగల యపవిత్రమగు యను రాగముకన్న మించినది మరియొకటి లేదు. బాహ్య యామోదములను, సంతోషములను విసర్జించితివేని, నీవు దైవిక విషయ చింతనా శక్తిగల వాడవగుదువు.

---

## సారాంశము

"ఈ నిర్భాగ్య ప్రపంచ వస్తువులను విడనాడి, హృదయపూర్వకముగ దైవసన్నిధికి నిన్ను గొనిపోజాలు జ్ఞానమార్గమున వర్తింపుము. బాహ్య విషయా నిరసన నభ్యసింపుము. ప్రపంచ విషయములను తృణీకరింప నేర్చుకొనుము. ఆంతరంగిక విషయములనుగూర్చి యోచించుకొనుము"

ఈ పై బోధనా వాక్యమునుండి మనము నేర్చుకొనవలసిన విషయము లేవియన:—ఈ జీవితమువలన వాస్తవమగు సౌఖ్యము, పాత్రత, యీ రెండును, మన మేకాంతముగ దైవధ్యాన నిరతులమై యుండుట వలననే లభ్యమగును. ఈ యోగ్యతల మన మెటుల కాపాడుకొన జాలుదుము?

సర్వేశ్వరుడు సర్వవ్యాపియై వెలయుచున్నాడను సత్యమును, ఆయన యెడల మిక్కిలి గౌరవభావముగలవారమై మానసమున మరువకుండ వలయును. ప్రతి మానవుడు, తన యాత్మను దైవార్పితము చేసికొనుచుండవలయును. ప్రపంచానురాగములయందు చిక్కుకొనక, దేవుని గూర్చి యాలోచించుకొను చుండవలయును. ప్రపంచ విషయమునుండి మరల్చుకొనబడిన మానసము, విశ్వాసపూరితమగు హృదయము— ఈ రెండును-ఉత్సాహముతోడ వాస్తవముగ, దైవమును పూజించెడు యాంతరంగిక పవిత్రతగల మానవుని లక్షణములు. అనగా అంతరంగముగ దైవసేవా నిరతుడై యుండు మానవుని గుణములు. ఈ యాంతరంగిక సేవయనున దెటులుండవలయును? సర్వ ప్రపంచ రాజ్యాధికారమును వహించియున్న దేవుని ఘనతకు తగినదై యుండవలయును.

దేవుని కరుణా ప్రసాదముకొరకు, సర్వదా దైవచింత నా నిరతుండై యుండుటయే ముఖ్యోద్దేశముగల మానవుని కర్తవ్యమైనది ఆంతరంగిక దైవసేవయే.

మనము కట్టుకొన్న పాపములగూర్చి నిట్టూర్పులు విడచుచు, దైవమువైపు దృష్టిని పారించుచు, శోధనచేయుచు, మనభావమంతయు దేవుని పాదములపైని నిలుపుకొనునెడల, శ్రేష్టమగు నట్టియు స్వాభావికముగానుండు దానికంటే నెక్కువ యారోగ్యమగు నట్టియు, యాంతరంగిక జీవితము గలవారమై యుండగలము.

ఇట్టి జీవితముగల వారమైన, మనయాత్మను దైవముతో ఐక్యము చేసికొనజాలుదుము. ఆత్మ దేవునియందు స్థిరస్థాయియై యుండగలదు. ఇట్టి ఆంతరంగిక జీవితమే యీ ప్రపంచమునందు మన మనుభవింపగల మోక్షభాగ్యము. ముందు మన మరణాంతమున ప్రాప్తించునని మన మాశపడియెడు దైవసంబంధమగు యానందము, యీ ఆంతరంగిక జీవితమే-మోక్షమున స్థిరపడిపోవును. గనుక నా యింద్రియముల నణచివైచి, యాడంబరములు నిష్ప్రయోజనకరములగు యోచనలను నా మానసమునుండి తరుమగొట్టి, జేసునాథుని యందలి భయభక్తులను ప్రేమను పెంపొందింపజాలెడు విషయములు తప్ప నితర విషయము లేవియు నా హృదయమున ప్రవేశింప కుండునటుల స్థిరసంకల్పమును చేసికొని యున్నాను. ప్రతి యితర అంశము నాకు లేనిదానిలో లెక్కయే.

అన్నిటికన్న నెక్కువగా నేను వాంఛించు విషయము లేవియన:-

a) నన్ను శాపములనుండి విముక్తునిగ నొనర్చు జేసునాథుని గ్రహించుట.

b) అట్టి నా రక్షకుని పరిపూర్ణముగ ప్రేమించుట.

c) అట్టి నా మోక్షదాత ననుసరించి వారు స్వయముగ నడచి చూపిన యోగ్యమగు మార్గాను వర్తినై సంచరించుట.

d) అట్టి లోకరక్షకుని కొరకై, యెట్టి సంకటములనైన ననుభవించుటకు సంతృప్తుడనై యుండుట.

ఇవి యన్నియు నే నేల వాంఛించుచుంటి ననియెదరా? ఏదియో యొక దినమున జేసునాథునితో ఐక్యమై, మోక్షరాజ్య మేలుటకొరకే సుమా?

గనుక ఓ నా యాత్మా!

జేసునాథునే ప్రేమించుము. వారిని సంతోషపరచుటకే జీవించుము. వారి పవిత్ర ప్రేమను సంపాదించుకొని, అంత్యకాలమున ననుభవింపజాలెడి యానందము కొరకై నిట్టూర్పులు విడువుము. కష్టపడి శ్రమచేయుము.

---

## 2. వ అధ్యాయము

## దీనత్వమును వహించి, తనను దైవాధీనము గావించుకొనుట

1. నీకనుకూల్యు లెవరు, ప్రతికూలు లెవరను అంశమునుగూర్చి, యెక్కువ లెక్కచేయకుము. నీయాచరణలన్నిటియందును, దేవుడే నీతోడునీడగా నుండవలయునను విషయమునుగురించి యోచించుకొనుటయే నీవిధిగా నుంచుకొనుము. ఇతరులు మనలోపములను కనుగొని మనను చీవాట్లు పెట్టుటయే, మనయందు దీనభావమును సాధనచేసికొనుటకు పలుమారు మిక్కిలి లాభకరముగ నుండును. మంచి మనస్సాక్షి కలిగియుండ జూడుము. దేవుడు నిన్ను కాపాడును. దేవుడు ఎవనికి సాయముచేయునో, వానికి మానవుని ద్వేషమెట్టి కీడును చేయజాలదు.

నీవు ఓర్పుగలిగి కష్టముల సహించినచో, దేవుడు తప్పక నీకు సాయ పడును. నిన్ను ఎట్లు రక్షించవలసినది, ఎప్పుడు రక్షించవలసినది వారి తెలిసియున్నది. గనుక వారికి నిన్ను అప్పగించివేయవలయును. మన లను సకలదురితములనుండి తప్పించి సహాయపడుట దేవుని పనియై యున్నది.

2. తనయందలి దోషములనుగూర్చి మానవుడు దీనత్వమును వహించి యుండునపుడు యితరుల నతిసులభముగ శాంతపరచును. మనయందాగ్రహము గలిగినవారలను, త్వరితముగనే తృప్తిపరచును. దీనభావము గల మానవుని దేవుడు కాపాడి, కష్టములనుండి తప్పించుచుండును. దీనులను దేవుడు ప్రేమించి పురస్కరించును. దీనులదగ్గరకు వేంచేయును. దీనులయెడల దయచూపును. మహారాశవరప్రసాదము నొసగును. మానవుడు దీనుడై క్రుంగుబాటు చెందిన తదుపరి, దేవుడు వానిని పైకి లేవనెత్తి కీర్తివంతునిగ చేయును. తన రహస్యములనన్నిటిని దీనులకు విశదపరచును. తనసన్నిధికి రావలసినదని వారిని పిలచుచు, మిక్కిలి ప్రేమతో వారిని తనయొద్ద కాకర్షించును. దీనభావముగలవాడు లోకమువిూదగాక, దైవమునందే తన నమ్మకముంచినందున అతడు పరులవలన అవమానముతో బాధపడుచుండినను, సమాధానమును గోల్పోడు. అందరికంటే నిన్ను నీవు తగ్గించుకొనువరకు, పుణ్యమునందు అభివృద్ధి చెందితివని తలంపకుము.

---

## సారాంశము

అర్చ్య. అగుస్టీనను వారేమని వ్రాసియున్నారో మీరెరుంగుదురా?

సద్గుణములన్నిటియందును, మిక్కిలి ప్రశస్తమగు సద్గుణమేదియని తనను ప్రశ్నించిన "దీనత్వమే మొదటిదని జవాబుచెప్పుదును. రెండవదేదియని ప్రశ్నించిన, దీనత్వమేయని చెప్పుదును. మూడవదేదియని యడిగిన దీనత్వమేయని తిరుగ చెప్పుదును. ఇదేరీతిని నన్నెన్నిమారులు ప్రశ్నించినను దీనత్వమనియే జవాబు చెప్పెదను." అని వ్రాసియున్నారు. ఏలయందురా? దీనత్వమనునది సర్వ సద్గుణములకును పునాదివంటిది. ఒకానొకవిధముగ నీ సద్గుణమునందే సర్వ సద్గుణము లిమిడియున్నవి.

దీనులపై మనలను దేవునికి సమర్పణ గావించుకొనుటను గూర్చి, పావనచరితుడగు మన గ్రంథకర్తగారు, తమ యభిప్రాయముల నీ విధముగా తెలుపుచున్నారు. దేవుని పవిత్రక్షేమకొరకై, అందరికంటె మనలను మనము తక్కువగా భావించుకొనజేసి, పరిపూర్ణముగా మనలను వారి యేలుబడిక్రిందికి తీసికొనిపోవజాలునది వినయము.

ఈ సద్గుణమునందలి యుక్తత్వస్పష్టతను గూర్చియు, ఆవశ్యకతను గూర్చియు, దానివలన ప్రయోజనముల గూర్చియు, మనకు ప్రాప్తించెడు బహుమానముల గూర్చియు, వారు తెలియజేసియున్న అంశములకన్న, యధికముగ మన మేమియును తెలుపజాలము. అట్టి సద్గుణముగలవారమై యుండుటకు, వారు తెలిపిన మార్గములకన్న యధికమేమియు నవసరము లేదు.

---

## 3 వ అధ్యాయము

## సమాధానముగల సద్గుణుని గూర్చి.

1. తొలుదొల్త నీలో సమాధానముండునట్లు చూడుము. అటు పిమ్మట ఇతరులను సమాధాన పరుపవచ్చును. శాస్త్రపాండిత్యముగల మానవునికన్న సమాధానముగల మనుష్యుడు అధిక మేలుచేయుచున్నాడు. కోపిష్టి మేలునుసహా కీడుగామార్చివేయును. పరులను గూర్చి చెప్పబడిన నిందలను సులభముగా నమ్ముచున్నాడు. సమాధాన సద్గుణుడు సర్వవిషయములను ప్రయోజనకరమైనవిగ జేయును.

పూర్ణసమాధానము గలవా డితరుల నెవ్వరినిగూర్చి అనుమానింపడు. కాని అసంతృప్తికలవాడై కలతనొందినవాడు, పలువిధములగు ననుమానములవలన బాధపడుచున్నాడు. తాను నెమ్మదిగా నుండడు; ఇతరులను సమాధానముగ నుండనీయడు. చెప్పతగని విషయములను చెప్పుచుండును. తనకు మేలుకరముగ నుండువానిని వదలివేయుచుండును. ఇతరు లాచరింపవలసిన విషయములనుగూర్చి తలచుచుండును. కాని తానాచరింపవలసిన విషయములనుగూర్చి లక్ష్యముచేయడు.

గనుక యారంభమున నీవిషయమై శ్రద్ధగలిగియుండుము. అటు పైని నీపొరుగువానినిగూర్చి న్యాయసమ్మతముగ నీయుత్సాహము గను-పరపగను.

2. నీలోపమునుగూర్చి, సాకులను చెప్పుకొనుటయు, వాటినన్నిటిని కప్పిపెట్టుకొనుటయు, నీవు చక్కగా నెరుగుదువుగాని, పరులు తమ లోపములనుగూర్చి చెప్పుకొనియెడు కారణముల నేమాత్రము నంగీకరింపవు. నీ పొరుగువాని దోషములను మన్నించుటయు, నీ దోషములను గూర్చి యితరు లోర్చుకొని యుండవలయునని నీవు కోరుదువేని, వానిచర్యలను గూర్చియు నీ వటులనే సహనముగలవాడవై యుండుము. తనను తప్ప పరులను కోపగించుటగాని, లేక వారలపై ఆగ్రహపడుటగాని ఎట్టిదని యెరుగని దాక్ష్యత్వము, దీనత్వమునుండి ఎంతదూరమై యున్నదని. యోచించుకొనుము. మంచివారితోను, శాంతముగల వారితోను సంభాషింపగలుగుట యొకగొప్ప కార్యముకాదు. ఏలయనగా అది ప్రతిమానవునకును సహజముగ ప్రీతికరముగనే యుండును. సమాధానము కలిగియుండ ప్రతిమానవునకును మిక్కిలిసహజమే. తమతో నేకీభవించువానిని ఎక్కువగ ప్రేమించుదురు. కాని మూర్ఖులతోను, దుష్టులతోను లేక శిక్షణలేక ఇష్టాగోష్టిగ ప్రవర్తించు వారలతోను, మనకు వ్యతిరేకముగ నుండు వారలతోను గలసి సమాధానముగా జీవింపగలిగి యుండుట గొప్ప వరప్రసాదమగును. అదియే మెచ్చతగిన సాహసకృత్యము.

3. తాము సమాధానముగ నుండుటయేగాక, యితరులతో సమాధానముగలిగి యుండువారు కొందరు గలరు. తాము సమాధానముగ నుండక పోవుటయేగాక పరులనైతము సమాధానముగ నుండనీయని వారు మరికొందరుగలరు. అట్టివార లితరులకు మిక్కిలి సంకటములను కలిగించెదరు. అంతియేగాక వారు తమకును, నంతకన్న నెక్కువ సంకటములు తెచ్చిపెట్టుకొనుచున్నారు. మరికొందరు తాము శాంతముగలిగి సమాధానములేని పరులను సమాధానపరుప ప్రయాసపడుచుందురు. నిర్భాగ్యమైన యీ ప్రపంచ జీవనములో కష్టములను ఓర్పుతో సహించుటవల్లనే మనసుకు సమాధానము గలుగును. గాని, మనకు కష్టములు కలిగించు నేవియు లేకుండుటలో కాదు.

కష్టములను సహించియుండ నేర్చినమానవుడే, యమోఘమగు సమాధానము ననుభవింప జాలును. అట్టి మానవుడే, తన్నుతాను జయించినవాడు. ప్రపంచమునకు ప్రభువు. మిగులప్రియమగు స్నేహితుడు. అట్టిమానవుడే మోక్షమునకు హక్కుదారుడై యున్నాడు.

---

## సారాంశము

అహంకారరహితమై, సమాధాన శాంతస్వభావముల కన్న, ప్రస్తుతకాలమునందెక్కువ వాంచనీయ మగునట్టియు, అనంతకాల మెక్కువ లాభకరములుగ నుండునట్టియు, యితరగుణము లేవియును లేవు.

ఐతే యారంభమున తనను తాను పూర్తిగా జయించుకొన జాలిన గాని, అట్టి శాంతస్వాభావముల యందలి ఫలమును కోయుటకే మానవునకును యర్హతలేదు. మన యింద్రియములను జాగరూకతతో వశపరచుకొని మనయదుపుక్రింద నుంచుకొనజాలక పోయినయెడల, కలిగెడు ఫలితము లేవియన? సంకటములు, స్నేహాభంగములు, ఒండొరుల నుండి ఎడబాటులు, కలహములు, తగవులాటలు.

సమాధాన హృదయులమై యుండునప్పుడే, మన మితరులతోడ శాంతము నెప్పుడు బడయజాలుదుము. మన పంచేంద్రియములను జయించి, శరీరమును మన యాత్మాధికారము క్రిందనుంచి, ఆత్మను సృష్టికర్తకు స్వాధీనము చేయుటవల్లను, అన్నికష్టములను, ఆటంకములను యీ శరీరమువలని యన్నిబాధలను, శాంతముగను, దీనభావముతోడను, నిరహంకారముతోడను, యనుభవించుట నలవాటు చేసుకొని యుండుటచేతను ఈ రెండుమార్గముల వలననే ఆంతరంగిక శాంతమును పొందజాలుదుము. ఇట్టి యభ్యాసము మన మొక్కదినములో చేయజాలునదిగాదు.

అనేకవత్సరములు గడచినపిమ్మట సైతము, మన మీయభ్యాసమునందు జయము పొందజాలుదుమేని మూడురెట్ల సౌఖ్యమును పొందజాలుదుము.

---

## 4 వ అధ్యాయము

## పవిత్రమగు మానసము-ఉత్తమాభిప్రాయము.

నిష్కాపట్యము, పవిత్రత యను నీరెండు సద్గుణములచే మానవుడు, ప్రపంచవిషయములనిలిటి నుండియు, పైకి లేవనెత్తబడుచున్నాడు, మన యభిప్రాయములన్నియు, నిష్కపటములైనవై యుండవలయును. మానసము కల్మషరహితమై పరిశుద్ధమైనదిగ నుండవలయును. మనయందలి నిష్కాపట్యత యెల్లప్పుడును దేవునియందు గురిపెట్టుకొని యుండును. పవిత్రత దేవుని చేపట్టి రుచిచూచును. యక్రమ వాంఛలు లేనివాడవైన యెడల, ఏ మంచికార్యము నందును నీకు కష్టము కలుగదు.

దేవుని చిత్తము, నీ పొరుగువాని క్షేమమును తప్ప నితరమేమియు ఆశింపకుండినయెడల, నీవాంతరంగిక స్వాతంత్ర్యము గలవాడవగుదువు.

నీ హృదయము ధర్మబద్ధమై యుండెనేని, ప్రతిజీవియు నీకు జ్ఞానబోధితమగు సద్గ్రంథమువలె నుండును. సన్మార్గ జీవితమును అద్దములో వలె గోచరింపచేయును. సృష్టియందలి యొంత అల్పవస్తువైనను, యొంత నీచమైనదైనను, సృష్టికర్తయొక్క మంచితనమును గనుపరచ జాలక పోదు.

ఆంతరంగిక యోగ్యతో పవిత్రత కలవాడైనయెడల, నీవు నిరాటంకముగ, సృష్టియందలి ప్రతివస్తువును, వివేకించి కనుగొనజాలుదువు. వాటినన్నిటిని చక్కగా గ్రహింప జాలుదువు. పవిత్రహృదయము మోక్షనరకములు ఎట్టివని చక్కగా గ్రహింపగలుగును.

ప్రతి మానవుడును తానెట్టి యాంతరంగిక భావములను గలిగి యుండునో, అట్టి భావముల ననుసరించియే, బాహ్యవస్తువులన్నిటిని తీర్మానించుచుండును. ప్రపంచమునందు సంతోషమనునదియే యున్నయెడల, ఆ సంతోషమును నిశ్చయముగ పవిత్రహృదయము గలవాడు అనుభవించుచున్నాడు. ఎచ్చటనైనను బాధలు, మనోవేదనలున్నయెడల దుష్టమనసాక్షిగలవాడే వానిని అధికముగా ననుభవించుచున్నాడు.

ఇనుము అగ్నియందుంచబడినప్పుడు, దాని త్రుప్పంతయు పోయి, యగ్నిమయమగును. అదేరీతిని, పరిపూర్ణముగ దైవోన్ముఖుడైనవాడు తన యందలి మాంద్యమును పోగొట్టుకొని, నూతన పరిణామమును పొందిన వాడగుచున్నాడు. యోగ్యప్రవర్తనగల నూతన వ్యక్తిగా మారిపోవుచు న్నాడు.

మానవుడు జ్ఞానమార్గమున చురుకుదనము లేక, మందమతియగుట కారంభించినప్పుడు, లేశమాత్రము శ్రమపడుటకు భయపడును. ఇత రుల యౌదార్యములను మనఃపూర్వకముగ స్వీకరించుచుండును. ఐనను తన సహజ వాంఛలను పూర్ణముగ జయించుట కారంభించి, మిక్కిలి ధైర్యముతో దేవుడు చూపిన జ్ఞానమార్గమును బట్టిపోవునపుడు, అంతకు ముందు తను దుర్భరములని తలంచిన విషయములను గూర్చి లెక్కచే యడు. తమతమ ఉద్దేశ్యముల ననుసరించి, వాటియెడల తనదయనుజూపి, వాటియందే యూరటయును, సంతోషమును పొందగోరుచున్నారు.

---

## సారాంశము

ద్వివిధములగు ప్రేమలతో మానవుని జీవితము సాగిపోవుచున్నది. (1) సృష్టియందలి జీవుల యెడల ప్రేమ. (2) సృష్టికర్తయందలి ప్రేమ. ఈ ద్వివిధ ప్రేమలలో, నేది మనకు చైతన్యమును గలిగించి సత్కార్యా చరణకు మనలను పురిగొల్పునో, యను విషయములనుగూర్చి దేవుని యెదుట దీర్ఘముగ నాలోచించి చూతము.

ఈ ద్విధములగు ప్రేమలు, మనయభిప్రాయములను నియమములను క్రమపరచుచుండును. సృష్టియందలి జీవకోటిని ప్రేమించు వ్యక్తి, తానాచరించెడు ప్రతికార్యములందును, కేవలము జీవకోటినే తన దృష్టి యందుంచుకొనుచున్నాడు. వాటియెడల దయనుచూపి వాటికొరకై, తాను చేయవలసిన సాయమునుచేసి, యంతకన్న మరేమియును చేయుట లేదు. అటుల వాటియెడల తనదయను చూపుటయందే, యూరటయును సంతోషమును సౌఖ్యమును పొందగోరుచున్నాడు. హృదయ పవిత్రత కలవాడగుటలేదు.

ఐతే దేవుని ప్రేమించువాడేమి చేయుచున్నాడు? అతడు భగవంతుని మాత్రము యాశించుచున్నాడు. వాని యవలోకమునందు (దృష్టియందు) భగవంతుని తప్ప నితర మేదియును కలిగియుండుట లేదు. భగవంతునికొరకగు కార్యాచరణ చేయుచున్నాడు. అన్ని జీవజంతువులను, సర్వవస్తువులను భగవత్ కటాక్షమునకే వదలివేయు చున్నాడు. ఆతని యభిప్రాయమునందు భగవంతుడు తప్ప మరేమియు లేనందున (భగవత్ ప్రీతికొరకై) కర్మల నాచరించు చున్నానను భావముతప్ప, మరియే యితర భావము లేనందున యది యుత్తమమైన దగు చున్నది. భగవత్ కటాక్షమును మాత్రమే పొందవలయునని, యాతని హృదయమాశించుచున్నది. గాన వానిహృదయము లేశమాత్రమైనను కల్మషము లేనిదగుచున్నది.

ఇందువలన నిశ్చయమైనదని చూపబడు సత్యము ఈ క్రింది ముఖ్య అంశమును సత్యమని స్థాపించుచున్నది. "పక్షులకు రెక్కలెటుల యుపయోగకరమో, యటులనే సంకల్పముల యందలి సరళతయు (యోగ్యతయు) హృదయ పవిత్రతయు (జ్ఞానసంపాదన కొరకై ప్రయత్నములు గావించుకొనుచుండు మానవునకు) రెండు రెక్కలను పోలి యున్నవనియు, తాను ప్రపంచము నందుండినను, ఈ రెండు రెక్కల సహాయముచే ప్రపంచమునందలి యితర జీవులన్నిటికన్నను, మిక్కిలి యత్యున్నతముగ నాకసమువరకు తీసుకొనిపోబడి (ఆకసమననేల), తానదివరకే ముందు రుచిచూచియున్న భగవంతునియొక్క హృదయము వరకు తీసికొనిపోబడు చున్నాడనియును నిరూపింపబడుచున్నది.

సృష్టియందలి సర్వజీవులయెడ, తనకుగల యనురాగాదులను నానాటికి యెక్కువగ మరచిపోవుచు, బహిరంగమున తనమీద యుద్ధమును చాటించుకొని, యింద్రియములను లోబరచుకొని, తనను తాను జయించుకొనుటచే భగవంతునితో పరిపూర్ణైక్యతను పొందవచ్చును. ఇందుకొరకై (భగవంతునిలో పరిపూర్ణ చేరికకొరకై) మన జీవితమునందలి, ప్రతి నిముషమును వినియోగించుకొనవలయును.

---

# 5 వ అధ్యాయము

## ఆత్మవిచారణ.

1. మనను నెక్కువ గనమ్ముకొనరాదు. ఎందుకంటే పలుమారులు మనము దేవప్రేమను గ్రహింపలేని వారలమనుచున్నాము. మన యందు స్వల్పజ్ఞానము మాత్రమే కలవారలమైయున్నాము. ఈస్వల్ప వికాసము సైతము, మనమతి త్వరితకాలములోనే యలక్ష్యముచే పోగొట్టుకొనుచున్నాము. అంతరంగికమున సైతము, మనమనేకమారులు జ్ఞానాంధులమై పోవుచున్నామను విషయమును గ్రహించజాలకున్నాము.

మనము పలుమారులు అక్రమకార్యము లాచరించుచుందుము. అటులాచరించు చుండుటయేగాక వాటినన్నిటిని కప్పిపెట్టుటకై, యనేకసాకులు చెప్పుకొనుచు, అందుమూలముగ నింకానెక్కువ దోష మాచరించిన వారల మగుచున్నాము.

కొన్నిసమయములందు క్రోమక్రోధాది గుణములయం దేదియో యొక మనోవికారముచే రేగగొట్టబడుచు, అట్టి మన స్థితిని పట్టుదలలేక యుత్సాహామని మనము తప్పుభావముగల వారలమగుచున్నాము.

పరుల యందలి స్వల్ప లోపములను గూర్చి, వారలను నిందించు చుందుము. కాని మన యందలి పెద్ద కొరతలనుగూర్చి లేశమైనను యోచించుకొనక యూరకుందుము.

పరులు మనకు కావించుచుండెడు కష్టముల నతిశీఘ్రముగ తెలిసికొనుచు, దురిత బాధలను తీవ్రముగ యోచించుచుందుముగాని,పరులకు మనము కలిగించెడి కష్టములనుగూర్చి కొద్దిగానైన సరకు జేయము.

తన చర్యలను గూర్చి చక్కగ న్యాయదృష్టితో విమర్శించుకొనువానికి, పరుల చర్యలనుగూర్చి కఠినముగా యోచించుట కవకాశము లేదు.

2. ధర్మాధర్మ విచక్షణాశక్తిగల మానవుడు యితర విషయాలోచనలకన్న, తన యాత్మ విమర్శనయే మునుముందు గావించుకొనుట ప్రశస్తమని యెంచుకొను చుండును.

తన క్షేమముకొరకై శ్రద్ధతో పాటుపడువానికి, పరులనుగూర్చి యోచింపకుండుట సులభముగనుండును. కేవలము నీ సందర్భములను మాత్రము చూచుకొనుచు, పరుల సంగతి సందర్భములను గూర్చి జోక్యమును కలిగించుకొనక, నెమ్మదిగ నుండని యెడల, నీ వెప్పుడును దైవభక్తుడవును, లోజూపు గలవాడవు కాజాలవు.

నిన్ను గూర్చియు, దేవుని గూర్చియు, పూర్తిగా యోచించుకొనుచుంటివేని, నీకు సంబంధించని యితర బహిరంగ విషయము లేవియును నిన్ను కలవరపరుపజాలవు. నిన్ను గూర్చి నీవు విచారించుకొను శక్తిలేనివాడవైనచో, నీవు చేయజాలున దేమిగలదు?

నీ స్వవిషయములందు లక్ష్యముంచుకొనక, పరుల సంగతులను గూర్చి చింతించుచుండుటవలన నీకేమిలాభము? నీయందు మనో నెమ్మదియును, వాస్తవమగు దైవ ఐక్యతయును, పొందవలయుననెడి కాంక్ష గలవాడవైనచో, నీ చుట్టుపట్ల జరుగు యితర విషయము లేవియును సరకుచేయక, నీ దృష్టిని నీవైపునకే మరల్చుకొనవలెను.

3. అశాశ్వతమగు ప్రపంచ విలాసములను విసర్జించి యుంటివేని, నీవు మిక్కిలి జ్ఞానాభివృద్ధి నొందెదవు. లేక ప్రపంచ విషయముల వేవినైనను, ఘనముగ నెంచుకొనుచుందువేని, నీవు జ్ఞానాభివృద్ధి నందజాలక పోవుటయేగాక, మీదుమిక్కిలి వ్యర్థుడవై పోయెదవు.

కేవలము దేవుడును, దైవ విషయములను తప్ప, యితర ప్రాపంచక విషయము లేవియును ఘనమైనవనియు, యుత్తమమైనవనియు, సంతోషకరమైనవనియు, యనుకూలమైనవనియు నెంచకుము.

సృష్టియందలి ప్రతి జీవినుండియు, నీవు పొందెడుయూరట వ్యర్థమైనదని నమ్ముము. దేవుని ప్రేమించుచుండెడి యాత్మ, దేవునికన్న నితరమగు విషయములన్నిటిని మిక్కిలి నీచముగ పరిగణించును.

సర్వవ్యాపియు, అగోచరుడునగు, సృష్టికర్త తప్ప, నితరులెవ్వరును వాస్తవమగు నూరటయును, సంతోషమును ఆత్మకు కలిగింపజాలరు.

## సా రాం శ ము

"ఆత్మను గోల్పోయి ప్రపంచమంతయును సంపాదించినను, మానవున కదియేమి ప్రయోజనకరము?" (మత్తై 15 అ. 26వ)

ఈ యధ్యాయమునందు, పూజ్యనీయుడైన, మన గ్రంథకర్తగారు పైని చెప్పబడిన మన రక్షకుడను దైవ సందేశమును, మన కుదాహరణముగా నిచ్చుచున్నారు. దీని నెన్నటికిని మనము మరువకుందుముగాక. ఈ నీతి వాక్యమున కనుగుణ్యముగనే, వారివలెనే మనము తర్కించి విచారించుకొనియెదము.

మనమొక్క విద్యను మాత్రము నేర్చుకొనవలసి యున్నాము. అది యేదియన, మన మోక్షప్రాప్తిని గూర్చిన విద్యయే.

మనమొక్క విద్యుక్త ధర్మమును మాత్రమే నెరవేర్చవలసి యున్నాము. అది యేగియన, మన యాత్మరక్షణయే.

ఈ విద్యను నేర్చుకుందుమేని, ప్రతి యితరవిద్యయును, లాభకరమైనదిగాకపోవుటయేగాక, పైగా మనకది వినాశకరమగునది గూడాయగుచున్నది.

ఈ విద్య నభ్యసించుటకు మనము రెండువిషయములను మాత్రము నేర్చుకొనవలసి యున్నాము. అవి యేవియనిన ?

మొదటిది :- దేవుడు. వీరినిగూర్చి మనము నేర్చుకొనవలసినదేమి?

a) వారిని గ్రహించి, వారిని ప్రేమించి, వారికి సేవచేయుట.

b) దేవునిమాత్రమే అనుసరించియుండి వారిని విడువకుండుట.

c) సర్వకాలము లందును వారి దయానుభవమునకు తగిన యర్హత కలిగియుండుట.

రెండవది :- మనలనుగూర్చి, మనము నేర్చుకొనవలసినదేమియన:

a) మన ప్రస్తుతపు స్థితి యెటులున్నది ?

b) మనయందలి దోషము లేమి ?

c) మనయందలి సద్గుణము లేవి ?

d) మనము జ్ఞానాభి వృద్ధియందు ముందడుగు వేయుచున్నామా ? వెనుకడుగు వేయుచున్నామా ?

మన మీ రెండువిషయములగూర్చియే, పరిపూర్ణముగ యోచించు కొందము. ఇతరవిషయము లన్నియును వదలివేయుదము. మన యింద్రియము లన్నిటిని, చెలరేగనియ్యక అదుపునం దుంచుకొనియెదము. అటుల చేయుదుమేని, సృష్టియందలి జీవులయెడ మోహమున జిక్కికొని, వానివెంట నంటిపోవునటుల మనను యింద్రియములు తొందర పెట్టజాలవు. అందుచే చివరకు మనము న్యాయప్రకారం మనుభవింప వలసిన వాటినితప్ప, యితరవిషయములయందలి వాంఛలచే మోహింప బడకుందుము.

ఇతర సందర్భములందు ప్రస్తుతపు పరిస్థితినిబట్టి యవసరము కలిగినతప్ప, మనమెట్టి జోక్యమును కలిగించుకొనకూడదు.

ప్రతిదినమును మన లోపములను సవరించుకొని, మనను నిష్కల్మషులుగా చేసికొనుటను గురించియును, పరిపూర్ణ జ్ఞానసంపాదనా మార్గమున మనము దినదినాభి వృద్ధినొందు విధములనుగూర్చియు, యోచించు చుండవలయును.

---

## 6 వ అధ్యాయము

## పవిత్రమగు మనస్సాక్షియొక్క యానందము.

1. పవిత్రమగు మనస్సాక్షి కలిగియుండుటయే, మానవునియొక్క యశస్సు. మంచి మనస్సాక్షికలవాడై యున్నచో, సర్వదా శాంతము ననుభవింపజాలును. పవిత్రమగు మనస్సాక్షిగల మానవు డెక్కువ తాలిమివహించి యుండగలడు. కష్టముల మధ్యనుండియు మిక్కిలిసంతోషహృదయుడై యుండును.

అపవిత్రమగు మనస్సాక్షిగల మానవునకు, సర్వదా భయమే తోచుచుండును. ఎల్లప్పుడు నతడు అశాంతిచే యావరింపబడి యుండును. నీవు దోషములను చేయకున్నచో, మిక్కిలి యానందయుతమగు

విశ్రాంతి ననుభవింప జాలుదువు. నీ వాచరింపవలసిన పనులన్నియును చక్కగా నాచరించినగాని, మరెప్పుడును సంతసింపకుము. దుర్మార్గుల కెప్పుడును నిజమైన సంతోషముండదు. వారు ఆంతరంగిక శాంతమును సైత మనుభవింపరు. ఎలయన? "దుర్మార్గులకు శాంతములేదు" యని సర్వేశ్వరుడు తెలిపియున్నాడు. (ఇజయాసు 48 వ అ. 22 వ.)

"మేము హాయిగా నున్నాము. మా కెట్టి దుస్థితులును, కష్టములును రావు. మాకు కష్టములను కలిగింప ధైర్యముచేయువా రెవరు" యని దుర్మార్గులు చెప్పుదురేని, వారిమాటలను విశ్వసింపకుము. వారిపైని నకస్మాత్తుగా దేవుని కాగ్రహము వచ్చును. వారాచరించెడు దుష్టకార్యము లన్నియును వృధాయగును. వారికుట్ర పన్నాగములన్నియు నశించును.

2. దైవభక్తుడగువానికి, సంకటములయందు సైతము, సంతోషముగ నుండుట యొక కష్టకార్యముకాదు. కష్టములు ప్రాప్తించునప్పుడు సంతోషించుటయన మానుపైని కొరతవేయబడినప్పుడు మనజేసునాథ స్వామి సహించియున్న కష్టములనుగూర్చి, వారిమహిమనుగూర్చి పొగడుటయేగదా?

మానవు లితరులనుగూర్చి పొగడుటయు, ఇతరులవల్ల శ్లాఘింపబడుటయు, బహుకొద్దికాలముమాత్రమే. ప్రపంచపొగడ్తలకు వెంటనే దుఃఖములు ప్రాప్తించుచుండును. పవిత్రమగు మనస్సాక్షిని కల్గియుండుటయందే, మానవులకు సమాధానము గలదుగాని, పరులచే పొగడబడుటయందు గౌరవములేదు.

న్యాయమార్గానుసారులయొక్క సంతోషము దేవునినుండి ప్రాప్తించుచుండును. దైవచింతలయందే యోగ్యులు సంతోషము ననుభవించుచుండెదరు. సత్యమయిన వారికమితానందము.

వాస్తవముగ శాశ్వతకీర్తికొరకు కాంక్షగలమానవుడు, అశాశ్వతమగు ప్రాపంచక గౌరవములను లక్ష్యముచేయడు. ఏమానవు డశాశ్వతమగు ప్రాపంచక గౌరవములందాశ కల్గియుండునో, ఆమానవు శాశ్వతగౌరవములను తృణీకరింపజాలడు. అట్టిమానవుడు, మో సంబంధ

మగు దివ్యగౌరవముసెడల లేశమాత్రమైనను ప్రేమలేనివాడై యున్నాడు.

ఇతరులదూషణ, భూషణల నెవడు లక్ష్యముచేయడో, యాతె డెక్కువ హృదయశాంతము ననుభవింపజాలును.

3. ఏమానవుని యాంతర్యము నిష్కల్మషమై యుండునో, యాత డతిసులభముగ సంతృప్తిహృదయుడై శాంతము ననుభవింపజాలును.

పరులచే శ్లాఘింపబడు నంతమాత్రమున, నీవు పావనుడవుకాజా లవు. లేక నీవు పరులచే దూషింపబడినంత మాత్రమున నీవు చెడ్డ వాడగుటలేదు.

నీవెట్టి ప్రకృతిగలవాడవై యుందువో, యట్టివాడవే యైయుం గుదు. నీవు దేవుని దృష్టియందెంతవాడవో, నంతకన్న నెక్కువ ఘనత గలవాడవై యుండజాలవు. ఆంతరంగికమున నీవెట్టివాడవై యుంటివో, చక్కగాయోచించుకొని చూచితివేని, మానవులు నిన్నుగూర్చి చెప్పు కొనియెడు విషయములను లక్ష్యము చేయకుందువు.

మానవుడు బాహ్యచిహ్నములనుగూర్చి మాత్రమాలోచించుచు, పరిశోధనలను గావించును. కాని భగవంతుడు మనహృదయములను, పరిశీలనచేయును.

మానవుడు మనమాచరించెడు క్రియలనుగూర్చి యోచించును. భగవంతుడన్ననో, మనసంకల్పములను పరిశీలినచేయును.

ఆచరింపవలసియున్న పనులను తగురీత్యా పరిపూర్తిచేయుచు, తననుగూర్చి ఘనముగ నెంచుకొనకుండుట, దీనత్వమును వహించియుం డెడి యాత్మలక్షణములై యున్నవి.

సృష్టియందలి ఏజీవినుండియును, ఆదరణను పొందుట కిష్టపడకుం డుట యాంతరంగిక పరిశుద్ధతకును, ఆత్మవిశ్వాసమునకును చిహ్నము.

4. తన గొప్పతనమునుగూర్చి, పరులయొద్దనుండి యోగ్యతాపత్రిక లను, కోరు మానవుడు, తనను సర్వేశ్వరునకు పరిపూర్ణార్పణము గావించుకొనని వాడగుచున్నాడు.

ఏమానవుడు దేవునియొక్క మెప్పును పొందజాలునో, యాతడే మెప్పునకు తగిన యర్హత గలవాడుగాని, "తనను తాను పొగడుకొనెడు

వాడు మెప్పునకర్హుడుగాడ”ని అర్చ్య. చిన్నప్పగారు బోధించి యున్నారు. (2 కొరింత-18)

ఆంతరంగికముగ దేవునిచే నిర్ణయింపబడిన విధులననుసరించి వర్తించుచు, బాహ్యవిషయానురాగము కల్గియుండకుండుటయే అంతరంగిక మానవునియొక్క స్థితియైయున్నది.

---

## సారాంశము

ఈ ప్రపంచ జీవితమున మనమున్నంతకాలమును, ప్రేమపాత్రులమో, లేక యపాత్రులమో యను విషయములనుగూర్చి నిశ్చితాభిప్రాయము మనకు కలుగదు. ఐతే యీ అంశమునుగూర్చి మన మనసాక్షి ప్రసాదించెడు యోగ్యతా పత్రికల ననుసరించి, కొంతవరకు మనము యోగ్యులమో, అయోగ్యులమో? యనుసంగతిని స్థిరపరచుకొనవచ్చును. మన మనస్సాక్షిచే నియ్యబడియెడి, యోగ్యతాపత్రిక, మనకు కొంచెమనుగుణ్యముగ నుండునెడల, మనము దేవునికి ప్రియులమని తలంచుకొనవచ్చును. ఐతే యట్టి యోగ్యతా పత్రికలవలన మనకు పరిపూర్ణ క్షేమము లేదు. అయినప్పటికిని, మనకది ఎంతో యాదరణను కలిగించి, యానందము నొనగూర్చి, శాంతమును తెచ్చిపెట్టును. ఈ జీవితమునందు మనమాశింపవలసిన దంతయు నిదియే.

ఇట్టి యోగ్యతా పత్రికలను పొందుటకై, మనము సర్వకాలము లయందును, దుర్మార్గములను విసర్జించి, యోగ్యమగు పుణ్యకార్యములనాచరించు చుండవలయును. మనసుగూర్చి పరులెట్టి విషయములను చెప్పుకొనుచుండినను, యెట్టి యభిప్రాయము గలవారైయున్నను, మన మేమియును జోక్యమును కలిగించుకొనకుండవలయును. ఇదియే నీయధ్యాయమునందు సర్వేశ్వరునియొక్క పవిత్రాత్మప్రేరితుసాంక్తు మనకుపదేశించియున్న బోధనవాక్యముల యందలి యుద్దేశమై యున్నది.

---

## 7 వ అధ్యాయము
## అందరికన్న నెక్కువగ జేసునాథస్వామినే ప్రేమింపవలయును.

1. జేసునాథస్వామిని ప్రేమించుట యననేమో ? వారికొరకై తన్ను తాను తృణీకరించుకొనుట యననేమో గ్రహించిన మానవుడే యదృష్టవంతుడు. మనము ప్రేమించుచుండెడు యితర విషయములన్నియును, సర్వేశ్వరుని ప్రియపుత్రుడగు జేసునాథస్వామికొరకై వదలివేయవలెను. ఏలయనగా, మనమందరికన్న నెక్కువగ జేసునాథస్వామిని ప్రేమించవలయును. ప్రపంచ విషయములయందలి, ప్రేమ నమ్మరానిది. చపలమైనది. జేసునాథునియందలి ప్రేమ, విశ్వాస యుక్తమైనది. స్థిరముగ నిలిచియుండును. సృష్టివస్తువులయం దనురాగ బద్ధుడై యుండువాడు, యశాశ్వతమగు యా వస్తువులతో నశించిపోవును.

జేసునాథస్వామిని ప్రేమించి, యాలింగనము చేసికొని యుండువాడు, స్థిరస్థాయియై యుండగలడు. జేసునాథస్వామిని ప్రేమింపుము. ఎల్లప్పుడును వారిస్నేహమును గలిగియుండుము. నిన్నితరులందరును విసర్జించునప్పుడు సైతము,ఆయన నిన్నువీడక ఎల్లప్పుడు నీవునశించి పోకుండునటుల కాపాడును. నీకిష్టమున్నను, లేకున్నను, చివరకు నీవు సకల వస్తువులనుండి వేరుచేయ బడవలసినవాడవై యున్నావుసుమా.

2. నీ జీవితకాలములోను, మరణ తరుణములోను, జేసునాథస్వామి యెడల ప్రేమను వీడకుండవలయును. నీ రక్షణ భారమంతయు, వారి హస్తగతము చేయవలయును. ఏలయనగా; ఇతరులందరును నిన్ను వీడినప్పటికిని జేసునాథస్వామి మాత్రమే నీకు తోడ్పడగలరు.

నీవు ప్రేమించెడి జేసునాథుని నైజగుణము యిదియేసుమా ?నీహృదయరాజ్యములో వారికి తప్ప మరెవ్వరికి పాలుపంపులు కలిగి ఉండుట కిష్టపడరు. నీ హృదయమును పూర్ణముగా తమకు మాత్రమే సొంతమై యుండవలెనని ఆశించుచున్నారు. రాజు తన సింహాసనముపై ఎటుల ఆసీనుడై యుండునో, యటులనే జేసునాథుడు నీ హృదయపీఠము నందాసీనుడై యుండవలయునని కోరుచున్నాడు.

ప్రపంచ విషయానురాగములు లేనివాడవై, నిన్నుమాత్రము నీవు పవిత్రముగ నుంచుకొన జాలుదువేని జేసునాథస్వామి మనఃపూర్వకముగ నీ హృదయవాసియై, నీతో కలసి యుండుట కిష్టపడును. జేసునాథస్వామియందు భక్తివిశ్వాసములు కలిగియుండక, పరులను మాత్రమే కలిగియుంటివా ? యవియన్నియును నీకేమాత్రము ప్రయోజనకరములు కాక వ్యర్థమైనవని నీవు తెలిసికొనియెదవు.

గాలికిస్సితము అల్లలాడుచు వంగిపోయెడు రెల్లుగడ్డిని నమ్మకుము. దానిపై యాధారపడి యుండకుము. ఏలయనగా ?

"మానవులందరును తృణప్రాయులు. వారి మహిమలన్నియును పొలములందు పుట్టి పెరిగి కొద్దికాలములో నశించిపోయెడు పుష్పములను పోలియున్నది. (ఇజయాస్ 10 అ. 6. వ)

3. మానవుల బాహ్యయాడంబరములను మాత్రము నమ్మియుంటివా? నీవు త్వరలోనే మోసపోవుదువు సుమా ? ఏలయనగా? అట్టిమానవుల వలన యాదరణయు, లాభమును పొందవలయునని యాశపడుదువేని, నీకు తరుచుగా నష్టమే సంప్రాప్తమగుచుండును.

అన్నివిషయములలో నీవు జేసునాథస్వామికొరకై వెదకిన యెడల, ప్రతివస్తువునందును వారి దర్శనమును నీవు పొందజాలుదువు. నిన్నునీవు వెతికికొనినయెడల నిన్నుమాత్రమే కనుగొనియెదవు. అయితే అటులచేయుట నీ నాశనముకొరకే సుమా ?

జేసునాథస్వామిని వెదకని మానవుడు, ప్రపంచమంతయును, శతృకోటియంతయును నేకమై తనకు జేయజాలెడు యపకారముకంటె నెక్కువ యపకారమును తనకు తానే తెచ్చిపెట్టుకొనినవాడగును.

---

## సారాంశము

జేసునాథస్వామిని గ్రహించుటయందే నీ మనస్సునంతయును లగ్నముచేసి యుంచుము. నీ హృదయమంతయును వారి ప్రేమకొరకే వదలివేయుము. వారి ననుసరించి ప్రవర్తించుటయందే, నీ శ్రద్ధనంతయును వినియోగింపుము. ఏలయందువా ? ఇందుకొరకై నీవు ప్రస్తుత మీ

మవలంభించియున్నావు. నీయందలి ప్రేమచేతను, నిన్ను పాపవిముక్తినిగ నొనర్చి మోక్షము ననుగ్రహించుటకొరకై, మానవజన్మనెత్తిన జేసునాథస్వామిని ప్రేమించుటయందు నీకుగల కష్టమేమి?

జేసునాథస్వామి చర్యలనుగూర్చి చింతించి, వాటిని గమనించుటకును, వారి పవిత్రయుద్దేశముల యందలి రహస్యములను గ్రహించుటకును, వారి యేర్పాటుల ననుసరించి ప్రవర్తించుటకును, వారి భావములను గ్రహించి వాటిననుసరించి వర్తించుటకును, స్థిరసంకల్పములనుగావించుకొనుము. వారాచరించియున్నరీతిని, కార్యాచరణకు గడంగుటకును, కష్టము లనుభవించుటకును, వారివలనే పవిత్రజీవితమును గడపుటకును ప్రయత్నింపుము.

సర్వవిషయముల యందును జేసునాథస్వామిని ననుసరించుటయే క్రీస్తువునియొక్క పరిపూర్ణమగు యోగ్యత. అట్టివారలకు కడాపటకు శాశ్వత పరమానందము ప్రాప్తించును.

మన పాపవిమోచనము గావించి, మనల రక్షించిన జేసునాథస్వామి, మనకొరకై యనుభవించిన దీనత్వమునందును, కష్టములందును, యిప్పుడు మనము పాలుగొనుటకు ప్రయత్నించుదుమేని, వారి మహోన్నతమగు మోక్షానందమున ఇటుపై పాల్గొనవచ్చును.

---

## 8. వ అధ్యాయము

## జేసునాథస్వామితో సన్నిహిత మైత్రి.

జేసునాథస్వామి మనతో నుండునంతకాలమును, ప్రతివిషయమును చక్కగనే సాగిపోవుచుండును. కాని, వారు మనతో లేనప్పుడు, ప్రతివిషయము కష్టముగనే యుండును. జేసునాథస్వామి మన హృదయమునందు ముచ్చటించుచుండనియెడల, మన మనుభవించుచుండెడు ఇతరుల యూరటలు యెందుకును కొరగానివగును. జేసునాథస్వామి వారొక్కపలుకు పల్కినను, మనము మిక్కిలి యూరటచెందుదుము. "మన ప్రభువు యిచ్చట విచ్చేసియున్నారు. నిన్ను పిలచుచున్నారు." అని మార్తమ్మ తెలియజేయుటతోడనే మరియ మగ్దలేనమ్మ రోధనము

చేయుచుండు స్థలమునుండి తత్క్షణము లేచి వెళ్ళియుండలేదా ? (జాన్. 11 వ అ-28 వ)

జేసునాథస్వామి మన కన్నీటిని తుడిచివైచి, మానసమునకు సంతోషమును కలిగించుటకు, మనలనందరిని తమ సముఖమునకు పిలుచుకొనియెడు గడియ, మిక్కిలి యానందకరమై యుండును.

జేసునాథస్వామి నీతో లేకుండిన, నీవు యెంత కఠినుడవై యుందువు ? జేసునాథస్వామిని తప్ప, యితరమేమైన వాంఛించువాడవైన యెడల బుద్ధిహీనుడవును, వ్యర్థడవు నగుచున్నావు. ప్రపంచము నంతయు పోగొట్టుకొనుటకన్న నిదియెక్కువ యనర్థదాయకము కాదా ?

2. జేసునాథస్వామి లేనిది ప్రపంచమువలన నీ కేమి ప్రయోజనముండును ? జేసునాథస్వామిని విడచియుండుటయన, ఘోర నరకమే సరి. వారు నీతో కలిసియుండుటయన యానందకరమగు స్వర్గము. వారు నీ చెంత నుందురేని నిన్నెట్టి శత్రువు కష్టపెట్టజాలడు. వారినెవరు కనుగొన జాలుదురో, వారు పెన్నిధిని పొందినవారలగుదురు. అది యిది యననేల ? మహోన్నతమగు లాభము పొందుదురు. వారిని పోగొట్టుకొనువాడు, మిక్కిలి నష్టమును పొందుచున్నాడు. ప్రపంచము నంతయు పోగొట్టుకొను దానికన్న యెక్కువ నష్టమును పొందినవాడగుచున్నాడు. జేసునాథస్వామి లేకుండ జీవించువానికన్న మరొక పేదవాడు లేడు. ఆయనతో సన్నిహితముగ జీవించువానికన్న మరొక భాగ్యవంతుడు లేడు.

3. జేసునాథస్వామి తో సంభాషించెడు విధమును గ్రహించుట యన నొక గొప్ప విద్య. వారి నెల్లప్పుడును తన హృదయమునందు కాత్తుకొనుట, పరిపూర్ణ జ్ఞానము.

మిక్కిల దీనభావమును వహించి, శాంతియుంతుడవై యుండుము. జేసునాథస్వామి నీకు తోడునీడయై యుండును. వారియెడల భయభక్తులుగలవాడవై, హృదయశాంతమును పొందియుండుము. వారెల్లపుడు నీపార్శ్వముననే నిలిచియుండెదరు.

బాహ్యవిషయముల మునిగి, జేసునాథునికి విముఖుడవైనచో, వారిని త్వరితముగా వెడలగొట్టినవాడవై, వారిదయను కోల్పోయెదవు.

నీహృదయమునుండి వారిని తరిమివేసి వారిని పోగొట్టుకొనియెదవేని, నీరక్షణముకొరకు నీవెవరియండకు పరుగిడియెదవు. నీవెవరితోడి స్నేహమును సంపాదించుకొనుటకై శ్రమపడియెదవు? స్నేహితుడెవడును లేని యెడల నీవు హాయిగా జీవింపజాలవు. అందరికంటెను జేసునాథునితోడ ఎక్కువ స్నేహము కలిగియుండని యెడల, మిక్కిలి సంకటములననుభవించువాడవై, దిక్కుమాలిన నిర్భాగ్యుడవై పోయెదవు.

జేసునాథునియందుతప్ప, యితరులెవరి యందైనను విశ్వాసము గలవాడవై నమ్మి సంతసించుచుంటివా? నీవు బుద్ధిహీనునివలె ప్రవర్తించుచున్నావని చెప్పవలసివచ్చును. నీకుప్రియులగు వారందరికంటెను జేసునాథుని మాత్రము ప్రత్యేకముగ ప్రేమింపబడవలెను.

జేసునాథుని నిమిత్తము సర్వమును ప్రేమించుము. అయితే జేసునాథస్వామి మాత్రము తననిమిత్తము ప్రేమించుము. వారినిమాత్రమే మిక్కిలి ఘనముగ ప్రేమించవలయును. స్నేహితులందరియందును జేసునాథుడొక్కడే యోగ్యుడగునట్టియు, మిగుల విశ్వాసము కలిగినట్టియు స్నేహితుడుసుమా?

జేసునాథస్వామికొరకు నీస్నేహితులను, విరోధులను ప్రేమించుచుండుము. వీరందరి రక్షణముకొరకును, వీరందరు జేసునాథస్వామిని గ్రహించి, ప్రేమించు నటుల స్వామిని ప్రార్థించుము.

పరులు నిన్ను ఘనముగ శ్లాఘింపవలయుననియు, ప్రేమించవలయునినియు, కాంక్షగలవాడవై యుండకుము. సాటిలేని దేవుడొక్కడే ప్రేమింపబడవలసినవారు. వారే పొగడ్తకు అర్హతగలవారు. ఇతరులెవ్వరు నట్టియర్హతగలవారుకారు. ఇతరులు నీయందు హృదయానురాగము కలిగియుండవలయునని కోరుకొనకుము. నీవును మరియొకరి యెడల ప్రేమబద్ధుడవై యుండకుము. నీయందును, గుణవంతులైన యితరుల యందరియందును జేసునాథస్వామియే ప్రేమింపబడుగాక.

5. ప్రపంచ విషయానురాగములందు తగుల్కొనక, పవిత్రమగు స్వాతంత్ర హృదయుడవై యుండుము. మిక్కిలి విశ్రాంతితో దైవమెంత ఆనందదాయియో గ్రహింపదలచితివేని, సర్వము నిగ్రహించి, పవిత్రమగు హృదయ మొక్కటి మాత్రము గలిగి, దేవుని సన్నిధికరుగుము.

సర్వవిషయములకు స్వస్తిచెప్పి, వారితో ఐక్యమగుటకు వారి వర ప్రసాదము యున్ననే తప్ప, నీవు ఎంత మాత్రమును అట్టిస్థితిని పొందజాలవు. దైవవర ప్రసాద సహాయముననే మానవుడు సకల కార్యములనుచేయ శక్తిగలిగియున్నాడు. దైవానుగ్రహము వానినుండి తొలగిపోయినప్పుడు వాడు దరిద్రుడు, బలహీనుడై దురితములకు గురియగుచున్నాడు.

ఇట్టి స్థితియందుండుటకు తటస్థించునేని, యాతడు ఖిన్నుడుగాక, నిరాశపడక చలింపని మానసము కలవాడై తనను దేవుని కర్పించుకొని, తనకెట్టి యిక్కట్టులు వాటిల్లినను, జేసునాధస్వామి మహిమకొరకై యోర్చుకొని యుండవలయును. ఏలయనగా, చలికాలమునకు పిమ్మట యెండాకాలము వచ్చును. రాత్రి గతించగనే పగటి కాలము వచ్చుచుండును. తుపాను పోయిన వెంటనే ప్రశాంతము గలుగుచుండును. ఈ విధముననే మానవునకు కష్టకాలము గతించిన వెంటనే, మంచి కాలము వచ్చుచుండును.

---

## సా రాం శ ము

మన యజ్ఞాన తిమిరము తొలగించి, మనయందు జ్ఞానోదయమును గలిగించుటకును, మనకు తగినంతబలము దయచేయుటకును, మనల నాదరించి సంతోషములను సర్వసంపదలను చేకూర్చుటకును, పితయైన సర్వేశ్వరుడు మన కర్పించియున్న జేసునాధస్వామి, తనయందు కలిగి యుండని ప్రతి క్రీస్తువుడును వ్యర్థుడే. గనుక అందరికన్న జేసునాధస్వామిని ప్రేమించుటకు మనను పురిగొల్పు కారణములే, వారిని ప్రత్యేక స్నేహితునిగ మనము పరిగణించునటుల మనను ప్రేరేపింపవలయును.

ఈరీతిని మనము వారిని సంపాదించుకొనజాలుదుమేని, ప్రపంచమునందలి సర్వసౌఖ్యములు పొందినవారలమగుదుము. అటుగాక మనము వారిని పైవిధముగా సంపాదించుకొనజాలక పోగొట్టుకొనియెదమేని, సర్వమును కోల్పోయిన దౌర్భాగ్యులమగుదుము.

ఈవిధముగ మనస్నేహితుడగు జేసునాధస్వామిని పొందజాలుటయన, ఆహ్లాదకరమగు విశ్వాసముతోడను, ఆశతోడను తీవ్రమగు

త్యాగముతోడను వారిని పొందుటయేసుమా? మనము వారిని సంపాదించుటయన, వారిభావములను వారిసద్గుణములను, సాధనముచేసి సంపాదించుకొనుటయే. ఇందుకొరకై మనమందరము దీనులమై నమ్రతగలవారలమై, శాంతియుతులమై, అప్పుడప్పుడు మనమానసమును యితర విషయములదెసకు పోనీయక, లాగిపట్టుకొని, మనచర్యలనుగూర్చి యోచించుకొనుచుండవలయును. మనమెల్లప్పుడును మనదొడ్డ స్నేహితుడగు జేసునాథస్వామినిగూర్చియే, మనహృదయములందు తలంచుచుండవలయును. అంతరంగికముగ మనమెల్లప్పుడును వారితోడ సంభాషించుచుండవలయును.

మనము సర్వమును విసర్జించి, దిగంబరులమై జేసునాథస్వామిని గూర్చిన చింతలనే ధరించుదము. అటుల చేయజాలుదుమేని మనము వారిని సంపాదించుకొన శక్తిగలవారలమగుదుము. మనము వారియందును, వారు మనయందును జీవింపగలము.

---

## 9వ అధ్యాయము

### ఎట్టి యోదార్పును లేక నుండుట.

1. దేవుడు మనలను నూరడించునప్పుడు, మనుష్యుల యోదార్పును తృణీకరించుట యొక కష్టమగు కార్యముకాదు. దేవునినుండియు, మానవులనుండియు, ఎట్టి యోదార్పును పొందకుండుటయును. దేవుని ఘనతకొరకై, యాంతరంగిక సంకటమును సహించియుండుటయు, దేవునియందును తన స్వలాభముకొరకై ప్రయత్నింపకుండుటయు, తన యోగ్యతనుగూర్చి తానెక్కువగ నెంచుకొనక యుండుటయు, ఇవి యన్నియును ఘనకార్యములు.

దైవానుగ్రహము కలిగియుండునపుడు, సంతోషముగలవాడవై భక్తిపరుడవై యుండుట యొక గొప్పకార్యముకాదు. అట్టి సమయమును అందరు వాంఛించదగినదే. దైవానుగ్రహము గలిగియుండు మానవుడు హాయిగా జీవయాత్రయందు త్వరితగతిని పోజాలును. మిక్కిలి మహోన్నత మార్గదర్శియగు సర్వశక్తిమంతునిచే నడుపబడుచు, మోసికొని

పోబకు మానవునికేమియును భారము తోచకుండుట వింతయైన విషయము గాదు.

2. మనకు ఓదార్పనొసగున దేదియో యొకటి యుండవలయు ననియే, మనము కోరుచుందుము. ప్రతిమానవునకును స్వపరిత్యాగమనిన, కష్టతరమైనది. వేదముకొరకై తమ ప్రాణములను కోల్పోయినలారెన్స్ యను పావనపురుషుడు, తన గురువుతో గూడ ప్రపంచాను రాగములను జయించెను. ఐహికప్రపంచమున యానందకరములగు విషయములన్నిటిని తృణీకరించివైచినందున, జేసునాథుని ప్రేమకొరకై, తాను మిక్కిలి ప్రేమించుచు వచ్చిన సిక్తసు యను పెద్దగురువు యెడబాటువలన గలిగిన సంకటమును సైత మనుభవించెను.

దైవ ప్రేమవలన; మానవులయందలి ప్రేమను జయించెను. మానవుని ఓదార్పుకు బదులు దైవప్రీతినే యాతడెక్కువైనదిగా వరించెను. ఆలాగునే నీవును నీకు మిక్కిలి యగత్యమగు నట్టియు, నీవు మిక్కిలి యెక్కువగా ప్రేమించునట్టియు ప్రాణస్నేహితుని సైతము, దైవప్రేమ కొరకై కోల్పోవజాలుటను నేర్చుకొనవలయును. నీ స్నేహితుడు నిన్ను విసర్జించినప్పుడు చింతపడకుము. ఒకానొక కాలమునకు మనమందరము నను యొండొరులనుబాసి, యెడబాయ వలసియున్నామను విషయమును గ్రహింపుము.

3. తన్ను తాను జయించుట పూర్తిగా నేర్చుకొనుటకు ముందు, తన యనురాగమంతయును దేవునికే చూపగలుటకుముందు, ప్రతి మానవుడును చిరకాలమువరకు తన యాంతరంగమున, తనలో తాను కఠిన పోరాటము సలుపవలసి యున్నాడు. మానవుడు తనయందే నమ్మకము గలవాడగు నెడల, మిక్కిలి సులభముగ మానవులనుండి యాదరణలను కోరసాగును.

ఐతే దేవుని యెడల వాస్తవమగు ప్రేమగల్గి, యుత్సాహముతో, పుణ్యముల నార్జింప ప్రయాసపడెడువాడు, యితరులవలన ఊరటపొందవెదుకడు. విషయానురాగము వలని యానందముల కొరకై ప్రయత్నములు గావింపడు. కాని జేసునాథుని కొరకై కఠినమైన కష్టములను, ప్రయాసలను సహించి యుండుటకే యిచ్చగలవాడై యుండును.

4. కనుక దేవుడు జ్ఞానసంబంధమగు ఓదార్పును దయచేయునప్పుడు, వారికి వందనము లర్పించుచు స్వీకరింపుము. అయితే దానిని దేవుడు నీకు మిక్కిలి ఔదార్యముతో ననుగ్రహించెనని నమ్ముము. అంతేగాని దానిని పొందుటకు, యోగ్యత నీయందుండుటచే వారనుగ్రహించిరని భావించుకొనకుము. ఇట్టి జ్ఞానసంబంధమగు యాదరణను, నీవు దేవుడు ప్రసాదించెనని గర్వపడకుము. అమితానందము నొందకుము. వ్యర్థనమ్మకము నీమీద నుంచుకొనకుము. మిక్కిలి దీనత్వము వహించియుండుము. నీవాచరించెడు కార్యము లన్నిటియందును, మిక్కిలి జాగరూకుడవై భయభక్తులతో ప్రవర్తింపుము. ఏలయనగా? యీగడియ దాటిపోవును; అటుపిమ్మట తంత్రశోధనలు వచ్చును. ఊరట నీనుండి తొలగింపబడినప్పుడు యధైర్యపడి నమ్మకము విడువవలదు. తిరుగ దేవునికి నీయందు దయకలుగువరకు, దీనుడవై శాంతముతో కనిపెట్టుకొని యుండుము. ఏలయనగా? దేవుడు నిన్నింక ఎక్కువగా నాదరించగలడు. ఇది యొక నూతన అంశముకాదు. దేవుని చర్యల ననుభవపూర్వకముగ గ్రహించియున్నవారలకు, వింతగొల్పెడు విషయముకాదు. ఏలయనగా? గొప్ప, అగ్ర్యశిష్టులయందును నిట్టిమార్పులు పలుమారు సంభవించుచుండెడివి.

5. అందువల్లనే దేవ వరప్రసాదము తనయందున్నప్పుడు, ఒకానొకరు యిట్లనిరి. "దేవుని పరిపూర్ణ కటాక్షము నాయందుండునప్పుడు నేను లేశమాత్రము చలింపను అని చెప్పితిని" అని నుడివియున్నారు. (కీర్త.29-7) "వారు ప్రసన్నవదనమును నానుండి మరల్చుకొనినారు నేను సంకటముల పాలైతిని." ఐతే యీ మధ్యకాలములో వారేమియును నిరాశచెందియుండలేదు. "దైవమా! తమయెదుట దుఃఖించుచున్నాను. మొరపెట్టుచున్నాను. దైవమా! తమను ప్రార్థించుచున్నాను. అని యెక్కువగా మనఃపూర్వకముగ దేవుని వేడుకొనుచున్నాడు. తుదకాయన ప్రార్థనా ఫలముపొంది, తన ప్రార్థనలను దేవుడాలకించెనని మనకందరకును తెలియపరచుటకొరకై, "దేవుడు నా ప్రార్థనల నాలకించి నాయెడల తమ దయానుగ్రహమును ప్రసాదించినారు. నాకు వారు తోడునీడయైయున్నారు." అని చెప్పియుండెను. అయితే వారి ప్రార్థనలు దేవుడేరీతిని యంగీకరించి కరుణించిరని తెలియజేయుటకై,

"వారు నా దుఃఖమునంతయును, సంతోషముగా మార్చివైచిరి. సంతో
షముతో నన్ను పరివేష్టించిరి. నా కన్నిదిశలయందును సంతోషముతో
నింపివేసినారు." అనెను. మహనీయులగు పావనపురుషుల సందర్భము
లయందే యిటుల జరుగుచున్నపుడు, మిక్కిలి బలహీనులము జ్ఞానహీను
లము అయిన మనము కొన్ని కొన్ని సమయములందు భక్తిపరులమై
యుండుటయును, మరికొన్ని సమయములందు నిరుత్సాహము కలవా
రలమై యుండుటయును తటస్థించుచునెడల, నధైర్యము నొందరాదు. ఏల
యన; స్పిరితుసాంక్తు తమ యిష్టాను సారముగవచ్చి పోవుచుండును.

6. అందువల్లనే పావనపురుషుడగు జోబు చెప్పినదేమనగా? "వారు
యుదయమున పెందలకడనే మానవుని కలిసికొని వాని నకస్మాత్తుగా
పరిశోధించెదరు" (జాబ్ 7 అ. 18 వ) ఇట్టిస్థితిలో దైవము నా యెడల
యనుగ్రహము కలవాడగు ననుయాశతో వారికరుణామీదనే యాధారపడి
యుండవలసిన వాడనే కాని, మరియే యితర విషయములం దాశయుం
చుకొనియెదను? ఎవరి దయమీద నమ్మకముంచుకొనెదను? యోగ్యప్ర
వర్తనులును, దైవభక్తి పరాయణులగు సోదరులు, విశ్వాసముగల స్నేహి
తులును, నాకు ఎంతమంది యుండిననేమి ప్రయోజనము? నేనెన్ని
పవిత్రగ్రంథములు పఠించుచుండిననేమి ప్రయోజనము. భగవంతుని
గూర్చిన మనోహరమగు సంకీర్తనల వలనను , వారలను గూర్చిన గీత
గానము చేయుచున్నందువలన ఏమిప్రయోజనము? దైవకటాక్షము పోగొ
ట్టుకొని నిర్భాగ్యస్థితియం దుండునప్పుడు, పైవారియం దెవ్వరును నాకు
సాయము చేయజాలరు. నేనేమాత్రమును సంతోషము కలవాడను
కాజాలను. అట్టి సమయమునందు, శాంతముతో దేవునియొక్క యిష్టా
నుసారముగా జీవయాత్ర సలుపుచుండుటకన్న, మరియొక గత్యంతర
ము లేదు.

ఎంతమిక్కుటమగు యాసక్తిగల భగవత్ భక్తిపరాయణుడైనను,
కొన్ని సమయములందు వరప్రసాద తగ్గుదలను ననుభవింపనివానిని, దైవ
భక్తియందలి యుత్సాహము తగ్గుదలను ఎరుగనివానిని, నేనెన్నడును కను
గొనియుండలేదు. ఆరంభమునగాని, కడాపటగాని శోధింపబడక
యుండునంతవరకు పరవశులై యున్నవారులేరు. ఏలయనగా? దైవము
కొరకై కొన్నిసంకటములవల్లనైనను పరీక్షింపబడనివాడు, దైవమును

గూర్చి మహోన్నతముగా ధ్యానముచేయుటకు పాత్రుడుకాడు. ఏల యనగా? వెంటనే రాబోయెడి యూరటకు శోధనముందు బోయెడి గురుతుగాయున్నది. శోధనవెంటనే ఊరట నెమ్మది రాబోవుచున్నదని ముందు తెలియజేయు గురుతైయున్నది. తంత్రశోధనలవలన పరీక్షింపబడినవానికే పరలోక సంబంధమైన ఊరట నొసగబడునని వాగ్దానము చేయబడినది. "విజయము గాంచువానికి మాత్రము, జీవవృక్షముయొక్క ఫలముల భుజింపనిత్తును." అని దేవుడు వాగ్దానము చేసియున్నాడు.

8. ఐయితే దుఃఖదురితములను ధైర్యముతో సహింపగలందులకే దేవుడు ఓదార్పునిచ్చుచున్నాడు. తన మేలునుగాంచి, గర్వమును వహింపకుండుటకై, తంత్రశోధనలును వెంబడించుచుండును. పిశాచము నిదురించుటలేదు. మనశరీరేచ్ఛలు నశించియుండను లేదు. నీకిరుపార్శ్వములను విశ్రాంతిలేని శత్రువులు వేచియున్నారు. గనుకనీవు వారితోడ పోరాటము సల్పుటకై సిద్ధము కావలయును; యుపేక్షించి యుండరాదు.

---

## సారాంశము

తమసేవయందుండు వారలకందరకును, మానవులనుండి యాదరణలు లేకుండ యుండవలయునన దేవుడు అప్పుడప్పుడు చిత్తగించుచున్నాడు. అంతేగాక దైవసంబంధమగునట్టి ఓదార్పు లేకున్నను, మానవులు దీనులై, మిక్కిలి శాంతముతోడను, నిగ్రహాత్వముతో ప్రవర్తింపవలయునని దేవుడు కోరుచున్నాడు. అట్టిస్థితికి మనలను తీసికొనిపోవుట క్రమమని వారికి తోచినపుడు, వారిపత్రమగు యీాప్సితమును మనము పూజింపవలయును. మన మధైర్యము చెందరాదు. దేవునిప్రార్థింపుము. మనదోషములను తలంచుకొని, దుఃఖించుచు దీనులమైప్రవర్తించుచుండవలెను.

దేవునికి మనయందుగల కనికరముచే, మనలనాదరింపవలయునని యెడి కోర్కె వారికిగల్గినప్పుడు, మనము భయభక్తులతో దీనులమై వారిదయను స్వీకరించి, వారియెడల కృతజ్ఞులమై యుండవలెను. వారు తిరుగవారి కరుణను మననుండి తొలగించుట క్రమమని వారికితోచి

నప్పుడు, అట్టివారికరుణను గోల్పోవుటకును మనము సంసిద్ధులమై యుండవలయును. జ్ఞానమార్గానువర్తులకు పలువిధ యాచరణలు, పరిశోధనలు సంప్రాప్తించుచుండును. పరిశోధనలందు బలముగలవారలమై జయము గాంచుటకే దైవము మనలనాదరించుచుండును. దైవము మనకు తోడునీడయై యాదరించుచున్నాడను గర్వముపొందినవారమై పొంగి పోకుండుటకుగాను, తిరుగ మనను పరిశోధనల పాలుచేయుచుండును.

దైవము మన కనుగ్రహించుచుండెడు యాదరణలమధ్య మన ముండునప్పుడు సైతము, సంప్రాప్తించెడి ప్రపంచాను రాగములవలని పరిశోధనల నెదుర్కొనుటకు సైతము సిద్ధముగా నుండవలయును.

మనము శోధనలయందు, చిక్కుకొని యుండునప్పుడును దేవుడు మననాదరించెదరనియెడి దృఢనమ్మకముతో మిక్కిలి బలవంతులమై యుండవలయును.

---

## 10. వ అధ్యాయము

### దేవునియెడల మనము కృతజ్ఞులమై యుండవలయును.

కష్టించి కృషిచేయుటకై నీవు జన్మించియున్నావుగాన, సుఖముగ విశ్రమించి యుండవలయునని యేలకోరెదవు. ఆదరణవలన సంతోషము పొందుటకన్న, శాంతముగ కష్టముల ననుభవించుటకే ఆయత్తపడుము. సంతోషముల ననుభవించుటకు తయారైయుండుటకన్న, కష్టములననుభవించుటకే సిద్ధపడి యుండుము. తానెల్లప్పుడు పొందజాలునెడల, ఆత్మసంబంధమైన సంతోషమును, ఆదరణలను, మనఃపూర్వకముగ స్వీకరించుట కిష్టములేనివాడు మానవకోటి యందెవడైనను గలడా? ఏలయనగా? శరీర భోగములన్నిటికంటెను, ఐహికానందములకంటెను, జ్ఞానసంబంధమగు యూరట మహత్తరమైనది. ఏలయనగా? ఐహికానందములన్నియు నిష్ప్రయోజనములు; అసహ్యకరములైనవి.

జ్ఞానసంబంధమగు యానందములన్ననో, సంతోషదాయకములు, ఉత్తమములైనవి. అవియన్నియు, సుగుణములనుండియే బయలుదేరు చున్నవి. దైవమువలన పరిశుద్ధ హృదయములకు ఒసంగబడుచున్నవి. అయితే నిట్టి దైవసంబంధమగు యౌదార్యములు మానవుడు తాను కోరు నప్పుడెల్లను లభ్యమగునవికావు. ఏలయనగా? శోధనకాలము చాల దూరముగ లేదు.

2. కృత్రిమ మానసిక స్వాతంత్ర్యము, తనశక్తి సామర్ధ్యమునందలి మితిమీరిన నమ్మకము, అను నీరెండు విషయములే మనము భగవదాను గ్రహమును పొందకుండునటుల పలుమారు యాటంకము లగుచున్నవి.

దేవుడు మనకు యూరట ననుగ్రహించుచు, అందుమూలముగ, గొప్ప మేలు నొనగూర్చుచున్నాడు. దేవుడు ఒనగూర్చెడు మేలులకు గాను, మానవుడు వారికి వందనములర్పింపక, సర్వమును వారికే యర్పణ గావించక పోవుటచే, అక్రమ ప్రవర్తనుడగుచున్నాడు. ఈ కారణము చేతనే దైవానుగ్రహములు మనలోకి ప్రవహించుటలేదు. ఏలయనగా? మనకు వరప్రసాదముల ననుగ్రహించిన దేవునియెడల, మనము కృతఘ్ను లగుచున్నాము. అదియునుగాక వరప్రసాదముల చెలమయైన దేవునికి మనము తిరుగ అర్పించుటలేదు. వందనపూర్వకముగ నెవరు దేవునికి కృతజ్ఞత చూపుదురో, వారలకే దైవానుగ్రహము లభ్యమగును.

దీనులకు ప్రసాదింపబడెడు వరములు, గర్వులనుండి తీసివేయ బడును.

3. నేగట్టుకొన్న పాపములకై పశ్చాత్తాపము, న్యాయంబు లేకుండు నటులొనర్చెడు, యూరట నేనెన్నడును కోరను. నన్ను గర్వింప జేయు ధ్యానమును నేనెన్నడాశింపను. ఏలయనగా? మిక్కిలి ఘనముగ కనుపించునదంతయును, పావనమైనదికాదు. ఆనందకరమైనదిగ తోచు నదంతయును యోగ్యమైనదికాదు. ప్రతివాంఛయును, పవిత్రమైనది గాదు. మనకు ప్రియమగునదంతయు దైవమునకు ప్రీతికరమైనదికాదు.

ఎల్లప్పుడు నేను దీనత్వముకల్గి, భయభక్తులతో ప్రవర్తించు నటుల, నిగ్రహము గావించుకొనునటుల యెల్లప్పుడును సంసిద్ధుడనై యుండునటుల చేయువరములమాత్రమే మనఃపూర్వకముగ నేను స్వీక

రించెదను. వరప్రసాదముల తొలగింపుచే వచ్చు కష్టములవలన దైవా
నుగ్రహామువలన నేర్పబడినవాడు, ఏ సత్కార్యముగానితన స్వశక్తివలన
నెరవేర్పబడినదని చెప్ప సాహసింపడు. కాని తాను మిక్కిలి దౌర్భా
గ్యుడ ననియు, దీనుడననియు నంగీకరించును.

దేవునికి చెందియుండు వాటిని వారికే యర్పింపుము. నీకు చెంది
యుండు వాటిని స్వీకరింపుము. అనగా వారునీకు ప్రసాదించిన మేలుల
కొరకై వారియెడల కృతజ్ఞుడవై యుండుము. అయితే నీయందు పాపము
మాత్ర మున్నదనియు, ఆపాపమునకు తగినశిక్షను పొంద పాత్రుడ
వనియు తలంచ గలవాడవు.

4. నీవెప్పుడును కడాపటి స్థలమును మాత్రమే యాక్రమించుకొ
నుము. అటుల చేయుదువేని నీకగ్రస్థాన మీయబడును. ఏలయనగా,
అధమస్థానము లేనిది, యున్నతస్థాన ముండబోదు. భగవంతుని దృష్టి
యందు మిక్కిలి మహాసీయులుగనుండు పుణ్యపురుషులందరును, తమ్ము
తాము మిక్కిలి హీనులుగ భావించుకొనియెదరు. వారలెంత మహిమ
గలిగియున్నారో, అంతగ తమ్ము తాము దీనులగ భావించుకొను
చున్నారు. సత్యముతోడను, మోక్షసంబంధమైన మహిమతోడను, పూరి
తులైనవారు బూటకమహిమను ఆశింపరు. గాఢమగు విశ్వాసమువలన
దేవునియందు స్థిరస్థాయిరై యున్నవారలు యేవిధమునను హంకారులై
యుండరు.

తమకు యేమేలు సంప్రాప్తించినను, అదియంతయును దైవకటా
క్షము వల్లనే లభించినదని, సర్వమును దేవునికే యర్పించువారలు యొం
డొరులనుండి పొగడ్తలను కోరరు. దేవునినుండి వచ్చుమహిమను
మాత్రమే కోరెదరు. అందరికన్న ఎక్కువగా తమయందును పుణ్యపు
రుషులందరి యందును, దేవుడే మిగుల ఘనముగ శ్లాఘింపబడవలయు
ననియే వారు కోరుకొనియెదరు. ఇదియే ఎల్లప్పుడు వారిలక్ష్యము. అందు
వలన దేవునిచే ప్రసాదింపబడిన అనుగ్రహమెంత స్వల్పమైనను, వారి
యెడల కృతజ్ఞుడవై యుండుము. నీవంతకన్న గొప్పవరములు పొందు
టకు పాత్రుడవై యుందువు.

5. నీకు ప్రసాదింపబడిన వరము, మిక్కిలి స్వల్పమైనదైనను, దానినే మిక్కిలి ఘనమైన దానినిగా భావించుకొనుము. నికృష్టమైన బహుమానముగ నీకుతోచెడుదానిని విశిష్టమైన వరమని భావింపుము. వర ప్రదాతయొక్క ఘనతనుగూర్చి యోచించితివేని, యేవరముగాని నీకు స్వల్పమైనదిగాను, హీనమైనదిగాను తోచదు. ఎందుకనగ? మహోన్నత దేవుడు నీకు అనుగ్రహముగ నొసంగున దేదియుస్వల్పమైనదిగ నుండదు.

వారునీకు శిక్షవిధించి, కొరడా దెబ్బలు కొట్టినను, అట్టి దండనను నీవు మిక్కిలి హితకరమైనదిగ నెంచుకొనవలయును. ఏలయనగ? వారుమనకు సంప్రాప్తింప చేయునదంతయు, సర్వదా మనమోక్షప్రాప్తి కొరకై యతులల గావించుచుందురు.

దేవుని వరప్రసాదములను మిక్కిలి భద్రముగా కాపాడుకొనదలచు మానవుడు, అట్టివరము లనుగ్రహింపబడినపుడు కృతజ్ఞుడైయుండవలయును, తిరుగ నా వరప్రసాదములు తననుండి తీసివేయబడిన, శాంతము వహించియే యుండవలెను. వానిని తిరుగ ప్రసాదింప ననుగ్రహింపుడని భగవంతునిగూర్చి ప్రార్థింపవలయును. ప్రసాదింపబడిన వరములను కోల్పోవకుండుటకు, అతను జాగరూకుడై దీనత్వమును వహించియుండవలయును.

---

## సారాంశము

దేవునిచే దయచేయబడిన వరములను తలంచుకొని, నిన్నునీవొక గొప్పవానిగా భావించుకొనకుము. అట్టి వరములన్నియును, బలహీనుడవై యున్న నీ సహాయము కొరకై దయామయుడగు దేవునిచే యనుగ్రహింపబడినవి. ఈ వరములన్నియును దేవుడు నీకు ఔదార్యముతో ననుగ్రహించియున్నాడు. అవియన్నియును, నీపాత్రతకు మించియున్నవి. నీవు సర్వేశ్వరుని కోగ్రము కలిగించెడు కార్యమునేదైన నాచరించినప్పుడు, అట్టి కార్యాచరణవలన నీవు దేవునియెడల కృతఘ్నుడవై యుంటివనియు, విశ్వాసఘాతకుడవనియు, నీహృదయమున చంచలత కలిగినప్పుడు నీవు మిక్కిలి దీనత్వమును వహించి, దేవుడు నీయెడల కనుబర

చిన ద్వేషమును యనుభవపూర్వకముగ గ్రహించి, భ్రమజెందవలసిన వాడవగుదువు.

నీవు దేవుని దివ్యసన్నిధానమును విడచి, దుర్మార్గములంబడి పారి పోవుచుండినను, నిన్ను వారు వెతకుకొనుచువచ్చి, వారి వరప్రసాదములకు నీవేమాత్రము నర్హతలేనివాడవై యుండినను, వాటినన్నిటిని, నీకనుగ్రహించి మంచిమార్గమున నడిపించుకొని పోవునట్టి దయాపరిపూర్ణుడగు దేవునియెడల, ద్వేషబుద్ధితోడ ప్రవర్తించి వారికి కోపమును కలిగించి నందుకుగాను, మనస్తాపపడి నిష్కపటివై హృదయ పరితాపమును పొందుచు తిరుగ దేవుని దివ్యసముఖమునకరిగి, నీచే యాచరింపబడిన దోషకృత్యమును క్షమించుమనియు, అట్టి దుష్కృత్యమునకుగాను, నిన్ను శిక్షించి, వారికోపమును చల్లార్చుకొనుమనియు వారిని ప్రార్థింపుము.

---

## 11వ అధ్యాయము

### బాధలను ప్రేమించువారలసంఖ్య మిక్కిలి స్వల్పము.

1. జేసునాథుని మోక్షరాజ్యము ఆశించు వారలనేకులు గలరు. కాని వారిశ్లీవను మోయుటకు కొలదిమందిమాత్రమేయిష్టపడుచున్నారు. అనేకులు సంతోషము ననుభవింప కోరుచుందురుగాని, జేసునాథుని కష్టముల ననుభవింప నిచ్ఛగించువారిసంఖ్య కొద్ది. అనేకులు జేసునాథునితో సహాపంక్తిని యాసీనులై విందులనారగింప గోరుదురుగాని, వారివలె యుపవాసము చేయ ఇష్టపడువారు కొలదిమందిమాత్రమే కలరు.

జేసునాథుడు రొట్టెను విరచి పంచిపెట్టువరకు, వారివెంటనంటి పోయెడువారు పెక్కుమందిగాని, వారనుభవించియున్న, కష్టములనెడు పానపాత్రితో, వారితోగూడ పాల్గొనదలచువారి సంఖ్య స్వల్పము.

జేసునాథుని అద్భుతములనుగూర్చి ధన్యవాదములర్పించెదరు. కాని వారు మానుపైని కొరతవేయబడినప్పు డనుభవించియున్న యవమానముల ననుభవింప నిచ్ఛగలవారు మిక్కిలి కొద్దిమంది. తమకు

విపత్తు రాకుండునంతకాలము, పెక్కుమంది జేసునాథునియెడల ప్రేమ కలిగియుందురు. వారి యాదరణలను పొందుచుండునంతకాలము, వారిని శ్లాఘించుచుందురు. అయితే జేసునాథుడు కొద్దికాలమువరకు కనుపించక మరుగైయున్నచో, వారినిగూర్చి మొరపెట్టుకొనియెదరు. లేదా, నిరాశ జెందుదురు.

2. తమయూరట ఆదరణ కొరకుగాక, కేవలము జేసునాథస్వామి కొరకై వారిని ప్రేమించువారు, తామెక్కువగ యాదరింపబడినప్పుడు వారిని స్తుతించినదానికన్న కష్టము లనుభవించునప్పుడును, హృదయ వేదనల ననుభవించునప్పుడును, వారిని ఎక్కువగ స్తుతించెదరు. వారి నెన్నడును స్వామి ఆదరింపకున్నను కుస్తరింపకున్నను, వారుమాత్రము జేసునాథుని సదాకొనియాడుచు వారికి, వందనములర్పించు చుండెదరు.

ఆహా ఎట్టి మనస్వప్రయోజనము కొరకుగాని ఎట్టి స్వంతక్షేమము కొరకుగాని కేవలము జేసునాథస్వామిని ప్రేమింపవలయునను, సంకల్పముతోడనే వారిని ప్రేమించినయెడల, అట్టి పవిత్రప్రేమ యెంత శక్తివంతమై యుండును!

సర్వదా ఆదరింపబడవలయునని యాశించువారలందరును, కూలి వారలనియే పిలువబడవలయునుగదా? ఎల్లప్పుడును స్వభావముల స్వసంపాదనలనుగూర్చి మాత్రమాలోచించుచు కొనుచుండెడి వారలందరును స్వప్రేమ గలవారలేగాని, జేసునాథుని ప్రేమించువారలు కారనువిషయమును విశదపరచుచున్నారుకదా?

ప్రతిఫలాపేక్ష లేకుండ దేవుని ప్రేమించుమానవుల నెచ్చట గాంచజాలుదుము?

4. సర్వ పరిత్యాగమొనరించునంతటి జ్ఞానవంతుని, మనము మిక్కిలి యరుదుగమాత్రమే చూడగలుగుదుము. ఏలయన? దీనభావము వహించియున్న యాత్మకలవాడై, సృష్టివస్తువులయెడల ననురాగమంతయు విసర్జించిన మానవుని కనుగొనజాలువారెవరు?

మిక్కిలి దూరదేశములలో దూరసముద్ర ప్రాంతములలో వెదకి సంపాదించిన ధనమునకు వానిని పోల్చవచ్చును. మానవుడు తాను కలిగియున్న దానినంతయును దానముచేసినను, అది స్వల్పకార్యమే

సుమా? సర్వజ్ఞానము కలవాడైనను అతడు నేర్వవలసినదింకను చాల గలదు. కఠిన తపమాచరించినను అదియును ఘనకార్యము కాదు. ఎక్కువ సద్గుణసంపన్నుడైనను మిక్కిలి భయభక్తులతో గూడిన దైవ ధ్యానరుడైనను, అతడు ఇంకను నెరవేర్చవలసినది చాలయున్నది. అనగా అతనికి అన్నిటికన్న అగత్యముగ నెరవేర్చవలసిన కార్యమొకటి కలదు. అది ఏదన,

సర్వ పరిత్యాగమొనర్చిన పిమ్మట తనను సైతము విసర్జించుకొని లేశమాత్రపు స్వాభిలాష లేనివాడై యుండుటయే.

కాబట్టి తాను నెరవేర్చవలసిన సర్వకార్యములను చేసినపిమ్మట, తానేమియు చేయలేదని తలంపవలయును.

5, ఇతరులవలన ఘనమైనదిగ నెంచబడినదానినిగూర్చి, గొప్పగా నెన్నకుండుగాక. వాస్తవముగా తాను వ్యర్థుడైన సేవకుడని భావించు గాక. "మీకాజ్ఞాపింపబడిన కార్యములన్నియు నెరవేర్చినపిమ్మట నిష్ప్రయోజకులమగు సేవకుల"మని భావించుకొనుడు. అని సత్య స్వరూపియైన సర్వేశ్వరుడు వక్కాణించియున్నాడు.

తనను ఐహికవిషయములనన్నిటిని విసర్జింపను, అధమస్థానము నాక్రమింప తెలిసినట్టి మానవునకన్న నెక్కువ భాగ్యశాలియు, పరాక్రమశాలియు యెక్కువ స్వాతంత్రము గలవాడునగు మానవుడు లేడు. అటుల భావించునప్పుడే అతడు మనోదరిద్రుడుగను, పరిత్యాగిగ నుండగలుగును. "నేను ఏకాకిని దీనుడ"నని దావీదురాజు దీర్ఘ దర్శితో కలసి చెప్పవచ్చును.

---

## సారాంశము

"నన్ను ప్రేమించుటకంటె నెక్కువగ తనతల్లిని లేక తండ్రిని ప్రేమించువాడు నాకు తగిన యనుచరుడు కాడు."

"నన్ను ప్రేమించుటకన్న నెక్కువగా తన కుమారుని లేక కొమార్తెను ప్రేమించువాడు నాకు తగినభక్తుడు కాజాలడు."

"మానవుడు నాకొరకై తానను భవింపవలసిన కష్టముల ననుభవించుచు, నన్ననుసరించి ప్రవర్తింపడో, వాడు నాకు తగినవాడు కాడు"

"తన ప్రాణమునుమాత్రము కాపాడుకొనదలచువాడు దానిని పోగొట్టుకొనును"

నా కొరకై నెవడు తన ప్రాణముల కోల్పోవునో, అతడు తిరుగ తన ప్రాణమును సంపాదించు కొనజాలును" (మత్తై. 10 వ. అ-37 వ.)

"ఏ మానవుడైనను నన్ను అనుసరించి వెంబడింపగోరునో ఆత్మ నిగ్రహము గావించుకొని, సర్వ కష్టముల ననుభవించుటకు సంసిద్ధుడై నా వెంట రావలయును"

"ఏ మానవుడైనను నా దరికి వచ్చియుండియు, తన తల్లిదండ్రులను, భార్యను సంతానమును అన్నదమ్ములను అక్కచెల్లెండ్రును తన ప్రాణమును సైతము ద్వేషింపకుండునేని, అట్టి మానవుడు నాకు తగిన శిష్యుడు కాజాలడు" అదేరీతిని మీలో ప్రతివాడును తనకు గలిగియున్న దంతయును త్యజించని యెడల, నా శిష్యుడుగ నుండుటకు వీలు లేదు. (మార్కు 8 అ-34 వ)

స్వయంభువును పరిపూర్ణ జ్ఞానస్వరూపియునగు సర్వేశ్వరుడు బోధించిన, పై సత్య సూత్రములన్నిటి తన మానసమునం దుంచుకొని, యీ పుస్తకమునం దీ యధ్యాయమును వ్రాయునప్పుడు పావనచరితుడగు మన గ్రంథకర్త తన నీతి సూత్రములను తెలియపరచి యున్నాడు.

a) సకాలములో యిప్పుడే జేసునాథుని ప్రేమించుచు, వారివలెనే మనమును పాపపరిహారార్థమై కష్టముల ననుభవించుటకు తయారై యుండవలెను.

b) సర్వ పరిత్యాగము కావించుకొనవలయును. ఐహిక విషయములను విసర్జింపవలయును.

c) మనలను సైతము విర్జింపవలయును.

d) సృష్టియందలి సర్వవిషయములనుండి తొలగియుండ వలయును.

e) మన గ్రంథకారుడు విమర్శించి బోధించిన రీతిని స్వక్షేమమును లేశమాత్రమైనను పాటింపరాదు.

f) ప్రతి మానవుడును తానొక నిష్ప్రయోజకుడగు సేవకుడని భావించుకొనవలయును.

g) తానందరిలో అధముడనని భావించుకొనవలయును.

---

## 12 వ అధ్యాయము

## స్లీవ ప్రమానుపై కఠినబాధల ననుభవించియున్న దైవ పురుషుడగు జేసునాథస్వామిని దర్శించుటకు మహోన్నతమగు రాజమార్గము.

"స్లీవనెత్తుకొని జేసునాథుని వెంబడింపుము." స్వపరిత్యాగ మొనరించుకొనుమని చెప్పబడిన యీ వాక్యము పలువురకు మిగుల కఠినముగ తోచుచున్నది. (మ. 16 అ-24 వ)

శపింపబడిన పాపులారా! నా దగ్గరనుండి వెళ్లిపొండు. శాశ్వత నరకాగ్నియందు దహింపబడుడు. (మ. 25 అ-41వ) అను నీ కడాపటి వాక్యము వినుట కంతకన్న యెక్కువ కఠోరముగ నుండును. స్లీవ ప్రమానుమీద బాధల ననుభవించిన జేసునాథుని యుపదేశములను మన స్ఫూర్తిగ నాలకించి, వారి యుపదేశముల ననుసరించి జీవించువారలందరును, అప్పుడు పాపాత్ములకువచ్చు భయంకరతీర్పును వినుటకు భీతి జెందరు.

న్యాయ తీర్మానములను చెప్పుటకు మనదివ్యకర్త దయచేయునప్పుడు స్లీవయొక్క గుర్తు ఆకాశమున నిలిచియుండును. అప్పుడు జేసునాథుని ననుసరించి తమజీవితకాలమున ప్రవర్తించిన వారిసేవకులందరును, తమ న్యాయ విమర్శనాధికారియైన జేసునాథుని యెద్దకు మిక్కిలి విశ్వాసముతో నేతెంచెదరు.

2. పరలోక రాజ్యమునకు స్లీవ మార్గమైయుండ, దాని మోయ నీవేల భయపడెదవు? స్లీవయందే రక్షణముగలదు. శత్రువులబారినుండి తప్పించుకొన ప్రాపకముకలదు. స్లీవయందే పరలోక మాధుర్యము

కలదు. స్లీవయందే మానసికబలము కలదు. స్లీవయందే ఆత్మసంతోషము గలదు. స్లీవయందే పుణ్యమహోన్నత్యము కలదు. స్లీవయందే పరిపూర్ణ పావనత్వము కలదు.

3. స్లీవయందు వినహా ఆత్మస్వస్థత కలుగదు. శాశ్వతజీవము పొందుదుననను నమ్మకము లేదు. కనుక స్లీవను ఎత్తుకొని జేసునాథుని వెంబడించితివేని, సతతజీవములోనికి ప్రవేశించుదువు. నీవును స్లీవను మోయుటకును స్లీవపై మృతిపొంద ఆశించుటకును, జేసునాథుడు తమ స్లీవను మోసుకొని నీకుముందుగా సాగిపోయి, నీకొరకై స్లీవపై మరణము నొందిరి. ఏలయనగా ? నీవును వారితోగూడ మరణించినయెడల నీవును వారితో శాశ్వతముగ జీవింప జాలుదువు.

కష్టానుభవములందు వారితో పాల్గొందువేని, అట్టి కష్టానుభవము వలన వారికి లభ్యమైన యశస్సునందును నీవును భాగస్వామివయ్యెదవు. ఇదిగో స్లీవభారమును మోసికొని దానిపై మరణించుటయందే సకల భాగ్యములు కలవు. పరిశుద్ధ స్లీవమార్గమును దైనందిన త్యాగమార్గమును తప్ప నిత్యజీవమునకును, యథార్థమైన ఆంతరంగిక సమాధానమునకు వేరొండు మార్గము లేదు.

నీయిచ్ఛవచ్చిన స్థలముల కరుగుము. నీయిచ్ఛవచ్చిన విషయములను వెదకుము; స్లీవమార్గమునకన్న ఉన్నతమైన మార్గముగాని సురక్షితమైన మార్గముగాని ఇహపరలోకములం దెచ్చటను లేదు. నీ యిష్టము వచ్చినరీతిని మిక్కిలి యుత్తమని నీకు తోచిన పద్ధతిని, సర్వ విషయములను పరిష్కరించుకొని, క్రమముగ నుంచుకొనినను, నీకు యిష్టమున్నను లేకున్నను, ఇంకను ఏదోకొంత బాధననుభవించవలసియున్నదని కనుగొనెదవు. అదేరీతిగ స్లీవ నీ కెల్లప్పుడును ఎదురుపడును. ఏలయనగా ? నీవు శరీరకష్టము పడవలసి వచ్చును. లేదా, ఆంతరంగికమున ఆత్మసంబంధమగు సంకటముల ననుభవింప వలసియుండును.

4. కొన్ని సమయములయందు దేవుడు చెయివిడుచును. మరికొన్ని సమయములలో నీ యిరుగు పొరుగు వారలె నిన్ను కష్టములపాలు చేసెదరు. అన్నిటికంటే యెక్కువైనది ఏదియన ? తరచు నీకునీవే భారమగుదువు. ఆ కష్టములనుండి నిన్నెవరును విముక్తి నొందింపజాలరు.

అట్టికష్టముల మానృజాలు యుపాయము యుండబోదు. అట్టి కష్టముల యందు నీకు యూరటయు లేదు. దేవుని చిత్తమైనంతకాలము నీవు ఓర్పుతో సహించుట ఉచితము. ఏలయనగా? ఆదరించు వారలెవ్వరును లేనివాడవై, నిన్ను నీవు తమకు పరిపూర్ణార్పణము గావించుకొని, సంకటానుభవములవలన నింకయెక్కువగ దీనత్వమును వహించి, కష్టములను సహించుట నీవు నేర్చుకొని యుండవలయునని దేవుడు కోరుచుండును.

క్రీస్తునాథుని పాట్లను పోలిన బాధలను అనుభవించినవాడు తప్ప, మరియొకడు జేసునాథుని వేదనలయెడల సానుభూతి గలిగియుండడు. గనుక స్లీవ యెల్లప్పుడును సిద్ధముగనుండును. అదియెల్ల చోటులను నీకొరకు కనుపెట్టుకొని యుండును. నీ వెచ్చటికి పారిపోయినను, దాని నుండి తప్పించుకొన జాలవు. నీవెచ్చటికేగినను ఆస్లీవ కష్టములన్నియును నిన్ను వెంబడించుచునే యుండును.

నీవు ఎటుబోయినను నీభారమును నీవు మోయుచున్నావు; నిన్ను నీవు కనుగొనుచునే యుండెదవు. పైన చూచినను క్రిందచూచినను, లోపల చూచినను, అన్నిచోట్ల స్లీవ నీ కెదురుపడును. మరియు నీవు ఆత్మ సమాధానము కలిగి నిత్యకిరీటము పొంద పాత్రుడవుగ నుండకోరితివేని, ఏచోటను ఓర్పుతో వర్తించుట అగత్యము.

5. నీవు స్లీవను సంతోషముతో మోసిన అదియు నిన్ను నీ జీవితాశయము కడకు అనగా లోకబాధ లన్నిటికిని అంతమొందించు స్థలమునకు మోసికొనిపోవును. అయిష్టముతో దానిని మోసితివేని దానిని భారముగ చేసికొని ఎక్కువ బాధ కలుగ జేసికొనుచున్నావు. ఐనను దానిని నీవు మోయక తప్పదు. ఒకస్లీవను మోయ నిష్టపడక క్రిందపడవేసిన, నిస్సందేహముగ మరియొకటి ఎదురు పడును. బహుశ యిది యింకను ఎక్కువ భారమైనదిగ నుండవచ్చును. మానవుడెవ్వడును తప్పించుకొనజాలని దానిని నీవు తప్పించుకొనజాలుదువని తలంచెదవా? ఎప్పుడైన నీ ప్రపంచమునందు తన కష్టములను వ్యసనములను తప్పించుకొనజాలిన పుణ్యపురుషు డెవ్వడైన నుండెనా? మన ప్రభువగు జేసునాథుడు సహితము, తన జీవితకాలమున కష్టము లనుభవింపకుం

దినని ముష మొకటియైనను లేదు. జేసునాధుడు కష్టము లనుభవించి, మూడవ దినమున మరణించిన వారలలోనుండి తిరుగలేచి, తనమహిమలో ప్రవేశింపవలసినది అగత్యమని వారేవక్కాణించియున్నారు. అటులైన పరిశుద్ధ స్లీవమార్గమగు ఈ రాజబాటను విడిచి, మరియొక త్రోవన నడువ తలంచుదువేల?

6. జేసునాధుని జీవితమంతయు యాతనలతో గూడిన స్లీవమీద జీవితమై యుండెను. అట్టి సందర్భమునందు,నీవు విశ్రాంతియును, సంతోషమును, యనుభవించు చుండవలయునని కోరుచున్నావా? కష్టము లనుభవింపవలయునని కోరకొనుటకంటె, యితరము నేదైనను యాశించుదువా? నీవు మోసపోయెదవు.

ఏలయనగా, చావవలసియున్న మానవునియొక్క యీ జీవితకాలమంతయును దురితములతో నావరింపబడి యున్నది. అన్నిదిశలను సంకటములు చుట్టుకొనియున్నవి. మానవుడు ఆత్మజీవనమునం దెంత ఎక్కువ అభివృద్ధిని గాంచునో, అంత యెక్కువగా యాతన లనుభవించును. ఏలయనగా, దైవము నెంతగా నతడు ప్రేమించునో, దేవుని యందు అంతగా పూర్ణ ఐక్యతను ఆశించుచు, అట్టి దింకను పరదేశమైన యీ లోకమున లభ్యము కాదని ఆరాటపడుచుండును.

7. ఐనప్పటికిని పలువిధములగు సంకటముల ననుభవించుచున్న యీ వ్యక్తి కొంతమట్టుకైనను ఊరట కలిగియే యుండును. ఏలయనగా, ఎప్పుడావ్యక్తి ఇష్టముతో కష్టముల ననుభవించుటకు అంగీకరించుచున్నాడో, అప్పుడు సంకటమువలని భారమంతయును మారి, దేవుడు సంతోషమును పాలించుదురను నమ్మకమును వానియందు జనింపచేయుచున్నది. బాధలవలన శరీరమెంతకృశించునో,అంతగ ఆత్మ ఆంతరంగిక దేవ వరప్రసాదముచేత నింపబడును. స్లీవ మ్రానిమీద వెతల ననుభవించుచున్న జేసునాధుని బోలియుండవలయునను ఆశవలన బాధలను విపత్తుల ననుభవింప అభిలషించుచున్నది. ఎట్టిబాధయు లేకుండయుండ యిష్టగింప కుండునంతటి బలము ఆత్మకు పలుమారు కలుగుచున్నది.ఎందుకన అట్టియాత్మ తానెంత కష్టముల ననుభవింప గలిగియుండునో,అంతగ దేవునికి ప్రియపడుదుననెడి గాఢవిశ్వాసము గలదియై యుండును.

8. ఇట్టి ఘనకార్యములు జేసునాథుని దయా ప్రభావముచే, సాధింప బడుచున్నవి. గాని మానవ మాత్రుని శక్తి సామర్థ్యముల వలనగాదు. మరియు సహజముగ దేహధారియగు మానవుడు యేవిషయముల నస హ్యించుకొనుచు వాటినుండి దూరముగ తొలగి చనుచుండునో, యట్టి విషయములను సైతము మానవుడు దైవ ప్రేరేపణల వలన ప్రేమించి, యాలింగనము చేసికొనుచున్నాడు.

9. క్లీవ మెాయుటయు కష్టములను అవమానముల ననుభవించు టయు, అట్టి యనుభవమునందు ప్రీతిగలిగి యుండుటయు, తన శరీర మును దండించుకొని తన వశమునందుంచుకొనుటయు, గౌరవ మర్యాద లను కోరక, వాటన్నిటికి విముఖుడై తొలగియుండుటయును, పరులు తననుగూర్చి పల్కెడు దూషణ వాక్యములను, తనయం దారోపించెడు యపవాదములను సంతోషముగ సహించి యుండుటయు, తన్ను తాను త్యజించికొని యుండుటయును, యితరుల వలన తాను అధముడుగా నెంచబడుటకు యిష్టపడి యుండుటయును, సర్వదురదృష్టములను, నష్టములను నోర్చుకొనియుండుటయు, ప్రపంచ సంపద లేవియునుకోర కుండుటయు, నివి యన్నియును మానవునికి ప్రీతికరమైనవిగావు.

ఇట్టి ప్రవర్తన గలవారై యుండుటకు కేవలము స్వశక్తి మీదనే విశ్వాసముంచుకొని, ఆధారపడి యుందువేని, వీనియందు కనీసమొక్క విషయమును సైతము నీ యంతట నీవు నిర్వహించుకొన జాలవు. అయితే నీవు దేవునియందు విశ్వాసము కలిగియుంటివేని, మోక్షము నీకు తగినంత బలము ప్రసాదించును. ప్రాపంచక విషయానురాగములను, ఇంద్రియము లను, జయింపజాలుదువు. జేసునాథుని జీవితానుసరణిని వర్తించుచు, వారి యెడల గాఢ విశ్వాసమనియెడు కవచము ధరించితివేని, నీ శత్రు వును పిశాచమునుగాంచి లేశమాత్రమేనియు భీతిలేనివాడవై యుండెదవు. నీ యందలి ప్రేమచే క్లీవమానిపై జేసునాథుడనుభవించిన కష్టములను, యవమానములను అపనిందలను, ధైర్యముతో సహించియుండుటకు గాను, యోగ్యుడగునట్టియు, జేసునాథస్వామియందు విశ్వాసము కలిగి యుండునట్టియు, సేవకునిగా నిన్ను నీవు తయారు చేసికొనుము.

10. దౌర్భాగ్యమగు నీప్రపంచ జీవితమునందనేక దురవస్థలను, పలు విధములగు కీడులను అనుభవించుటకు సంసిద్ధుడవై యుండుము. ఏలయ

నగా? నీవెచ్చటనుండినను, యీ దురవస్థలు కీడులు మొదలగునవన్నియు నీవెంటనంటి వీడక వచ్చుచునే యుండును. నీవెచ్చటదాగి యున్నను, నీకవి ఎదురుపడుచునే యుండును. అదినిశ్చయము. అది యటులనే సంభవించుచుండవలెను. వాటిని శాంతముగ సహించుటతప్ప కష్టములను, దుఃఖములనుతప్పించుకొన వేరసదుపాయ మేమియును లేదు.

నీవు క్రీస్తునాథుని స్నేహితుడవైయుండ కోరుదువేని, వారనుభవించియున్న కష్టములు, అవమానములనియెడు పానపాత్రమును, సంతోషముతో త్రాగవలయును. దేవునికి యుక్తమని తోచినరీతిని, వారి యిష్టానుసారముగ నిన్నాదరింతురుగాక. అయితే కష్టములను సహించుటకు సంసిద్ధుడవై, అట్టికష్టములనే మిక్కిలి ఘనమగునట్టియు, దుఃఖోపశమనము లగునట్టియు యూరటలుగా నెన్నుకొనుము. ఏలనందువా? ఈ ప్రపంచ జీవితమునందు, నీవుమాత్రమే యట్టి ప్రాపంచిక కష్టములన్నిటిని అనుభవింప జాలియుండియు, యట్టి యనుభవము వలన, నీకు ముందురానున్న యశస్సునకు యవి సమానములు కావు.

11. క్రీస్తునాథుని ప్రేమకొరకై నీవనుభవించెడు దురితములు, నీకు మధురముగను, రుచికరములుగ నుండునట్టి స్థితికి నీవు వచ్చినపుడు, నీవు భాగ్యశాలివని యెంచుకొనుము. ఏలయనగా అప్పుడు నీకీలోకము నందే మోక్షభాగ్యము లభించిన వాడవగుచున్నావు. దురితము లనుభవించుట, నీకు మనోసంకటముగ నున్నంతకాలము, వానినుండి తప్పించుకొన యత్నించుచున్నంతవరకు, నీవు నిర్భాగ్యుడవుగనే యుందువు. నీవు భీతిచే తప్పించ్చుకొన చూచెడు దురితము, నీ వెంటనంటియే యుండును.

12 నీవెటుల తయారైయుండవలయునో, యటుల తయారైయున్నయెడల, అనగా కష్టావమానము లనుభవించుటకును, మరణము పొందుటకును సంసిద్ధుడవై యున్నయెడల, నీవచిరకాలముననే ఎక్కువ బాగుపడియెదవు. కొద్దికాలములోనే శాంతము ననుభవింపజాలుదువు.

ఆర్చ్య. చిన్నప్పగారితో గూడ, మూడవ మండలమువరకు, తీసికొనిపోబడి, అచ్చట పరమానంద పరవశుడవైయున్నను, దౌర్భాగ్య స్థితి ననుభవింపకుండ నుండునంత సురక్షితుడవై యుండజాలవు.

"నా నామముకొరకై యాతడెంత కఠినమగు, కష్టము లనుభ వింపవలయునో, నేను ఆయనకు చూపుదును" అని జేసునాథస్వామి చెప్పియున్నారు. గనుక నీవు జేసునాథుని ప్రేమింపదలచితివా? సదా వారికి సేవ చేయదలచితివా? నీవు కష్టముల ననుభవింప వలయును.

13 జేసునాథుని నామముకొరకై నీవు కొంతమట్టుకైనను, కష్టము లనుభవించుటకు ప్రాప్తుడవైయుండిన ఎంతో భాగ్యవంతుడవై యుందువు. అందువలన నీకు మహిమ కలుగును. అగ్ర్యశిష్టులందరును, మిక్కిలి యానందింతురు. అది నీపొరుగువానికిసైతము, గొప్ప సన్మాత్రకగ నుండును. శాంతము యుత్తమగుణమని సర్వజనులు పొగడుచుందురుగాని, కొలదిమందిమాత్రమే కష్టములసహింప అభిలాషగలవారై యున్నారు. ప్రపంచ విషయములకొరకై, యనేకులు చాలకష్టములననుభవించుచున్నారు. గనుక జేసునాథుని కొరకై నీవు మనస్ఫూర్తిగ కొంచెముపాటి శ్రమనైనను యనుభవించుట న్యాయమైయున్నది.

14 నీవు నిశ్చయముగ పూర్ణత్యాగముతోగూడిన జీవితమును జీవింప వలయునను అంశమును గ్రహించుము. మానవుడెంత యెక్కువగ నిగ్రహములొగడుపునో, యంతయెక్కువగ దేవుని ప్రేమయందు నిలచియుండుట కారంభించును. దేవునికై జీవింపనారంభించును.

, జేసునాథస్వామికొరకై విపత్తుల ననుభవించుటకు ఇష్టపడియుండనివాడు, పరలోక రహస్యములను గ్రహించుటకు తగిన యర్హత గలవాడుకాడు. జేసునాథునికొరకై, మనఃపూర్వకముగ, కష్టముల ననుభవించుటకన్న, నీకెక్కువ హితకరమగునదియు, భగవంతునకు మిక్కిలి యంగీకారమగునట్టిదియు, మరియొక విషయమయ మీ ప్రపంచమునందేదియును లేదు.

సుఖదుఃఖములలో నీయిచ్ఛవచ్చినదానిని, యేరుకొనుటకు నీకవకాశమే యుండునెడల, జేసునాథునికొరకై సంతోషము కలిగియుండుటకన్న, కష్టములనుభవించుటయే, నీవుకోరుకొనుటకు సంసిద్ధుడవై యుండవలయును. ఏలనందువా? నీవు జేసునాథుని బోలియుండజాలుదువు. పుణ్యపురుషులందరిని ఎక్కువగ ననుసరించియుందువు. ఏలయ

నగ పుణ్య ఫలితమును, మనస్థితియందలి యభివృద్ధియును, పలువిధములగు నానందములను గలిగియుండుటయందు లేదు.

ఐతే కష్టములను, సంకటములను, భరించుటయందు మాత్రమే కలవు.

15 కష్టములనుభవించుటకన్న. మానవునిరక్షణకు, ఉత్తమమును ఎక్కువ ప్రయోజనకరమైన, మార్గము మరియొకటి యుండినయెడల, జేసునాథుడు యామార్గమును మనకు బోధించి యుండువార లేసుమా? తనవలెనే కష్టములననుభవించుటకు తయారై, తనను వెంబడించిన తన శిష్యులకును, తనవెంబడింపవలయుననెడి కాంక్షగలవారందరును, ప్రత్యక్షముగ నగుపరచి తేటతెల్లముగ జేసునాథస్వామి బోధించినదేమనగా?

"ఎవడైనను నావెంటనంటి రావలయునని కోరినయెడల, అతడు తన్నుతాను నిగ్రహించుకొని, సిలువనెత్తుకొని నన్నువెంబడించ వలయును." అని బోధించి యున్నారు. (లు 9 అ-23 వ) కనుక అంశము లన్నియును చక్కగనేర్చుకొని, పరిశీలన గావించుకొనిన పిమ్మట "మన మనేక కష్టములగుండా, మోక్షమునకు చేరవలయును" అనెడు స్థిరసంకల్పమును గావించుకొనియెదము గాక.

---

## సారాంశము

కష్టములను, యవమానములను మానుపైని కొరతవేయబడిన జేసునాథునివలెనే సహించి, వారిననుసరించి, ప్రవర్తించుటకన్న మోక్షమునకు వేరొండు మార్గమేయున్నయెడల, మార్గదర్శియు, సత్యమూర్తియు, ప్రపంచమునకు ప్రాణమును నగు జేసునాథ స్వామియే నిశ్చయముగ నట్టిమార్గమును బోధించియే యుండువారు. వారు మనకే యితర మార్గమును బోధించి చూపియుండలేదు; అందువలన మరియొక మార్గమును మనము కనుగొనజాలము. పాపవిముక్తిని పొందగోరుదుమేని యీ లోకజీవితము నందైనను కష్టముల ననుభవింపవలయును. లేక యీ లోకమున, పరిహరింపబడని స్వల్పపాపము లేక, మన్నింపబడి పరిహారము నొందని చావైన పాపముల ఫలితము మరులోకమున ననుభవించి తీరవలయును.

దేవునియొక్క న్యాయతీర్మానము ననుసరించి, మనము కష్టము లనుభవించితీరవలయును. కష్టములు మనకన్నిస్థితులయందును ప్రాప్తించు చుండును. మనమెచ్చటికి పరిగిడిపోయినను, భారమైన కష్టములను మనవెంటను మనమే మోసికొని పోవుచుందుము. మోక్షసంపాదనకు కష్టములు మిక్కిలియోగ్యములైనవి; ఉపయోగకరములైనవి.

జీవితకాలమునందు హృదయశాంతియు, దేవుని కరుణాప్రసాదము, భగవదైక్యత, ఘనత, ఆనందము, యశస్సు, సౌఖ్యము వర్ణింప నలవిగాని శాశ్వతానందము, ఇవియన్నియును నసహాన గుణములు గలవారలకు, ప్రసాదించెదమని వాగ్దానము చేయబడియున్న, అపారమగు బహుమతులు. కష్టములను, పరాభవములను, సహించియుండ జాలుదుమేని, జేసునాథు ననుసరించి ప్రవర్తింపగలము. కనుక మనము మనకు సంప్రాప్తించుచుండు విఘ్నములతోడను, కష్టములతోను సరిపుచ్చుకొని వాటికనుగుణ్యముగ ప్రవర్తించు చుండవలయును.

శాంతమును, సంతోషమును, విధేయతను, నిగ్రహమును గలవారలమై కష్టము లనుభవించ వలయును. దేవునియొక్క న్యాయతీర్పు సరియైనదని చూపుటకును, మనపాపవిముక్తి కొరకును, శాశ్వతజీవితమును పొందుటకును తగినయర్హత గలవారలమై యుండుటకును, మనము కష్టము లనుభ వింపవలయును. ఎక్కువగ మనకొరకు, మనముక్తి సంపాదనకొరకు కష్టములును, అవమానములను అనుభవించిన జేసునాథుని ప్రేమకొరకై మనము కష్టము లనుభవించ వలయును. వారి కష్టములతో మనకష్టములను, వారి మరణముతో మన మరణమును చేర్చవలెను.

వారు ఎట్టి మానసముతో, ఎట్టిభావముతో, కష్టముల ననుభవించి మరణించియుండిరో, అదేరీతిని వారివలెనే అట్టిభావముతో కష్టముల ననుభవించి మనము మరణించవలయును. ఈ పెద్ద యధ్యాయమున చదివియున్న అంశములయందలి ఫలితము, సారాంశము లివియే. పైన పేర్కొనబడిన నీతి సూత్రములనుండి కారణయుక్తముగను, విశ్వాసముతోడను, మనము నిశ్చయపరచు కొనవలసిన ముఖ్యభావము లివియే. మనకు మనము నియమించుకొనవలసిన సాధన లివియే.



# క్రీస్తునాథుని అనుసరణము

## మూడవ భాగము



### 1 వ అధ్యాయము.

### జేసునాథస్వామి తనభక్తునికి చేయు అంతరంగిక యుపదేశములు.

"సృష్టికర్తయగు దేవుడు నాకుపదేశించునదంతయు నేనాలకించెదను" అని భక్తుడు చెప్పుచున్నాడు.

ఆంతరంగికముగా సర్వేశ్వరు డనుగ్రహించు ఉపదేశముల నాలకించుచు, అందుచే యూరటచెందుచుండు వాడదృష్టవంతుడు.

దేవుడు రహస్యముగ బోధించు నుపదేశ వాక్యముల నాలకించుచు, ప్రపంచానురాగములుగల వారలుపదేశించు విషయములను సరకుచేయని చెవులె దైవాశీర్వాదమును పొందును.

సత్యమూర్తియగు దేవుడు అంతరంగికముగ బోధింప ననుగ్రహించు సత్యవాక్యములను చెవియొగ్గివినుచు, బాహ్యప్రపంచ జనుల నుండి వినవచ్చెడి ధ్వనులను వినకుండునట్టి వీనులె యదృష్టవంతములైనవి.

ఐహిక విషయములను వీక్షింపక, ఆంతరంగిక విషయములను మాత్రము గాంచెడు నేత్రములే ధన్యములైనవి. అంతరంగిక విషయము లందుజొచ్చి, దినదినాభ్యాసమువలన నానాటి కెక్కువగ దైవరహస్యములను గ్రహింప ప్రయత్నించు మానవులే దైవాశీర్వాదములను పొందజాలుదురు.

దేవునియందే పరిపూర్ణ లక్ష్యమనస్కులై ప్రపంచ యాటంకములనన్నిటిని తప్పించుకొనియుండు మానవులే యదృష్టవంతులు.

నా యాత్మమా ! ఈ విషయములను మానసము నందుంచు కొనుము. నీ ఇంద్రియములను, వాని యిచ్ఛవచ్చినరీతిని సంచరింప నీయక అణచియుంచి, నీ ప్రభువగు దేవుడు నీకు అంతరంగికముగా నుపదేశించెడు సుబోధలను చెవియొగ్గి యాలకించుము.

2. నీ ప్రియుండగు జేసునాథుడు వక్కాణించు నదేమన? "నేనే మీరక్షణ, మీ శాంతము, మీ ప్రాణము; నాయందు వాసముచేయు వారు శాంతమును పొందుదురు.

క్షణకాలములో నదృశ్యములై పోవు ప్రపంచ విషయముల దరికి పోకుము. శాశ్వతమగు పరలోక విషయములను గూర్చియే శ్రమపడుము. అశాశ్వతములగు ప్రపంచ విషయములన్నియును మోసకరమైనవియే గదా ?

నీ సృష్టియే నిన్ను విసర్జించునెడల, సృష్టివస్తువుల వలన నీ కేమి లాభము చేకూరగలదు ? కనుక ప్రపంచవిషయముల నన్నింటిని విసర్జింపుము. నీ సృష్టికర్తకు ప్రియుడవుగ నుండునటుల ప్రవర్తింపుము. వారియెడల విశ్వాసముగలిగి యుండజాలుదువేని, నీవు నిజమగుసౌఖ్యము ననుభవింప శక్తుడ వగుదువు.

---

## సారాంశము

ప్రాపంచిక విషయములందు జోక్యమును కలిగించుకొనక, ఏకాంతవాసివై, శాంతముగ దైవ ప్రార్థనలు చేసికొనవలయునను నాసక్తిగలవాడవై, అంతరంగికముగ దేవుడుపదేశించు నీతుల నాలకించుటకై, ఆత్మనాయత్తము చేసికొనుము.

ప్రపంచ విషయములనుండి మానసమును వెనుకకు మరల్చి, దైవ చర్యలనుగూర్చి యోచించుకొనవలయునను భావములను విశ్వాసపూరితమగు ప్రేమతో నీయందు కాపాడుకొనుచుండుము. దైవ ఇష్టానుసారముగ ప్రవర్తించుటకై, నీ మానసము నెప్పుడును సిద్ధముచేసి యుంచుకొనుము.

దైవము మనకు తన దివ్యజ్ఞానమును ప్రసాదించి, మనతో ముచ్చటించుచుండును. తమ నీతి కనుగుణ్యమగు జీవితమున మనలను ప్రవేశ పెట్టుటకు పావనమగు భావములను మన హృదయములందు పుట్టించుచుండును.

ఐతే, మనము వారి యుపదేశముల నాలకించుటలేదు. మన యాత్మ పరిపూర్ణముగ ఇంద్రియానువర్తియై విషయాను రాగములచే కలవరపెట్టబడుచు, బాహ్యవిషయములయందే తగుల్కొని యుండుటచేత, అంతరంగిక జీవనమున యభివృద్ధినొందుటలేదు.

కావున, రక్షింపబడవలయునని కోరెడు ప్రతి క్రైస్తవుడును, దైవదృష్టియందు యోగ్యమని యెంచబడెడు కార్యములనే ఆచరించు చుండవలయును.

---

## 2వ అధ్యాయము

## సత్యస్వరూపి నిశ్శబ్దముగ మన అంతరంగమున ముచ్చటించును.

"ప్రభూ ! ఉపదేశింపుము. తమ సేవకుడు ఆలకించుటకు సిద్ధముగనున్నాడు" (రాజు: 3-10) నేను తమ సేవకుడను. తా ముపదేశించెడు ప్రామాణ్యములను గ్రహింపజాలెడు వివేకమును నాకు ప్రసాదింపుము. నా హృదయము తమ వాక్కుల నాలకించుటయందాసక్తి గలదై యుండునటుల చేయుము.

తమ దివ్యయుపదేశామృతము మంచువలె నాపై స్రవించునటుల కరుణింపుము. ఇంతకుముందు ఇశ్రాయేలు సంతతివారలు మోయిజుతో "మీరు మాతో మాట్లాడుడు. మే మాలకించెదము.

సర్వేశ్వరుడు మాతో మాటలాడునేని మేము మృతినొందుదుము" అని చెప్పియున్నారు. ఐతే నా దైవమా, నే నటుల చెప్పుటలేదు. నే నటుల ప్రార్థించుట లేదు.

సామువేలు దీర్ఘదర్శి చెప్పినట్టుల, స్వామీ! సేవకునితో ముచ్చటించుము. వినుటకు కని పెట్టుకొని యున్నానని" మిక్కిలి దీనతతో ప్రార్థించుచున్నాను.

మోయీజాగాని మరి యితర దీర్ఘదర్శులుగాని నాతో మాటాడుట నాకిష్టము లేదు.

సృష్టికర్తా! దీర్ఘదర్శుల కందరకును జ్ఞానదృష్టిని దయచేసి, జ్ఞానవికాసమును కలిగించిన తమరేనాతో మాటలాడుడు. ఏలయనగా దీర్ఘదర్శుల తోడ్పాటు లేకనే తాముమాకు సంపూర్ణముగా బోధింపగలరు. తమ జోక్యము లేనిచో దీర్ఘదర్శులవలన నాకేమియును ప్రయోజనము పొసగదు.

2 పదప్రయోగమున వారు మహాజ్ఞానవంతులు కావచ్చును; కాని సజీవభావములను నాకు వారు అందజేయజాలరు.

వారి పదములకూర్పు అతిమధురము కావచ్చును, గాని తాము మౌనము వహించినచో వారు నాహృదయమును స్నేహజ్వాలలచే దీప్తినొందింపజాలరు.

వారు పదజాలమును మాత్రము సమకూర్పగలరు; కాని తమరు గుప్తార్థమును ప్రకటితము గావించుదురు. వారు గూఢవిషయములను ప్రచురపరచెదరు; ఐతే యావిషయములయందు గుప్తముచేయబడి యున్న పరమరహస్యములను తాము విశదీకరించెదరు.

వారు తమయాజ్ఞలను చాటించెదరు. కాని అట్టియాజ్ఞల ననుసరించి వర్తింపజాలుశక్తిని దయచేయువారు తమరు. జ్ఞానమార్గమును చూపువారు మాత్రమువారు; కాని యట్టిమార్గముల ననుసరించిపోవుటకు తగిన బలమును దయచేయువారు తమరు.

వారిచర్యలన్నియుబహిర్గతములు. కాని తమరు మాహృదయముల కుపదేశము గావించి, వానినివికసింపచేయుదురు. వారు ఆత్మవృక్షమునకు నీటిపారుదల మాత్రము గావించుదురు; అయితే తమరు ఆవృక్షము పెరిగి ఫలభరితమగునట్లు చేయుదురు. వారు మాటలచే మాత్రముఘోషించుదురు; కాని తమరు అర్థగ్రహణశక్తిని ప్రసాదించుదురు.

3 నేను బహిరంగముగా మాత్రము ప్రబోధింపబడి ఆంతరంగికముగ, దైవభక్తి విశ్వాసములచే ప్రదీప్తుడను కానిచో, నిర్జీవుడనై, నిష్ఫలుడనగుదును. కాన శాశ్వతమూర్తియగు స్వామీ! మోయాజు కాదు; తామే నాతో సంభాషింపుడు. తమ వాక్యమును వినియు, అనుసరించుట లేదు; తెలిసికొనియు ప్రేమించుటలేదు. విశ్వసించియు ప్రవర్తనలో వ్యక్తము చేయుటలేదను ఖండనకు నేను గురిగాకుండుటకై, ఓ సర్వేశ్వరా! మీరే నాతో సంభాషింపుడు. నేను తమస్వరమును ఆలకించుటకు సంసిద్ధుడను. ఏలయన, తమవాక్యములు శాశ్వత జీవన ప్రదాయకములు.

నా యాత్మకు నెమ్మదికలుగునట్లును, చక్కగా దిద్దుకొని కల్మషరహితముగ నొనర్చుకొనుటకును, సర్వకాలమును తమ్మును స్తుతించి తమ మహిమను, ఖ్యాతిని సర్వదా వర్ణించు కొనుచుండుటకును, స్వామీ! నాకు మీనీతి సూత్రముల నుపదేశింపుడు.

---

## సారాంశము

సర్వేశ్వరా! మిక్కిలి శక్తివంతములగు నీతివాక్యములను మా హృదయముల కెక్కించి, మాకు మనోవికాశమును కలిగింప కనికరింపని యెడల, మీ వాక్కులు మా కర్ణములందు ప్రవేశించినను ప్రయోజనము లేదు. ఈ యంశమునే దివ్యపరప్రసాదములను పొందియున్న అర్చ్య॥అగుస్తీను వేదశాస్త్రి పలుమారులు బోధించియున్నారు. క్రీస్తుమతమునందలి యీగొప్ప నీతిసూత్రమును గురించియే మనమీ అధ్యాయమున చదివియున్నాము. సహజముగ మనమీ నీతిసూత్రమునుండి యూహింపవలసిన పర్యవసానమును మన మనుష్ఠింపవలసిన సాధనము లేవియనగా;

మానవులు తాము వ్రాసియున్న రచనల ద్వారా బహిరంగముగ మనకు ప్రపంచ విషయములను చూపుచున్నారు. తాము బోధించు వాక్యములను మనకర్ణములందు జొనుపుచున్నారు. దైవ సహాయము లేనిది అట్టిరచనలవలనను, ఉపన్యాసము వలనను ఫలమేమియు లేదు. కనుక మునుముందు మనము దేవునియెదుట సాష్టాంగపడి, ఆంతరంగిక

నీతిబోధనలను దయచేయుడని వారిని ప్రార్థింపనిది మనము ప్రపంచ మానవులిచ్చెడు మతధర్మాది విషయములను గూర్చిన యుపన్యాసములు నిరర్థకములు. వానిని వినినను గ్రహింప జాలము. గ్రహించినను అనుసరింప జాలము.

---

## 3. అధ్యాయము

### దీనత్వమును వహించి విధేయులమై దైవవాక్కులనాలకింపవలయును. పలువురు, బోధనల నాలకించుటలేదు.

జేసునాథస్వామి:- కుమారా! నావాక్యము లాలకింపుము; అవి అతిమధురములు. తత్వశాస్త్రజ్ఞుల పాండిత్యముకన్న ప్రపంచజ్ఞానుల వాక్యములకన్న అతిశ్రేష్ఠములు.

నేను మీకు బోధించెడు వాక్యములన్నియును జ్ఞానదాయకములు. నా వాక్యములందు ప్రాణముగలదు. మానవదృష్టితో నా వాక్యామృత మాధుర్యమును కనిపెట్ట జాలరు.

కేవలము విలాసార్థమై నా బోధనలను దుర్వినియోగపఱచక, శాంతచిత్తముతో ధైర్యానురాగమనస్కులై, మీరు నాయుపదేశముల నాలకింపవలయును.

శిష్యుడు:- ప్రభూ! ఏ మానవునకు తాము నీతిబోధనము చేయుచున్నారో, మీ న్యాయసూత్రముల నెరింగించుచున్నారో ఆ మానవుడే యదృష్టవంతుడు. దుష్కాలములయం దాతనికి విశ్రాంతిగను లోక జీవితమునందు అండగ నుండుటకు మీరు సమ్మతించుచురు.

3. జేసునాథస్వామి:- ఆరంభమునుండి నేటివరకు దీర్ఘదర్శుల కందరికిని బోధించుచున్నది నేనే. నే నిప్పుడందరికి నుపదేశములనిచ్చుచున్నాను. ఐయితే పెక్కుమంది మనో కాఠిన్యమునుపూని నా బోధనలను పెడచెవిని బెట్టుచుందురు. మానవులలో పెక్కుమంది లౌకికానురాగములందు నిమగ్నులైన మానవుల మాటలనే దైవవాక్యములకన్న నెక్కువ కాంక్షతో వినుచున్నారు. ఇంద్రియానురాగముల వెంట

వంటిరయె పరుగిడుచున్నారు. మిక్కిలి యోగ్యమగు సర్వేశ్వరుని ఇష్టానుసారముగ ప్రవర్తించుట లేదు.

ఈ లోక సంపదలు అల్పములు, క్షణికములు, కాని వాని సంపాదనలో మానవులెంతో పట్టుదలను జూపుదురు. దివ్యములును, ప్రశస్తములును, శాశ్వతములు నగు విషయములను నేను వాగ్దానము చేయుచున్నాను. అయితే మానవుల హృదయములు లేశమాత్రమైనను చలించుట లేదు. భూపాలురను గౌరవించి సేవించు విధమున నే మానవుడు నా వాక్యమును శిరసావహించి నన్ను అర్చించుచున్నాడు?

"ఓ సీదోన్ నగరమా! సిగ్గుపడుము." అని సముద్రము ఘోషించుచున్నది. ఇటులేల జరుగుచున్నదని ప్రశ్నింతువా? చెప్పుచున్నాను, ఆలకింపుము. అల్పాదాయముకొరకై మానవు లతిదూర ప్రయాణములు చేయుచు పరుగిడుచున్నారు. కాని శాశ్వతజీవితముకొరకై అనేకులు తాము నిలచియున్న స్థలమును విడిచి తుదకొక యడుగైనను కదల్ప ప్రయత్నింపరు. స్వల్పలాభముకొరకై మానవులాశ పెట్టుకొని ప్రయాశ పెట్టుకొని ప్రయాసపడుచున్నారు. ఒక్క రాగిడబ్బుకొరకై కొన్ని సమయములందు సిగ్గువిడనాడి తగవులాడెదరు.

లవమాత్రపు లాభముకొరకును లేక యితరులెవరైన మిక్కిలి స్వల్పమగు యాశను కలిగించినంత మాత్రమున దానికొరకు రాత్రింబవళులు శ్రమపడుటకు వెనుదీయరు.

4. ఐతే, శాశ్వత సంపదకొరకును, అమూల్య బహుమానముకొరకొను, మహోన్నతమగు ఘనతకొరకును, నాశనరహితమగు మహిమకొరకును మానవులు లవమాత్రమైనను శ్రమపడుట కిష్టములేని వారలై యున్నారు. సోమరిపోతులై, సర్వదా సణుగుకొనుచుండెదు సేవకా! నీవు శాశ్వతముకొరకు పడుచున్న శ్రమకన్న కొంతమంది మానవులు తమ వినాశనముకొరకై పడుచున్నపాటులే చాల యెక్కువ.

సత్యాన్వేషణమున నీవు వెల్లడించు నుత్సాహముకన్న నిష్ప్రయోజనకరమగు విషయముల సాధించుటలో వారలెక్కువ ఆశక్తిని వ్యక్తపరచుచున్నారు.

కొన్నివేళలందు వారు ఆశాభంగులై పోవుచున్నారు. కాని, నా వాగ్దానములవలన మోసపోవువార లెవ్వరును లేరు. నన్ను నమ్మియున్న వాని నెవ్వరిని నే నెన్నడును వ్యర్థముగ పంపివేయుటలేదు.

నా ప్రేమయందు అంత్యమువరకు విశ్వాసమును విడువకుండు నేని, నా వాగ్దానమును నెరవేర్చితీరుదును. నా మాటనుతప్పక చెల్లించుకొనియెదను. నన్నాశ్రయించు మానవులెప్పుడునుఆశాభంగము నొందరు.

యోగ్యప్రవర్తనగల వారికందరికిని, బహుమానముల నను గ్రహించు వాడను నేనే, మాయందు భక్తివిశ్వాసములు కలవారనందరిని మెచ్చుకొనువాడను నేనే.

నా యుపదేశములన్నియును నీ హృదయ ఫలకమున వ్రాసియుంచుకొని, వానినిగూర్చి శ్రద్ధతో యోచించుకొనుము. ఏలయనగా పరిశోధనా సమయములం దివియన్నియును సహాయకారులై యుండును.

నీవు చదువునప్పుడు, గ్రహింపజాలని విషయములు న్యాయతీర్పు దినమున గ్రహింపజాలుదువు. నేను ప్రేమించెడు మానవుని కలిసికొనుటకు నాకు రెండుమార్గములున్నవి. అవి (1) కష్టములందును ప్రపంచ వ్యామోహములందును వానిని చిక్కుపరచి వానిని శోధించుట, (2) అతడనుభవించు కష్టములనుగూర్చి వానిని యూరడించుట. నా ప్రియులకు నేను ప్రతిదినమును రెండు నీతిసూత్రముల నుపదేశించు చుందును. అవి యేవన:- (1) వారి దురలవాటులను ఖండించుట, (2) వారు తమ సుగుణసంపదలో పెంపొందునట్లు ప్రోత్సహించుట.

ఏ మానవుడు యీ యుపదేశముల నాలకించియును, వాని నుపేక్షించునో, ఆట్టిమానవుని చర్యలను ఖండించి అంత్యదినమున వానికి న్యాయము తీర్పు విధించుదుము.

దైవభక్తి కలిగియుండునట్లుల, వరము దయచేయుమని చేసికొను ప్రార్థన:

ఓ నాయేలికయగు దైవమా! తమరే నాభాగ్యరాశియై యున్నారు. తమతోడ సంభాషింప సాహసించుటకు నేనెంతవాడను? స్వామీ! నేను మిక్కిలి యభాగ్యుడనగు దీనసేవకుడను. నేనొక నీచమగు మట్టి

పురుగును పోలియున్నాను. నే నూహించు కొనలేనంత నికృష్టుడనై యున్నాను. నే నెంత హేయమైనవాడనో తెలియజేయ సాహసింపజాల కున్నాను.

ఐనను స్వామీ! నేను కేవలము వ్యర్థుడను. నే నేమియును లేని వాడను. నే నేమియు చేయజాలని యసమర్థుడను. తమరే మహాయోగ్యులు. తామే న్యాయకర్తలు. తమరే పావనమూర్తులు. తాము నిర్వహింపజాలని వేవియును లేవు. సర్వమును ప్రసాదించువారలు తమరే. తామే విశ్వము నందంతటను విస్తరించియున్నారు. పాపాత్మునిమాత్రమే దుఃఖింపుమని విడచిపుచ్చుచున్నారు. తమచే సృష్టింప బడియున్న వారలెవ్వరును నిర్భాగ్యులై వ్యర్థముగ నుండుటయన్న తమకు ప్రీతికరముగాదుకదా ? మా యందలి కోమలమగు తమకరుణను తాము జ్ఞప్తికి తెచ్చుకొని, మా హృదయము నంతయును తమదయతో నింపివేయుడు.

తమ కృపావరములు నాకుబలమును దయచేయని యెడల దిక్కుమాలిన యీ ప్రపంచ జీవితమునందు నన్ను నే నెటుల కాపాడు కొనగలను. స్వామీ! తాము నాయెడల విముఖతను వహింపకుడు. తమదర్శనమును నాకు దయచేయుటయందు కాలవిలంబనము చేయకుడు.

తిరస్కరింపక నన్నాదరింపుడు. తా మటు లనుగ్రహింపనిచో, తమయెదుట నా యాత్మ నిర్జలప్రదేశమువలె నుండును.

నా యేలికా! మీ యిష్టానుసారము నేను వర్తింప గలిగెడు మార్గమును నాకు నేర్పుడు. తమ సముఖమున మిక్కిలి దీనుడనై, యుత్తమపద్ధతిని మీతో సంభాషింపగల విధమును నా కుపదేశింపుడు.

తమరే నాజ్ఞాన ప్రదాతలు. ఈ ప్రపంచము సృష్టింపబడక పూర్వమును, ఈ ప్రపంచమున నేను జన్మింపక పూర్వమును, మీరు నన్నెరుంగుదురు. నిశ్చయముగ మీరు నన్నెరిగియున్నారు.

---

## సారాంశము

పావన చరితుడగు యీ గ్రంథకర్త రచించిన ప్రతివాక్యము దీర్ఘముగ యోచింపవలసిన విషయమై యున్నది. ఈ క్రింద యుదహ

రింపబడిన విషయములను గూర్చి యొక్క ముహూర్తకాలము యోచింతము.

1. "ఏ మానవుడు నా యుపదేశముల నాలకించియును, వానిని యుపేక్షించి యగౌరవపరచునో, కడాపటి దినమున మా యుపదేశము లా మానవుని చర్యలను ఖండించి వానిని శిక్షాపాత్రునిగా నిర్ధారణ చేయును."

ఈ విషయమును అనగా ఏ మానవుడైనను నా మాటల నాలకించి యును, వానిననుసరించి ప్రవర్తింపడో యా మానవునిగూర్చి నే నిపుడు విమర్శనుచేయును. ఏలయనగా నేను ప్రపంచ మానవులను విమర్శన చేయుటకు వచ్చియుండలేదు. కాని వారిని రక్షించుటకై వచ్చి యున్నాను. ఏ మానవుడు నన్నలక్ష్యము చేయుచున్నాడో, వానిని విమర్శించువారలొకరు గలరు. "నే నే మాటలను పల్కియుంటినో, ఆ మాటలే యా మానవుని కడాపటి దినమున పరిశోధించును." అని మన గురువగు జేసునాథస్వామి మనకు మిక్కిలి విపులముగ బోధించి యున్న విషయమునే పావనుడగు మన గ్రంథకర్త పైన యుదహరించి యున్న రెండు వాక్యములలో సంక్షేపముగా తెలియజేయుచున్నాడు.

మనకు సాధ్యమైనంతవరకు సర్వేశ్వరుని మాటవలన విమర్శన గావింపబడున దేదియో యూహించి చూతము. సర్వేశ్వరుడు అపార మగు జ్ఞానస్వరూపుడు. అపారమగు న్యాయమూర్తి. అచంచలమై దేనికిని లొంగని న్యాయకర్త. కడాపటి దినమున కరుణారసమును జ్ఞప్తి యందుంచుకొనియుండును. తాను కరుణామయుడైయున్న యవకాశ మును సద్వినియోగము చేసికొనక, దుర్వినియోగము చేసికొనిన మానవుల నెక్కువ కఠినముగ శిక్షించుటకై తన కరుణారసమును జ్ఞప్తి యందుంచుకొనును. మహాప్రభావముగల, సర్వశక్తుడగు న్యాయకర్త తామిప్పుడు విధించు దండన సర్వకాలమువరకు అమలునందుండును. అట్టి ఘోరమగు న్యాయతీర్పునందు క్రూరశిక్ష ననుభవింపకుండ తప్పించు కొనుటకై, దేవునిచే ననుగ్రహింపబడిన వాక్యమును న్యాయసూత్రము లను మనకు మార్గదర్శకములుగ ప్రతి దినమును భావించుకొనుచుండు టయే మన ప్రస్తుత సదుపాయము.

---

## 4. అధ్యాయము

## దైవ సముఖమున మనము దీనత్వమును వహించి, సత్య ప్రవర్తనులమై యుండవలయును.

1. జేసునాథస్వామి:- కుమారా! మా సముఖమున సత్యవర్తనుడవై చరించుము. నిష్కాపట్య సరళహృదయుడవై, మమ్ము తెలిసికొన కృషి సల్పుము.

సత్యమార్గ మవలంభించువారు తమ విపత్తులనుండి సురక్షితులగుదురు. వారి సత్య ప్రవర్తనయే వారిని దూర్తులబారినుండి తప్పింపగలగును. దుష్టులు వారినిగూర్చి వ్యాపింపజేయు అపవాదములనుండి వారిని విముక్తులుగ జేయును.

నీవు సత్యవ్రతుడ వగుదువేని నిజస్వాతంత్ర్య మానస్కుడవై యుందువు. డాంబికవర్తనులగు నిష్ప్రయోజకులు నీకు వ్యతిరేకముగ జెప్పు విషయములను నీ వేమియును లక్ష్యము చేయకుందువు.

2. శిష్యుడు:- స్వామీ! తాము సెలవిచ్చుచున్నదంతయు సత్యము. తాము వచించినరీతిని నేను ప్రవర్తింపగలుగునటు లనుగ్రహింపుడని తమను వేడుకొనుచున్నాను. తమ సత్యబోధయే నా కుపదేశముల ననుగ్రహించుగాక! తా ముపదేశించు సత్యవాక్కులే నన్ను రక్షించుగాక! ఆనందకరమగు అవసానదశ నాకు ప్రాప్తించువరకు నన్ను కాపాడునుగాక. దుష్టానురాగముల నుండియును ప్రపంచవిషయముల యెడ నాకుగల మితిమీరిన ప్రేమనుండియు నన్ను విముక్తునిగ చేయుగాక!

3. జేసునాథస్వామి :— సత్యస్వరూపులమగు మేము న్యాయమగునట్టియు మిక్కిలి యానందకరమగునట్టియు విషయములను నీకుపదేశించెదము. మిక్కిలి దుఃఖముతోను, పరితాపముతోను, నీపాపములను గూర్చి యోచించుకొనుము. నీవాచరించియున్న సత్కార్యములనుబట్టి నిన్నునీవు మిక్కిలి ఘనుడవని తలంచుకొనకుము. నీవు నిశ్చయముగ పాపివి. పలువిధములగు మనోవికారములకు బానిసవై, వానిచే బంధితుడవై యున్నావు.

నీ స్వశక్తినిగూర్చి యోచించుచుమన్న నీవు కేవలము వ్యర్థుడవు, మిక్కిలి యశక్తుడవు. నీవు మిక్కిలి త్వరితముగనె పడిపోవుదువు. సులభముగ నోడింపబడి, యపజయము నొందెదవు. మిక్కిలి సులభముగ యదృశ్యుడవై పోవుదువు.

నిన్ను నీవు మిక్కిలి ఘనముగ పొగడుకొన దగినంత సుగుణము నీయందు కనిపించదు. అట్టిదేదియు లేకపోవుటయేగాక, నీవు మిక్కిలి హీనత్వమును వహించియుండవలసినట్టి లోపములే నీయందుగలవు. ఏల యన, నీవు నిన్ను గ్రహించుకొనజాలిన దానికంటె నెక్కువ దుర్బలుడవు.

నీ వాచరించిన దేదియును మిక్కిల ఘనమైనదని యెంచుకొన కుము. శాశ్వత సంపదలు తప్ప మరియే విషయములును ఉత్కృష్టము లని, అమూల్యములని, విస్మయభరితములని, సంస్తవనీయములని, ఉదాత్తములగు వాంఛనీయములని భ్రమ జెందకుము. అన్నివిషయములకన్న శాశ్వతముగ నిలిచి యుండు సత్యమే నీకు సంతోషమును కలిగించు గాక !

నీయందలి యెక్కువ నికృష్టత్వమే నీకసహ్యముగ తోచును గాక. నీకు సంభవించెడు సర్వనష్టములకన్న, నీయందలి లోపములను, నీవాచరించిన పాపములును నీకెక్కువ యసహ్యాకరములైనవిగ తోచు చుండవలయును. వానిని గూర్చియే నీవు మిక్కిలి భీతిల్లవలయును ! వానినే నీవు మిక్కిలి ద్వేషింపవలయును.

కొంతమంది మాయెదుట నిష్కపటులై యుండుటలేదు. కాని యొకవిధమగు కౌతుకవాంఛచే ప్రవర్తించుచున్నారు. మా సృష్టియం దలి గొప్పరహస్యములను తెలిసికొన గోరుచున్నారు. సర్వేశ్వరుని మహోన్నత చర్యలను గ్రహింపగోరుచున్నారు. అయితే తమ స్వంత విషయములను గూర్చియుతమ ముక్తిమార్గమును గూర్చియు నలక్ష్యముగ నున్నారు.

పలుమారు అట్టివారిని మేము ప్రతిఘటించుటచే వారు తమ కౌతుకాహంకారముచే శోధనలలో చిక్కుపడి, ఘోరపాపమనెడు ఊబిలో దిగబడి పోవుచుందురు.

సర్వేశ్వరుడు మిమ్ముగూర్చి తీర్మానించబోయెడు న్యాయపు తీర్పును తలంచుకొని భయపడుడు. దేవునియనుగ్రహమును తలంచుకొని భీతమనస్కులగుడు. ఐతే మహోన్నతుడగు సర్వేశ్వరుని సృష్టికౌశల మును పరిశీలనజేయ జాలుదుమనియెడు యహంకారమును వదిలిపెట్టుడు. 'నీవెన్నిరీతుల దుష్కృత్యముల నాచరించి సర్వేశ్వరునికి నిష్ఠుర యాగ్రహమును తెప్పించియుంటివో, ఎంతటి యోగ్యమగు విషయము లను తృణీకరించి వైచితివో, అన్నివిధములగు, తీవ్రపరిశీలనను గావించు కొనుము.

కొందరు కొన్ని సద్గ్రంథములను చదువుటయందును, మరికొం దరు పావనచరితుల చిత్రపటములను గౌరవించుటయందును, ఇంకను మరికొందరు బాహ్యలక్షణములందును, ప్రతిమలయందును భక్తిగల వారలై యున్నారు. మరికొందరు మమ్ముగూర్చి భక్తితో మాటలాడు దురుగాని, తమహృదయములందుమాత్రము మాకు స్థలమొసంగుటలేదు. అయితే మరికొందరు విషయార్థ గ్రహణశక్తియందు వికాసముపొంది పవిత్ర హృదయులై సర్వదా శాశ్వత పదార్థములయందే యాశగల వారలై యుందురు. ప్రపంచవిషయములనుగూర్చి వినుటకైనను ఇచ్ఛగింప రు. తమ స్వాభావిక శారీరక అవసరములను తీర్చుకొనుటకు సైతము వారు చింతనొందెదరు. ఇట్టిమానవులే సత్యమూర్తియగు సర్వేశ్వరుని యుపదేశ సారాంశమును గ్రహింపజాలుదురు.

ఏలయనగా? ప్రాపంచక విషయములను నీచముగానెంచి, దైవ విషయములను మాత్రమే ప్రేమించి, ప్రపంచవిషయముల లేశమాత్ర మును గౌరవించక రాత్రింబవళ్లు స్వర్గప్రాప్తికొరకై యపేక్షించు చుండవలయునని సత్యమూర్తియగు సృష్టికర్త యుపదేశించునటులే వారు చేయప్రయత్నించెదరు.

---

## సా రాం శ ము

దైవేచ్ఛ ననుసరించి నిరాడంబరులై దీనభావము వహించి, నిష్క పటముతో .దేవునియెదుట సత్యప్రవర్తనులై యుండుమానవుల సంఖ్య బహుస్వల్పము.

ముక్తిమార్గమునందెన్ని మాయలు వ్యాపించియున్నవి! పవిత్రతను గూర్చి యనేక తప్పుభావములు గలవారగుచున్నారు. ప్రపంచమునందు జ్ఞానులమని కపటముగా నటించుచుండు దొంగభక్తులందరును, వారి జిజ్ఞాసలతోను, గర్వముతోను, పొంగిపోయినవారై, శుష్కచింతనాలోలురై మానవధర్మ శాస్త్రము నెరుగకున్నారు. గర్విష్ఠుల నందరిని నెదురొన్న సంసిద్ధుడైయున్న సర్వేశ్వరుడు, అట్టిమానవులకు, దీనులకొరకై నిలువచేయబడియున్న వరప్రసాదముల ననుగ్రహీరపడు. ఆ మానవులు మోహావేశులై, లెక్కకు మిక్కుటమగు క్రూరకర్మాచరణకు గడంగెదరు. వారి హృదయానురాగముల కనుకూలముగా నుండు సాధనలయందే తమశక్తిని వినియోగించు చుందురు.

వారు దేవుని కేవలము పెదవులతో మాత్రము గౌరవించుచుందురు గాని, వారిహృదయములు దేవునకు మిక్కిలి దూరమునందుండును. వారు తమహృదయములందు దేవునకు చోటొసంగుటలేదు.

మానవ కల్పితమగు సిద్ధాంతములను నీతులను బోధించువారలొనర్చెడి దైవార్చన వ్యర్థమైనది, తుచ్ఛమైనది, అల్పమైనది. ఇతరులు తమభక్తినంతయును, బాహ్యమగు తత్వమునందును, సంజ్ఞలయందును అంగవిన్యాసములందును, ఇతరుల బాహ్యాగుర్తులయందును వినియోగించెదరు.

అట్టి దొంగభక్తులనందరిని సత్యస్వరూపియగు దేవుడు దోషులుగనెంచి ఖండించును.

---

## 5 వ అధ్యాయము

## దైవ ప్రేమవలని అద్భుత ప్రయోజనములు

1. శిష్యుడు:- ఓ పరమపితా! నా ప్రభువగు జేసునాధునికి తండ్రివగు దైవమా!

నిర్భాగ్యుడనగు నన్ను మరువక, కనికర దృష్టితో జూచుటకనుగ్రహింపుము.

కరుణామయుడవగు పరమపితా! సర్వవిధ సౌకర్యదాయీ, నేను తమకు సాష్టాంగ నమస్కారముల నర్పించుచున్నాను.

తమ వలన సౌకర్యములను పొందుటకు తగినయోగ్యత లేనివాడనై యున్నాను. ఐనప్పటికిని, దైవమా, తాము కొన్ని సమయములందు తమ యాదరణచే నన్ను పోషించి, గారాబముతో పెంచుట కనుగ్రహించి యున్నారు.

సర్వదా తమను, తమ యేక పుత్రుడగు జేసునాథుని, శాశ్వత సౌకర్యములను దయచేయు స్పిరితుసాంతును, పొగడుచు నేను మీ మహిమలను కొనియాడెదను.

నా ప్రభువగు దైవమా! నా పవిత్ర ప్రేమకాస్పదుడవగు స్వామీ తాము నా హృదయ నివాసివై యుండుటకు దయచేయునపుడు, నా అంతరంగము పరిపూర్ణానందముచే నిండిపోవును. తమరే నా యానందము, నా యాంతరంగిక సంతోషము; విపత్కాలమున తమరే నాకు శరణము.

2. ఐతే స్వామీ!- నేనింక తమను గాఢముగ ప్రేమించుట లేదు. ఇంకను నేను పరిపూర్ణ యోగ్యతగల వాడనై యుండుటలేను. అందుచే తాము నన్నింకను బలపరచి, కుస్తరింపవలసి యున్నది. ఇందుకొరకై పలుమారు తమ దర్శనభాగ్యమును నాకు లభింపజేయుడు. పవిత్రవంతమగు తమ క్రమశిక్షణమందు నన్నుంచి, నాకు తమ దివ్యోపదేశముల ననుగ్రహింపుడు.

దుర్వ్యాపారములనుండి నా మనస్సును విముక్తి గావింపుడు. అనుచి తానురాగములని వెడి జాడ్యము నా మనస్సును పీడించుచున్నది. అట్టి నామనోజాడ్యమును నివారణచేయుడు. మానసిక జాడ్యములు నివర్తి చేయబడి, నా యాంతరంగిక హృదయము పవిత్రమొనర్పబడు నేని, తమను ప్రేమించుటకు తగినస్థితిగల వాడనగుదును. కష్టములను, సంకటములను, దుఃఖములను సహింప సాహసముగల వాడనగుదును. స్థిరమగు పట్టుదలను కలిగియుండ గలను.

తమ పవిత్రప్రేమ మిక్కిలి మహోన్నతమైనది. మిక్కిలి యోగ్యమైనది. భారముగా తోచు విషయము లన్నియును, పవిత్రప్రేమ భావముచే తేలికయై పోవును. అట్టి ప్రేమశక్తి వలననే కష్టసుఖము లన్నింటియందును సమభావముగల వాడనై యుండగలను. పవిత్ర

ప్రేమా భాగ్యముగల వాడైనను, ఎంత భారమైనను, కష్టముగా భావించు కొనక భరింప జాలుదును. పవిత్రప్రేమ ప్రభావము వలననే చింతాకుల చిత్తమై యుండునదంతయును మిక్కిలి మాధుర్యమై రుచికరముగ దోచును. జేసునాథస్వామి ప్రేమ మిగుల దివ్యమైనది, ఉదారతగలది, ధారాళమైనది. ఘనకార్యముల నాచరించుటకొరకే వారియందలి ప్రేమ మనలను పురికొల్పుచుండును.

పవిత్ర ప్రేమ మనల నెల్లప్పుడును, ఉన్నతస్థితికి గొనిపోవుచుండును. ప్రపంచ విషయానురాగము లేవియును, పవిత్రప్రేమగల మానవుని బంధించి క్రిందికిలాగ జాలవు.

పవిత్రప్రేమ స్వాతంత్ర్యమైనది. పవిత్రప్రేమ కిట్టి స్వభావము. లేకున్నచో:-

మానవుని యాంతరంగిక దృష్టికి భంగము కలుగును. అశాశ్వతమగు స్వప్రయోజనా కాంక్షయందు చిక్కువడి, కష్టనష్టముల వలన ధైర్యమును కోల్పోయి, బాధల ననుభవింపవలసిన వాడగును. ఇట్టి కష్టదశలు సంప్రాప్తింపకుండుటకే, పవిత్రప్రేమా సంపదగల మానవుడు, మిక్కిలి స్వాతంత్ర్యముగలవాడై,ప్రపంచానురాగముల కతీతుడై యుండవలయునని యెల్లప్పుడును కోరుచుండును.

పవిత్రప్రేమకన్న మధురమైనది, ఉదాత్తమైనది, ఔదార్యముగలది, ఆహ్లాదకరమైనది, సంపూర్ణమైనది, యోగ్యమైనది, భూలోకమునగాని పరలోకముననగాని వేరొండు లేదు. ఏలయనగా యీ పవిత్రప్రేమ సృష్టికర్తయగు దేవునినుండియే ప్రవహించుచున్నది. కనుక యీ పవిత్రప్రేమ నెరుగ దేవునియందే విశ్రమింప వలయును, ప్రపంచవిషయములందు, సర్వేశ్వరా! నీ యెడల మేమందరముచు పవిత్రప్రేమగలవారమై ప్రవర్తించు చుండవలయును.

4. పవిత్ర ప్రేమపూరితుడగు మానవుడు, పై కెగురుచు, గంతులు వైచును; అటునిటు పరుగులిడచు, ఆనంద పరవశుడై యుండును ఆతడే స్వతంత్రుడు. ప్రపంచానురాగము లేవియు నాతని నాటంకపఱుప జాలవు.

తనకున్న దానినంతయును వదలివేసి, తనసర్వమైన దేవునినే పొందుటకు కుతూహలపడును. ఏమూలనుండి సర్వశ్రేయములు బయలుదేరి ప్రవహించుచుండునో, అట్టి మూలాధారభూతుడును, మహోన్నతుడైన సర్వేశ్వరునియందాతడు సదా నివసించుచుండును. తాను పొందిన మేలులను చూచుకొనక, అట్టిమేలుల మూలకారణమయిన దేవుని యందే తన మనస్సును నిల్పుకొనును.

పవిత్ర ప్రేమ పలుమారు అపారమైయుండును. మితిమీరి ఎక్కువగ ప్రజ్వరిల్లుచుండును. పవిత్రప్రేమకు భారమనునదిలేదు. కష్టములను గూర్చి లేశమాత్రమైనను యోచింపదు. పవిత్రప్రేమగల మానవుడు, తాను చేయజాలిన దానికంటె ఎక్కువచేయుట కుద్యుక్తుడైయుండును. ఆ మానవుడేకార్యము దుస్సాధ్యమైనదని మొరపెట్టడు. ఏలయనగా, అతడు సర్వమును చేయజాలుదునని ధైర్యము కలిగియుండును. అందుచే పవిత్రప్రేమ చేయజాలనిదేదియునులేదు. సర్వమును నిర్వహింపజాలును.

పవిత్రప్రేమలేని యాతడేమి చేయజాలక, యలసట కలవాడై, క్రిందబడియుండగా, పవిత్రప్రేమగలవ్యక్తి నిదురించుచుండియును; చురుకుదనము గలవాడై సర్వము నిర్వహించును.

పవిత్ర ప్రేమపూరిత హృదయుడు డస్సియున్నప్పుడు సైతము, విసుకునొందడు. ఆత డిబ్బందులు పాలుచేయబడినను, ధర్మాచరణత యందాయిబ్బందులేవియు నాతనిని నిర్బంధింపజాలవు.

ఆతడు బెదరింపబడినను, కలవరపాటు జెందడు; కాని ప్రకాశవంతమగు నగ్నిజ్వాలవలె అంతయును మండుచున్న దివిటీవలె యాతడెప్పుడును ఊర్ధ్వగమనుడై దేవునిదిశకు పోవుచుండును. సర్వయాటంకములను తప్పించుకొని సురక్షితముగ ముందునకు సాగిపోవుచుండును.

పవిత్ర ప్రేమ హృదయులందరును, పవిత్ర ప్రేమ యనెడు పదము నందలి యర్థమును పవిత్ర ప్రేమభావమును గ్రహింప గల్గుదురు.

ఓ నా ప్రభూ! నా ప్రేమాస్పదా! మీరే నా సర్వము. నేను మీ యాధీనుడను.

5. దేవా మీ యెడలి పవిత్రప్రేమ కలిగియుండుటయును, ఆ పవిత్ర ప్రేమసాగరమున నోలలాడుటయును, ఆ పవిత్రప్రేమయందే లగ్నమానసులమై యుండుటయును నెంత యానందకరమగు అంశమో నా అంతరంగమున రుచిచూడగల్గు విధమును నేర్చుకొనుటకై నా పవిత్రప్రేమ నింకను పెంపొందింపుము.

ప్రేమాధిక్యముచే నుప్పొంగుచు, అమితానందమునందు మైమరచినవాడనై, పవిత్రప్రేమావేశుడనై యుండునటు లనుగ్రహింపుడు.

పవిత్ర ప్రేమగీతమును గానము చేయుదును. నేను ప్రేమించుచుండెడు స్వర్గవాసియగు స్వామీ! మీ వెంట నన్ను రానిండు. తమ యందలి ప్రేమాతిశయముచే, పరమానందము ననుభవించుచు, మిమ్ము కొనియాడుటయందే నా యాత్మ మైమరచి యుండునటు లనుగ్రహింపుడు.

తమనుండి ప్రకాశించుచున్న పవిత్రప్రేమ న్యాయసూత్ర ప్రకారము, నన్ను నేను ప్రేమించుకొనుటకంటె, తమనే నేనెక్కువగా ప్రేమించుచుండునటులను, కేవలము తమ కొరకే, నన్ను నేను ప్రేమించుకొనునటులను, యనుగ్రహింపుడు.

6. ప్రేమ నిష్కపటమైనది, పవిత్రవంతమైనది, మనోరంజకమైనది, ఉత్సాహకరమైనది, మిక్కిలి బలమైనది, మిక్కిలి శాంతమైనది, విశ్వాసముగలది, దూరదృష్టిగలది, సంకటముల నోర్వ సహనశక్తిగలది, నిర్భయమైనది, తన్ను తానెప్పుడును పాటింపనిది.

మానవుడెప్పుడు తన స్వలాభమును పాటించుకొనునో అప్పుడాతడు పతనమునొందును. పవిత్రప్రేమ సర్వదా సమీక్ష్య కారియై యుండును. దీనత్వమును, న్యాయప్రవర్తనము కలదై యుండును.

7. పవిత్రప్రేమ ధైర్యము లేనిది కాదు; మిక్కిలి గాఢమైనది. తుచ్ఛవిషయముల వెంటనంటి పోవునది గాదు; స్థిరబుద్ధిగలది. విషయానురాగముల నన్నిటిని కనిపెట్టి యదుపునందుంచగలదు.

పవిత్రప్రేమ లొంగియుండెడు భావము గలదైయున్నది. పెద్దవారలయెడల విధేయతగలది. తన్ను తాను మిక్కిలి యధమముగను,

హేయముగను యెన్నుకొనుచుండును. దైవభక్తి కృతజ్ఞత కలదై యుండును. జ్ఞాన మాధుర్యము యొక్క రుచినెరుగ కున్నను, అదివారి యెడల భక్తియును, కృతజ్ఞతయు కలదిగనే యుండును; ఏలయనగా:- ఏదియో యొకబాధను యనుభవింప కుండగనే, పవిత్రప్రేమగల వారలమై యుండుటకు వలనుపడదు.

ఏ మానవుడు " సర్వబాధల ననుభవించుటకును, దైవేచ్ఛానుసారముగ వర్తించుటకును, సంసిద్ధుడుగ నుండడో, అట్టి మానవుడు, దైవ ప్రియుడుగా నెంచబడుటకు సర్హుడుకాడు.

ఏ మానవుడు దేవునియెడల పవిత్రప్రేమాహ్వాదయుడై యుండునో యాతడు తాను ప్రేమించుచున్న దేవుని కొరకై, కఠోరములగు నట్టియు, మిక్కిలి యప్రియము లగునట్టియు, సర్వవిధకష్టములను మనః పూర్వకముగా ననుభవించువాడై యుండవలయును. తనకు వ్యతిరేకముగ నేమి సంభవించినను, దేవుని సముఖమునుండి తరుమగొట్టబడియెడి యవకాశములకు చోటీయకుండ ప్రవర్తించుచుండవలయును.

---

## సారాంశము

"పరమపిత యెడల ప్రేమసాధనయని" యీ యధ్యాయమున కంకితము నొసంగవచ్చును.

పవిత్ర ప్రేమయందలి ప్రాముఖ్యతను గూర్చియు, నావశ్యకతను గూర్చియు, దాని స్వభావములు, గుణములు, కారణములు, అందువలని ప్రయోజనములు మొదలుగాగల వానిని గూర్చియు, పావనుడగు మన గ్రంథకర్తగారు చెప్పియున్న సంగతులకన్న నెక్కువ విషయములను చెప్పజాలుట మిక్కిలి దుస్తరము. వారిచే తెలుపబడియున్న సర్వవిషయముల నుండియును, మనము సహజముగ గ్రహింపవలసియున్న ముఖ్యాంశమేమనగా:-

మనయందీ పవిత్ర ప్రేమగలదా? లేదా? యనెడు విషయమును గూర్చి గాఢముగా దేవుని ఎదుట స్వవిమర్శన గావించుకొనుట.

పవిత్ర ప్రేమ లక్షణములనుగూర్చి గ్రంథకర్త మిక్కిలి విపులముగా తెల్పియున్నాడు. దేవుని గూర్చిన ఈ పవిత్ర ప్రేమ, మన హృదయములందు గలదని మన మనుభవ పూర్వకముగా గ్రహించుటకు తగిన కారణములే యున్నయెడల, అట్టి దివ్యమగు బహుమానమును ప్రసాదించియున్న దేవునికి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పింపవలయును. అటులగాక, అందుకు వ్యతిరేకముగ మనము పవిత్ర ప్రేమపూరిత హృదయులమై యుండలేదను చిహ్నములేవియైన మనయందున్నటుల గ్రహించుదుమేని, అట్టిప్రేమను గలిగియుండుటకు తీసికొనవలసిన శ్రమను తీసుకొనుచు, ఇంతకుముందు మనమట్టి పవిత్ర ప్రేమను కలిగియుండనందుకుగాను మిక్కిలి దుఃఖించుచు, దానిని పొందుటకై దేవుని వేడవలయును.

---

## 6. అధ్యాయము

## సత్యమగు దివ్య ప్రేమగలవాని లక్షణములు.

1 జేసునాథస్వామి :—

కుమారా! నీవింకను జాగరూకుడవై, దూరదృష్టిగలవాడవై మమ్ము ప్రేమించుటలేదు.

2 శిష్యుడు:- స్వామి ! అదేమి? అటుల సెలవిచ్చుచున్నారు.

3 జేసునాథస్వామి:- ఏలయనగా నీవారంభించినదానిని కొనసాగించుకొనక, ఏదియో యొక స్వల్పసంకటము సంప్రాప్తించిన తోడనే, యాకార్యమును వదలివేయుచున్నావు. మీదు మిక్కిలి యూరట పొందవలయునని యెక్కువ యాశపడుచున్నావు.

సాహసయుక్తుడై మాయెడల పవిత్రప్రేమకలిగియుండు భక్తుడు, ప్రపంచ వ్యామోహములచే మోసపోక, ధైర్యముతో నిలచియుండి, శత్రువుల కృత్రిమబోధలకు లొంగకుండును.

సత్యమగు పవిత్రప్రేమగలమానవుడు, కలిమిగలవాడై యుండునపుడు మమ్మెటుల ప్రేమించుచుండునో, యటులనే లేమిడియందును మమ్ము్మదలించి ద్వేషహృదయుడు కాకుండును.

4 దైవప్రేమగల వివేకి, తనకు ప్రసాదింపబడిన బహుమానములను గూర్చి ఎక్కువగా తలంచుకొనక, తనకొబహుమానముల ననుగ్రహించిన మహనీయుని ప్రేమనుగూర్చియే, ఘనముగ నెంచుకొనును. అతడా బహుమానముల విలువను సరకుచేయక, తనకా బహుమానములను ప్రసాదించిన దాతయొక్క సదభిప్రాయములను గూర్చి తలంచుకొనును.

తన కనుగ్రహింపబడిన బహుమానముకన్న, నెక్కువగ తన దాతను శ్లాఘించుచుండును

ఉదార స్వభావముతో మమ్ము ప్రేమించువాడు, ప్రేమె మొసంగిన వరములతో తృప్తిచెంది మిన్నకుండక, వానికన్న నెక్కువగ మమ్ము ప్రేమించుచుండును.

కొన్ని సమయములందు, మాయందును, అర్చ్యశిష్టులయందును, నీవు ప్రదర్శింపవలసినంత భక్తి విశ్వాసములు నీయందు లేనటుల నీకు తోచినను, నీవు సర్వమును నష్టపడితివని ఎంచుకొనకుము.

కొన్ని వేళలందు, నీకు మాయెడలగల యోగ్యమగు నట్టియు, నానందకగమగు నట్టియు భక్తి, మావలన నీవు స్వీకరించిన వరప్రసాదమువలన లభించిన దనియు, నీకు ముందు లభింపనున్న మోక్ష సౌఖ్యముల యందలి రుచి లక్షణమనియు గ్రహింపుము.

ఐతే నీవట్టి భక్తిపై నమ్మియుండకుము. ఏలయనగా ఆ భక్తి యొకొనొకప్పుడు కలుగుచుండును! ఒకప్పుడు నశించిపోవుచుండును.

అప్పుడప్పుడు తలయెత్తుచుండెడు మానసిక దుష్ట వాంఛలతో పెనుగులాడుట, పిశాచముచే చూపబడు సూచనలను నీచముగ నెంచుచు, వాని నన్నిటిని తృణీకరించివైచుట, యీ రెండును యోగ్యతా లక్షణములు.

కనుక నీకు సూచింపడు విపరీత భావములెట్టివైనను, వాటివలన వ్యాకులత చెందకుము.

దైవసంబంధమగు నీ సంకల్పములను, భావములను, దృఢముగా నుండునటుల చూచుకొను చుండుము.

కొన్ని సమయములందు నిన్ను అమితానంద పరవశునిగా చేయు నదియును, వెంటనే నీకు సహజముగ నుండు హృదయ దౌర్బల్యతను తెచ్చిపెట్టుచుండునదియును, కేవలము భ్రమాకల్పితమైన విషయమే యని తలంపకుము.

ఏలయనగా :— ఇవియన్నియును, నీయిష్టమునకు వ్యతిరేకముగ సంప్రాప్తించుచున్నవిగాని, నీవు తెచ్చిపెట్టుకొనుచున్నవిగావు. వాని యందన్నిటియెడలను నీవు విముఖతను వహించుచు ప్రతిఘటించుచుండు నంతకాలము, అట్టిప్రవర్తన నీకొక యోగ్యతయేగాని, నష్టకారికాదు.

సత్కార్యముల నాచరించుచుండవలయునను నీవాంఛలకు విఘ్నములు కలిగించుటకును, భక్తిపూర్వకమగు నీసాధనల నన్నిటినుండియు నిన్ను పెడత్రోవలకు లాగుటకును, నీ ప్రబల విరోధియగు పిశాచము పలు రీతుల ప్రయత్నములు చేయుచున్నదని గ్రహింపుము.

ఆ పెడత్రోవ లేవియన:—

(a) అర్చ్యశిష్టులయెడల చూపవలసిన గౌరవములను చూపకుండుట.
(b) నా స్లీవభాధలనుగూర్చి భక్తిగా ధ్యానింపకుండుట.
(c) మిక్కిలి లాభకారియగు, పాపస్మరణ లేకుండనుండుట.
(d) నీ హృదయమున దుష్టతలంపులు, అశుద్ధభావములు చేరకుండు నటుల తగిన కాపుదలను చేసికొనకుండుట.
(e) జ్ఞానమార్గమునందభివృద్ధి పొందవలయునను స్థిరసంకల్పము లేకుండుట.

ఈ మార్గములలోనికి నిన్ను లాగవలయునని పిశాచము మిగుల శ్రమపడుచుండును. నీవు దైవప్రార్థనలు, సద్గ్రంథపఠనము, చేసికొన కుండునటు లొనర్చుటకుగాను నీకు విసుగుజనించునటు లొనర్చి, నిన్ను భయపెట్టుచుండుటకు పిశాచము పలువిధములగు దుష్టవాంఛలను సూచించుచుండును.

దీనత్వమును వహించి, నీ పాపములనుగూర్చి పశ్చాత్తాపమునొంది ఆయత్తముచేయుట పిశాచమున కిష్టములేదు. తనకు సాధ్యమైనయెడల, దివ్యసత్ప్రసాదము లోకొనకుండ చేయవలయునని కోరుచుండును.

పిశాచము చేయుచున్న యీ పనులను నమ్మకుము. పిశాచము పలుమారు మోసకరములగు యురులొడ్డుచుండినను, వానిని లేశమాత్రమైనను లక్ష్యము చేయకుము. వాటిని చూచి భీతిల్లకుము. దుష్టమగునట్టియు, అపవిత్రమగు నట్టియు కృత్యముల నాచరింపుమని పిశాచము నీకు సూచనలు చేయునపుడు, దానినే చీవాట్లుపెట్టి, అట్టి తలంపులను నీకు సూచించినందుకు దానిమీదనే నిందవేసి, నీవు ధైర్యము వహించి ఈ క్రిందిరీతిని దానిని గద్దించుము.

"దుష్ట పిశాచమా! నా యెదుటనుండి తొలగిపొమ్ము. దౌర్భాగ్యుడవగు దిక్కుమాలిన నీచుడా! ఇట్టి దుష్ట కార్యము లాచరింపుమని నన్ను పురికొల్పుచుంటివా? నిశ్చయముగ నీవు అపవిత్రుడవు. నా యెదుటనుంచి లేచిపొమ్ము. నీకు సిగ్గులేదా? దుష్టవంచకా! నా నుండి నీ వేమియు గొనిపోజాలవు. నా రక్షకుడగు జేసునాథుడు పరాక్రమశాలియగు యుద్ధవీరునివలె నా పార్శ్వముననే నిలచియున్నాడు. గందరగోళమునబడి తబ్బిబ్బులాడ వలసి వచ్చునుసుమా! ఎట్టి ఘోరహింసలనైన సహించి యనుభవించెదను. గాని, నీ కెప్పుడును లొంగువాడను కాను; నోరుమూసికొనుము. అబద్ధ ప్రలాపీ! నీ నాల్కకు బుద్ధిచెప్పుము. నీవు నన్ను పలుమారులు కలవర పెట్టవలయునని ప్రయత్నములు చేయుచున్నావుగాని, నీ దుర్బోధలు ఏ మాత్రమును నా చెవికెక్కవు. సర్వేశ్వరుడే నాకు మార్గదర్శి. ఆతడే నా మోక్షము. నే నెవరికిని బయపడను.

శత్రుసేనలన్నియు నొక్కటై భీకర రణరంగమందు నన్నెదుర్కొనినను, నా హృదయమునకు లేశమాత్రమైనను భీతిలేదు. దైవమే నాకు తోడునీడ; సర్వేశ్వరుడు నారక్షకుడు."

5. మంచి రణధీరునివలె పోరాడుము. కొన్ని వేళలందు దౌర్బల్యముచే ధర్మభ్రష్టుడవైనను అమోఘమగు మాదయయందు విశ్వాసమును విడువక, అంతకుముందు కన్న నెక్కువబలము గలవాడవై తిరుగ లెమ్ము. ఐతే ఎట్టివ్యర్థమగు తృప్తినిగాని, గర్వమునుగాని పొందక, మిగుల జాగరూకుడవై యుండవలయును.

గర్వమువలన చాలమంది పామరులు తప్పుత్రోవలోబడి కొన్నివేళల తొలగించుకొనజాలనంత యంధకారమునందు బడియెదరు.

బుద్ధిహీనులై, తమబలము మీద మాత్రము నమ్మకము కలిగి యుండు అహంకార ప్రవర్తను లందరును, పడిపోవుటను గాంచి, ఆ విషయము నీకొక మందలింపుగా తీసికొని, సర్వదా దీనభావమును వహించి యుండుము.

---

## సారాంశము

కలిమి లేములయందుండు నప్పుడును, శోధనలయందు చిక్కుబడి యుండునప్పుడును, యూరటయు సంతోషమును గలిగియుండునప్పుడును, అన్ని సమయములందును సమభావము గల్గి, దేవుని నెల్లప్పుడును ప్రేమించుచుండవలయును. వివేకముతోను, దూరదృష్టితోను, స్వతంత్రాభిప్రాయముతోను, భగవంతుని ప్రేమింపవలయును. మనము వారిపై యాధారపడి యుండవలయును. కాని వారి వలన మనము పొందజాలెడి బహుమానములపైన కాదు.

మనము దేవునినుండ స్వీకరించెడు బహుమతుల విలువకన్న, వారికి మనయెడలగల ప్రేమయే మిక్కిలి ఘనమైనదని భావింపవలయును. సత్యమగు పవిత్రతయన నేమో, విరోధియగు పిశాచముచే పన్నబడినయెత్తు గడయు-యూరులును యేవియో, ఈ రెంటికిగల తారతమ్యమును, వివేకముతో కనిపెట్టుము.

సారవంతమగు దైవభక్తిని, యింద్రియ గ్రాహ్యమగు భగవద్భక్తిని, గల తారతమ్యమును గ్రహింపుము.

ఈ విషయములనె సంగ్రహముగ చెప్పవలెనని, దేవునియెడల మనకుగల ప్రేమ బలమైనదిగను, దివ్యమై గంభీరమైనదిగను, యుదారతంతమైనదిగ నుండవలయును. అన్ని వేళలందును, అన్ని సందర్భములయందును మనము వారిని ప్రేమించుచుండవలయును.

వారు మనల నాదరించునప్పుడు, వారికి మనము కృతజ్ఞతాపూర్వక వందనము లర్పింపవలయును.

తిరుగ వారు తమ యాదరణలను తొలగించునప్పుడు సైతము, మనకున్న పూర్వ విశ్వాసముతోనే, వారిని విడువక పట్టుదలతో ప్రేమించు చుండవలయును.

దేవుడు మనలను విమర్శనల పాలంబడ నిచ్చునా ? మనము విమర్శనలయందు చిక్కుబడి యున్నయెడల, మిగుల దీనత్వమును వహించి యుండవలయును గాని, అధైర్యము నొందుట తగదు. మన విశ్వాసమంతయు వారియందు పాదు కొల్పి, మిక్కిలి మనోధైర్యముతో మన శత్రువుల నెదిరింపవలయును. మన మొకానొక సమయమున దురదృష్టులమై పడిపోవుదుమేని, వెనువెంటనే లేచి, పోరాటమునకు గడంగవలయును. మిక్కిలి బలకరములగు నట్టియు, సమృద్ధికరములగు నట్టియు, సహాయములను దయచేయుమని భగవంతుని ప్రార్థించి, వారుమనయెడల దయచూపుదురను యాశను కలిగియుండవలయును. అనగా మనమెట్టి దురవస్థయందుండినను, దైవమునే సర్వదా మనలక్ష్యమునందుంచుకొనక తప్పదు. యోగ్యమగు సంకల్పముల నేర్పరచుకొని, చలింపకుండవలయును. మనము వాడుకగా చేసికొనుచుండెదు, పవిత్రత కొరకగు యభ్యాసములకెట్టి యంతరాయములను రానీయకుండవలెను. మనము దీనస్వభావమునందే రక్షింపబడవలయును. సర్వశక్తివంతుడగు సర్వేశ్వరుని యెడల భయభక్తులు గలవాడవై వారి దయయందు గాఢ విశ్వాసము గలవాడవై, ముక్తిసంపాదనకొరకు, కష్టపడి ప్రయత్నములు చేయుము.

---

## 7 వ అధ్యాయము.

## దైవభక్తియను వరప్రసాదమును, దీనత్వమను కాపరి యాధీనమునందు గుప్తపఱచుట.

జేసునాథస్వామి,

కుమారా — నీయందలి దైవభక్తియనెడు వరప్రసాదమును గుప్తపరచుకొని, అట్టివరప్రసాదమును గలిగియుంటినను గర్వమువహింపక, దానినిగూర్చి అధికప్రసంగములు సల్పుకొనక, అదియొక ఘనకార్యమను యభిప్రాయమును గలిగియుండక, అందుకుమారుగా నిన్ను నీవు నిగ్రహించుకొనుచు, దానిని పొందుటకు తగినయర్హత లేశమాత్రమైనను లేని నీకది యనుగ్రహింపబడెనని దానినిగూర్చి భయపడుచుండుటయే నీకు మిక్కిలి లాభకరము.

అనతికాలముననే మార్పుచెందు స్వభావము కలిగియున్న నీభక్తి పైని అతినమ్మకము కలిగియుండ తగదు.

దేవ వరప్రసాదమును కలిగియున్నపుడు, అట్టి వరప్రసాదము లేకున్నచో నీవెంత దిక్కుమాలిన నిరుపేదవైయుందువో నీలో నీవాలోచించుకొనుము.

ఆధ్యాత్మికమార్గాను వర్తియగు మానవుని యభివృద్ధి వానికి ప్రసాదింపబడు యూరటయందులేదు. మనకెట్టి యాదరణలు లేకుండినను, దీనత్వమును వహించి ఆత్మత్యాగముతో శాంతమును వహించియుండగలమేని, మనము జ్ఞానాభివృద్ధి నొందజాలుదుము.

అట్టి సమయములలో ఆధ్యాత్మిక ప్రార్థనా సాధనలయందు అవధానములేక నుండకుండుటకును, మన మభ్యాసపడియున్న సత్కార్యములన్నిటిని విసర్జింపకుండుటకును, దీనత్వమును వహించి శాంతహృదయముతో సర్వపరిత్యాగ మొనర్చి, సర్వేశ్వరుని యెడల మనకుగల విశ్వాసమును విడువకుండవలయును.

నీశక్తికి తగినట్లు, నీకు తెలిసియున్నంతవరకు యుల్లాసముతో నీ వాచరింపగల వాని నాచరించుచు, నీ వనుభవించెడు మానసిక అరంజకత వలనను, మనోవ్యాకులత వలనను, నీవు పూర్తిగా ఆశవదలకుంటివేని నీవు జ్ఞానాభివృద్ధిని పొందగలవు.

ఏలయనగా, కార్యములు తమ యిచ్ఛానుసారముగా కొనసాగని మరుక్షణమే పలువురు తాలిమిలేని వారలై, సోమరులై పోవుచున్నారు.

మానవుని ప్రవర్తన యెల్లప్పుడాతని శక్తిననుసరించి యుండదు. అది దైవేచ్ఛపై నాధారపడియుండును.

సర్వేశ్వరునకు మనసుకలిగినప్పుడు, దయదలచి మానవుని యాదరించుచుందెదరు. వారు తమకు తోచినంత వరకే దయచూపెదరు. వారుతమ కిష్టమువచ్చిన వారలకే వరప్రసాదము లనుగ్రహింతురు. తమకెంత దయచేయ నిష్టముండునో అంతవరకే దయచేయుదురు గాని అధికముగాదు.

కొందరు వివేచనాశక్తి శూన్యులై తమకు ప్రసాదింపబడిన దైవభక్తివలననే భ్రష్టులై పోయియున్నారు. ఏలయనగా తామెంత బలహీ-

నులై యున్నది చక్కగా పరిశీలించి చూచుకొనక, వివేక విమర్శన లేక తమ హృదయాపేక్షల ననుసరించి వర్తించుచు, తమశక్తికిమించిన కృత్యముల నిర్వహింపవలయునను కాంక్షకలవారలై పొందిన వరములను పోగొట్టుకొనియున్నారు.

దైవమునకు ప్రీతిగొల్పెడు వానికంటె యెక్కువయగు అంశములను నిర్వహించుటకుగాను, తమశక్తిమీదనే నమ్మకముగల వారలై, కార్యాచరణకు పూనుకొనుటచే అట్టి మానవులు మిక్కిలి యచిరకాలముననే తమకు ప్రసాదింప బడియున్న వరములనుకోల్పోయియున్నారు.

కడపటి కావిధముగా దీనులై, నిరుపేదలై, తమరెక్కలబలముపై తామెప్పుడును యాధారపడకూడదనియు మారెక్కలక్రిందనే దాగి యుండి రక్షింపబడవలయునను సత్యమును నేర్చుకొనుటకై, యిట్టిస్థితికి వారు తీసికొని రాబడియున్నారు.

సర్వేశ్వరునిచే నిర్దేశింపబడిన మార్గములందు ప్రవర్తించుటలో యనుభవములేని నవీనులు మంచిచెడ్డలను చక్కగా యోచింపజాలిన వివేకుల సలహాలను పొందక, లేదా వారిసలహాలను పొందియు వాటిననుసరించి ప్రవర్తింపక, మోసపోయినవారలై తమ ప్రయత్నములందె అపజయము నొందెదరు.

3. తమకన్న నెక్కువ యనుభవశాలురగు వారిని నమ్మక, తమ దురహంకారమును విసర్జించుట కిష్టములేనివారలై యుందురేని, అపజయమునంది, అపాయకరమగు స్థితియందు బడిపోయెదరు.

తాము వివేకులమని తలంచుకొనువారలు పరుల సలహాల కనుగుణ్యముగ దీనత్వమును వహించి వర్తించుటకు అనుమతించరు.

దురహంకారులై యెక్కువ పాండిత్యసంపదను కలిగియుండుటకంటె, కించిత్ జ్ఞానమే కలవారలైనను దీనభావమును వహించినచో, లేశమాత్రపు వివేకముమాత్రమే కలిగియుండుట మిక్కిలియోగ్యకరము.

నిన్ను గర్వపోతుగ నొనరించి యుప్పొంగిపోవు వానినిగాచేయునట్టి యమితమగు సంపద కలిగియుండుటకన్న, స్వల్పభాగ్యమును కలిగి యుండుటయె నీకు మంచిదికాదా?

తనపూర్వపు దౌర్భాగ్యస్థితిని, తన కనుగ్రహింపబడియున్న దైవ వరప్రసాదమును పోగొట్టుకొనియెద నేమోయను భీతినిగలిగించెడు పవిత్రమగు దైవభక్తిని మరచి, సర్వదా యానందములందే లీనమై మైమరచి యుండు మానవుడు తా నుండవలసిన రీతిగా వివేకము గల వాడై యుండుట లేదు. దుస్థితులందును, సంకటములందును చిక్కుబడి యుండునప్పుడు నిరాశచెంది ప్రవర్తించుచు, తాను మాయందుంచవల సిన దానికన్న తక్కువ విశ్వాసముతో వర్తించువాడు బుద్ధిహీనుడనియు వివేకహీనుడనియు చెప్పవలయును. శాంత సమయములందు మిక్కిలి సురక్షితముగా నున్నానని భావించువాడు, యుద్ధసమయములందు పలు మారు మిక్కిలి క్రుంగుబాటుచెంది భీతిగలవాడై యుండును. ఐతే నీ వెల్లప్పుడును దీనస్వభావము వహించి, నిన్ను నీ వొక యధము నిగ నెంచుకొనుచు, నీ మానసము నెల్లప్పుడు క్రమపద్ధతి యందుంచు కొన శక్తిగలవాడ వగుదు వేని, సులభముగ నేరములను చేయుటకు పాలుపడవు; అపాయకరములగు పరిస్థితులయందు తగుల్కొనవు.

నీ హృదయము భక్త్యావేశము నుప్పొంగునప్పుడు, ఆభక్తిజ్వాల నీహృదయ సీమనుండి తొలగింప బడినచో, నీస్థితి యేతీరున నుండునో ధ్యానించుట నీకు చాల ప్రయోజనకరము.

ఈ రీతిని నీవు జ్ఞానమును కోల్పోయియుండుట తటస్థించు నేని, నీకు జ్ఞానోపదేశమును గావించుట కొరకును, మా మహిమ వెల్లడి యగు టకును, కొంతకాలమువరకు నీకు జ్ఞానము తగ్గించ బడెననియును అటుల తక్కువచేయబడిన జ్ఞానము తిరుగ నీకు లభించుననియు జ్ఞప్తియం దుంచుకొనుము.

నీవుకోరుకొనురీతి యెల్లప్పుడును సంపదలయందే తులతూగు చుండుటకన్న యిట్టికష్టములు నీకు పలుమారులు సంభవించు చుండు టయే యెక్కువలాభము.

ఒక డనేక స్వప్నదర్శనములను యూరటలను గలిగియుండుట చేతను, వేదగ్రంథ జ్ఞానసంపన్నుడై యుండుటచేతను, లేక ఏదియో యొక యున్నత పదవియందుండుటచేతను యోగ్యుడని యెన్నతగను. ఐతే దీని స్థానమునందు స్థిరస్థాయియైయుండి దైవసంబంధమగు త్యాగ

బుద్ధి గలవాడై, సర్వకాలములందును పరిపూర్ణ పవిత్ర హృదయముతో
దేవుని ఘనత కొరకగు యత్నములు చేయుచు, తనను మిక్కిలి యధ
మునిగ భావించుకొనుచు, నిష్కపటియై తన్నుతాను నిరసించుకొనుచు,
పరులవలన పొగడబడుటకుమారు తృణీకరింపబడుటకే సంతోషించు
నట్టి మానవుడే, వాస్తవముగ యోగ్యతగలవాడని యెన్నదగును.

---

## సారాంశము

దైవభక్తి సంపన్నుడై యుండునంత మాత్రముననే వాస్తవముగు
నట్టియు, దృఢమగునట్టియు పవిత్ర వర్తనుడని యెన్నుటకు వీలులేదు.
దైవ నిర్మాణము ననుసరించి యెట్టి స్థితిగతులందుండవలసి వచ్చినను,
దైవసేవయందు పవిత్రమగు దైవభక్తి గలిగియుండు వాడే యోగ్యుడనం
బడును.

దైవభక్తి యనెడు వరప్రసాదమును గలిగియుండుట, మనము
పడెడు శ్రమలయొక్క ప్రతిఫలముగాదు. మన యోగ్యత ననుసరించి
దయచేయబడిన ప్రతిఫలమునుగాదు. అది స్థిరమగునట్టియు శాశ్వతమగు
నట్టియు ఏర్పాటుగాదు. కాని మనల నాదరించుటకును కాపాడుటకును
మాత్రమే సర్వేశ్వరుడు మనకు ప్రసాదించిన వరమైయున్నది. కొంత
కాలమువరకు మాత్రము నిలచియుండి, తదుపరి యదృశ్యమైపోవునట్టిదై
యున్నది. తమకు యిష్టమగు నపుడీ వరప్రసాదమును మననుండి
తొలగించుచుండును. ఈ పైకారణముచే క్రీస్తువులలో ఎవ్వని
కీవరప్రసాద మనుగ్రహింపబడి యుండునో, అతడు తానొక దైవ
భక్తిపరుడనని గర్వము వహింపతగదు. గర్వపడక దీనస్వభావము
గలిగి దైవ భయభక్తులుగలవాడై, జాగరూకతతో తనకనుగ్రహింపబడి
యున్న వరప్రసాదమును తనయందు మిక్కిలి భద్రముగ కాపాడుకొన
వలయును. ఈ వరప్రసాదము తాను తిరుగ కోల్పోవునప్పుడు తను
వాస్తవముగా నెంతబలముగలవాడై యుండునో నంతకన్న ఎక్కువ
బలముగలిగి యుంటినని తలంచుకొనతగదు. ఈ వరప్రసాదము తన
కనుగ్రహింపబడునప్పుడు, తాను దానిని కోల్పోయెడి దినమున తనస్థితి
యెటులుండునో యను అంశమునుగూర్చి యోచించుకొనవలయును.

ఆ వరప్రసాదమును తాను కోల్పోయినపుడు, దానిని తిరుగ దేవునినుండి స్వీకరింపగలనను యాశతో, తన్ను తాను కాపాడుకొనవలయును.

పలువిధములగు స్థితిగతులయందాతడు, తన పరిపూర్ణ విశ్వాస మంతయును సర్వేశ్వరునియందే నాటి యుంచుకొనవలయును. తన విధులన్నియును నెరవేర్చుచుండునప్పుడు, తగ్గిపోని భక్తిశ్రద్ధలతో యీ వరప్రసాదమును తనయందు కాపాడుకొనవలయును.

దివ్యమగు త్యాగమునందు వాస్తవమగు దీనభావము వహించి యుండుటయందును తానెంత అభివృద్ధి పొందియుండెనో, ఆ అభివృద్ధి ననుసరించి యోగ్యవర్తనయందు తానెంత అభివృద్ధి గాంచియుండెనో యను విషయమునుగూర్చి, విమర్శన గావించుకొనవలయును.

---

## 8 వ అధ్యాయము

## దైవసన్నిధానమున మన అయోగ్యత నంగీకరించుట.

1 శిష్యుడు :— నేను ధూళి దుమారమువలె మిక్కిలి యధముడనై యున్నను, నాప్రభువగు సర్వేశ్వరునితో ముచ్చటించెదను.”

నన్నుగూర్చి నేను ఘనముగ [illegible] కొనియెదనేని, మీరు నాకు ప్రత్యర్థులయ్యెదరు. సత్యమునుగూర్చి పాపములే సాక్షములగును. నా పాపకృత్యములిచ్చెడు సాక్ష్యమునకు నేను ప్రతివాదమేమియు చేయజాలను. ఐతే నేను దీనస్వభావముతో నాయందలి యయోగ్యతను అంగీకరించుచు, ఆత్మీయస్తోత్రమును విడిచి, వాస్తవముగ నేనున్న రీతిగ నేను కేవలము ధూళికి సమానుడని తలంచుకొను చుందునేని తాము నాయందు దయార్ద్రహృదలై యుందురు. జ్ఞాన వెలుంగు నా హృదయమునకు మిక్కిలి సమీపమునకు తీసికొని రాబడును.

ఆత్మీయ స్తోత్రమనునది యెంత స్వల్పముగా నున్నను, నాయందలి అపారమగు అయోగ్యతలో మునిగి అదృశ్యమైపోయి తిరిగి తల యెత్త జాలదు. నాకు జ్ఞాన వెలుంగును గలిగించి, నా యహంకారమును నాశన మొనర్చుటచే, నేనిప్పుడెట్టిస్థితియం దుండునది యికముందు

నాస్థితి యెట్టులుండునది, గతించిపోయిన కాలమునందు నేనేస్థితియం దుండినది, నాకు తాము తెలియజేయుచున్నారు. ఏలయనగా నేను మిక్కిలి యధముడనుగావున ఈ విషయము నిదివరకు తెలిసికొనజాల నైతిని. మీరు నన్ను విడిచివేయుదురేని, నేను వ్యర్థుడనై యెందుకును కొరగానివాడనై పోవుదును. తాము కనికరదృష్టితో వీక్షింప ననుగ్ర హింతురేని, నేనపుడే బలవంతుడనై నూతన యానందము గలవాడ నగుదును.

నాపాపభారముచే నధోగతి పాలైపోవుచున్న నన్ను, తామింత శీఘ్రముగా పైకిలేవనెత్తి, యింతి పరిపూర్ణదయతో యాలింగనము చేయుట చూడ, మిక్కిలి వింతగ తోచుచున్నది.

2 ఇదియంతయును తమ దయా ప్రభావమువలననే జరుగుచున్నది.

అనేక యవసరములందు మీదయయే నాకు సాయముచేయు చున్నది. దుఃఖకరములగు అపాయస్థితినుండి మీదయయే నన్ను కాపాడి రక్షించుచున్నది. వాస్తవముగా పలువిధములగు ఘోరవిపత్తులనుండి తమ దయయే నన్ను విముక్తునిగ చేయుచున్నది.

ఏలయనగా:—నన్ను నేనే ప్రేమించుకొనుటచే, నేను భ్రష్టు డనై పోవుచున్నాను. అపవిత్ర హృదయుడనై పోవుచున్నాను. పవిత్ర హృదయుడనై తమను ప్రేమించుటచే నన్ను నేను గుర్తెరుగగలిగి, తమను గ్రహింపజాలుచున్నాను. తమ్మును పవిత్రహృదయముతో ప్రేమించుట చేతనే, నా యహంకారమునంతయు శీఘ్రము నిర్మూలము గావించుకొను చున్నాను.

ఏలయనగా:-మహోన్నతానంద దాయివగు ఓ ప్రభు, నాయర్హ తకు మించినట్టియు, నేను మీనుండి కోరగలిగినట్టియు, ఆశింపగలిగి నట్టియు ఫలములకన్న నెక్కువగు ఫలములను తాము నాకు పుష్కల ముగా దయచేయుచున్నారు. స్వామీ! మీ ఖ్యాతి మిక్కిలి ఘనముగ ప్రకాశించునుగాక.!

ఏలయనగా:—తమనుండి మేలును పొందుటకు తగిన యర్హత లేశమైనను నా యందు లేకున్నను, మీ మొడల కృతఘ్నులైన దుర్మార్గు

లను సైతము తాము మిక్కిలి యుదార భావముతోను, అపారమగు దయ తోను మేలొనగూర్చుచుండుట తమరు మానియుండలేదు.

స్వామి! మేమందరమును దుర్మార్గమును విడిచి, మా మానసము లను మీరు చూపుచున్న జ్ఞానపదముల దెసకు మరల్చుకొని, తమ సన్ని ధికి వచ్చునటుల అనుగ్రహించి, మే మెల్లప్పుడును తమ యెడల కృతజ్ఞు లమై దీనభావముతో తమయందు భక్తిశ్రద్ధలు కలవారలమై యుండునటు లను గ్రహింపుడు. ఏలయన:-తమరే మా మోక్షము, తామే మా బలము.

---

## సారాంశము

మానవుని పతనమునకును, నాశనమునకును గర్వమే కారణము. గర్వము వలన ప్రతిమానవునకును మితిమీరిన స్వప్రేమయును, తాను నిర్దుష్టుడనను వ్యర్థమగు తృప్తియును నేర్పడుచుండును. ఇట్టి యపాయ కరమగు పరిస్థితి యేర్పడకుండునటుల చేసికొనుటకు, సర్వేశ్వరుని యెదుట ప్రతి మానవుడును తనను గూర్చి యోచించుకొనవలయును. సర్వేశ్వరుని కనుల యెదుటనే యాలోచించుకొనవలయును. దైవ విశ్వాసమువలన జ్ఞానమును సంపాదించుకొన వలయును. అజ్ఞానాంధ కారమునబడి ప్రాకులాడక, జ్ఞానమార్గము ననుసరించి సాగిపోవల యును. దేవుని సన్నిధిని మండుచుండెడు దివిటీయొక్క వెలుగునందు తాను నిశ్చయముగ యెట్టి యోగ్యతకలవాడై యున్నాడో, లేక యోగ్యత లేనివాడై యున్నాడోయను అంశములను పరిశీలింపవల యును. ప్రతిమానవుడును తన నీచత్వమును అధమత్వమును ఆమూలా గ్రముగ గ్రహించు కొనవలయును.

గతించి పోయిన కాలమునందు తనస్థితియెటులుండెనో, యిప్పు డెటులున్నదో, యికముం దెటులుండ బోవునో యను విషయములను గూర్చి ప్రతిమానవుడును విమర్శన గావించుకొన వలయును. ప్రతి వ్యక్తియు దీనత్వమును వహించి యుండవలయును. ఈ రీతిని మానవు డనుసరింప జాలినచో, కరుణా మయుడగు దేవుని మహోన్నతశక్తి వంతమగు ప్రేమ తప్పక యా మానవుని పైకిలేవనెత్తి, వానికి జ్ఞానో

దయను ననుగ్రహించును. అటు లనుగ్రహించెదనని సర్వేశ్వరు డే మాట యిచ్చియున్నాడు. తన వాగ్దానములను తప్పక నెరవేర్చును.

## 9. వ అధ్యాయము

## సర్వమునకు మూలాధారమగు సర్వేశ్వరునకే సర్వమును సమర్పింప వలయును.

జేసునాథస్వామి:-

కుమారా, నీవు నిశ్చయమగు సంతోషము ననుభవింప వలయు నను కోరికగల వాడవైనచో, నేనే నీ కడపటి ముఖ్యమగు యాశ యమై యుండవలయును.

పలుమారు నీవు స్వక్షేమమునందే అక్రమానురాగము గలవాడవగు చున్నావు. ప్రపంచ విషయానురాగము లందును చిక్కుకొనుచు న్నావు. కనుక నేనే నీజీవితా శయమను భావమును గలిగియుండి, అట్టి శుద్ధ భావమహిమచే నీ స్వక్షేమము దెసకును ప్రపంచవిషయముల దెసకును పరుగిడుచున్న నీ యక్రమ వాంఛలను పవిత్ర వంతములుగ నొనర్చుకొనుము.

ఏ సందర్భమునందైనను స్వలాభాపేక్షయే కలవాడవైయుండు నెడల, నీవు వెంటనే ఆంతరంగికముగ సొమ్మసిల్లి శుష్కించి పోయె దవు. గనుక సర్వవిషయములను నాకే యర్పణ చేయుము. ఏలయందువా సర్వమును నీకనుగ్రహించినది నేనే.

సమస్తమును మహోన్నత గుణరాశియగు మానుండియే నీవు లభిం చుచున్నదని గ్రహింపుము. మే మే సర్వమునకు మూలకందము, గాన సర్వమును తిరుగ మాకే యర్పింపుము.

స్వల్పులును, గొప్పవారును, భాగ్యవంతులును, నిరుపేలును అంద రును సమానముగ, మూలాధారమగు మా నుండియే వారి జీవాధార జల మును పొందుచున్నారు.

ఏ మానవులు మాకు మనస్ఫూర్తిగ విశాల హృదయముతో సేవచేయుదురో, వారికి పుష్కలముగ వరప్రసాదముల ననుగ్రహింతుము. ఐతే ఏ మానవుడైనను మమ్ముగాక నితరమేదైన ఘనముగనెంచి, తానేదేని పుణ్యకార్యము చేయునెడల, దానిని తన స్వశక్తి సహాయము చేతనే చేయజాలెనను యహంకారము గలవాడై, ఆ పుణ్యకార్యమును మా కర్పణ చేయకున్నచో, నాతడు సత్యమగు యానందమునం దోల లాడ జాలడు. అంతేగాక పలువిధ శ్రమలను ఆవేదన లనుభవించును. కనుక యే మంచికార్యము నీ వాచరించినను, దానిని నీ వాచరించితి వనియెడు యహంకారము పొందతగదు.

ఏ మానవుడైనను సద్గుణసంపన్నుడైయున్న యెడల, అట్టి సద్గుణ సంపద తనస్వంత మైనదని తలంపతగదు; సర్వమును దైవమునకే సమర్పింపవలయును.

ఏల యందువా! దైవసహాయము లేకున్న మానవుడుచేయునదేమి యును లేదు.

సర్వమును మేమే ప్రసాదించి యున్నాము. కనుక సర్వమును మాకు తిరుగ సమర్పింపబడ వలయునని మేము కోరుచున్నాము.

మేము మీకు ప్రసాదించెడు దానికంతకును మీరు మాకు కృత జ్ఞతా సూచకవందనము లర్పింప వలయునని మిగుల కఠినముగ నాజ్ఞా పించు చున్నాము.

3. ఈ సత్యమువలననే డాంబికాతిశయ మంతయును తరుమ గొట్టబడును.

దైవాశీర్వాదమును, సత్యమగు త్యాగమును గల మానవుని హృదయమునందు అసూయగాని, అసు దారతగాని యుండబోవు. అది యును గాక స్వేచ్ఛ వాని హృదయమున పాదుకొని యుండ జాలదు. ఏమనగా దైవ సంబంధమగు త్యాగము స్వరమును జయిం చును. ఆత్మశత్రులన్నియును త్యాగమువలన విస్తరించును. నీవు నిశ్చయ జ్ఞానముగల వాడవైన, మాయందొక్కరియందు మాత్రమే నీవానంద మును ననుభవింపగలవు, మాయందే నీవాశగలవాడవై యుందువు. ఏల

యనగా దేవుడుతప్ప మరెవ్వరును యోగ్యులుకారు. తత్కారణముచే దేవునినే యందరికన్న నెక్కువగ శ్లాఘింపవలయును.

---

## సారాంశము

మన మాచరించెడు సర్వకార్యములందును దైవమునే యుద్దేశించి యాచరింప వలయుననియు, కడపటి యాశయముగ సర్వమును దైవమునకే యర్పింపవలయుననియు, ఇతర మేమియును మన తలంపులయందుంచుకొన కూడదనియు, న్యాయము, కృతజ్ఞత, స్వలాభము అను యీమూడును నేకమై నిశ్చయించుచున్నవి.

కార్యాచరణశక్తిని మనము దేవునినుండియే పొందుచున్నాము. గనుక న్యాయము ననుసరించి మనచర్యలన్నియును వారికానందకరమగు స్వభావము కలవై యుండవలయును.

కృతజ్ఞతా ధర్మము, యేమని యాజ్ఞాపించుచున్నదో గమనింపుడు. మనకు వరప్రసాదములను దయచేసి, వానినన్నిటిని మనయందు కాపాడుచుండువారు దేవుడే గావున,మనకనుగ్రహింపబడు వరప్రసాదములన్నిటినిగూర్చి మన మాయన మహిమనే నుతింపవలయును.

మనస్వలాభాపేక్ష మనకే సూచనచేయుచున్నదో చూడుడు :—

దేవుడే మనయందు దయజూపువాడు. ప్రపంచమునం దన్నిటికంటెను వాస్తవమగు యాదరకర్త, మనకు ముందురానున్న మోక్షముకొరకై అట్టి దయామయుడగు దేవుని యెడల యెల్లప్పుడును స్నేహభావము గలిగి యుండవలయును.

కనుక మన సర్వకృత్యములందును దేవునికి సంతోషమును కలిగింపవలయును. సత్యమగు పావన సంకల్పము కలవారలమై, అట్టి సంకల్పాను సారముగ క్రియల నాచరించు చుండవలయును.

దేవుడే సర్వ క్షేమములకు పరిపూర్ణ మూలాధారము. గనుక, మనముచేయు సత్కార్మలయొక్క పొగడ్తనంతయును వారికే సమర్పించవలయును.

మనయందలి లోపములవలని దుర్బలత్వంతయును మనకే యారోపించుకొని, వానిని దయామయుడగు దేవుని కెరుక పరచుకొని, అందు మూలమున మన స్థితిగతులను చక్కపరచుకొన వలయును.

ఏ మానవుడు తన శూన్యతను చక్కగా గ్రహింపగలుగునో, అట్టి మానవుని యెడల దేవుడెల్లప్పుడును మిగుల ప్రీతిగలవాడై యుండును.

---

## 10 వ అధ్యాయము

## ప్రపంచానురాగ విసర్జన, దైవ సేవ, ఇవియే పరమానంద కరములు.

శిష్యుడు :— స్వామీ! ఇప్పుడు తిరుగ నేను తమతో ముచ్చటించెదను. మిన్నకుండుట నాకిష్టము లేదు.

స్వర్గాధిపతివై యున్న నా ప్రభువా! నాపాలిటి దైవమా తమ సముఖమున తమకు వినవచ్చునటుల ముచ్చటించెదను.

తమయెడల భయభక్తులుగల వారలకొరకై తాము దాచియుంచిన తమ ప్రేమాధిక్యతామృత మెంత మాధుర్యమైనది! తమను ప్రేమించువారలకును తమకు హృదయపూర్వక సేవచేయు వారలకును తాము మహోపకారులై యున్నారు.

మిమ్ము ప్రేమించుభక్తులకు మీరొసంగెడు దివ్య జ్ఞానామృతము వర్ణనాతీతము. తాము నాకొక విషయమున విశేష దయచూపియున్నారు, అది యేదన :— నేనంతకుముందు (ప్రపంచమున) లేనివాడనై యుండగా, తాము నన్ను సృష్టించియున్నారు. నేను తమనువిడిచి దూరముగ తొలగిపోయినపుడు, తాము తిరుగ తమకు సేవచేయుటకై నన్ను తమ దరికిచేర్చుకొని, తమను ప్రేమించ వలసినదని నాకాజ్ఞ నిడుచున్నారు.

శాశ్వతప్రేమకు మూలాధారులగు తమమహిమ నేను ఎంతని కొనియాడగలను!

నేను దుష్టుడనై భ్రష్టత్వమునొందిన పిమ్మట సైతము, నన్ను మరు వక రక్షించెదమని వాగ్దానము చేసియున్నారు. మిమ్ము నేనెటుల మరువ గలుగుదును! తమ సేవకుడనైన నాయెడల, నేనాశించిన దానికన్న నెక్కువగా తమ యపార దయారసము ప్రవహింప జేసియున్నారు. నా యోగ్యతకు మించిన తమదయను, ప్రేమను నాకు జూపియున్నారు.

నా యెడల తాము కనబరచిన యనుగ్రహమునకు నే నేమికృత జ్ఞతను చూపగలను? ఏలయనగా:- నా కనుగ్రహించిన దయ నందరికి మీ రనుగ్రహించి యుండలేదు. విషయాను రాగములన్నిటిని విసర్జించి ప్రపంచముపై రోసి, మత జీవితము నవలంభింపగల్గు శక్తిని నాకు దయ చేసి యున్నారు. ఇట్టి వరప్రసాద మందరకు దయచేయ బడలేదు. ఇట్టి మహోపకారము తాము నా కనుగ్రహించి నందులకు తమయెడల నేనేమి కృతజ్ఞతను చూపగల వాడను?

సృష్టియంతయును తమకు సేవచేయువలసిన విధికలదై యుండగా, తమను నేను సేవించుటయనున దొక ఘనకార్యము కాదు.

తమకు సేవచేయుటకైనను తగిన యర్హతలేని నా వంటి నీచుని సైతము తమ చెంతకు తీసికొని తమకు మిక్కిలి ప్రియులును యోగ్యులు నగు తమ యితర సేవకులతో పరిచయమును గలిగించెదమని వాగ్దా నము చేయుచున్నారు; అభయహస్త మిచ్చుచున్నారు. హా స్వామీ ఇది యెంతటి ఘనకార్యము. ఎంత ఆశ్చర్యకరమయిన విషయము.

3. నా సర్వమును తమదై యున్నది. అది యంతయును తమసేవ యందే వినియోగించెదను. తమకు నేనుచేయు సేవకన్న తమరే నా కెక్కువసేవ చేయుచున్నారు.

మానవుని సౌకర్యము కొరకుగాను తమచే సృష్టింపబడియున్న పరలోక భూలోకములు మీ యాజ్ఞలను నిర్వహించుటకు సంసిద్ధములై ప్రతిదినమును తాము వానికొసగుచున్న యుత్తరువుల ననుసరించి ప్రవర్తించు చున్నవి.

ఇంతియకాదు. మానవుని సేవకొరకై తమ దేవదూతలను సైతము నియమించి యున్నారు.

వీని యన్నిటికన్న నింక ఘనమగు మరొండు విషయమేమనః- తాము సైతము మానవునకు సేవచేయుదుమని మాట నిచ్చియున్నారు. అంతేగాక తమను సైతము మానవుని కర్పించి వేయుదుమని వాగ్దానము చేసియున్నారుగదా-

4. అయ్యో తామా విధముగ నాకు దయచేసియున్న వేలకొలది మేలులకుగాను తిరుగ నేను తమకేమి యర్పింపజాలుదును. నేను జీవించి యుండు నంతకాలమును తమకు సేవలుచేయు చుందును.

నిశ్చయముగ తాము సర్వ సేవకులను గౌరవములకును శాశ్వతమైన పొగడ్తలకును అర్హులైయున్నారు. నిశ్చయముగ తాము నా యేలికయై యున్నారు. నేను తమ బీదసేవకుడను. నాకు గల బలమంతయును తమ సేవయందే వినియోగించవలసి యున్నాను. తమను నుతించుచుండుటయందు నే నెప్పుడు నలసట చెందవలసిన వాడనుగాను. ఇటుల ప్రవర్తించుటే నాకు మిక్కిలి ప్రియము. ఇదియే నా వాంఛయై యున్నది. నా యందలి లోపములన్నియును, తాము పూర్తిచేయుదుమని తామే నాకు నమ్మకముగా చెప్పుచున్నారు.

5. తమకు సేవచేయుటయు, తమ కొరకై ప్రపంచ విషయములన్నిటిని తృణీకరించుటయు మిక్కిలి ఘనమైన కార్యము. ఏలయనగాః- మిక్కిలి పవిత్రవంతమగు తమ సేవచేయుటకు యే మానవులు హృదయపూర్వకముగ దీనులై యంగీకరించెదరో, వారలెక్కువ వరప్రసాదమును పొందుదురు. తమ ప్రేమకొరకై ఏ మానవులు ప్రపంచ విషయ వాంఛలన్నియును విసర్జించెదరో వారికందరికిని స్పిరితుసాంతు సర్వేశ్వరుడు మిక్కిలి మాధుర్యమగు ప్రశాంత పరిస్థితులను కల్పించుదురు.

ఏ మానవులు, దేవరవారి ఘనత కొరకై ప్రపంచ చింతలను విడిచి, మోక్షమునకు గొంపోజాలెడు యిరుకు మార్గమున ప్రవేశించెదరో ఆ మానవులు మానసిక స్వాతంత్ర్యమును పొందుదురు.

6. మానవునికి స్వాతంత్ర్యమునొసగి అతనిని పవిత్రవంతుని జేయు దైవసేవయెంత మనోహరమైనది; ఎంత ఆనందకరమైనది !

దైవభక్తియెడల దాస్యము వహించియుండు మతజీవనము ఎంత పవిత్రమగు ఆశ్రయమైయున్నది. ఇట్టి పావనమగు మతజీవనము నవలం

భించి యుండువారు దేవ దూతలకు సమానులగుచున్నారు. వీరు దేవునికి మిక్కిలి ప్రియులు. ఇట్టి మఠజీవితముల ననుసరించు వారలనుగాంచి, పిశాచములు భీతిచే గడగడవణకి పోవుచుండును. ఇట్టి మఠజీవులు విశ్వాసులందరిచేతను మెచ్చుకొనబడ వలసినవారలు.

మనోహరమగు నీ దివ్య దాస్యము సర్వదా అభిలషింప దగినది. ఇట్టి దైవసేవ వలననే మాకు అఖండ సౌఖ్యమును అనంతానందమును సంప్రాప్తించును.

---

## సారాంశము

దేవుని సేవామృతము నిశ్చయముగ నెంత మాధుర్యము. అట్టి మధురమగు దైవ సేవా తత్పరులమై యుండుటకు మనకెన్ని ప్రేరేపణ హేతువులుగలవు. శూన్యత నుండియేగదా మనము దేవునిచే సృష్టింపబడి యున్నాము. మనము దేవుని యుపదేశములయెడల కనుపరచిన విధేయతవలన భ్రష్టులమై నశించిన వారలమైనను, దేవుడు మనలను కరుణ వాత్సల్యములతో మన్నించి, విడుదలచేసియున్నారు. ఇది మిగుల వింతయగు విషయమేగదా!

ఇహలోక పరలోకములును సృష్టియందలి ప్రతి జీవరాశియు దేవదూతలు సైతము మానవుని ప్రయోజనముకొరకే సృష్టింపబడిరి. దేవుని ప్రత్యేక వరప్రసాదమువలననే క్రైస్తవ జ్ఞానమును మానవములకు తెచ్చుకొనజాలుచున్నారు. మరియు నిదియంతయును మనకు చాలనట్లుగా దయామయుడగు దేవుడు తాను ఎక్కువగా ప్రేమించిన తన ఏకకుమారుని సైతము మన రక్షణముకొరకును, మన యూరటకొరకును మనకర్పించి యుండిరిగదా!

కావున, మనమందరమును మనలను దేవునికి సమర్పించుకొని లేశమాత్రమును వెనుదీయక, పరిపూర్ణముగా వారిసేవకే మనల నర్పించుకొన వలసినదిగా అన్ని అంశములును మనలను పురిగొల్పుచున్నవి. మనము పరిపూర్ణముగా దైవ సేవాలోలురమై యుండవలయును.

దైవసంబంధమగునట్టి సేవకావృత్తియందు తప్ప, మరియేయితర సేవయందును సత్యమగు మానసిక హృదయ స్వాతంత్ర్యము లేదు.

## 11. వ అధ్యాయము

## మన హృదయానురాగములను పరిశీలించుకొని, యవి మితిమీరకుండు నటుల మట్టుపరచుకొన వలయును

1. జేసునాథస్వామి:- కుమారా, నీవు గ్రహింపవలసిన విషయము లింక ననేకములున్నవి. వానిని నీవింకను నేర్చుకొని యుండలేదు.

శిష్యుడు:- దేవా! ఆ విషయములను తెల్పుడని వేడుకొను చున్నాను.

జేసునాథస్వామి:- నీ వాచరించు కార్యములందలి నీ వాంఛ లన్నియును మాకు సంతోషకరములుగ నుండవలయును. నిన్ను నీవు ప్రేమించుకొనక, మా కోర్కెల ననుసరించి వర్తించుటకు, నిష్కపట మగు నుత్సాహము కలిగియుండవలయును. పలుమారు నీవు నీ వాంఛల వలన మిగుల యుద్రేకపూరితుడవగుట తటస్థించును. నీ వాంఛలచే ప్రేరే పింపబడిన యుద్రేకముతో కార్యాచరణను మిగుల తీవ్రముగా నారంభింతువు. ఐన నీ వటుల యుద్రేకపూరితుడవై తీవ్రతను వహించుట మా మహిమకొరకా, లేక నీ స్వప్రయోజనము కొరకాయని,వివేకముతో నాలోచించుకొనుము.

మమ్ము గూర్చిన యోచనతప్ప, యితర యోచనలేవియును నీ హృదయమునందు లేనివాడవై, మేము నీకెట్టి యనుజ్ఞల నిచ్చినను వానితో తృప్తిగలవాడవై యుండుము. స్వలాభాపేక్ష నీయందు లేశ మాత్రమైనను కలిగియున్న యెడల, దానియందలి కాంక్షయే నీకు పలు మారు విఘ్నములు గలిగించి, నిన్ను కలవరపెట్టుచుండును.

2 మాతో యాలోచించుటకుముందు నీకాంక్షలపై నేమాత్ర మును యాధారపడియుండకుండ జాగరూకతను వహించుము. అటుల జాగరూకుడవై యుండనియెడల నీవు పశ్చాత్తాపము నొందవలసివచ్చును. అంతకుముందు సంతోషకరములుగను మిక్కిలి ప్రశస్తమైనవిగను యెంచు కొని నీవు కాంక్షించినట్టి విషయములే నీకసంతృప్తిని కలిగించును. ఏల యనగా యోగ్యమైనదిగ కనబడు ప్రతిసంకల్పమును వెంటనే యాచ

రణయందు పెట్టతగదు. అదియునుగాక నీకారంభమున వ్యతిరేకముగ కనుపించు యేకోర్కెయైనను తక్షణమే తృణీకరింపనురాదు.

యోగ్యమగు వాంఛనా సంకల్పముల సందర్భములందు సైతము, కొన్నికొన్ని సమయములందు కొంతవరకు నిగ్రహమును చూపుటయే యవసరమై యున్నది, అటుల నిగ్రహమును వహింపనియెడల నీకుగల మితిమీరిన యుత్సాహము నీమానసమును చెదరగొట్టును. తత్కారణముచే నీమానసము పరధ్యానమున పడిపోవును. నీఅంతరంగమును క్రమశిక్షణయం దుంచుకొనజాలని వాడవై, పరులవలన అపనిందల పాలై పోయెదవు. లేక పరులు గలిగించెడు ఆటంకములవలన నీవకస్మాత్తుగా నీమానసిక హృదయ నిశ్చలతను కోల్పోయెదవు.

3 మరికొన్ని సందర్భములలో నీపైనీవు తీవ్రతను వహించి, యింద్రియ కాంక్షల నెదిరింపవలయును. శరీరమునకు సంబంధించిన కామక్రోధాది విషయానురాగములను మిక్కిలి ధీరత్వముతో నెదురించి, నీయంతరాత్మకు లొంగియుండునట్లు చేయవలయును.

సర్వవిషయములందును యింద్రియములు తక్షణమే వశీకృతమై మిక్కిలి స్వల్పమైనట్టియు, మిగుల నిష్కపటమగునట్టియు సామాన్యమగునట్టియు విషయములతోనే తృప్తినొందుట పరిపాటియగు నంతవరకు వానిని దండించి, దాసత్వము నందుంచవలయును. అట్టి పోరాటమున సంభవించెడు కష్టములను ధైర్యముతో సహింపుము.

---

## సారాంశము

మానవుడు తన కోర్కెలన్నిటిని దైవేచ్ఛ ననుసరించి సవరించుకొనవలసిన బాధ్యతగలవాడైయున్నాడు. ఈ బాధ్యత కారణయుక్తమగు నీతి సూత్రముల ననుసరించి ముఖ్యముగా మన ప్రయోజనముల ననుసరించియే యేర్పాటు చేయబడినది. మనవాంచల ననుసరించియే మనము శ్రమపడునెడల భగవదిచ్ఛకు వ్యతిరేకుల మగుదుము. అందుచే మనకోర్కెలు నెరవేరజాలవు. కనుక మన మాశాబద్ధులమై దుఃఖముల పాలుబడి కలవరపడియెదము.

మనము చంచల మనస్కులముగాన మన కాంక్షలను, యోచనలను, పన్నుగడలను భగవదిచ్ఛకు వదలి వేయనిచో, ఆరంభమున మన కనుగుణ్యముగ నుండునటుల కనుపించు విషయమును తరుపరి మనకు అసంతృప్తిని కలిగించును.

మన మేవిషయము నెడలనైనను మితిమీరిన యాశాబద్ధులమైయున్నయెడల, మన మనో స్వాతంత్ర్యమును హృదయశాంతిని రెంటిని కోల్పోయెదము,

ఏదొక కార్యమును క్రమప్రకారము నిర్వహింపనిచో మన పొరుగువానికి యపనిందలను తెచ్చిపెట్టిన వారమగుదుము. అందుచే కష్టములందు చిక్కుకొని, పరులతోడ భిన్నాభిప్రాయములు గలవారలమై, వారికి విరోధులమగుదుము. అటులగాక దైవకోరిక ననుసరించియే శ్రమపడితిమేని, మన మాచరింప తలపెట్టిన కార్యములను చక్కగ నిర్వహించి, పరిపూర్తి గావింపజాలుదుము. జయమెప్పుడును మనదై యుండగోరినచో, దైవ యిష్టానుసారముగ నడువుము. అప్పుడు మనము శాంతమును పరిపూర్ణ సంతృప్తిని అనుభవింప గలుగుదుము.

---

## 12 వ అధ్యా

## సమానాభ్యాసము - కామవికారములతో పోరాటము

1. శిష్యుడు:- నా యేలినవారా! నాకు తెలిసియున్నంతవరకు శాంతగుణము నాకు మిక్కిలి అవసరమైయున్నది. ఈ ప్రపంచ జీవితము అనేక దుస్థితుల కాస్పదమైయున్నది.

ఏలయన, శాంతము గలవాడనై జీవయాత్ర సలుపుటకు నేను చేయగల దంతయు చేసినను, నా జీవిత మెప్పుడును పోరాటము దుఃఖము లేనిదై యుండజాలదు.

2. జేసునాథస్వామి:- అది వాస్తవమేగాని కుమారా, పరిశోధనల పాలుగానట్టియు, దుస్థితులకు లోనుగానట్టియు, శాంతము కొరకు నీవు శ్రమపడుట మా కిష్టము లేదు.

ఐతే పలువిధ కష్టములందు పాటుబడుచు,అనేకములగు దుస్థితుల యందు పరిశోధింప బడినప్పుడు మాత్రమే, నీవు శాంతము గలవాడవని చెప్పదగును. అంతమాత్రము నీవు కష్టపడజాలనిచో, ఉత్తరించుస్థలాగ్ని ఘోరభీకర బాధల నెటుల సహింప గలుగుదువు? రెండు విధముల కష్టములు రానున్నప్పుడు, తెలివిగల మానవుడెప్పుడును అందు తక్కువ కష్టమునే యెన్నుకొన వలయును.

ముందు నీపైబడనున్న శాశ్వత నరకబాధలను తప్పించుకొనుటకు ప్రస్తుతము దేవుని ప్రేమకొరకై, నీవు సంభవించు కష్టములను శాంతముగ సహించియుండ నలవరచుకొనుము.

ఈప్రపంచ మానవులెట్టి కష్టముల ననుభవింపరనియును, కొన్ని సమయములందు వారు కష్టములపాలైనను, అవి మిక్కిలి స్వల్పమగు నవనియును తలంచుచుంటివా? మిగుల సుకుమార జీవితము గడపుచున్న వారియందు సైతము నట్టిస్థితిని కనుగొనజాలవు.

3 ఐనవారలు సంతోషానుభవముకలిగి యున్నారనియును, వారి యిష్టానుసారముగ ప్రవర్తించుచుండిరనియును, ఆకారణమువలన స్వల్ప సంకటములను లక్ష్యము చేయకున్నారనియు చెప్పుదువా?

4 వారు కోరునదంతయును వారికి కలిగియున్నదనియే యూహించుకొమ్ము. అయినను, అట్టివారిసంపదలు ఎంతకాలమువరకు నిలచియుండునని తలంచెదవు?

ఈప్రపంచమున సంపన్నులైయుండు వారందరును, పొగవలె నదృశ్యులై పోయెదరు. వారలదివరకనుభవించుచుండిన సంతోషము లన్నియును జ్ఞప్తియందుంచుకొనువారలు సైతము ఉండబోరు.

అంతేకాదు. వారు సజీవులైయుండు నపుడు సైతము కఠినమును, విసుగును జనింపజేయు సంకటములును, భీతియును లేనివారలై కేవలము ప్రపంచ సంపదలనే యనుభవింపజాలరు. వారనుభవించెడు సంపదలతో గలసి పై దుస్థితులును గలిగియుండును. ఏల యనగా — ఏ విషయములందు సంతోషము కలదని వారు భావించుకొందురో, యా విషయములనుండియే వారికి మిగుల దుఃఖము సైతము సంప్రాప్తించుచుండును. అది యటుల వారలకు తటస్థించుచుండుట న్యాయము.

ఏలయనగా:- వారు మితిమీరిన భోగలాలసులై వానివెంటనంటి పరుగు లిడిరెదరు కాని, సంభ్రమమును దుఃఖములను కలిగియుండక కేవలము వారాశించెడు భోగములవలన తృప్తి లభింపగూడదు.

అయ్యో, ఈ ప్రపంచభోగము లెంత క్షణికములు; ఎంత మోసగాండ్రు; ఎంత కలుషపూరితములై నవి! ఐనప్పటికిని, మానవులు మూర్ఖతవలనను, అజ్ఞానాంధకారముచేతను, పై సత్యమును గ్రహింప జాలకున్నారు! పశుప్రాయులై నశింపవలసియున్న యీ మానవజీవితమునందలి లవమాత్రపు భోగములకొరకై తమ యాత్మలకు నిత్య మరణమును తెచ్చి పెట్టుకొనుచున్నారు.

ఐనను బిడ్డా! నీవు మాత్రము కామ సౌఖ్యాలోలుడవై దాని వెంటనంటి పరుగిడకుము. నీ కోర్కెలన్నిటిని త్యజించుకొనుము.

"దేవునియందు సంతోషము గలవాడవై యుండుము. నీ కోర్కెలను వారు తీర్చెదరు."

5. సత్యప్రవర్తనయందు నీవు సంతసము గలవాడవై యెక్కువగా మా యాదరణలను పొంద నభిలషింతువేని, ప్రపంచానురాగములనన్నిటిని తృణీకరించి, నీచప్రపంచ భోగములను త్యజించుటవలననే మా యాశీర్వాదముల నందజాలుదువు. నీ యాత్మకు మోక్షమగు యాదరణ యనుగ్రహింపబడును. సృష్టియందలి విషయానురాగముల నీవెంత యెక్కువగ విసర్జించెదవో, అంతయెక్కువ మనోహరమగు నట్టియు, శక్తిదాయకమగునట్టియు మా యాదరణలను పొందుదువు. కాని ప్రథమమున ప్రపంచానురాగములతోడి సంఘటనలవలన కొంత దుఃఖమును శ్రమలను యనుభవింపకయే మా యౌదార్యములను పొందజాలవు.

చిరకాలమునుండియు నీ కలవాటైయున్న దురభ్యాసము నీకు విఘ్నము గలిగించును. కాని యోగ్యమగు మరియొక యభ్యాసమువలన నా దురభ్యాసమును తొలగించుకొనవచ్చును.

శరీర మీ విషయమున నెదిరించును గాని ఆత్మ ప్రభావముచే నయ్యది అదుపులో నుంచవచ్చును. నీ పూర్వవిరోధి నీకు మోసమును కలిగించి, అందుమూలమున నీకు కొన్ని సంకటములను కలిగించును

బన నీవు గావించుకొనుచుండు దైవ ప్రార్థనలవలన నా కోలసర్పమును పారద్రోలవచ్చును. అంతేగాక ఎల్లప్పుడు నీ వేదియో యొక ఉప యోగకరమగు పనియందు నిమగ్నుడవగుచో, ఆ సర్పము నీదరికి రాకుం డునటుల నీ శ్రమయె యొక యాటంకమును గలిగించును.

---

## సారాంశము

శాంతమునకన్న మిన్నయగు సుగుణము మరియొకటిలేదు. ఏల యన ఈ ప్రపంచమునందు మనస్థితియెటులున్నను, శ్రమ, అలసట, దుఃఖ ములు, శరీరబాధలు ప్రతిఘటనలు మొదలుగాగల యనేక విధములగు సంకటముల ననుభవింపక తప్పదు. వీని నన్నిటిని సహనశక్తియె యుప శమింపజేయును. కాలానుసారముగ సంప్రాప్తించెడు కష్టములను శాంత ముగ నోర్చుకొనుటవలన శాశ్వత నరక దుఃఖములను తప్పించుకొనజా లుదుము.

క్రీస్తువుడే దేవుని ప్రేమకొరకై కష్టముల ననుభవించుట కిష్టపడ కుండెనేని, యీ సృష్టియందలి యే మానవుడు శాశ్వతములగు ప్రతిఫలము లకొరకు కష్టపడ నిచ్ఛగల వాడైయుండును?

పుణ్యసంపాదన మార్గములయందు పెక్కు కష్టము లున్నను అదే రీతిగ నా మార్గముల వలననే సౌకర్యములును యాదరణలును సైతము గలవు. జ్ఞానసంపాదన కొరకై మన మవలంబించెడు మార్గములయందు మనము కష్టము లనుభవింపవలసి యున్నాముగాని, మన మనుభవించెడు కష్టముల కప్పుడప్పుడు దేవుడు మనల నూరడించుచు సౌకర్యముల నేర్పరచుచుండును.

ప్రపంచ జీవితమునందు సంభవించుచుండెడు స్వల్పకష్టముల కును అట్టి కష్టానుభవమువలన మనకు పరలోక జీవితమున లభింపనున్న మహనీయమును అగోచరమగునట్టి ఆనందభాగ్యమునకును ఎంత వ్యత్యా సమున్నదో యోచించుకొనుము.

ఈ ప్రపంచములో సహనమునందు తప్ప మరిదేనియందును సత్యమగు శాంతము లేదు. శాంతము వలననే మనము మన యాత్మలను స్వాధీనమునందుంచుకొని భద్రపరచుకొని కాపాడుకొనగలము.

---

## 13 వ అధ్యాయము

## జేసునాథస్వామి ననుసరించి దీనత్వమును వహించియుండు సేవకుడు చూపవలసిన విధేయత

జేసునాథస్వామి:-

కుమారా:- ఏమానవుడు దేవునియెడ విధేయతను కనుపరచక ప్రవర్తించునో, ఆ మానవుడు దేవ వరప్రసాదమును పోగొట్టుకొనును.

ఏ మానవుడు తన స్వలాభము కొరకై ప్రత్యేకముగా కొన్ని సదుపాయములను కలిగియుండ వలయునని కోరుకొనుచుండునో ఆ మానవుడు సామాన్యమగు సదుపాయములను సైతము పోగొట్టుకొనును.

తన పెద్దలకు ధారాళముగను, మనస్ఫూర్తిగను విధేయుడై యుండని యెడల, యింద్రియానువర్తియగు నాతని శరీర మాతని యనుపువందు లేదనియు, పలుమారాతని నెదిరించుచున్నదనియు సణుగుచుండుననియు మనము గ్రహింపవలయును.

కనుక నీ శరీరమును నీ యదుపునందుంచుకొనవలయునని కోరుదువేని, పెద్దలయెడల తక్షణమే విధేయుడవై ప్రవర్తింప నభ్యాసము చేసికొనుము.

మానవుని అంతరంగము చెడక రోగ్యమైనదిగ నున్నయెడల బాహ్య శత్రువులను సులభముగ జయింపవచ్చును.

నీ యంతరాత్మ బోధల ననుసరించి నీవు ప్రవర్తింపని యెడల నీ యాత్మకు నీకంటె నెక్కువ దుష్టుడును యెక్కువ కష్టములను కలిగించునట్టి శత్రువు మరియొక డుండబోడు.

నీ భౌతికశరీరమును నీయధికారముక్రింద నుంచుకొనదలంతువేని స్వతిరస్కారము మిక్కిలి యవసరమైయున్నది.

నీవింకను మితిమీరిన స్వక్షేమాభిలాష కలవాడవై యున్నావు గాన, పరుల యిష్టానుసారముగ పూర్తిగ విధేయుడవై వర్తించుటకు భీతిల్లుచున్నావు.

2. సర్వశక్తివంతులమై, మహోన్నతులమై శూన్యతనుండి ప్రపంచమునంతయు సృష్టింపగలిగిన మేమే నీకొరకై మిక్కిలి దీనత్వమును వహించి మానవ మాత్రులకు విధేయులమై వర్తించి యుండగా, కేవలము మృత్తికారేణువుతో సమానుడవై శూన్యుడవై యున్న నీవు సర్వేశ్వరుని కొరకై మానవులకు విధేయుడవై యుండుట యొక గొప్పవిషయము కాదు.

అందరికన్న నెక్కువ దీనత్వమును వహించి నేను ప్రవర్తించుచున్నాను. మానవు లందరియందును మిక్కిలి యాధముడుగ నెన్నబడియుంటిని. నేను వహించిన దీనభావమును గాంచి నీవు నీ గర్వమును జయించుటకు గాను నేనటుల ప్రవర్తించి యున్నాను. గనుక ధూళితో సమానుడవగు మానవుడా! నీ కన్నయోగ్యులగు వారియెడల విధేయుడవై వర్తింప నేర్చుకొనుము. మిక్కిలి దీనస్వభావమును వహించి ప్రవర్తింప నభ్యసింపుము.

నీ యిచ్ఛానుసారముగ వర్తింపక సర్వవిషయములందును విధేయుడవై వర్తింపుము.

3. నీ యెడల నీవే కోపము వహించుకొనుము. స్వాభిమానమును చంపుకొనుము. నీయందు గర్వాతిశయమును తలచూపనీయకుము.

వ్యర్థమానవుడా! ఏల సణుగుకొనియెదవు? పాపీ! నిన్ను ఖండించువారి కేమిబదులు చెప్పుకొనగలవు? నీవు పలుమారు దుష్కృత్యముల నాచరించి సర్వేశ్వరున కాగ్రహము కలిగించి యున్నావు. అందుచే నీవనేక సందర్భములందు నరకమున పడిపోవలసి యుంటివి.

కాని మాకృపాదృష్టి నిన్ను కాపాడియున్నది. మా సృష్టియందు నీ యాత్మ మిగుల నమూల్యమైనదై యుండుటయే దానికి కారణము. (a) మా దయామహిమను నీవు గ్రహింపజాలుటకును (b) మేము నీకను

గ్రహించెడు వరప్రసాదములను నీవు స్వీకరించి మా యెడల కృతజ్ఞుడవై ప్రవర్తింప నేర్చుకొనుటకును (c) నీ పెడతెగక సర్వదా దీనత్వమును వహించి నిశ్చయముగ విధేయతా భావముతో నీ పైవారికి లొంగియుండు టకును (d) ఇతరులు నీ యెడల చూపెడు తృణీకార భావమును గాంచి శాంతము వహించియుండ నభ్యసించుటకును మేము నిన్ను కొపాడి యున్నాము.

---

## సారాంశము

ఇతరులకు విధేయులై లొంగియుండుట కేవలము జ్ఞానమార్గాను వర్తుల ప్రత్యేక సద్గుణమని మనము తలంచరాదు. లౌకిక సంబంధమగు నట్టియు లేక క్రైస్తవ వేద సంబంధమగునట్టియు న్యాయాధికారము నకు ప్రతి లౌకికుడును విధేయుడై యుండవలయునని జేసునాథస్వామి యును అపోస్తులును ఆజ్ఞాపించియున్నారు.

పంచభూతాత్మకమై యింద్రియానువర్తియగు నీ శరీరమును జ్ఞాన మార్గమునందు వర్తింపజేయుటకు మనకు దేవుని వరప్రసాదము లవసర ములై యున్నవి.

ఏ మానవులు తమ పెద్దలకు విధేయులై వర్తించెదరో, వారికి అట్టి వరప్రసాదములను ధారాళముగా దైవ మొసగును. వాస్తవముగా మన జీవితారంభమున మన పరిస్థితు లెటులుండెను. ప్రకృతి ననుసరించి ఆరంభ మున మన మందరము శూన్యులము. న్యాయము ననుసరించి చూచిన మనము పాపులము.

దీనత్వము, విధేయత మొదలగు సద్గుణములను మనయందు పురి గొల్పుటకు పైజెప్పిన సత్యములు చాలని యెడల, తాను దైవమైయుండి యును హానిసత్వమును సహితము వహించి మానుపైని కొరత వేయ బడవలయునని విధింపబడిన శిక్షకు బద్ధుడైన జేసునాథస్వామిని తలచు కొని మనమొక్కమారు స్లీవపై మన దృష్టులను సారించి యోచించు కొనియెదము గాక.

## 14 వ అధ్యాయము

### మనము నిర్వహించెడు మంచికృత్యములను గూర్చి గర్వముచే నుప్పొంగి పోకుండుటకు దేవునిచే తీర్మానింప బడు రహస్యన్యాయ తీర్పులను తలంచు కొనుట.

శిష్యుడు:- నా దేవా! పిడుగులను బోలు మీ న్యాయతీర్మానములు నా నెత్తిపై బడుచున్నవి. భీతిచే గడగడ వణకి పోవుచున్నాను. అందుచే నా శల్యములన్నియును కదలిపోవుచున్నవి. నాయాత్మ మిక్కిలి బెదరి పోవుచున్నది.

నేను విస్మయుడనై నిలిచియున్నాను. జ్యోతిర్మండలములు సహితము మీ యభిప్రాయమునందు పవిత్రములుగ నుండజాలవని నేను తెలిసికొనుచున్నాను.

దేవదూతలు సైతము, పాపులై యుండిరని గ్రహించి తాము వారిని సైతము శిక్షింపక వదలి వేయుటలేదు. అట్టి సందర్భమున నాగతి యేమి కానున్నదో యెరుగజాలను.

ఆకసమునుండి నక్షత్రములు సైతము క్రిందరాలిపడిపోవు చున్నవి. ధూళిమాత్రుడనైన నేనెటు లహంకారమును వహించి నిలువ గలను?

శ్లాఘనీయమగు సత్కార్యముల నాచరించియున్నవారు సైతము మిక్కిలి యధోగతి పాలైయున్నారు.

ఇంతకుపూర్వము దేవదూతల కాహారమగు అప్పమునే భుజించుచు జీవించుచుండు వారలు సైతము ప్రస్తుతకాలమున కేవలము పందులు మెసవుచుండెడు పొట్టును సంతోషముతో భుజించుట కనుగొనుచున్నాను.

2. తమ దివ్యహస్తమును వెనుకకు మరల్చుకొందురేని, ఏలినవారా! పవిత్రతయనునది యెచ్చటను కాన్పించక అదృశ్యమై పోవును.

తాము మాపైని అధికారమును వహించి మమ్ము నడుపరేని, మేమెంత జ్ఞానులమైనను ప్రయోజనము లేక పోవును.

తాము మాపైని అధికారమును వహించి మమ్ము నడుపరేని మాజ్ఞానము వలన లాభము లేకపోవును.

తాము మమ్ము కాపాడి రక్షింపనియెడల పవిత్రతకు క్షేమముండ బోదు.

తమ పావన నిర్మాణము మమ్ము కాచి కాపాడనియెడల, మే మేర్పరచుకొన గలుగు రక్షణములవలన మాకు ప్రయోజన ముండ జాలదు.

ఏలయనగా, మాగతికి మమ్ము వదలివేయుదురేని, మేమీ ప్రపంచానురాగమున మునిగి నశించిపోవుదుము. అతుల దయతో తమదర్శన భాగ్యమును మాకు ప్రసాదింతురేని మేములేచి జీవింప గల్గుదుము.

ఏలయనగా, మేము లేశమాత్రమైనను మనస్థైర్యము లేనివారమై యున్నాము. తమ దయవలనే మేము బలముగల వారలమగుదుము. మేము లవమాత్రమేనియు నుత్సాహములేని వారలమై, మందమతులమై యున్నాము. తమ యనుగ్రహమువలన మాత్రమే ఔత్సుక్యవంతుల మగుదుము.

3. నేనుమిక్కిలి దీనుడననియును నీచుడననియును భావించుకొన వలయును. నేనెక్కువ యోగ్యుడుగనున్నటుల తోచుచుండినను నాయందు లేశమాత్రమేనియు యోగ్యత లేదనియే నేను భావించుకొన వలసియున్నాను.

ఓ నాప్రభువా! అగాధమగు సముద్రమునుబోలు తమన్యాయ ములైన తీర్పులక్రింద నేనుమిక్కిలి హీనపరచుకొన వలసియున్నాను. నేను శూన్యుడను; శూన్యతతప్ప మరేమియు నాయందు లేదని గ్రహించుచున్నాను. అట్టిసందర్భమున నన్నుగూర్చి నేను మిక్కిలి ఘనముగ ప్రశంసించుకొన జాలు టెక్కడ?

నే నయోగ్యుడను. దురహంకారము పొందుటకు నాకు నమ్మిక మెచ్చుటగలదు! అయ్యో ఎంతమత్సరము! తరింప నలవిగాని యో మహాంబుధీ! నీముందర నేనెంతవాడను. నేను సర్వశూన్యుడను; కేవ

లము లేనివారలలోనె లెక్కచేయ బడవలసినవాడను. గేవా, తాము నాపై విధించెడు న్యాయములైన తీర్పులనియెడు మహాసముద్రమునందు నాయహంకారమంతయు నశించిపోవుచున్నది.

4. తమదృష్టియందు శరీరధారులగు మానవులెంతటి వారలు? బంకమన్ను తనను పలువిధములుగ మార్చగలిగియున్న మానవుని ఎదిరించి తాను ఘనతగల దానినని పొగడుకొన జాలునా?

వాస్తవమునకు దేవుని కధీనమైయున్న హృదయముగల మానవుడు తనతోడి మానవులు తనను గూర్చి సల్పెడు వ్యర్థప్రశంశలను చూచుకొని గర్వముచే యుప్పొంగిపోడు.

సత్యస్వరూపుడగు దేవునిదయవలన హీనభావమునందు తీర్చబడి యున్న మానవుని యీ ప్రపంచమంతయు నేకీభవించి యైనను కదలింప జాలదు.

ఏమానవుడు తన యాశలన్నియు సర్వేశ్వరుని యందు నెల కొల్పుకొని యుండునో, యా మానవుడు తనను గూర్చి పరులు గావించెడి పొగడ్తలవలన లేశమాత్రమైనను గర్వమువహింపడు.

ఏలయనగా:-అటుల పొగడుచుండు వారలందరుకూడ శూన్యులే. వారుచేయు పొగడ్తలన్నియును శబ్దమాత్రముతోనే గతించిపోవును. ఐన భగవంతునిచే బోధింపబడు సత్యవాక్యములే సర్వకాలమును నిలచి యుండును.

---

## సారాంశము

భ్రష్టులైపోయిన దేవదూతల విషయమున దేవుడు తీర్మానించి యున్న న్యాయములైన తీర్పునుగూర్చి మనము మన మానసముల యందు గావించుకొనియెడు చింతకన్న మనయందెక్కువ ననుభవమును గలిగించి, ప్రవిత్రమగు దైవభీతిని పురికొల్ప జాలెడు విషయము మరియొకటేదియును లేదు. కనుక పలుమారు లాదైవన్యాయతీర్మానము లనుగురించియే స్మరించుచుందము. డంబమునకుగాని, గర్వమునకుగాని,

దురహంకారమునకుగాని లేశమైన మనయందవకాశ మీయకుండ వలయును.

దైవదృష్టియందు పరమండలము సైతము పవిత్రముగను దివ్యమైనదిగాను నుండజాలదు. 2. మనమో-మిక్కిలి పాపులము. దుష్టస్వభావము గలవారలము. నిశ్చయముగ మన మీ రెండు అంశములను గురించియే ధ్యానించుకొనుచున్న పక్షమున, మనయందు తలచూపుచుండెడు దుష్టస్వభావగుణముల నన్నిటిని అరికట్టుటకు అట్టిచింతనమే సరిపోవును.

మనలను దేవునితో బోల్చుకొని తారతమ్యతను చూచుకొందుము, అపారమగు వారి పరిపూర్ణత్వము నందలి రహస్యములను గూర్చి యోచింతము. అన్నిటికన్న నెక్కువగ వారి పావనత్వమును గూర్చియు, న్యాయమును గూర్చియు మిక్కిలి గంభీరమగు వారి తీర్మానములను గురించియు యోచించుకొనియెదము. వారి యాధిక్యము మ్రోల మనము శూన్యులమని కనుగొన జాలుదుము. మనలను గూర్చి మన మే విధముగా యోచించుకొనినను, కేవలము మనము పాపులము, శూన్యులమై యున్నటుల తేటపడును.

కనుక మానవులారా! మనము గర్విష్టులమై కన్నుమిన్ను గానక ప్రవర్తించుటకు మనకాధారముగనుండజాలు కారణము లేమైన గలవా?

---

## 15. వ అధ్యాయము

### మనమేదేని వాంఛించునప్పుడు మన మెటుల దేవుని ప్రార్థింపవలయును? ఏటుల ప్రవర్తింప వలయును?

1. జేసునాథస్వామి:- కుమారా! అన్ని సమయములయందును నీవీ విధముగ ప్రార్థించుము. "ప్రభువా! తమకు ప్రియమగునేని తమ యిచ్ఛవచ్చినటుల యీ కార్యమును నెరవేరనిండు. నాకర్తా! యిది తమ మహిమకు తగినదైనయెడల మీ ప్రతిష్ఠకొరకే సమర్థింపబడునుగాక

ఇది నాకవసరమైనదనియు, యుపయోగకరమైనదనియు తాము తల చెదరేని, తమ ఘనతకొరకై దానిని నేను వినియోగ పరచుకొను నటుల యనుగ్రహింపుడు. అదినాకు హానికరమైనదనియు నాయాత్మ శ్రేయస్సునకవసరము కాదనియు మీకు తోచినయెడల అట్టి కాంక్ష నాకు లేకుండునటుల అనుగ్రహింపుడు. ఆ వాంఛను నామానసమునుండి తొలగించుడు. మానవునకు కలుగు ప్రతివాంఛయు క్రమమైనదనియు యోగ్యమైనదనియు తోచుచుండినను, అది స్పిరితుసాంక్తునుండి వచ్చినది కాకపోవచ్చును. ఏదియో యొకవిషయమును వాంఛించుమని నన్ను పురికొల్పునది స్పిరితుసాంక్తు సర్వేశ్వరుడా, లేక పిశాచమా లేక నీమానసమా యనెడు అంశమునుగూర్చి సత్యమగు తీర్మానమును గావించుకొనుట దుస్తరము.

స్పిరితుసాంక్తు చేతనే పురికొల్పబడి నడుపబడుచున్నామని ఆరంభమున తలంచుకొనుచుండు వారలలో పెక్కుమంది తుదకు మోసపోయి యున్నారు.

2. కనుక వాంఛనీయమైనదని నీకు తోచిన దేనినైనను సర్వదా దైవభీతితోను దీనస్వభావముతోడను కోరుచు “దానిననుగ్రహింపుమని” సర్వేశ్వరుని ప్రార్థింపవలయును.

అన్నిటికన్న నెక్కువగ స్వపరిత్యాగమును గావించుకొని సర్వమును మా కర్పించి ఈ క్రింది విధముగ మమ్ము ప్రార్థింపుము.

“ప్రభువా! మిగుల యుక్తమగున దేదియని తమకు తెలిసియే యున్నది. కనుక సర్వము తమ యిష్టానుసారముగ జరిగిపోవును గాక. నాకు తమ యిచ్ఛవచ్చినదాని నెంత యనుగ్రహింప దలచితిరో యెప్పుడనుగ్రహింప దలచితిరో, అంతయే ఆత్మ అవసరములకే ప్రసాదింపుడు.

తమకు తెలిసియున్న రీతిని తమ యిచ్ఛవచ్చిన రీతిని యెక్కువగ తమ ఘనతకొరకై నన్ను నడపింపుడు.

తాము నన్నెక్కడ నుంచదలచితిరో యచ్చటనే యుంచుడు. సత్యసందర్భములందును తమ యిష్టానుసారముగ నన్ను నడిపించుకొనిపొండు.

నేను తమ దివ్య హస్తములందే యున్నాను. తమకు ప్రియమగు రీతిని నన్ను నడిపించుడి.

ఇదిగో నేను. మీ సేవకుడను. సర్వ విషయములందును మీకు విధేయుడనై యుండుటకు సంసిద్ధుడనై యున్నాను.

ఏలయనగా నాకొరకై నేను జీవించవలయుననెడి కాంక్ష నాకు లేదు. మీ కొరకై జీవింపవలయునను కోర్కెగల వాడనై యున్నాను. తమయందు విశ్వాసము గలవాడనై యున్నాను."

---

## దైవచిత్తము నెరవేర్చునిమిత్తము ప్రార్థన

శిష్యుడు:- మిక్కిలి కరుణామయుడవగు జేసునాథా! మీదయ నాయందుండునటులను అంత్యకాలము వరకు నన్ను విడువకుండ నటులను దయచేయుడు. తమకు తృప్తికరమగునట్టియు విషయములనే నేను కోరుకొని దానిని నెరవేర్పవలయునను కాంక్షగలవాడనై యుండునటుల సర్వదా నాకనుగ్రహింపుడు. తమ కోర్కెప్రకారము నా మానసము వర్తించునటుల దయజూపుడు. తమ చిత్తమును నామనసు వెంబడించు నట్లును, తమ చిత్తమున కనుగుణ్యముగ నుండునటులను ప్రసాదింపుడు. తమకు తృప్తికరమగున దేదియో, నాకు తృప్తికరముగను తప్పితరము కానిది నాకు కానిదిగా నుండునుగాక! తమకు ప్రియము గాని దానిని నేను కోరకుందునుగాక.

ప్రపంచవిషయములందునే ననురాగములేని వాడనై యుందును గాక. తమకొరకై ప్రపంచమువలన తృణీకరింపబడి, యెవ్వనికి తెలియని వ్యక్తినై యుండగల స్థితిని ప్రేమించెదను గాక.

వాంఛనీయమై యున్న సర్వవిషయములందును తమ మీదనే యాధారపడి యుందునుగాక. తమరిని గూర్చి యెల్లప్పుడును తలచుకొనుచు, నా హృదయము శాంతము కలదైయుండుగాక. తామే

నా హృదయమునకు నిజమగు శాంతమును దయచేయువారు. తామే నా హృదయమున కాధార భూతులు.

తమ దయ నాయెడల లేనిచో నివియన్నియు మిగుల కఠినములై యుండును; తృప్తిలేనివై వ్యాకులకారణము లగును.

ఈ శాంతమునందే నిరంతర మహోన్నత యోగ్యమూర్తివై వెలయుచున్న తమయం దైక్యమగుటచే లభించునట్టి శాంతమునందే నేను నిదురించుచు, నాశ్రమను తీర్చుకొనియెదను.

---

## సారాంశము

రాబోవు కాలమున దేవునికి ప్రీతికరములగు కోర్కెలను మనము కలిగియుండుటకు గాను ప్రస్తుత కాలమున మనకోర్కెలన్నిటిని పరిపూర్ణముగ దేవుని కర్పింపవలయును. మనకు సంప్రాప్తించుచుండు వాని యందు దేవుని కితరయుద్దేశము లేదియు లేవు. వారేమి యుద్దేశించినను అదియంతయును వారిమహిమకొరకె. అదియంతయును మనమోక్షప్రాప్తికొరకె గనుక, దేవుని దివ్యాభిప్రాయము ననుసరించియే ప్రవర్తించుటకు వారు మనకు నియమించిన విధులను నెరవేర్చుటకు మనము మనస్వార్థమును త్యజించి,ఆ విధులను నెరవేర్చుట సహేతుకమై యున్నది.

ఇందుకొరకై మనమేమి చేయువలయును? దేవుని కెప్పటికేది ప్రియమగునో, అప్పటికదియే మనకును ప్రియమైనదిగ నుండవలయును.

2. ఇతరుల ప్రోత్సాహముచేగాక మనస్వేచ్ఛాపూర్వకముగా నెట్టి యాజ్ఞల నుల్లంఘింపక మనచిత్తవృత్తి సర్వదా దేవుని చిత్తవృత్తిని నిలిచియుండునటుల ప్రవర్తించు చుండవలయును.

3. బుద్ధిపూర్వకముగ నెన్నడును పాపకార్యము లాచరింపకుండ వలయును. దేవుడు మననుండి కోరువానిని మన మెన్నడును తిరస్కరింపకూడదు.

దేవునికి ప్రియమగు విషయమునే మనము కోరుటయు, వారి యిష్ట మునకు వ్యతిరేకముగ మనమేమియును కోరకుండుటయును, పరలోకమున దేవునికి ప్రియులై యున్నవారి లక్షణములలో నొకటియై యున్నది.

ఈ ప్రపంచ జీవితమునందు సైతము యట్టివైఖరినే యవలంబించుటకు ప్రయత్నములు చేయ మొదలిడియెదము. సర్వకాలములందును మనకు యశస్కరములగునట్టియు, సౌఖ్యదాయకములగునట్టియు విషయములన్నిటిని సకాలములో నిర్వహించుటకు సాధ్యమగునటుల నిప్పుడే యారంభించి నేర్చుకొనియెదము.

---

## 16 వ అధ్యాయము

## వాస్తవమగు నోదార్పులను మనము దేవునినుండియే పొందవలసి యున్నాము.

శిష్యుడు:- నా సౌఖ్యము కొరకై నేనేమి వాంఛింప గలిగినను లేక నాకు కావలసి యున్నదానిని నేనూహించుకొన జాలినను ఆ విషయములకొరకై ఈ ప్రపంచ జీవితమున నేను కనిపెట్టుకొని యుండ లేదు. పరలోకమునందు పొందగలుగుదునను యాశయే నా జీవిత కోర్కె. ఏలయన: ఈ ప్రపంచాదరణలన్నియు నే నొక్కడనే పొంద గలిగి, అందువలన లభించు యానందమునంతను అనుభవింపగల్గినను అవి చిరకాలము నిలిచి యుండునవిగాదు.

కనుక నా యాత్మమా! నీవు సర్వేశ్వరునినుండి తప్ప ఇతరు లెవ్వరునుండియు పరిపూర్ణాదరణలను పొందజాలవు. నిండు సంతోషము ననుభవింపజాలవు. సర్వేశ్వరుడే నిరుపేదల నాదరించెడు దాత. దీనుల పాలిటి రక్షకుడు.

నా యాత్మా! కొద్దికాలము కనిపెట్టుకొనియుండుము. దేవు డనుగ్రహించియున్న వాగ్దానములను వారు నెరవేర్చువరకు వేచి

యుండుము. స్వర్గమున నీవు నీకు వలయునంత సౌఖ్యము ననుభవింప జాలుదువు.

ప్రపంచ సౌఖ్యముల యెడల మితిమీరిన యక్రమ వాంఛలు కలదానవైన, స్వర్గసంబంధమగు శాశ్వతానంద సౌఖ్యమును కోల్పోదువు.

అనిత్యములగు యిహలోక సంబంధమగు విషయములు నీ కెంత వరకవసరములై యుండునో, అంతవరకు మాత్రమే వినియోగించుకొనుము.

స్వర్గసంబంధమగు శాశ్వతానందములనే నీ వాంఛలయొక్క యాశయములుగా నుంచుకొనుము.

అనిత్యమగు నీ ఐహిక సంపదలవలన నీవు పరిపూర్ణ తృప్తిని గాంచ జాలవు. ఏలయనగా నీ విట్టి యనిత్య సంపదలను ననుభవించుటకొరకై సృష్టింపబడి యుండలేదు.

2. దేవునిచే సృష్టింపబడిన భౌతిక సామగ్రియంతయు నీవు సంపాదించ గలిగినను, అందువలన సుఖమును బడయజాలవు. నీ మోక్షానందమును, సౌఖ్యమును ప్రపంచ సృష్టికర్తయగు దేవునియందు మాత్రమే కనుగొనగలవు.

ఈ ప్రపంచ విషయములను మెచ్చుకొనుచు, బుద్ధిహీనులు పొగడు చుండునట్టివి సౌఖ్యములుగావు. కాని యోగ్యులగు క్రైస్తవులు కోరు నట్టియు క్రైస్తవులలో ఆధ్యాత్మిక మార్గానువర్తులై పవిత్ర హృదయులై స్వర్గసంబంధమగు విషయములయందే నిమగ్నులై యుండు పుణ్యపురుషులు కొన్ని సమయములందు రుచిచూచి యున్నట్టివియు నిజమైన సౌఖ్యములు.

మానవమాత్రులవలన పొందగల యాదరణలన్నియును కేవలము వ్యర్థములైనవి. కొద్దికాలమువరకు మాత్రమే నిలచియుండును.

సత్య స్వరూపుడగు దేవుడనుగ్రహించెడు అంతరంగికమైన యోదార్పులన్నియో సత్యమైనవి.

దైవభక్తుడగు మానవుడు తన కొదరణకర్తయగు జేసునాధుని మరువక, సదా తన హృదయమున ధ్యానించుచు, "స్వామీ నన్ను విడనాడకుము. స్వామీ, ఎల్లప్పుడును సర్వ స్థలములయందును నాకు

తోడునీడయైయుండుట కనుగ్రహింపుము. మానవులనుండి నాకేమాత్ర మును సౌఖ్యము లభింపకుండవలెననెడు కోర్కె కలిగియుండుటయే నేనాసించెడు యూరటయై యుండును గాక" అని స్వామిని ప్రార్థించు కొనుచుండును. ఊరట నా నుండి తొలగించబడునేని తమ చిత్తము నన్ను పరిశీలన చేయుటకొరకై తాము విధించెడు న్యాయమగు నిర్ణ యము ఈ రెండును నాకు ఘనమైన యూరటలుగా నుండును గాక.

ఏలయనగా :— దేవర వారెల్లప్పుడును ఆగ్రహాపూరితులై మమ్ము బెదరించుచుండరు.

---

## సారాంశము

మహోన్నతమగు మోక్షమును శాశ్వతముగ ననుభవించుటకై సృష్టింపబడిన మానవుడు,యిచ్చట యీ యిహలోకమున ప్రత్యేకమగు యెట్టి మనోరథ సిద్ధియందును వాస్తవమగు యూరటను గాని, సౌఖ్యమును గాని పొందజాలడు. సృష్టియందలి వస్తు సముదాయమంతయును ఏక ముగా ననుభవించుట సాధ్యమైనను, లెక్కకు మిక్కుటమగు కొంతకు లను హృదయానురాగ బాహుళ్యతను యెన్నడును తృప్తిపరుప జాలవు. దేవుడుమాత్రమే మానవునకు యూరటను యనుగ్రహింపగలరు. వారు మాత్రమే మానవునకు సంతోషమును చేకూర్చి సౌఖ్యపెట్టగలరు.

ఐన దేవునిచే యనుగ్రహింపబడు ఈ సంతోషము, సౌఖ్యము పరలోకమునందె పూర్తిచేయబడును. ఐనను దేవుడు తమయందు విశ్వా సీముగల తమ సేవకుల కందరకును యెప్పటికిని నశింపని యీ యనుభవ ముల యందలి రుచిని ముందుగ నీలోకములోనే అప్పుడప్పుడు చవి చూపుచుందురు.

ఇట్టిసందర్భమునందు వారు మనకనుగ్రహించెడు యూరటలకు మనము వారికి కృతజ్ఞులమై వానిని వినియోగించు కొనుచుండవలయును. ఆ యూరటలన్నియు తిరిగి యెప్పుడో యొకానొక సమయమున మన నుండి తొలగింపబడునని తలంచుకొను చుండవలయును. దేవునిచే యను

గ్రహింపబడు యీ యూరటలను గోల్పోయెడి దుస్థితికి వచ్చినప్పుడు, అవిలేకున్నను తృప్తిగలవాగమై యుండుట కభ్యసింపవలయును. తిరుగ ఆ యూరటలన్నియును దేవుడు దయచేయునను యాశతో మనసులను నిలువద్రొక్కుకొని వారాయూరటల దయచేయు తరుణముకొరకై శాంతముగ నోర్చుకొని యుండుటకు నభ్యసింపవలయును.

---

## 17 వ అధ్యాయము

## మన పరామరికల భారమంతయు సర్వేశ్వరునిపై వేయవలయును.

1. జేసునాథస్వామి :—

బిడ్డా— నీకు మిక్కిలి తగినదేదియో మే మెరుగుదుము. మా యిచ్ఛవచ్చినరీతిని నిన్ను నడిపించుకొని పోవు భారమంతయును మాకే వదలివేయుము.

కేవలము మానవుడు యోచించురీతినే నీవు యోచించుకొనుచున్నావు. మానవస్వభావము ననుసరించియే అనేక విషయములందభిప్రాయము లేర్పరచుకొనుచున్నావు.

2. శిష్యుడు :— స్వామి! తాము బోధించునదంతయును సత్యము. నన్ను గురించి నేను తీసికొనగల శ్రమకన్న నాకొరకై తాము వహింప ననుగ్రహించుచున్న జాగరూకతయె యెక్కువగనున్నది. ఏలయనగా, తన పరామరిక భారమంతయును మీపైనుంచని మానవున కాకస్మికముగా ఘోరమగు గండములు సంప్రాప్తింపవచ్చును.

నా ఏలినవారా!

తమయందు నాబుద్ధి క్రమముగను, సుస్థిరముగను, నిలచియుండిన నాకంతే చాలును. అటుల నిలచి యుండునేని దేవరవారిచిత్తము ననుసరించి నన్ను నడుపుకొనిపొండు, ఏలయనగా తాము నాకొజ్ఞాపించునదంతయును మేలైనదిగా నుండునుగాని మరియొకవిధముగ

నుండదు. నే నజ్ఞానంధకారమునందేపడి ప్రాకులాడ చుండవలయుననుఉద్దేశము తమకు కలదేని, అందుకును తమను శ్లాఘించుచున్నాను. లేక తమరు నన్ను అజ్ఞానంధకారమునుండి వెలుపలకులాగి, ప్రకాశము నందుంచవలయుననెడి కోర్కె కలదేని, అందులకును నేను తమకు ధన్యవాదము లర్పించు చుండెదను.

తాము నన్నాదరించుట కనుగ్రహింతురేని, అందులకును తమను తలంచుకొను చుండెదను. అదియునుగాక నేను కష్టము లనుభవించుచు దుఃఖములందు మునిగియుండ వలయునను కోర్కె తమకుగలదేని, అందులకును సర్వదా పై సందర్భములందునలెనె తమరిని పొగడుచుండెదను.

3. జేసునాథస్వామి :

కుమారా! నీవునా వెంట నంటిరావలయునని కోరుదువేని మేము చెప్పబోవురీతిని కష్టములకోర్చుకొని నిలుచుటకు సంసిద్ధుడవై యుండవలయును.

a) సంతోషముగా నుండుటకెంత సంసిద్ధుడవై యుండెదవో, కష్టములను ననుభవించుటకు అంత సిద్ధమై యుండవలయును.

b) నీవెంత యెక్కువ సంపన్నుడవై యుండ కాంక్షించెదవో, అంత యెక్కువ నిరుపేదవై యుండుటకును వెనుదీయరాదు.

c) శిష్యుడు:- ఏలినవారా! నాకెట్టి దురవస్థలు సంప్రాప్తింప వలయునని తాముద్దేశించినను తమకొరకై వాని నన్నిటిని మనఃపూర్వకముగ నే ననుభవింతును. తమదివ్య హస్తములనుండి వచ్చునదెట్టిదైనను సుఖకరమైనదైనను, కఠోరమైనదైనను, సంతోషకరమైనదైనను, లేక దుఃఖకరమైన దైనను, యెట్టిదైనను యేవస్తువైనను, వానిమంచిచెడ్డల యందును కష్టనిష్టురములందును, లేశమాత్రమైనను లక్ష్యముంచక, అట్టివ్యత్యాసములను తృణీకరించి నేను వాని నన్నిటిని మనస్ఫూర్తిగా స్వీకరించెదను. స్వామీ! పాపకూపమునందు మాత్రము పడకుండునటుల నన్ను కాపాడుడు; నాకంతే చాలును. తామిటు లనుగ్రహించుదురేని మరణముగాని, ఘోరనరకముగాని లవమాత్రమేనియు నన్ను

భీతిల్లజేయలేవు. శాశ్వతజీవమును పొందబోవువారల నామములు లిఖిత మైయున్న పుస్తకమునుండి నా పేరును తీసివేయకుడు.

---

## సారాంశము

దేవుని మూర్తియందు మిక్కిలి ప్రేమగల తండ్రిని కనుగొన జాలుచున్నాము. మనకవసరమగు విషయము లేవియో మన మెరిగిన దానికన్న ప్రేమగల మన పరమపిత కెక్కువుగ నెరుకరై యున్నవి. మన తండ్రియందు గల త్యాగము మిక్కిలి యమోఘమైనది. అందుచే వారు తమ బిడ్డలమైన మన క్షేమముకొరకై యవసరమగు సర్వవిషయ ములను గూర్చి అధికమగు శ్రద్ధను వహించెదరు. వారు మాత్రమే మన సర్వదుస్థితులనుండియును మనకు ముక్తి ననుగ్రహించి మనల ననేకవిధ ములగు మేలులతో నింపివేయుదురు.

వారి త్యాగముపై నమ్మకముతో యాధారపడి, ప్రేమతో వారి యొండజేరి, మన మనస్తాపము లన్నియును వారికే సమర్పించు కొనెదము.

ఈ ప్రపంచ జీవితమునందు మనకేమి పొసగినను పొసగనిండు; నెమ్మదిగ నోర్చుకొని శాంతమును వహించి యుందము. ఏలయన సర్వ శక్తుడగు దేవుని యాజ్ఞ లేనిది మన కేమియును సంభవింపదు. మన యాత్మను కోల్పోవుట మేమోయను భీతితప్ప నితరభయ మేమియును లేదు. మనకు మోక్షమును ప్రసాదించుటకుగాను ఆ కార్యము పరిపూర్తి యగువరకు తమ యుద్యమమును విడువకుండ వలయుననెడి యుద్దేశ ముతో దేవుడు తమ కార్యము నిదివరకే యారంభించియున్నాడు. మన యెడల వారికి గల యుదారత యపారమైనది. అట్టివారి అపర యుదా రతపై మన నమ్మకమంతయు నాధారపడియుండవలయును. మన నమ్మ కమంతయు సత్యమైనదిగ నుండవలయును. తండ్రియెడల బిడ్డల నమ్మక మెట్టులుండునో దేవునియందు మననమ్మకము నటులే యుండవలయును.

---

## 18. వ అధ్యాయము

### జేసునాధు ననుసరించి అశాశ్వతమగు ప్రపంచ దౌర్భాగ్యస్థితులను సహించియుండుటకభ్యసింపవలయును.

జేసునాధస్వామి:-

కుమారా:- నీకు మోక్షప్రాప్తిని కలిగించుటకై మేము మోక్షమునుండి వచ్చియున్నాము. నీ దుస్థితులన్నిటిని మా శిరముపై నిడుకొని యున్నాము. అటులచేయుట మాకవసరమై యుండుటవలన గాదు. సమానగుణమును గలిగి యీ ప్రపంచ జీవితపు కష్టము లన్నిటిని నేర్పుతో భరించుకొను విధము నీవు నేర్చుకొనుటకుగాను, మాయందలి త్యాగప్రభావము వలన హృదయము కరగిన వారమై నీకష్టము లన్నియును మా శిరముపైన పెట్టుకొని యున్నాము. జన్మించిన దాదిగ సిలువమీద కొరత వేయబడి ప్రాణములను విడచువరకు కష్టము లనుభవింపని గడియ లేదు.

కొద్ది కాలములో గతించిపోయెడు యిహలోక సంబంధమగు సంపదలందు మేమెక్కువ లేమి ననుభవించి యున్నాము.

మా మీద యితరులు నేరములు మోపుచుండగా పలుమారు విని యున్నాము. వ్యాకులతను, పరులవలని నిందలను మిక్కిలిదీనత్వముతో సహించియున్నాము.

మేము మానవుల కనుగ్రహించిన మేలులకు ప్రతిఫలముగా వారు మాయెడల కృతఘ్నులై ప్రవర్తించి యున్నారు.

మేము మానవుల మేలుకొరకై చేసిన అద్భుతములకు బదులు, వారు మమ్ముగూర్చి దేవదూషణలు పలికియున్నారు. మేము వారికి బోధించి యున్న నీతి సూత్రములకు ప్రతిఫలముగ వారివలన అపవాదము లనుభవించి యున్నాము.

శిష్యుడు:- నా ప్రభువా తమ జీవితకాలములో తాము శాంతమును వహించి యుండగా, అందును ముఖ్యముగ తమ పిత యుత్తర్వులను పాలించుటయందు శాంతమూని యుండగా ఎందుకు కొరగాని పాపి

నైన నేను తమ యిచ్ఛానుసారముగ సర్వమును శాంతముగ ననుభవించుట ఎంతయును తగియున్నది. తమకు ప్రియమగు నంతకాలము పాపముచే క్రుళ్లి చెడి నశింపనున్న యీ మానవజీవిత భారమును నేనుసహించియుండుట గూడ సరియైనదియే. ఏలయనగా ప్రస్తుతపు మానవ జీవితము భారమై యున్నది. తమదయా ప్రభావము వలన ఇప్పుడిదిమిక్కిలి పుణ్యావంతముగల దనుచున్నది. తమ సాదృశ్య సహాయము వలనను,తమ అర్చ్యశిష్టులు నడచిన మార్గముల యందలి వారిపదచిహ్నముల సహాయమువలనను బలహీనులందరికిని యీ మానవ జీవతము భరించుటకు తగినదిగాను సులభముగాను నున్నది.

పూర్వ వేదకాలమున స్వర్గకవాటము మూయబడి యుండుటచే ఇప్పటికన్న నాటి జీవితము బహు ఆపదలతో నిండియుండెను. స్వర్గ మార్గము మిక్కిలి గాఢమై యెవ్వరికి గోచరము గాకుండునంత యస్పష్టముగా నుండెను. ఆ దినములలో మిక్కిలి కొలదిమంది మాత్రమే స్వర్గ ప్రవేశము కొరకై శ్రమచేసియుండిరి.

ఆ దినములలో న్యాయవర్తనులై రక్షింపబడుటకు తగిన యోగ్యతగలవారు నైతము, తా మనేకపాట్లు పడి తమ దివ్య మరణము వలన మా ఋణవిముక్తిని గావించువరకు స్వర్గలోకమున ప్రవేశింపజాలరైరి.

అహా ! నాకును, తమయందు విశ్వాసముగల వారలందరకును శాశ్వతానంద నిలయమగు స్వర్గలోకమునకు నడుపుకొని పోయెడి సరియగు యోగ్యమైన మార్గమును చూపినందుకుగాను కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పింప వలసియున్నాము.

తాము నడచి చూపిన జీవితమార్గమే, మా మార్గము. తాము మా బహుమానమైయున్నారు. అట్టి తమ సన్నిధానమునకు దివ్యమగు శాంతముతో యాత్ర చేయుదుముగాక.

తాము మా ముందు నడచి మాకు బోధింపకుండినచో,తమ ననుసరించి వచ్చుటకెవ్వరు సాహసింతురు?

మిక్కిలి ప్రసిద్ధిగల తమ సాదృశ్యము మానవుల నేత్రముల యెదుట నిలువనిచో,వారు చాల వెనుకపడి నిలిచి పోయెడివారు.

తామెన్నియో యద్భుతములను గావించి ప్రబోధించినను, మేముచాల మాంద్యము వహించి యుండుటచే మా గతియేమి యయ్యెడిదోగదా ?

---

## సారాంశము

యుక్తమగు రీతిని కష్టముల ననుభవించుటకొరకై మనకు ప్రోత్సాహమును గలిగించుటకుగాను జేసునాథస్వామి మన రక్షణ కొరకై పడియున్న కష్టములనుగూర్చి పలుమారు ధ్యానించుకొను చుండవలయును. మన పాపముల కొరకై వారు సంకటముల ననుభవించి యున్నారు. మనకు సంకటములను గలిగించుటలో దేవుని యభిప్రాయము లేవో యోచించితివా ?

(a) వారి యెడల మనకు గల విశ్వాసమును ఋజావు చేయుటకును.
(b) మనము చేసిన నేరములకుగాను మనలను శిక్షించుటకును.

మనలను దుఃఖములపాలు చేయుటయందలి దేవుని యుద్దేశము లివియే. వారు పావనమగు నిట్టి యుద్దేశములతో మనకు కష్టములు కలిగించుచున్నారు. గాన, పాపులగు మానవులారా! మనము వానిని తప్పించుకొనుటకై వ్యర్థముగ ప్రతిఘటించక, మిగుల దీనులమై వారికి విధేయులమై వాస్తవమగు దుఃఖముతో మనకు సంప్రాప్తించెడి సంకటములన్నియు స్వీకరించి యనుభవింప వలయును. శాశ్వతముగ వారి యుదారతను గూర్చి మనము యోచించి, ధ్యానించు కొనుటకును, సకాలములో దైవ నిర్మాణమునందలి న్యాయమును తృప్తిపరచుటకును, అవకాశము లనుగ్రహింపబడినవారమైన మనమెంత యదృష్టవంతులము! మనకు సంప్రాప్తించుచున్న ఘోర పరిశోధనలన్నియును ఇందుకే బయలుదేరుచున్నవి సుమా ! ఐనను, మనమెన్ని విధములుగ దేవుని యుద్దేశములను వ్యతిరేకించు చుంటిమో చూచితిరా !

a) మనభావమునుగూర్చి యోచించితిమా ! కామ, క్రోధ, మద, మాత్సర్యాది వికారములన్నియును పెచ్చుపెరిగి బలముగ యెదుర్పాటును చేయుచున్నవి. వాని నణచివేయుటయన మిక్కిలిదుస్తరముగ నున్నది.

b) మన హృదయములను గూర్చి యోచించితిమా ! అవి మిగుల కాఠిన్యములై దుఃఖకారణములై మనకు నొప్పిని గలిగించుచున్నవి.

c) శారీరక ప్రకృతినిగూర్చి తలంచుకొందుమన్న, ముక్కోపితనము గలవారలమై స్వల్పకార్యములలోనైతే మాగ్రహపిశాచావేశులమై, సర్వదా చురచురలాడుచుండు స్వభావముగల వారలమై యున్నాము.

మానవప్రకృతియంతయు నీరీతిని దేవునియుద్దేశములకు మిక్కిలి ప్రతికూలమై యున్నది.

ఇట్టి దుష్టప్రకృతిగల మనమందరమును:

a) దేవుడు మనరక్షణకొరకై కనిపెట్టుకొని యుండుటలో నాతడు చూపుచున్న శాంతమును తలంచుకొని యోచింప కుండినను;

b) మనదుష్కృత్యముల నన్నిటిని సహించియున్న దేవుని యుద్దేశముల ననుసరించియు, వారు చూపియున్న మార్గముల ననుసరించియు జీవయాత్ర చేయుటకు ప్రయత్నము చేయకుండినను;

మనపాపములనుండి మనలను రక్షించువారులేక, దౌర్భాగ్యులమై పోవుదము.

కనుక పామరులగు మానవులారా! ఇప్పుడు మనమేలుకొరకై మనకు సంప్రాప్తింప జేయుచున్న కష్ట పరంపరలన్నిటియందును చలింపక, భీతిచే కంపితులుగాక, ధైర్యమును వహించి శాంతహృదయులై యుందుడు.

అటుల శాంతముగ నుండజాలుదుమేని, కడపటి గడియయందు పాపపరిహారార్థము పడెడి కాయక్లేశమును మానసమునం దుంచుకొని, యీ మానవ జన్మయందలి దోషముల నన్నిటిని ఆహుతి చేయుజాలి, అందుమూలముగ నవియన్నియు మన మోక్షసంపాదనా యజ్ఞమునందు మనకు మిక్కిలి యుపయోగ కరమైన వానినిగ చేసికొన జాలితిమని యెడి యూరటను ఆనందముతో ననుభవింపగలము.

---

## 19 వ అధ్యాయము.

## కష్ట నష్టములను సహించియుండుట, నిజమగు సహనశక్తి గలవాని లక్షణము.

జేసునాథస్వామి:-

కుమారా! నీవేమిచెప్పుచున్నావు? మానవుల రక్షణకొరకై మేము పడియున్న శ్రమలను అర్చ్యశిష్టు లనుభవించియున్న కష్టములను తలంచుకొని నీవనుభవించుచున్న కష్టములను గూర్చి మొరపెట్టుటను మానుము. నీవింకను రక్తము స్రవించువరకు పోరాటము సల్పియుండ లేదు.

మిక్కిలి కష్టముల ననుభవించి యున్నట్టియు, మిక్కిలి బలమగు మోహాములచే శోధింపబడినట్టియు, ఘోరదుఃఖముల ననుభవించి నట్టియు, పలువిధ పరిశోధనలయందు సాధనము చేయబడినట్టియు, యితర మానవులతో సరిపోల్చుకొని చూచినచో, నీ వనుభవించు కష్టములు లవమాత్రములు.

కనుక నీవనుభవించుచుండు కొద్ది కష్టములను సులభముగ నోర్చుకొనుటకుగాను, పై వార లనుభవించియున్న గొప్ప కష్టములను గూర్చి, నీ మనసునందు యోచించు కొనవలయును.

నీ వనుభవించు కష్టములు నీకు స్వల్పముగ తోచనిచో నయ్యది నీకు సహనశక్తి లేనందుచేత ప్రాప్తించుచుండును. అవి స్వల్పమైనను లేక గొప్పవైనను వానినన్నిటిని శాంతముగ సహించి యుండగల్గుటకు కష్టించి సాధనముచేయుము.

2. కష్టము లనుభవించుటకు నీవెంత యెక్కువగ తయారై యుందువో, అంతయెక్కువ న్యాయప్రవర్తన గలవాడ వగుదువు: అంత యెక్కువ పాత్రత, పుణ్యము గడించెదవు. నీ మానసము కష్టానుభవము నకు చక్కగా తయారై యుండుటవలనను, కష్టముల కలవాటు పడి యుండుటచేతను నీవు మిక్కిలిసులభముగ కష్టము లు సహింపజాలుదువు.

"ఈతడు నాకెక్కువ యపకారములు చేయుచున్నాడు, గాన నీ విషయము నాతనినుండి నేను సహింపజాలను. ఈ కష్టములు నేననుభ

వింపవలసినవి కావు. నే నెన్నడును తలంపని విషయములనుగూర్చి యీతడు నాపై నిందమోపి దూషించుచున్నాడు. ఐన ఇట్టివిషయముల నితరులనుండి నే ననుభవింప యిష్టపడుదునుగాని యీతనివలన నేననుభవించుట నాకిష్టములేదు. ఇట్టి కష్టనష్టములను అవమానముల నెంతవరకు నేనుసహించుట తగునని నేను తలంచెదనో అంతవరకు మాత్రము సహించెదనుగాని అంతకన్న నెక్కువసహింపను" అని యీ విధముగ నెన్నడును మొరపెట్టుకొనకుము.

సహనశక్తియందలి యోగ్యతను గూర్చియు, అట్టిసహనశక్తిగలిగి యున్నందుకుగాను మనకు జయముగూర్చ నున్నవారిని గూర్చియు, యెంచుకొనక కేవలము తనయెడల గావింపబడిన యపరాధములను గూర్చియు అపరాధముల నాచరించిన వారలను గూర్చియు మాత్రము యెక్కువగ తలపోయుట వెఱ్ఱితనము.

3. తనబుద్ధికి మంచిదని తోచినంతవరకు తప్ప మరేమాత్ర మెక్కువగ కష్టముల ననుభవించుటకును,మనకు ప్రియులగువారినుండి మాత్రమే తప్ప యితరుల నెవరినుండియూ కష్టముల ననుభవించుటకును యిష్టపడని మానవుడు వాస్తవముగ సహనముగలవాడు కాడు.

"తన్ను పరిశోధించువారలు తనకన్న పెద్దవారలా? తనతో సమానులా? తనకన్న తక్కువవారలా? వారు పావనచరితులా? యోగ్యులా? లేక కుటిలస్వభావులా? అయోగ్యులా యనెడు నీవిచారణ వాస్తవముగ సహనశక్తి గల మానవుడెప్పుడును చేయడు.

సృష్టియందలి యే వస్తువునుండి యైనను తనకెన్ని దురవస్థలు సంభవించినను,ఎన్నిమారులట్టి దురవస్థలు ప్రాప్తించినను, అవి యన్నియును తనకు దైవ హస్తముల నుండియే సంభవించుచున్నవని, వానియెడల సమభావము గలవాడై కృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించి, యనుభవించుచు వానినొక యమోఘమగు లాభముగా నెంచుకొనుచుండుట శీలవంతుని లక్షణము.

ఎంతస్వల్ప కష్టమైనను దేవుని కొరకై యనుభవించుచో, అట్టి కష్టానుభవమునకు దైవదృష్టి యందదనికి ఫలము లేకుండబోదు.

కనుక నీవు విజయకాంక్షగలవాడవైనచో, పోరాడుటకై తగు ప్రయత్నములన్నియు గావించుకొని, సిద్ధముగ నుండుము. పోరాటము సలుపనున్నచో, శాంతమనెడు ప్రశస్తమగు జయమును పొందజాలవు.

నీవు కష్టము లనుభవించుట కిష్టములేనివాడవైనయెడల, జయము నీ కక్కరలేదని నిశ్చయించినవాడ వగుచున్నావు.

నీవు జయకాంక్ష గలవాడవైనయెడల, రణశూరునివలె పోరాడుము. శాంతముగ కష్టములను సహించియుండుము.

శ్రమ పడకున్నచో విశ్రాంతి పొందజాలవు. పోరాటము జరుపనిదే జయము లభింపదు.

శిష్యుడు :- నా యేలినవారా! నాకు సహజముగ అసాధ్యముగ కనిపించు విషయములను తమ వరప్రసాదములచే సాధ్యమగునవిగా జేయుడు.

నాకు లవమాత్రపు కష్టములు సంఘటిల్లినను ఓర్చుకొనజాలని యసమర్థుడనని దేవర వారికి విశదమై యున్నది. అతిస్వల్పమగు కష్టము సంభవించినను ధైర్యమును కోల్పోవువాడనని తామెరుగుదురు.

కష్టానుభవములన్నియును తమ ఖ్యాతికొరకై నాకు ప్రియమైనవిగను, అనుకూలమైనవిగ నుండునట్లుల అనుగ్రహింపుడు.

తమకొరకై శ్రమపడుటయు, సంకటముల ననుభవించుటయు నా యాత్మకు మిక్కిలి యారోగ్యకరము.

---

## సారాంశము

మనరక్షకుడును ఏలికయునగు యేసునాథస్వామియు వారి అర్చ్యశిష్టులును అనుభవించియున్న కష్టములతో పోల్చి చూచితిమేని, మన మనుభవించు కష్టములంత ఎక్కువగా నెంచవలసినవి కావు.

మనకు సంప్రాప్తమగు కష్టకారణము లేవియైనను, అట్టికష్టములచే మనలను శిక్షించుచుండునది దేవుడే సుమా!

ప్రతిమానవుడును శాంతమును వహించియుండుటయే వాస్తవ మగునట్టియు, అపరివ్యాజ మగునట్టియు విధియై యున్నది.

శాంతమును వహించి యుండజాలని మానవుడు నిశ్చయముగ జేనికిని అర్హుడు కాజాలడు.

సాహసముతో పోరాడుటవలనే మనము జయించుచుము. మనకెట్టి సంకటములు ప్రాప్తించినను, శాంతముగ సహించి యుండునటుల మన సంకల్పములు మనలను ఎక్కువగ పురికొల్పవలసి యున్నవి.

ఇట్టి స్థిర సంకల్పమును ప్రతిదినమును చేసికొని, దాని ననుసరించి ప్రవర్తించునట్టి సాధనము చేయుటకు, దైనందిన కష్టము లనుభవించుటకు సంసిద్ధులమై యుందుముగాక.

మనకు లాభములు చేకూరునపుడు,మనమెటుల దేవునికి కృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచుందుమో, అటేరీతిని కష్టములు సంప్రాప్తించు నప్పుడును వందనము లర్పించవలయును.

"ఏలినవారు నా కనుగ్రహించినారు. ఏలినవారే తిరుగ తీసికొనినారు. వారి ఘనత మిక్కిలి పొగడబడును గాక !" అని పలుమారు మనము స్మరించుకొను చుండవలయును. ముక్తిసంపాదన కవసరమగు శాంతము నభ్యసించుట కిదియేపద్ధతి. అయినను, అయ్యో! యిట్టి సాధనను క్రైస్తవులు మిక్కిలి యరుదుగ మాత్రమే చేయుచున్నారు.

---

## 20 వ అధ్యాయము

## మన బలహీనతను, మానవ జీవితమునందలి దురవస్థలను అంగీకరించుట.

1. శిష్యుడు:- "నేను అక్రమ ప్రవర్తనుడననియు, దుష్టుడననియు నా యంతట నేనే తమ దివ్య సముఖమునం దొప్పుకొనుచున్నాను. అనేక సమయములందు నేను బహు స్వల్ప విషయముల వలన సైతము అధైర్యపడి కలతనొందుచున్నాను.

మిక్కిలి ధైర్యము వహించి ప్రవర్తింప వలయుననెడి దృఢసంకల్పమును యేర్పరచుకొని యున్నప్పటికిని, లేశమాత్రపు మనోవికార హేతువు కలిగినప్పుడెల్ల, గొప్ప సంకటములయందు పడిపోవుచున్నాను.

కొన్ని సమయములందు మిగుల స్వల్పవిషయముల నుండియే కడుంగడు దుఃఖకరమగు మనోవికార హేతువు బయలుదేరుచున్నది. నేను కొంతవరకు క్షేమకరమగు స్థితియందుంటినని తలంచుకొనుచుండగా, తలవని తలంపుగ కొలది గాలితాకుడు చేతనే తలక్రిందై పోవుచున్నాను.

2. కావున, ఓ నా యేలినవారా! దయచేసి నా వైపు చూడుడు. నా నీచ స్థితియును నా యపరాధములును తమకు విశదమైయున్నవి.

నా యందు దయార్ద్రహృదయులై, నేనీ రొంపియందుపడి అధైర్యుడనై తిరిగి పైకిలేవ జాలకుండనంత లోతుగా పూడిపోకుండునటుల నన్ను పైకి లేవనెత్తి కాపాడుడు.

నేనంత సులభముగ భ్రష్టుడనై పోవునంతటి దుస్థితియందుండుటను, నా మనో వికారములను జయింపలేక దుర్బలుడనై యుండుటను చూచుకొనగా, మీ యెదుట నాకు సిగ్గగుచున్నది. నా కిష్టము లేకున్నను కామ,క్రోధ, మద,మాత్సర్యాది వికారములు నా వెంటనంటి నాపైపడుచుండుటవలన నాకు హేయము కలుగజేయుచు, మిక్కిలి దుఃఖకరములగుచున్నవి. ఈ విధముగ నెల్లప్పుడును వికటస్థితి యందుండుట నాకు విసుగగుచున్నది. ఇందుచే నా యపరాధములు నాకు చక్కగ తెలియ వచ్చుచున్నవి.

ఏలయనగా: నామానసిక వికారములన్నియును మిక్కిలి సులభముగ నాపైకి కుప్పించి దుముకుచున్నవిగాని తిరుగ నంతసులభముగా వానిని తరిమివేయజాలకున్నాను.

3. ఇశ్రాయేలులకు దైవమగు ఓ సర్వశక్తిమంతుడవగు దేవా! విశ్వాసముగల యాత్మలయెడల గాఢమగు ప్రేమనుజూపెడు స్వామీ! తమ సేవకుడనైన నేను పడుచున్నశ్రమను, అనుభవించుచున్న దుఃఖమును వీక్షింపుము.

నేను చేయ నుద్యుక్తుడనైయున్న కార్యములన్నిటియందును నా చెంత నేయుండి సాయము చేయుమని దీనుడనై వేడుకొనుచున్నాను.

దివ్యమగు మానసిక స్థైర్యము నాకనుగ్రహించి, బలము చేకూర్పుము. నామటు లనుగ్రహింపని యెడల, ఈ నిక్కృష్ఠమాలిని మానవ జీవితమున నిలచియుండునంత కాలము, నేను నిరోధింపవలసినట్టియు ఇప్పటి వరకును న్యాయమార్గానువర్తియై ప్రవర్తించుటకు పరిపూర్ణముగా లొంగనట్టియు, నా దౌర్భాగ్య శరీరము చెలరేగి నన్ను మీరిపోవును.

అటుల నా శరీరము హద్దులుదాటి పోకుండునటు లణచియుంచ జాలుటకు దివ్యమగు మానసిక బలమును నాకు దయచేయుము.

అయ్యో! సర్వదా దుఃఖముల చేతను దుర్వస్థల చేతను నిండియుండు యీ మానవజీవితము ఎంత నిక్కృష్ఠమాలినదై యున్నది! ఈ జీవితము నందెల్లెడలను పలువిధములగు మోసకారులును శత్రువులును కలిగియున్నారు.

ఏలయనగా: ఒక సంకటము లేక నొకమనో వికార హేతువు గడచిపోవగనే మరియొక సంకటము లేక మరియొక మనోవికార హేతువు తలచూపు చుండును. ఒకదానితో పోరాటము ముగియగనే యెన్నగను తలంపని మరియొక పోరాటము ఆసన్నమై యుండును.

4. ఇట్టి కఠినమగునట్టియు, అన్ని దుర్ఘటనలకు దుస్థితులకును లోనై యున్నట్టియు మానవజీవితము, ఎటుల ప్రీతికరముగ నుండగలదు? మరణమునకు, పలువిధములగు రుగ్మతలకు మూలమగు యీ జీవితమును, జీవిత మనుటెట్లు?

ఐనను, ఇట్టి జీవితమును ప్రేమించుచునే యున్నారు. అనేక మంది మానవులు యీ మానవ జీవితమునందే మిక్కిలి యానందమునంద వలెనని ప్రయత్నించుచున్నారు.

అనేకమంది మానవులు యీ ప్రపంచమెంతో మోసకరమైన దనియును, వ్యర్థమైనదనియును నిందించు చుందురుగాని, దానిని వదలి వేయుటకు మాత్రము యిచ్ఛగించుటలేదు. ఏలయనగా మానవుని కామ వికారము యెక్కువగ చెలరేగి పోవుచున్నది.

కొందరు మానవులు ప్రపంచమును ప్రేమించుటకును మరికొందరు దానిని ద్వేషించుటకును కారణములు గలవు.

అనేక వికారములకు లోనైయున్న మానవశరీరముయొక్క పశువాంఛ, మానవుని నేత్రములయొక్క మోహము, మానసిక గర్వము మొదలగునవి ప్రపంచమును ప్రేమింప జేయుచున్నవి.

పైకారణములచే ప్రాప్తించెడు శరీరబాధలు, దుస్థితులు ప్రపంచ విషయములనిన కొందరికి అసహ్యతను గలిగించి చీదరను పుట్టించు చున్నవి.

5. ఐన ఆయోగ్య ప్రపంచానురాగములయందు చిక్కుబడియున్న యాత్మ పాపకార్యములయందలి భోగలాలసతయందు మునిగి, యీ భోగములనియెడు కంటకముల క్రింద ఆనందముకలదని యూహించు చున్నది. అది యటు లేల మోసపోవుచున్నదన, ఇదివరకెన్నడును దైవమహిమయందలి మాధుర్యమునుగాని, యోగ్యప్రవర్తనవలన అంత గంభీరముగా తానుభవింపగల ఆనందమునుగాని అది యనుభవ పూర్వకముగ రుచిచూచియెరుగదు.

ఐన రేమానవు డీప్రపంచమును పరిపూర్ణముగ ద్వేషించునో, ఎవ్వరీ ప్రపంచానురాగములన్నిటియందును విముఖతవహించి యుందురో, యెవ్వరు దివ్యమగు క్రమశిక్షణయందు దైవేచ్ఛ ననుసరించి ప్రవర్తింప నేర్చుకొనియెదరో, అట్టిమానవులుమాత్రమే ప్రపంచానురాగములన్ని టిని విసర్జించెడువారలకు వాగ్దానము చేయబడియున్న దైవామృతము నందు మాధుర్యమును అనుభవింపగలరు.

అట్టి భాగ్యశాలురగు మానవులు మాత్రమే దుఃఖకరమగు ఈ ప్రపంచమునుజూచి, మానవులెంత తప్పుకలవారలగుచుండిరో, ఎన్నివిధ ములుగ దీనిచే మోసము చేయబడుచుండిరో అను అంశమును మిక్కిలి చక్కగ గ్రహింప గలుగుచున్నారు.

---

## సారాంశము

మానవుడు మిక్కిలి దుర్బలుడు. ప్రస్తుతపు జీవితము నందలి దురవస్థలు ఎప్పటికిని తీరిపోవునవి కావు. మానవుడు తనముక్తిమార్గము నకు శత్రువులగు వికారములందు సర్వదా సంఘటన కలవాడై యున్నాడు. హృదయదుర్బలతగల మానవుని ప్రపంచాను రాగములు, మనోవికారములు యెడతెగక సర్వదానెదుర్కొను చుండును. అత డెల్లప్పుడును మోహములందు తగుల్కొని పరిశోధనల పాలగుచుండును. పలుమారులు పాపకార్యముల నాచరించు చుండును. అతడెప్పుడైనను భ్రష్టుడై పడిపోవునేని, సాధారణముగ తిరుగనెన్నడును లేవజాలడు. లేక యొకానొక సమయమున తిరుగ లేవగలిగినను మరల పడిపోవుదు నేమోయని భీతిజెందుచుండును. అట్టిదిక్కుమాలిన మానవజీవితము లేశమైన శ్లాఘాపాత్రమైనదికాదు. ఐనను మనమీ పాపిష్టిజీవితము నెడల ప్రేమానురాగులమై దానిని విడువజాలక పెనుగులాడు చున్నాము. దానియందే మోహముగల వారమైయున్నాము. ప్రపంచ మంతయును కేవలము క్షణికమనియు, వ్యర్థమైనదనియు నంగీకరింతుము; కాని దానిని ప్రేమించుట మాత్రము మాని వేయుటలేదు.

మనదుర్బలతను మనకు ప్రాప్తించుచుండు దుస్థితులను మనో వికారములకు లొంగిపోవుటచే మనకు రానున్న శాశ్వతమగు నాశనము వలని యెడతెగని ప్రమాదము మొదలగు వానిని తెలిసికొని గ్రహించి యుండుట మాత్రము మనకు చాలదు. మనమటుల గ్రహించి మిన్న కుండక, అవి కొన్పించినంతనే దేవుని యెదుట దీనత్వమును వహించి, మన నమ్మకమంతయును వారియందు పాదుకొనునట్లు చేయవలయును. మన మీప్రపంచమున స్వదేశమునుండి బహిష్కృతులమై పరదేశము నందు గ్రుమ్మరుచున్న వారివిబోలి దిక్కుమాలిన వారమైయున్నాము. అట్టి మన దుస్థితిని గూర్చి దుఃఖించవలయును. ఉదార స్వరూపుడగు దేవునిపై మన భారమంతయును నిలిపియుంచవలయును.

పలుమారు మన దుర్బలతచేత పాపకార్యములయందే నిలిచి పోకూడదు. నిరుత్సాహులమై యుండతగదు. దేవునియందలి విశ్వాస

మును విడువకుండవలయును. వారియందె విశ్వాస శూన్యులమగుదుమేని పలుమారు భ్రష్టులమై పోవుదుము.

ఐన మనయందు దుర్బలతను మనము కనుగొన జాలుదుమేని మనము భ్రష్టులమై పడిపోయిన వెంటనే తిరుగ లేవగల్గిన వారలమై, శీఘ్రముగ దేవుని సమీపమునకు పోజాలుగుదుము.

---

## 21 వ అధ్యాయము

## మనకులభించెడు సర్వమేలులందేగాక, ఎక్కువగ దేవునియందే మనము విశ్రమించి యుండవలయును.

శిష్యుడు: నాయాత్మా! ఎల్లప్పుడు సకలముకన్న నెక్కువగ దేవునియందే నమ్మకము కలిగి, వారియందే విశ్రమించి యుండుము.

ఏలయనగా:- అర్చ్యశిష్టులకందరకును దేవుడే విశ్రామమందిరము.

మిక్కిలి యానందకరమగు ప్రేమగల జేసునాథా! సృష్టియందలి సర్వఅంశములు, శరీరారోగ్యము, సౌందర్యము, పేరుప్రతిష్ఠలు, శక్తి సామర్థ్యములు, సర్వశాస్త్రజ్ఞానము,మానవుని యుక్తి చమత్కారములు, సర్వసంపదలు, సర్వవిధ విద్యలు, సర్వ సంతోషానందములు, కీర్తి, శ్లాఘ్యత, సర్వమాధుర్యములు, యూరట, సర్వాశలు, వాగ్దానములు, యోగ్యతలు, వాంఛలు తాము దయచేయుచవరములేగదా! తుదకు తమ దూతలకన్న, ప్రధాన దూతలకన్న, గోచరమగునట్టియు గోచరము కానట్టియు సర్వశక్తులకన్న తామే సర్వోన్నతులును, సర్వవల్లభులుగావున తమయందే నేను విశ్రమించియుండునటుల నా కనుగ్రహింపుడు. తమయందుతప్ప యితరులయందు నేను నమ్మకము నుంచుకొనక, తమయందే విశ్రమించియుండగల మనస్థైర్యమును నాకు దయచేయుడు.

2. ఏలయనగా :- నా యేలికయగుదైవమా! విశ్వమంతటి యందును తామే మిక్కిలి యుత్తములు. తామే మిక్కిలి మహోన్నతులు. తామే

సర్వశక్తి సామర్థ్యములుగలవారు. తామే పరిపూర్ణులు. తాముమాత్రమే పరులసహాయ మవసరము లేనివారు. తామే మిక్కిలి మాధుర్యమగు మహిమ గలవారు. తామే సర్వప్రపంచమునకు యూరటరైనవారు. తామే సర్వసౌందర్యరాశి. తామే పవిత్రప్రేమనిధియై వెలయుచుం డెదరు. మీరే మిక్కిలియోగ్యులు. అందరికన్న నెక్కువ మహనీయులు. తమయందే సర్వవస్తుసముదాయములు పరిపూర్ణత్వమును వహించి యున్నవి. ఇక నెప్పటికి తమ్మునే నాకనుగ్రహింపక, తాము నాకేమి దయచేసినను, తామనుగ్రహింప జాలుశక్తిని నాకు దయచేసినను, నాకేమి వాగ్దానము లనుగ్రహించినను, తమదర్శనభాగ్యము నాకు లభింపకుండు నంతవరకు, తమ దయను నేను పరిపూర్ణముగ ననుభవింపకుండు నంత వరకు, తమచే ప్రసాదింపబడునవన్నియును మిక్కిలి స్వల్పములనియు, కొరతపడి యున్నవనియు నేను భావించుకొనియెదను.

ఏలయనగా:- మీరనుగ్రహించెడు సర్వవరముల నుండియు తమచే సృష్టింపబడిన సర్వవస్తు సముదాయము నుండియు నేననుభవింప గలుగు సుఖములకన్న, తమయందే యెక్కువ విశ్రాంతిని పొందజాలు వరకు నా హృదయమునకు సత్యమగు విశ్రాంతి యుండబోదు. పరిపూర్ణ హృదయతృప్తి నొందజాలను.

యేసునాధా! మిక్కిలి పవిత్రమగు నా కర్తా! సృష్టికర్తవగు నా స్వామీ! తమ సన్నిధానమున కెగురుచువచ్చి తమయందు విశ్రమించుటకుగాను స్వాతంత్ర్య మనియెడి రెక్కలను నాకు దయచేయు వార లెవరు?

నా యేలికయగు స్వామీ! ఇతరులవలన లేశమైన నాటంకపరుప బడక, సావకాశముగ నేను తమకు సేవలొనరించి, తామెంత మనోహర మూర్తులైనది రుచిచూడగల్గు భాగ్యము, నా కెపు డనుగ్రహించెదరు?

తమ యందలి ప్రేమాతిశయముచే నేను తన్మయత్వమునంది మానసమున తలంచి గణనసేయుటకు వీలులేనంత ఘనముగ అందరికిని గోచరముగాక కొందరికే మాత్రమే గ్రహింప శక్యమగుకీతిని స్మరించు కొనుచు, మీతో ఆనందించుచు తమ స్నేహమును గూర్చి పరిపూర్ణముగ నా మానసమున స్మరించుకొనగలుగు భాగ్యము నా కెపుడు లభించును?

నాకర్తా! నేనిప్పుడును నిట్టూర్పులు విడుచుచు నా దుస్థితిని దుఃఖముతో భరించుచున్నాను. ఏలయనగా యీ మానవ జీవితమునందలి దుస్థితులనియెడి రొంపిలో తగుల్కొనియున్న నాకనేక కష్టము లెదురగుచున్నవి. ఇవన్నియును నన్ను కలవరపెట్టుచు, దుఃఖములనియెడి కారుమేఘములను నా మానసాంబరముపై వ్యాపింపజేయుచున్నవి. పలుమారు నాకు విఘ్నకారులగుచు, నామానసమును చెదరగొట్టి పెడత్రోవలకు లాగుచు, భాగ్యములందుండు మోహకారణ వస్తుసముదాయముచే నన్ను మోహింపజేయుచు, ఆమోహ పాశములచే నన్ను బంధించుచున్నవి. అందుచే నాకర్తా! తమ సముఖమ్మునకు నేను నిరాటంకముగ రాజాలకున్నాను. అదృష్టశాలురగు యాత్మ లనుభవించుచున్న మనోహరమగు తమ యాలింగన సౌఖ్యమును నే ననుభవింప జాలకున్నాను.

కర్తా! మిమ్మెడబాసియున్న కారణముచే నేను విడచుచున్న నిట్టూర్పులును, నేనీప్రపంచమునం దనుభవించుచున్న నానావిధ కష్టములును మీహృదయమును కరిగించునుగాక!

4. ఓజేసునాథా! తమ శాశ్వత మహిమావికాసము, ఈప్రపంచ జీవయాత్ర సల్పుచున్న యాత్మకు, గొప్ప యూరటయై యున్నది. నా హృదయాంతరాళమున నేను పొందుచున్న భావములు వర్ణనాతీతములై యున్నవి. నేను మౌనముగ నుండవలసి వచ్చినది. నా మానసము తమతో ముచ్చటించుగాక.

అయ్యో నాప్రభువు వెంటనే విచ్చేయక ఎంతజాగుచేయుచున్నారు? వారు తత్క్షణము వేంచేసి వారి సేవకుడనగు నాకానందమును గలుగజేయుగాక. వారిదివ్యహస్తమునుచాచి దిక్కులేక మిక్కిలి దుస్థితియందు చిక్కుకొనియున్న నన్ను యీవేదననుండి ముక్తినంద చేయుదురుగాక.

కర్తా! దయచేయుము. తామే నా ప్రేమరాశియై యున్నారు. మిమ్ము విడనాడి యుండునెడల నేనొక్కదినమైనను, నొక గడియైనను సంతోషముగ నుండజాలను. తమరు నాచెంతచేరి యుండనిచో నాతో విందారగించు వారలెవ్వరులేరు. నేను దుస్థితియందు పడియున్నాను. తమ దర్శనావకాశముచే నన్నాదరించి, నాకు స్వాతంత్ర్యము దయ

చేసి, నాయందనుకూలతానూచకమగు తమ దివ్య ముఖారవిందమును నాకు కనుపరచువరకు, నేను సంకెళ్ళచే బంధింపబడి చెరయందుంచబడిన నేరస్థునివలె నున్నాను.

5. ఇతరులందరును తమకొరకై ప్రయాసపడక యే విషయములైనను కోరుకొననిండు. నాకుమాత్రము తాముతప్ప యితరమేమియును ప్రియముగ నుండుటలేదు.

ఇకముందు యితరులెవ్వరును నన్ను తృప్తిపరుపజాలరు. తమరే నా దైవము. నా యాశయంతయును తామే. నా శాశ్వతముక్తి తమరే. తాము తిరుగ తమ ప్రేమామృతమును నాపై చిలికి, నా హృదయమందిరమున నాతో ముచ్చటలాడువరకు, నేనోర్చుకొని మాటలాడక మౌనముగ నుండజాలను. తమను ప్రార్థింపకుండ నుండజాలను.

6. జేసునాథస్వామి :-

నీవు మమ్ము వేడుకొనుటచే మేమిదిగో విచ్చేసియున్నాము. చూడుము! మే మిక్కడదయున్నాము. నీవు విడచియున్న కన్నీటిధారలు, నీ యాత్మయొక్క వాంఛ, నీ హృదయ దీనత్వము, హృదయపూర్వక పశ్చాత్తాపము, మా మానసమును నీవైపున కాకర్షించి, నీ దగ్గరకు మమ్ము తీసికొనివచ్చి యున్నవి.

7. శిష్యుడు :- తండ్రీ ! నేను తమను ప్రార్థించుచున్నాను. తమతో నేను సౌఖ్యము లనుభవింప నిచ్ఛగల వాడనైయున్నాను. తమ ప్రేమకొరకై సర్వమును విసర్జింప ఆయత్తుడనై యున్నాను.

ఏలయనగా:- ఆరంభమున తమరేనన్ను తమకొరకై వెదకుమని ప్రోత్సాహపరిచి యున్నారు.

తమకుగల ప్రేమాతిశయమునకు తగినరీతిని దీనుడనైన ఈ తమ సేవకునికి తాము దయచేసిన మేలుకొరకుగాను తమను శ్లాఘించుచున్నాను.

ఇహలోక పరలోకములందును గల యద్భుతాతిశయములలో తమకు దీటైన దేదియును లేదు.

తమచర్యలన్నియును యోగ్యములైనవి. తాము దయచేయు న్యాయ విమర్శనా తీర్మానములు సత్యములైనవి. తమ నిర్మాణాను సారముగ ప్రపంచమంతయును పాలింపబడు చున్నది. పరిపూర్ణజ్ఞాన స్వరూపుడవగు తండ్రీ! తమను శ్లాఘించుచు ప్రార్థించుకొనియెదను. అటుల చేయుటలో నా నాలుకయు, ఆత్మయు, సృష్టియందలి సర్వ పదార్థములును నాతో నేకీభవించుగాక.

---

## సారాంశము

సర్వ విషయములందును మనము దేవునినే యెక్కువగ నెన్ను కొనుచుండవలయును. మనము సర్వసంగ పరిత్యాగ మొనర్చి, స్వలాభా పేక్ష లేశమాత్రము లేనివారలమై, న్యాయము ననుసరించి మన మనుభ వించియున్న సౌఖ్యానందములను సైతము పలుమారు తృణీకరించివైచి, దూష్యములగు మితిమీరిన యక్రమ భోగలాలసులమై యున్నందులకు గాను, మనలను మనమే నిందించుకొని శిక్షించుకొనుచు శ్రమపడుచుండ వలయును. మనము మిక్కిలి యుల్లాసముతో దేవుని యెడల వినమ్రులమై ఆత్మసమర్పణచేసి మనలను బలియిచ్చుకొందము. సృష్టియందలి సర్వ వస్తువులకన్న నెక్కువ యోగ్యతను గడించుకొని, భగవతోన్ముఖమగు హృదయములతో వారి పరిపూర్ణత్వమునందు లీనమై పోవుదము.

మనము ఆంతరంగిక పరిశుద్ధతను గావించుకొని, హృదయాంగీ కారముగల వారలమై, యుత్కృష్ట దశయందుందుముగాక!

మనకు మిక్కిలి ప్రియమగు విషయములన్నిటిని సమర్పించి, మన యాత్మలపైని నిరంకుశాధికారముగల నాయకునివలె, దేవుని ప్రతి ష్ఠించుకొందము.

కేవలము జ్ఞానానందము ననుభవించుటకుగాను, దేవుని ప్రేమించు టయే భూలోక స్వర్గము. అట్టి భాగ్యమే శాశ్వతానందము. ఐతే అట్టి శాశ్వతానందమును ఈలోకమందే యనుభవింప కోరుదుమేని, మాన సికానందములనుండి తొలగియుండవలయును. మానసికానందములు

మన మానసములను చెదరగొట్టి వ్యగ్రములుగ నొనర్చి, మనలను దేవుని నుండి వేరు పరచును. సృష్టివిషయములతోడ మనలనుబంధించెడు హృదయానురాగములను సహితము మనోవికార దాస్యములనుండి ముక్తిని గాంచినదై, పావురపు రెక్కలు గలదై మనయాత్మ యేకాంతముగ దేవునితో ఆనందించుట కతివేగముగ వారి సముఖమున కెగరి పోవును.

---

## 22. వ అధ్యాయము

## దేవుడనుగ్రహించిన నానావిధ క్షేమములను మరువక, స్మరించుకొను చుండవలయును.

శిష్యుడు:- నా యేలినవారా! తమనిర్మాణ చట్టమునందలి న్యాయసూత్రమును నాహృదయమున నెలకొల్పి, తాము నియమించిన విధుల ననుసరించి ప్రవర్తించునటుల నా హృదయమున నుపదేశింపుడు.

తమ చిత్తమేదియో నేను గ్రహించి, తాము దయచేయుచుండెడి సాధారణమగునట్టియు, ప్రత్యేకమగునట్టియు సర్వ క్షేమములను తమ యెడల నేనుచూపవలసిన మిక్కిలిగౌరవమును శ్రద్ధాపూర్వకమగు విచారణతో జ్ఞప్తియందుంచుకొని, తమను కొనియాడుచుండెదను. అటుల ప్రవర్తించుటచే తాము నాకు దయచేయుచున్న మేలులన్నిటికిని తమకు నా కృతజ్ఞతా సూచక వందనములర్పింప జాలుదును.

ఐతే, తాము నాకు దయచేసియున్న స్వల్ప లాభమునకు సైతము తమయెడల తగినంత కృతజ్ఞతను చూపజాలకున్నానని నాకు గోచర మయ్యే యున్నది. ఈ అంశమును నే నంగీకరించు చున్నాను.

తాము నా కనుగ్రహించిన వరములకు తగిన యోగ్యత నా యందేమియును లేదు. నేనా లాభములన్నిటికి అనర్హుడను. తమ యుత్కృష్టతను గూర్చి నేను యోచించుకొనునపుడు, మహోన్నతమై వెలయుచున్న తమ రాజ తేజస్సునందు నా మానసము మైమరచి పోవు

-చున్నది. సహజముగాని లేక తమ దయాప్రభావము వలనగాని ఆత్మ సంబంధమగునట్టియు, భౌతిక శారీరక సంబంధమగునట్టియు మా బహిరంగ, అంతరంగిక క్షేమములన్నియును తామనుగ్రహించినవై యున్నవి. తమ యుదార స్వభావమును, మా యెడల తాము చూపెడు కరుణను, తమ యోగ్యతలను, తాము మాకు దయచేసిన మేలులే శ్లాఘించుచున్నవి. మేమీ సంపదలన్నిటిని తమనుండియే స్వీకరించియున్నాము. ఇట్టి ప్రయోజనములను తమనుండి యొక మానవుడెక్కువగా స్వీకరించినను, మరియొకడు తక్కువగా స్వీకరించినను, అన్నియును తమనుండియే స్వీకరించుచున్నారు. తాము లేనిదే అల్పవిషయము సహితము కలిగియుండుట దుర్లభము.

అందుచే నా యేలినవారా! యెక్కువపొందినవాడు తనబలము వల్ల పొందియుండలేదు. గనుక తన్నుతాను శ్లాఘించుకొనుటయు; ఇతరులకంటె తానెక్కువయని తలంచుటయు; తక్కువ స్వీకరించిన వారిని అసహ్యించుకొనుటయు మిక్కిలి తగనికార్యము. ఎంతయెక్కువగా నొకడుపొందిన మేలులకు తాను కారణము కాదని యొప్పుకొనునో, అంతయెక్కువ దీనతతో దేవునికి మేలెరిగిన స్తోత్రములు చెల్లించును.

తననీచత్వమును, అనర్హతను యేమానవు డంగీకరించునో, యట్టి మానవునకు యెక్కువగా తాము వరము నొసంగుదురు. కాని తక్కువ పొందినవారలు దుఃఖితులై యసూయకు తావియ్యతగదు. మీరే యన్ని మేలులకు కారణకర్తలు గనుక మిమ్మేనమ్ముకొని మిమ్మే శ్లాఘించవలయును.

మాయవసరములన్నియు తమరెరింగి యున్నారు. ఎవరికెంత కావలయునో తమ కెరుకయే యైయున్నది. మాయొక్క యోగ్యతాయోగ్యతలు తమకు తెలిసియే యున్నవి.

అయినను నాయేలికా! ప్రపంచదృష్టిలో గొప్పగా భావింపబడు మేలులనెక్కువగా పొందకుండుటయే నాకు శ్రేయస్కరమయిన బహుమతి. కనుక పేదరికము నీచత్వములలో దుఃఖించి, కృంగియుండు

టకు ఆశించుచున్నాను. ఏలయనగా నిరుపేదలను, దీనులను దిక్కు మాలినవారిని- యీలోకముచే నిరసింప బడినవారిని- తమ సేవకులుగను ప్రియస్నేహితులుగా తమరెన్నుకొని యున్నారు.

ఈ భూలోకమున కంతకును అధికారులుగా తమచే నియమింప బడిన అపోస్తులే యీ సందర్భమున సాక్షులు,నిదర్శకులై యున్నారు.

ఎందుకనగ ఏమాత్రమును సణుగుకొనకుండగనే వారు ప్రపంచమున ప్రవర్తించియున్నారు. మిక్కిలి దీనత్వమును వహించి, నిరాడంబరమగు జీవనము చేసియున్నారు. గర్వరహితులై నిష్కపటులై యుండిరి.

తమ ఘనతకొరకై పరులవలన వారు తిరస్కరింపబడి, యవమానపరుపబడినను, దూషింపబడినను, ఎట్టి ద్వేషభావములను కపట ప్రవర్తనయు లేనివారలై ప్రవర్తించుచు వచ్చిరి. ప్రపంచమానవులు ద్వేషించి విసర్జించియున్న విషయములను సైతము, వారు మిక్కిలి సంతసముతో నవలంభించుచుండిరి.

౭. తాము ప్రసాదించు మేలులనుగుర్తించి తమ్మును ప్రేమించు భక్తుడు తమ శాశ్వత నిర్మాణములను తెలిసికొని తమ చిత్తమున కనుగుణ్యముగ తన జీవితమును సరిదిద్దుకొనుటయందే యెక్కువ సంతృప్తిని పొందును.

ప్రతిమానవుడును తానెంత గొప్పవాడుగా నుండవలయునని కోరుచుండునో, అంత స్వల్పుడుగ నుండుటకుగూడ సంసిద్ధుడుగా నుండవలెను. అటు లుండగలుగుదుమేని దేవుని యభీష్టమును వారు చేయ ననుగ్రహించెడు యేర్పాటులనుగూర్చి అంతయెక్కువ తృప్తిగలవారలమై యూరడింపబడిన వారల మగుదుము.

మనము మిక్కిలి యుత్తమస్థితియందుండునప్పు డెంత శాంతమును తృప్తియును కలిగియుందుమో, నీచస్థితియం దుండునప్పుడు సైతమంత యెక్కువ శాంతమును తృప్తియును గలిగి యుండవలయును.

ఇరులకన్న తామెంత యెక్కువగౌరవము కలవారలై యెంత యెక్కువ గౌరవ వంతులుగ నుండవలయునని మానవు లాసించుదురో,

అంతయెక్కువ హేయమైనవారలుగను, నీచులుగనుండుటకు పేరు-ప్రతిష్టలేని వారలై యుండు స్థితినే యాశింపవలయును.

ఏలయనగా తమచిత్తమును తమ గౌరవమునెడల గలిగియుండ-వలసిన ప్రేమయు అన్నిటికన్న మిక్కిలి యెక్కువ ఘనమైనదని తలంపవలయును.

తమనుండి మానవుడు స్వీకరించియుండు నట్టియు, యికముందు స్వీకరింప నున్నట్టియు సర్వమేలులకన్న యెక్కువగ తమ చిత్తము వల్లను, తమఘనత యందలి వారిప్రేమవల్లను యౌదార్య్యబడినవారలై సంతోషించువారలై యుండవలయును.

---

## సారాంశము

దైవమునుండి సర్వసామాన్యముగను, లేక ప్రత్యేకముగను మానవుడు స్వీకరించియుండు వరప్రసాదములనుగూర్చి మానసముగ స్మరించుకొనుటకన్న, నెక్కువ ప్రశస్తమైనది యితరమేదియును లేదు. అట్టి భగవద్దత్తములగు వరములను యెడతెగక మనకెక్కువగ చేకూర్చ జాలునదియును లేదు.

ప్రతి మానవుడును దైవ హస్తములనుండి తాను స్వీకరించియున్న వరప్రసాదములతో తృప్తినొందవలయును. తాను పొందియున్న యా వరప్రసాదములను దేవుని గౌరవము కొరకును తన మోక్షము కొరకును సద్వినియోగము గావించుకొనవలయును. దేవునిచే ప్రసాదింపబడిన వరప్రసాదములలో మనము ముఖ్యముగ ప్రేమింపవలసినది పూజనీయమగు వారి చిత్తము.

గొప్ప విషయములందువలె స్వల్ప సందర్భములందును దేవుని చిత్తమె నెరవేర్పబడు చుండును గాక. అన్ని సందర్భములలోను సమముగ మనము తృప్తిచెంది యుండవలయును.

దేవుడనుగ్రహింపనున్న వరములలో మన యిచ్చవచ్చిన దాని నేరుకొనుటకు మన కవకాశ మొసంగబడునేని, మానవుల దృష్టియందు

రేది మిక్కిలి ఘనమైనదిగ నెన్నబడదో అదియే మన ముక్తి సంపాదన కెక్కువ యపాయకరమైనది గాదని తలంచుచు, దానినే యెన్నుకొన వలయును. ఇంకను మన మెన్నుకొనవలసిన వరప్రసాదము లేవియనః-

ఆత్మ దారిద్ర్యము, హృదయ దీనత్వము, నిష్కాపట్యము, స్వతిరస్కారము, శాంతము, పరులవలన తృణీకరింపబడుటయును, యవమాన పరుపబడుటయును మిక్కిలి ప్రేమగలిగి యుండుట, కష్టములందు సంతోషమును వహించుట, సర్వ విషయములందును భగవదేచ్ఛ ననుసరించి వర్తించుట; ఇవియే మనము దేవుని వలన పొందవలసిన వరప్రసాదములు.

తన్ను తాను మిక్కిలి నీచముగ నెంచుకొనుచు, అందరికన్నను తాను మిక్కిలి తక్కువ వాడని యెన్నబడుటయందే యెక్కువ తృప్తి నందువాడు నిజమగు సౌఖ్యమనుభవించును.

ప్రపంచమునందుండు వారల కెవ్వరికిని యెరుకబడకుండ, యెంత ఘనముగ కొనియాడబడ వలయుననియు పొగడబడ వలయుననియు మానవులు వాంఛించుచుందురో, అంత యెక్కువగ ప్రపంచము వలన దూషింపబడుచు, బహిష్కరింపబడు చుండవలయునని వాంఛను గలిగియుండుటయందు మాత్రమే ఆత్మయొక్క యోగ్యతయు సౌఖ్యమును యిమిడి యున్నవి.

ఇటుల ప్రవర్తించుచుండు ఆత్మయే యోగ్యమైనది. ఇట్టి యాత్మయే సత్యానుభవము గలదియగును.

అట్టి యాత్మను జూచి దేవుడు మిక్కిలి యానందించును. అట్టి యాత్మయే దేవుని దృష్టియందు మిక్కిలి ఘనమైనది. అట్టి యాత్మ యొక్క దీనత్వమే దేవుని దివ్యహస్తములనుండి గొప్ప వరప్రసాదములను స్వీకరించుటకు తగిన యర్హతను ప్రసాదించును.

---

## 23 వ అధ్యాయము.

### శాంతిదాయకములగు చతుర్విధ అంశములు.

1) జేసునాథస్వామి :—

కుమారా! శాంతయుతమై, సత్యమగు స్వాతంత్ర్యమును పొందు మార్గములను నేనిప్పుడు బోధించెద నాలకింపుము.

2) శిష్యుడు :- నా యేలికా! తమ యుపదేశముల నాలకించుట నాకు మిక్కిలి సంతోషకరము. గాన తాము వాకుర్చిచ్చినటుల యుపదేశింపుడని ప్రార్థించుచున్నాను.

3) జేసునాథస్వామి:- (a) కుమారా! నీ యిచ్చవచ్చినరీతిని వర్తించుటకన్న యితరులు చెప్పెడురీతిని ప్రవర్తించుచుండుము. (b) నీ వెప్పుడైనను, దేనినైనను అమితముగ నుండవలయునని యెడు వాంఛగలవాడవై యుండక, కొంచెము మాత్రమె యభిలషించుచుండుము. (c) ఎల్లప్పుడును తక్కువ స్థానముకొరకే ప్రయత్నముచేయుచు, అందరికన్న తక్కువ వాడవై యుండుటకే యత్నింపుము. (d) భగవంతుని చిత్తానుసారముగ నీయందు సర్వదా సర్వ అంశములును పరిపూర్ణముగ సమర్థింపబడుచుండ వలయునని యభిలషించుచు భగవంతుని ప్రార్థింపుము.

ఈ చతుర్విధ మార్గములనుసరించి వర్తించుమానవుడు, శాంతము విశ్రాంతిలభించెడు యావరణములందు ప్రవేశింపగలడు.

4) శిష్యుడు:- స్వామీ! తాము కొద్దిలో ముగించిన యీ సంగ్రహ వ్యాసము పరిపూర్ణ భావగర్భితమై యున్నది. తా ముపదేశించిన యీ కొద్దిపాటి నీతిసూత్రము లందెక్కువ తాత్పర్య మిమిడియున్నది. ఇది మాటల వరుసను చూచినకొద్దియే కాని మిక్కిలి జ్ఞానబోధితమై యున్నది. మిక్కిలి ఫల ప్రదాయిని.

ఏలయనగా:- మిక్కిలి విశ్వాసముతో నేనీ నీతి సూత్రముల ననుసరించి ప్రవర్తింప నవలంభింతునేని, నాకు సంకటములు సులభముగ సంఘటిల్లుట తటస్థింపదు. ఏలయనగా నా మానసము కలవరపరుపబడి

నిశ్చలతను కోల్పోయినప్పుడెల్ల పైనుపదేశింపబడిన న్యాయసూత్రము లకు భిన్నముగ ప్రవర్తించుట చేతనే యటుల సంభవించినదని నే నెరుంగ గలను.

ఐతే సర్వకార్య నిర్వహణ ధురీణుడవగు నా స్వామీ! సర్వదా నా యాత్మాభివృద్ధి నభిలషించెడు సర్వేశ్వరా! యీ నీతి సూత్రముల కనుగుణ్యముగ ప్రవర్తించి, నా ముక్తి పరిపూర్ణతను గావించుకొనుటకు గాను నా యెడల తాము చూప ననుగ్రహించుచుండెడి తమ ప్రేమనింక నెక్కువ చేయుడని వేడుకొనుచున్నాను.

---

## దుష్ట తలంపుల నివారణకు ప్రార్థన

5. నా దైవమును ఏలికయునగు దేవా!

నన్నెడబాసి చనకుము. స్వామీ నాకు సాయముచేయుటయందు శ్రద్ధవహింపుము. ఏలయనగ పలువిధములగు దుష్టములైన తలంపులు చెల రేగి, తలయెత్తి నా పైకి దాడివెడలుచున్నవి. ఘోరమగు భీతి నా యాత్మకు సంకటము కలిగించుచున్నది. హాని లేకుండ నే నెటుల తప్పించుకొనజాలుదును? నే నెటుల సంకటములందు చొచ్చుకొని పోయి తప్పించుకొనగలను?

6. "మేము నీకు ముందుబోవు చుండెదము. ప్రపంచమునందు ఘనుల మని విర్రవీగుచుండు గర్వపోతుల నందరిని యణచి వేయుదుము. చెర సాలయొక్క ద్వారములను తెరచి, యందు గుప్తమైయున్న రహస్యము లన్నియును నీకు తెలియపరతుము." అని తాము వాగ్దానము చేసి యున్నారు.

7. స్వామీ! తాము చెప్పియున్నప్రకారము దయచేసి యటు లొనరింపుడు. తమ సముఖమున యీ దుష్టతలంపు లన్నియును నానుండి పారిపోవ ననుగ్రహింపుడు. నాకు సంప్రాప్తించుచుండు సర్వసంకట ముల నుండియును తమ సముఖమునకు పరుగిడు కొనుచువచ్చి పరిపూర్ణ విశ్వాసము గలవాడనై, నా హృదయ పూర్వకముగ తమరిని ప్రార్థిం

చుచు తమ యాదరణము కొరకై శాంతముగ నెదురుచూచుటయె నా యాశయము,

---

## మనోవికాసముకొఱకు ప్రార్థన,

౭. ఓయోగ్యతా స్వరూపుడవగు జేసునాథస్వామీ:- అంతరంగిక ప్రకాశములగు తళతళ కాంతులచే నాకు హృదయ వికాసము ననుగ్రహించి నా హృదయమందిరమునుండి గాఢాంధకార మంతటిని పెరికి వేయుము.

అటునిటు పరుగిడుచున్న నా తలంపులన్నిటిని అణచియుంచి మిక్కిలి ఘోరముగ నాపైకి దుముకుచున్న మోహముల నన్నిటిని త్రొక్కివేయుడని ప్రార్థించు చున్నాను. అయ్యో నాకొరకై యెక్కడు బలముతో పోరాడు ఈ దుష్టమృగములను జంపుడు. అనగా, మోసకారులగు కామ వికారముచే నేను శాంతమునుపొంద జాలుదును.

అప్పుడుపవిత్రమగు తమదివ్య కార్యస్థానమను నాహృదయము తమ పొగడ్తలతోను, స్తోత్రములతోను ప్రతిధ్వనించు చుండును.

దేవా ! వాయుమండలమునకును, తుపానులకును తమ యాజ్ఞ లను దయచేయుడు. శాంతముగ నుండుమని సముద్రమును, వీచకుండుమని యుత్తరపు గాలికిని ఉత్తరువులను దయచేయుడు. ఘనమగు శాంతి వెంటనె వ్యాపించును.

మీ తేజోవికాసమును, సత్యమును మర్త్యలోకమునందెల్ల యెడలను వ్యాపించునటుల జేయుడు. ఏలయనగా తాము నాయందు జ్ఞానోదయమును గలిగించునంతవరకు మృత్తికవలె నేమియు లేనివాడనై సర్వశూన్యుడనై యుండెదను. స్వర్గమునుండి తమ దివ్య దయామృతమును నాపై కురిపింపుడు. స్వర్గసంబంధమగు మంచుబిందువులతో నా హృదయమును నానబెట్టుడు. జ్ఞానబిందువులను నా హృదయమునజేర్చి, యా బిందువులచే దానిని తడిపివేయుడు. తమయందలి భక్తియనెడు దివ్యమగు జలప్రవాహమును దానిపై ప్రవహింపజేసి, దానిని పదునుచేసి యోగ్యమును

ఫలప్రదాయిని యగునటుల నను గ్రహింపుడు. పాపములనియెడు భారము క్రిందబడి నలిగిపోవు నా మానసమును పైకి లేవనెత్తి, నా వాంఛల నన్నిటిని దైవవిషయముల దెసకు మరల్చుడు.

స్వర్గసౌఖ్యమునందలి మాధుర్యానుభవము గలవాడనై, ప్రపంచ విషయ సంబంధమగు యోచనలేమియును లేనివాడనగుదును.

10. నన్ను ప్రపంచవిషయములనుండి దూరముగ లాగివేయుడు. సృష్టి విషయమువలన నస్థిరములగు సౌఖ్యములన్నిటి విషయ సుఖాసక్తతయందలి ప్రేమకు మారుగా తమ ఖ్యాతియందలి ప్రేమ నాకనుగ్రహింపుడు.

గాఢమగు దైవభక్తిగల యాత్మకు, తినుట, త్రాగుట వస్త్రధారణ మొదలుగాగల శారీర పోషణ కవసరమగు విషయములన్నియును భారమై యున్నవి.

కనుక శారీర రక్షణ కవసరమగు నీ విషయములన్నిటిని మితి మీరిన అక్రమానురాగములేనివాడనై మిక్కిలి మితముగను యుపయోగించుకొనునట్లనుగ్రహింపుడు.

వీటినన్నిటిని ద్వేషించి దూరముగా విసరివేయుట న్యాయము గాదు. ఏలయనగా ప్రకృతిని కాపాడుచుండవలయును గదా! ఐతే శారీర పోషణకు కావలసిన దానికంటె నెక్కువ యనవసర విషయములను మిక్కిలి యందమగు వాటిని కోరుటను దివ్యమగు తమ న్యాయచట్టము ఖండించుచున్నది. ఏలయనగా అటుల ఖండింపబడనియెడల మానవ శరీరము ఆత్మయెడల అహంకారమును వహించి, దానిని యవమానపరచును.

ఈ సందర్భము లన్నిటియందును తమరే నా పైని యధికారమును వహించి, నేను యే విషయమునందు మేరమీరి ప్రవర్తింపకుండునటుల నన్ను నడపుడని తమను ప్రార్థించుచున్నాను.

సృష్టివస్తువులీయగల క్షణభంగురములగు సంతోషములనుండినన్ను విముక్తునిగ జేయుము. ఏలయనగా సృష్టియందలి యేవిషయమును నా వాంఛలకు పూర్తిగ శాంతిగల్పించి తృప్తిపరుపజాలదు.

ఎడబాయని ప్రేమబంధముతో నున్న తమతో చేర్చుకొని, బంధించి వేయుడు. ఏలయనగా తాము మాత్రమే ప్రియులను తృప్తిపరుపగలరు. తాము లేని యెడల నితర విషయము లన్నియును కేవలము నిష్ప్రయోజనములు.

---

## సా రాం శ ము

మీ కొండొరులతో యుద్ధములును, వివాదములును కలుగుచుండుటకు కారణమేమి? మీ శరీరాంగములందు రేగుచున్న కామాది మనోవికారముల చేతనే గదా? మీరు కానివానియందత్యాశగలవారలై, లోభులై పేరాశాప్రేరితులై, పరుల స్వాధీనానుభవములందుండు విషయముల యెడల కాంక్షగలవారలై యున్నారు. ఐతే మీరావిషయములను పొందజాలక, నశక్తులై పోవుచున్నారు. ఆశాభంగు లగుచున్నారు. ఆశాభంగులగుటయేగాక పరులనుమారణము చేయుచున్నారు. అసూయాపిశాచావేశులై మోసపోవుచున్నారు. ఇట్టి ఘోరమారణ కర్మ లాచరించియును మీరాసించు విషయములను పొందుచుండుట లేదుగదా!

ఇవన్నియును స్పిరిటుసాంక్తుచే బోధింపబడిన నీతివాక్యములు. మనలను పావనుడగు మన గ్రంథకర్తగారు పెట్టిన జ్ఞానబోధములగు చీవాట్లలో యీ నీతివాక్యముల నుద్దేశించియే మనకు సూచనలు చేసియున్నారు. చలింపనట్టియు, శాంతమగు నట్టియు, హృదయమును మనము సంపాదించుకొన గలుగుటకుగాను యిట్టి సూచనలను వారు చేసియున్నారు.

స్వాతంత్ర్యమునందలి ప్రేమకొరకై, గర్వము మనలను ప్రోత్సాహపరచుచున్నది. మనము స్వాతంత్ర్యాధికారులము కావలయుననియు పరుల కేరికిని లొంగియుండకుండ వలయుననియు, మనము కోరుచున్నాము. మనకన్న నెక్కువ ఘనులగువారు కలగని మనము తెలిసికొని యవసరమును బట్టి మనము వారియెడల విధేయత చూపవలసినవారలమై యున్నాము.

సంకటములకును, పోరాటములకును ప్రథమ కారణమును వీక్షింపుడు. మనము దీనత్వమును వహించి విధేయులమై ప్రవర్తింప వలయును. మన యిచ్ఛానుసారముగ ప్రవర్తించుటకన్న యితరుల యిష్టము ననుసరించి పోవుట యుత్తమము. అట్టి ప్రవర్తన వలన నొక పోరాటము యంత్యమగును.

ధన సంపాదన యందలి యత్యాశ, ధనార్జనము కొరకై మనలను పురికొల్పును.

అట్టి దురాశా పిశాచమును తృప్తిపరచుటకై, మనము పడరాని పాట్లుపడుదుము. మనలను మనము పీడించు కొనియెదము. పలువిధము లగు వేదనల పాలగుదుము. మనకు మనమే సంకటకారులమగుటయే గాక, మన యిరుగు పొరుగు వారికిని సంకటములను గలిగించెదము. మనము వారితో వాదప్రతివాదములకు దిగి వారిని ప్రతిఘటింతుము. కనుక దురాశ నెదుర్కొనుటకై స్వప్రయోజనా లోపము ప్రయోగింతము.

దురాశా పిశాచము నెదుర్కొనుటకై, పేదరికమును శక్తిని నియమించుదము. అసామాన్యమగు వాంఛలయందే ఆసగలవారమై యుందము. మన మీరీతిని చేయగలుగుదుమేని రెండవ పోరాటము ముగి యును. ఉన్నతస్థితులను పొందవలయు ననెడి యాశ, మనల నెప్పుడును యున్నతస్థితుల నాక్రమింప జేయుటకై పురికొల్పుచుండును. కాని యట్టి మన ప్రయత్నములలో మనకు పోటీదారులు బయలుదేరు చుండె దరు. వారు మనతంత్రముల నెదుర్కొని, మన మాశించుచున్న యున్నత పదవిని వారు కొట్టుకొని పోయెదరు. అందుచే దుఃఖములు, శారీరక బాధలు, సంకటములు, అశాంతియు బయలువెడలును. కనుక మనము దీనత్వమును వహించి, కడపటి స్థానమునే యాక్రమించు కొందుము గాక. మన పైవారలను వీక్షించి సంతసించుదము. మన మీరీతిని మనప్రవర్తనను క్రమపరచుకొన జాలుదుమేని, మూడవ యుద్ధరంగము ముగిసి పోవును. విశ్రాంతియు శాంతము వృద్ధియగును.

మనము మన మనోరధమూర్తులనే పూజచేయుచున్నాము. మన మాచరింప వలసియున్న సర్వకార్యములందును మన చిత్తాను సారము పోవుచుండవలయునని కోరుచున్నాము. మనకుప్రతిఘటనయేదైనను నెదు

రగునప్పుడు దుఃఖించుచు కలతనొందుచున్నాము. పలు సందర్భములందు భగవదిచ్ఛయును మన కాంక్షలును కేవలము వ్యతిరేకముగ నుండుట సంభవించును. మన కసంతృప్తిగ నుండియును, సర్వమును భగవదిచ్ఛ ననుసరించియే జరిగిపోవు చుండును. అయ్యో! యట్టి సందర్భములందు మనకెంత మితిమీరిన శరీర బాధలును, సంకటములును, గ్రుంగుబాటులును సంప్రాప్తించు చుండును.

కనుక మనము భగవంతుని యెడల విధేయులమై లొంగి యుందుము. సర్వశక్తివంతులగు వారి యేలుబడిక్రింద మనము దీనత్వమును వహించియుందుము గాక! భగవదాశీర్వాదము పొంది, భాగ్యశాలులై స్వర్గనివాసులై యున్నవారివలె మన మన్ని సందర్భములందును యీ ప్రపంచమునందు సైతము భగవదిచ్ఛయే పరిపూర్ణముగ నెరవేరు గాక యని మిక్కిలి నిష్కపటులమై భక్తియుక్తముగ భగవంతుని ప్రార్థించుదము. అప్పుడు మాత్రమే మన మత్యంత గంభీర శాంతమును మార్పు జెందని స్థిరమగు పరమ విశ్రాంతియును బడయ జాలుదుము.

---

## 24. వ అధ్యాయము

## పరుల జీవితములనుగూర్చి విమర్శింప వలయుననెడి జిజ్ఞాసాపరులమై యుండతగదు

1. జేసునాథస్వామి:-

కుమారా! జిజ్ఞాసాపరుడవై లేనిపోని నూతనాంశములనుగూర్చి యోచింపవలయుననెడు తలంపులతో శ్రమపడకుము. అది యిది నీకేల? మమ్మనుసరించి ప్రవర్తింపుము. ఏమానవుడెట్టివాడైన నీకేమి? ఏమానవుడేమి చెప్పుచుండిన నీకేల? ఇతరులనుగూర్చి నీవేమియును పూచీదారుడవుగావు. నీ ప్రవర్తననుగూర్చి మాత్రమే నీవు ఉత్తరవాదివై యున్నావు. గనుక పరుల విషయములందేల జోక్యము కలుగజేసికొనియెదవు?

మేమందరి నెరుంగుదుము. విశ్వము నందెల్లడల జరుగుచున్న అంశ ములను మేము చూచుచునే యున్నాము. ఏమానవుని స్థితిగతు లెటు లున్నదియు, ఏ మానవుడేమి తలంచుచుండినదియు, అతని యభిప్రాయ ము లేయంశమునందు గురిపెట్టబడియున్నదియు, యీ విషయము లన్ని యును మాకు గ్రాహ్యములు. కనుక సర్వవిషయములను మా కర్పింప వలయును. ఐతే నీవో మంచి శాంతమును వహించియుండుము. పరులు తమ యిచ్చవచ్చిన పోకడలు పోయిన పోనిమ్ము.

వారేమి చెప్పినను, వారేమి యాచరించినను, అందువలన లాభ నష్టములను వారే యనుభవించెదరు. ఏలయనగా వారు మా నేత్రములను మూసి మమ్ము మోసము చేయజాలరు.

2. పేరు ప్రతిష్టలు నీడవలె నిలుకడలేనివి. వానికొరకు వ్యర్థ ప్రయాస తీసికొనకుము. పలువురతో పరిచయముగలిగి యుండవలయు నని గాని, లేక పరులు ప్రత్యేకముగ నీ యెడల ప్రేమగలిగి యుండ వలయునని గాని కోరుకొనకుము.

ఏలయందువా, యిట్టికోర్కెలు గలవాడవగుదువేని నీ మానసము చెదరగొట్టబడి పరధ్యానము గలదై ప్రస్తుతమార్గమునుండి తొలగి పెడ త్రోవలకు గుంజుకొని పోబడును. అందుచే నీ హృదయమంతయు నంధ కార గృహమై పోవును.

నీకు మాదర్శన మొసంగుటకై మే మే తెంచుటను చక్కగ గమనించి, వెంటనే నీహృదయ కవాటములను తెరచియుంచి సిద్ధముగ నుంచుకొని యుందువేని, మిక్కిలి సంతసముతో నీకునీతి సూత్రములన్ని యును బోధించి, మాదివ్యరహస్యములన్నియును నీకు తెలియురీతిని వెల్లడిచేయుదుము. నీ ప్రార్థనలయందు జాగరూకుడవై వేచియుండుము. సర్వవిషయములయందును దీనత్వమును వహింపుము.

## సారాంశము

వాస్తవమగు హృదయ శాంతమును సంపాదించుకొనుటకును సంపాదించుకొనిన శాంతమును తిరుగ పోగొట్టుకుండునటుల భద్రపరచుకొని యుంచుకొనుటకును నొకమార్గముగలదు. అదియేది యన:

ప్రయోజనకరములు గానట్టియు,యనవసరమగునట్టియు,విచారములను పెట్టుకొనకుండుటయె.

ఉత్తావమైన జేసువుచే తనను వెంబడించి రావలయునని పిలువబడినప్పుడు అర్చ్యశిష్ట రాయప్పగారు "నాము ప్రేమించియున్న శిష్యుని గతియేమి గానున్న యది" యని యవివేకముగా ప్రశ్నించియున్నారు. ఈ ప్రశ్నకు జేసునాధస్వామి యొసంగిన ప్రత్యుత్తరమునే పావనుడగు మన గ్రంధకర్త మన యెడల ప్రయోగించియున్నాడు.

శ్రీ జేసునాధస్వామి రాయప్పగారి పై ప్రశ్నకు దయచేసియున్న ప్రత్యుత్తరమేమన:

"ఆ విషయముతో నీకేమి ప్రయోజనము. మేము నీ కొజ్ఞ యిడుచున్న రీతిని చేయుచు మమ్మనుసరించి గమ్ము" అని ప్రత్యుత్తరమిచ్చిరి

మనపొరుగువారలను సంబంధించియుండు విషయములందు మనమమితముగ జోక్యమును కలిగించుకొనుచు, అంతకన్న నెక్కువగ మనకు సంబంధించియుండు విషయములలో సంభ్రమము చెందుచున్నాము. మనము యశస్సును కొగలింప వాంఛించుచున్నాము. స్నేహితుల ప్రేమను పొందవలయునని కోరుకొనుచున్నాము. ప్రత్యేకముగ నొకానొక వ్యక్తితో స్నేహమును గావించి, వానివలన కొంత యాదరణను పొందవలయునని ప్రయత్నము చేయుచున్నాము. ఇట్టి చింతలన్నియును మిక్కిలి నిష్ప్రయోజనములు. ఇట్టి కొంతలవలన మానసికములగు శ్రమలగు బాటులును సంకటములును తప్ప, మరేమియును ప్రయోజనము లేదు. నిరర్థకమగు నిట్టి చింతలు కలవాగమె యుందుమేని, జేసునాధస్వామి మనలనందరిని వదలిపైచి తాము

మన కనుగ్రహించిన తమదివ్య దర్శనా ఫలములను పొందజాలకుండు నటుల అడ్డుపరచును.

---

## 25 వ అధ్యాయము

## చలింపని హృదయశాంతమును, దానియభివృద్ధియు నెందు గలవు ?

1. జేసునాథస్వామి:-

కుమారా ! "శాంతమును నీకువదలివేయుదుము, మా శాంమును నీ కనుగ్రహింతుము. ప్రపంచ మానవులిచ్చురీతిని మేము నీ కనుగ్రహించుటలేదు" అని మేము నీకు చెప్పియున్నాము.

ప్రతిమానవుడును శాంతము నభిలషించు చుండును గాని, వాస్తవమగు శాంతమునకు సంబంధించిన విషయముల నెవ్వడును లక్ష్యము చేయుటలేదు.

మే మనుగ్రహించెడు శాంతము దీనత్వమును వహించి నిరహంకార హృదయులగు మానవులందు మాత్రమే గలదు. సంకటము లన్నిటిని సహించియుండుటయందే మా శాంతము గలదు.

మా యుపదేశముల నాలకింపవలయునను యుద్దేశ్యము గలవాడవై యుందువేని, మే ముపదేశించు రీతిని ప్రవర్తించెదవేని, నీవు మిక్కిలి శాంతము ననుభవింప జాలుదువు.

2. శిష్యుడు:- నా ఏలినవారా ! ఐతే నే నేమి చేయవలెనో దయచేసి సెలవిండు.

3. జేసునాథస్వామి:- నీ వాచరించెడు ప్రతికార్యమునందును, నీవు చెప్పెడి ప్రతి అంశమునందును నీ వేమిచేయుచుంటివో, నీ వేమి వాక్రుచ్చుచుంటివో చక్కగ గమనించి చూచుకొను చుండుము.

మాకు మాత్రమే సంతోషమును గలిగించుటకును, మమ్ము తప్ప నితర మేమియును వాంఛింపక, దానికొరకై శ్రమపడుచుండుటకును నీ శ్రద్ధనంతయును వినియోగించుకొనుము.

పరుల చర్యలను గూర్చియు, వారు మాటాడు అంశములను గూర్చియు చక్కగ నాలోచించకయే, నీ యభిప్రాయము లేమియును వెలిబుచ్చకుము.

నీవు జోక్యమును కలిగించుకొని, జాగ్రత్తవహింప బాధ్యత లేని పరుల విషయములందు, అనవసర ప్రవేశమును గలిగించుకొనకుము.

ఇటులచేయ సాధ్యము గలవాడవగుదు వేని, నీ వెపుడు యే మాత్రమును కలతనొందకుండెదవు. కొన్ని సందర్భములందు కలత సంభవించు నేని, మిగుల అరుదుగను స్వల్పముగను మాత్రము తటస్థించును.

ఐతే ప్రస్తుతపు యీ మానవ జీవితమున సంకటములు బొత్తిగా సంభవించకుండుటయు, అంతరంగిక సంబంధమగునట్టియు లేక భౌతిక శారీక సంబంధమగునట్టియు బాధలు రాకుండుటయు, నెప్పుడు సంభవించుటలేదు. అట్టిభాగ్యము శాశ్వత విశ్రాంతి ననుభవించు చుండెడు కాలమునందు మాత్రమే పొందగి లుగుదువు.

కనుక యీ జీవితమున భారమేమియును నీపైబడి యుండునటుల తోచక పోయినంత మాత్రమున, వాస్తవముగ శాంతమును పొంది యున్నానని తలంచుకొనకుము.

నీ కెవ్వరును శత్రువులు లేనంత మాత్రమున, సర్వము నీకే అనుకూలముగ నున్నదని భావింపకుము.

సర్వకార్యములును నీ యిష్టాను సారముగ నిర్వహింప బడుచున్నంత మాత్రమున, నీవు నిర్దుష్టుడవని తలంచుకొనకుము.

నీవు గాఢమగు దైవభక్తి సంపన్నుడవై, యందలి మాధుర్యమును రుచిచూచి యున్నచో, నీవుమిక్కిలి ఘనుడవని యూహించుకొనకుము. భగవంతుడు నిన్నెక్కువగ ప్రేమించు చుండెననియు తలంపతగదు.

వాస్తవమగు సుగుణాభిలాషియగు మానవుని లక్షణము లివికావు. ఇటుల జరిగినంత మాత్రముచేతనే, మానవుడు తనస్థితియందు వృద్ధి గాంచుచున్నాడనియును, పరిపూర్ణ నిర్దుష్టుడాయెననియు తలంచుటకు వీలులేదు.

4. శిష్యుడు:- ఐతే స్వామీ! మానవుని యభివృద్ధి, పరిపూర్ణ పవిత్రత, శాంతము, దేనియందిమిడి యున్నవో దయచేసి తెల్పుడు.

జేసునాథస్వామి:-

(a) స్వల్ప విషయములందును, గొప్ప విషయములందును తాత్కాలికముగనైనను, లేక శాశ్వతముగనైనను సర్వ విషయములను కూర్చి శ్రమపడక, సంపూర్ణ హృదయముతో నిన్ను దైవ చిత్తమునకు అర్పించుకొనుటయందే శాంతము శాంతాభివృద్ధియు నిమిడియున్నవి.

అందుచే కలిమిలేములయందు సైతము, సర్వ విషయములను సమభావముతోడ చూచుచు నొక విధమగు మానసిక దృష్టితో దేవునికి కృతజ్ఞతాపూర్వక వందనము అర్పించుచుండవలయును.

నీకు అంతరంగికమగు ఓదార్పు లేనప్పుడు యింక నెక్కువ కష్టములనుభవించుటకు నీహృదయమును తయారుచేసి యుంచుకొనశక్తి గలవాడవై, యట్టి ఘోరమగుబాధల ననుభవింపవలసిన యవసరము లేని వాడనని యెంచుకొనక, నిన్ను నీవొక నీతిమంతుడవని నమ్ముకొనక మా నియామకములన్నిటియందును మేము న్యాయముగానె సమర్థించుకొనుచుంటిమని నీ వంగీకరించుచు, మా పవిత్రమగు ఘనతను శ్లాఘించుచుండునంతటి ధైర్యమును వహించి, మాయందలి నమ్మకముచే నెక్కువకాలము వరకు కష్టముల ననుభవించుటకు యుక్తుడవై యున్నచో, సత్యమగు నట్టియు, క్రమమగునట్టియు శాంతమార్గమున ప్రవర్తించుచుంటివనియు లేశమాత్రమైనను సందేహము లేకుండ మిక్కిలి యానందముతో తిరుగ మమ్ము దర్శింపయాశ గలవాడవైయుండ వచ్చునవియును చెప్పవచ్చును.

నిన్ను నీవు పరిపూర్ణముగ ద్వేషించుకొనగల స్థితికి వచ్చితివేని, యీ లోకమందు నీవనుభవించుటకు తగినంత శాంత సమృద్ధిని నీవు పొందగలవు.

## సారాంశము

మానవులందరును శాంతాన్వేషణాపరులై యుండెదరు. ఐయితే వారియందు మిక్కిలి కొలదిమంది మాత్రమే దానిని గాంచజాలెదరు. ఏలయనగా శాంతము లభింపనున్న గమ్యస్థానమును చేరుటకుగాను యేర్పడియున్న చక్కని రాజమార్గముల ననుసరించి వారు నడచుట లేదు.

పెక్కుమంది మానవులు యీ శాంతమును ప్రపంచవిషయముల నుండియె పొందవలయుననెడి యాశగలవారలై యుందురు. ఐతే వారాశించుచున్న శాంతము భగవంతునియందు తప్ప మరెవరియందును కనుగొనజాలరు.

కొంతమంది దైవభక్తుల గతియెటులున్నదో చూచితిరా! కొన్ని నిమిషములవరకు తమమనో వికారములు సద్దుచేయక శాంతముగ నున్నప్పుడును, తమ కోర్కెల కనుగుణ్యముగ ప్రతి అంశము నెరవేరుచుండు నప్పుడును, వారియుత్సాహము వివేకముతో గూడిన భగవత్ భక్తియు కొద్ది కాలమువరకు నిలిచియుండునప్పుడును, జ్ఞానమార్గానువర్తులై యుండువారలలో కొందరు తాము నిజమగు శాంతమును కనుగొనజాలితిమని యూహించుకొనుచు మోసపోవుచున్నారు.

విశ్రాంతిని, క్షోభమును లేమిని యీ మానవ జన్మయందెంత యెక్కువగ ననుభవించుటకు సాధ్యమగునో, అంతయెక్కువగ శాంత సమృద్ధిని పొందు మార్గము లేవియనగా;

a) భగవంతుని మాత్రమే సంతోష పరుపవలయుననెడి నిష్కాపట్యమగు సంకల్పము కలిగియుండుట.

b) భగవంతుని తప్ప యితరమేమియు వాంఛింపక, మరియేయితర పదార్థము కొరకు ప్రయత్నము చేయకుండుట.

c) మిక్కిలి యుల్లాసముతో భగవదేచ్ఛననుసరించి, స్వవిసర్జన గావించుకొనుట.

d) నీకు మంచిగాని, చెడుగాని దేనినైనను సమభావముతో కృతజ్ఞతా పూర్వక వందనములతో భగవంతుని దివ్యహస్తములనుండి స్వీకరించుట.

e) ఆధ్యాత్మికమగు యూరటను గోల్పోయినప్పుడు మనమేమియును మొరపెట్టుకొనకుండుట.

f) పరిశోధనలయందు చిక్కుబడి యున్నప్పుడు, అంతకన్న నెక్కువ పరిశోధనలను సైతము సహించి యుండుటకై తయారై యుండుట.

(g) అన్నివిషయములందును సదా న్యాయమగునట్టియు పవిత్రమగునట్టియు భగవత్ నియములను పూజించుచుండుట.

ఇవియె విశ్రాంతిని, మనస్సునకు మనోనెమ్మదిని, శాంతమును పొందగలుగుటకు ముఖ్యమగునట్టియు అమోఘమగునట్టియు క్రమమగు మార్గములు.

---

## 26 వ అధ్యాయము

## కేవలము గ్రంథపఠన వలనగాక, దైవప్రార్థనలవలన సంప్రాప్తమగు మానసిక స్వాతంత్ర్యమునందలి శ్రేష్ఠత్వము.

1. శిష్యుడు:- నా స్వామి! సోమరిపోతువలెగాక సృష్టియందలి యేవిషయమును గూర్చియు మితిమీరిన యనురాగము పెట్టుకొని ప్రాకులాడని మానసముగల మానవుడు కలిగియుండెడు యొకానొక విధమగు యసాధారణాధికారముతో దైవసంబంధమగు విషయములందు చలింపని మనసు గలిగియుండుటయు, పలువిధములగు విచారకరమగు విషయములందు పడియుండుటయు, విచారము లేవియును లేనివానివలె ప్రవర్తించుచుండుటయు పరిపూర్ణజ్ఞానియొక్క వర్తనలై యున్నవి.

మహోన్నత కరుణా స్వరూపుడవగు ఓ దైవమా!

2. ఈ మానవ జీవిత వాంఛలనుండియు ప్రపంచ భోగానందములలో చిక్కుకొనకుండుటకై శరీరావసరములనుండియు నన్ను విముక్తిని గావింపుడు. సంకటములకు లోనై ధైర్యమును కోల్పోయి పడిపోకుండుటకున్ను, నా యాత్మకేమియు నాటంకములు రాకుండునటుల నన్ను కాపాడి రక్షింపుమని ప్రార్థించుచున్నాను.

ఆత్మాతురతతో నిష్ప్రయోజన కరములగు ఐహిక వాంఛాలోలురై వ్యర్థులగు మానవులాచరించుచుండు విషయములనుండి, నన్ను కాపాడుడని నేను ప్రార్థించుటలేదు. కాని దైవమా! తమ సేవకుడనగు నా యాత్మ తానుకోరునప్పుడు మానసిక స్వాతంత్ర్యతను పొందకుండు లాగున నణగద్రొక్కి, వెనుకకు నెట్టివైచుచుండినట్టియు చావనున్న మానవకోటిపైని విధింపబడియున్న సామాన్య నరకదండన ననుసరించి శిక్షగా ననుభవింప వలసియున్న సంకటముల నుండియు నన్ను కాపాడి రక్షించుమని వేడుకొను చున్నాను.

వర్ణనాతీతమగు మాధుర్యరాశివై వెలయుచున్న ఓ దైవమా!

శాశ్వతానందమును చేకూర్చ జాలెడి దివ్యవిషయములను ప్రేమించకుండునటుల ఐహిక విషయాసక్తత వలని యూరట నన్ను వెనుకకు లాగిపట్టి, నాకు ఆటంకమును కలిగించుచున్నది.

కేవలము తాత్కాలిక సంతోషమును గూర్చ జాలెడు నట్టి దేదియో యొక లాభకరమగు విషయమును, నా కనులముందు మెరపించుచు తనయందే మోహము కలిగియుండు లాగున నాకాశపెట్టుచున్నది.

అట్టి యీ ఐహిక సంబంధమగు విషయాసక్తత వలని యూరటను నేను ప్రియమగు దానినిగ భావించుకొన మిగుల కఠినమైనదనియు దుర్మార్గమైనదనియు భావించుకొను నటు లనుగ్రహింపుము.

మాంస రుధిరాదులచే నిర్మింపబడియున్న యీ భౌతిక శరీరమునందలి మోహము, నాపై చెలరేగి నన్ను జయింపకుండునటుల దయచూడుడు.

అశాశ్వతమగు నీప్రపంచము, దానినంటుకొని యుండెడు యనిత్యమను దానిప్రభావమును నన్ను మోసము చేయకుండును గాక.

పిశాచము తన కపట తంత్రములచే నన్ను స్థానభ్రష్టుని చేయకుండును గాక.

ఈపై నుదహరింపబడిన నానావిధములగు శత్రువులతో పోరాడునపుడు నేను భీతిజెందక, యుద్ధరంగమునుండి పారిపోక, నిలచియుండి శత్రువులతో పోరుసల్పుటకు ధైర్య స్థైర్యములను యీ యుద్ధమున రానున్న కష్టములను సహించుటకు శాంతమును, యుద్ధమునందు కాలు కదల్పక నిలచి పట్టుదలతో విడువక పోరాడుటకు నిశ్చలతను దయ చేయుము.

ఈ ప్రపంచ సంబంధమగు సౌఖ్యములకు మారుగా స్పిరితుసాంత్వపు యొక్క యూరటను నాకు దయచేయుము.

---

## సారాంశము

మన మపేక్షింపవలసిన లోపరాహిత్యత లేక పరిపక్వము దేనియందిమిడియున్నది? ఈ స్థితి నెటుల పొందజాలుదుము?

భగవత్ సేవయందే మనలను వినియోగించుకొని భగవత్ చింతనాలోలురమై యింద్రియ నిగ్రహమొనర్చి, చిత్తవృత్తిని జయించుటచే మనము పరిపూర్ణత్వమును పొందజాలుదుము.

మన మాశింపవలసియున్న నిట్టి పరిపూర్ణస్థితిని గూర్చి పావనచరితుడగు మన గ్రంథకర్తగారు మనకు తెలిపినమాటనే, యీ యధ్యాయమునం దారంభమున చూపబడియున్న పేరులో వారు తెలిపియున్న విషయమున కనుగుణ్యముగ కేవలము గ్రంథపఠనవలనను, అభ్యాసము వలనను మనము పడుచున్న శ్రమవలనను లభ్యపడని మనోహరమగు ఆత్మ స్వాతంత్ర్యమును, భగవంతునినుండి సంపాదించుకొనుటకు గాను దైవ ప్రార్థనలకు గడంగినారు.

## 27 వ అధ్యాయము

### తనక్షేమమును మాత్రము పాటించుకొనుచు, దానిని ప్రేమించుకొనుచుండు మానవుడు, మహోన్నతుడగు దైవమునే కోల్పోవుచున్నాడు.

1. జేసునాథస్వామి:-

కుమారా! నీవు సర్వమును పొందవలయునను ఆశగలవాడవగుదువేని, నీకున్న దంతయు నందరికిని పంచిపెట్టుము. నీకొరకై నీవేమియు మిగుల్చుకొనకుము.

నిన్ను నీవు ప్రేమించుకొనుటకన్న, నీకెక్కువ యపాయకరమగు విషయము ప్రపంచమున మరొక్కటేదియును లేదని తెలిసికొనుము.

ప్రతి వస్తువుకొరకు నీవు ప్రేమేచ్ఛలనుసరించి వాని యెడల నీవంత బద్ధానురాగుడవై యుండెదవు.

పవిత్రమై, నిష్కాపట్య రహితమగు క్రమమగు ప్రేమకలవాడవైనచో, నీవెట్టి ప్రత్యేక విషయమునందును మితిమీరిన యనురాగ పాశబద్ధుడవై యుండవు.

నీకగత్యలేని యేవస్తువును పొందవలయునను దురాశగలిగి యుండకుము.

నీ యంతరంగిక స్వాతంత్ర్యము నణచివేయ జాలెడు, లేక కోల్పోవునటు లొనరించు, నే విషయమును కలిగియుండుటకై శ్రమపడకుము.

నీ వాంఛింపగలిగినట్టియు పొందగలిగినట్టియు, సమస్తవిషయములను, నిన్ను సైతము హృదయపూర్వకముగ మాకర్పింప నీకిష్టము లేకుండుట మిక్కిలి వింతగ తోచుచున్నది.

వ్యర్థమగు దుఃఖముచే నీవేల కృశించి పోయెదవు? లేనిపోని, కొరగాని చింతలను పెట్టుకొని, నీవేల దుఃఖములో మునిగిపోయెదవు?

మా దివ్యచిత్తము ననుసరించి,లొంగి ప్రవర్తింపుము. మాకు సంతసము గలిగించెడు రీతిని, యోగ్యప్రవర్తనగలవాడవై యుండుము. అందువలన నీకేమియును నష్టము కలుగదు.

అటులగాక, నీ స్వలాభము కొరకు గాని, లేక నీ మానసమునకు సంతోషకరమగు నటుల నీ యిచ్ఛవచ్చినరీతిని పలు స్థలములందేదియో యొక విషయముకొరకొరకై గ్రుమ్మరుచు, ప్రయత్నములు చేయుచుందువేని ఆతురతలు లేకుండ నుండజాలవు.

ఏలయనగా ప్రతి విషయమందును నీ కేదియో యొక లోపము గోచరమగుచునే యుండును. ప్రతిస్థలమందును నీ కొటంకములు సంప్రాప్తించుచునే యుండును.

3. కనుక బహిరంగ విషయములను పొందుటవలనగాని, లేక యా విషయముల నెక్కువ చేసికొనుటవలనగాని నీకేమియును లాభము లేదు. ఐతే ప్రపంచవిషయములను తృణీకరించివైచి, వానియెడల నీకుగల మోహమును నీ హృదయమునుండి మొదలంట నరికివేయుటయే నీ కుపయోగకరమగు అంశము. ఇప్పుడు మేము నీకు బోధించుచున్న విషయములు: నీ ధనము, భాగ్యము, యీ రెంటి సందర్భములయందు మాత్రమేనని నీ వెంచుకొనవలయునని మా యభిప్రాయము గాదు. ఘనతయందలి అత్యాశ, వ్యర్థస్తోత్రములందలి వాంఛ, మొదలుగాగల సర్వప్రపంచ విషయములను గూర్చియు మేము నీకిటుల నుపదేశించుచున్నాము. ఈ విషయములన్ని యీ ప్రపంచముతో గతించిపోవుచున్నవి.

నీకు దైవభక్తియందు కొంక్ష లేకున్నచో, నీవెచ్చట నున్నను ఆ స్థలము వలన నీకేమియును ప్రయోజనముండదు.

శాంతమును నెలకొల్పుటకు తగిన పునాది నీ హృదయమునందు లేనిచో, బాహ్యప్రపంచమునుండి నీ వాశించుచున్న శాంతము చిరకాలము నిలిచియుండజాలక, మిగుల స్వల్పకాలముననే అంతమగును.

అనగా నీవు మాయందు విశ్వాసము లేనివాడవైన నీకిటుల సంప్రాప్తమగు చుండును. అప్పటప్పటికి నీ వట్టి మార్పులు గావించుకొనుచుండినను నీస్థితి యెప్పటికిని బాగుపడదు.

## ప్రార్థన

### కల్మషరాహిత్యము - దైవజ్ఞాన సంపాదన.

శిష్యుడు :- ఓ నా స్వామీ! తమ స్విరతుసాంత్వ దయచే నాకు, స్థైర్యమొసంగుడు. నా అంతరంగమును బలపరచుకొనుటకును నిష్ప్రయోజన కరమగు చింతలను, సంకటములను నా హృదయమునుండి పారద్రోలుటకును తగినశక్తిని నాకు దయచేయుడు.

ఏవిషయైనను సరియే - కొద్దిదైనను, గొప్పదైనను, యేవిషయము లందును నేను పలువిధ వాంఛలు కలవాడనై, వానిచే నీడ్చుకొని పోబడకుండునటు లనుగ్రహింపుడు. సర్వవిషయములు శాశ్వతముగ నుండక గతించి పోయెడు స్వభావముగలవనియు, వానివెంట నేనును గతించి పోవువాడనే యనియు, నే నెంచుకొన జాలునటుల నా కుపదేశముల దయచేయుడు.

ఏలయనగా: సూర్య మండలము క్రిందనుండు యీ ప్రపంచమునం దేదియును శాశ్వతముగ నిలచియుండునది లేదు. అంతయు క్షణికము.

ఇచ్చట యీ ప్రపంచమున, దేనిని గాంచినను ప్రతివిషయమును ఆత్మకు దుఃఖకరమైనదిగనే యున్నది.

ఓహో! ఈ ప్రపంచ విషయము లన్నియును యిట్టి స్వభావము గలవని గ్రహింపగల మానవుడెంత జ్ఞాని!

ఓ నా యేలికా! అన్నిటికన్న ఘనముగ తమనే ప్రేమించి యాశింప నేర్చుకొనుటకును, మీ దర్శనాభాగ్యము నంద జాలుటకును, అన్నిటికన్న నెక్కువగ తమదివ్య మహిమను గుర్తెరింగి తమను ప్రేమించుటకును, తమదివ్య నిర్మాణము ననుసరించి సర్వవిషయముల సత్యతత్వమును గ్రహింప జాలుటకును, దివ్యజ్ఞానమును నాకుదయచేయుడు. నన్నుగూర్చి ముఖప్రీతులు పలుకు వారలను తృణీకరించివైచి వాటిని సరకుచేయకుండు నటులను, నాకు మారాడి, యెదురించు వారి యెడల నేను సమానము గలవాడనై శాంతమును వహించి యుండ గలుగునటు లనుగ్రహింపుము.

ఏలయనగా: పరులు పలుకుచుండెడు పలువిధములగు మాటవలన చలింపని మానసము కలిగి యుండుటయు, కపటులు పలుకుచుండెడు ప్రీతికరమగు ముఖస్తుతులను చెవియొగ్గి యాలకింపకుండుటయు, మిక్కిలి యోగ్యము.

ఇటుల చేయుజాలుదుమేని, ఇప్పుడు మేమారంభించ బోవుచున్న జ్ఞానమార్గమున సురక్షితముగ ప్రయాణము చేయుజాలుదుము.

---

## సారాంశము

మితిమీరిన మన యక్రమ అనురాగములే మన వ్యాకులతకును, సంకటములకును మూలము.

దేవునితో మనము పరిపూర్ణమగు సంబంధము కలిగియుండిన గాని, వ్యాకులతనుండియు, సంకటములనుండియు పరిపూర్ణ విముక్తిని పొందజాలము.

దేవునికి మనకును పరిపూర్ణ స్నేహ మెట్లుగలుగును? ఏమానవులు లేశమాత్రమైనను వెనుదీయక, తమను పరిపూర్ణముగ దేవునికి కర్పించి వారి యధికారమునకు బద్ధులై లొంగి యుండెదరో, ఏమానవులు తమ సర్వస్వమును వర్జించివైచి తమను హీనపరచుకొని యుండెదరో, ఏ మానవులు ప్రపంచ విషయము లన్నింటిని సైతము విసర్జించెదరో, అట్టి మానవులతో మాత్రమే దేవుడు పరిపూర్ణ సంబంధము, స్నేహము గలవాడై యుండును. స్వప్రేమయే యిట్టి మహోన్నతమగు యోగ్యతనుండి మనలను దూరముగ తొలగించివైచు చున్నది.

దేవునియొక్క ప్రేమకొరకై మన స్వప్రేమను బలిచేయ వలెను. యోగ్యుడగు మన గ్రంథకర్త గారు పై చెప్పియున్న వివేక వంతములగు చింతలను కలవాడై ప్రపంచ విషయములన్నిటి నుండియు నింత పరిపూర్ణ త్యాగమును గావింపజాలెడు మార్గములను జూపెట్టి యున్నారు. ఆ మార్గము లేవియన: మన హృదయమును నిర్మాలిన్యమును కొనర్చి, మనకు మానసిక వికాసము నొడగూర్చి మన హృదయములను

మానసములను దైవజ్ఞానములో నింపజాలిన పరాక్రమ శాలి యగు దేవుని దివ్య పవిత్ర ప్రేమ సహాయము చేతనే మనము పైని చెప్ప బడిన పరిపూర్ణ పరిత్యాగమును చేయజాలుదుమని గ్రహించియున్నాము.

ఇట్టి పవిత్ర ప్రేమను దయచేయుడని వారు వెంటనే దేవుని గూర్చి ప్రార్థించుచున్నారు.

కనుక మనమును అట్టి దివ్య పవిత్రప్రేమనే మనయెడల చూపు డని దేవుని ప్రార్థించుదము.

సర్వవిధములగు మనలేమిడులయందును, కలతలయందును, కష్ట ములయందును మనరక్షణకొరకై దేవునే ప్రార్థించుదము.

క్రమముగ నియమానువర్తులమై సుస్వభావముతో దేవుని ప్రార్థించుదుమేని, వారు తమ యుల్లాసకరమగు దయను మనయెడల చూపుట కెల్లప్పుడును సంసిద్ధులై యుండెదరు.

---

## 28. వ అధ్యాయము

### పరులపై అపనిందవేయు వారలను గూర్చి

1. జేసునాథస్వామి:- కుమారా ! జనులు నీయందు దురభిప్రాయము గలవారలై నిన్నుగూర్చి కర్ణకఠోరముగ మాటలాడినయెడల నీ మాన సమున కించనొందకుము.

పరులు నిన్నుగూర్చి కలిగియుండు అభిప్రాయమునకన్న నింక నెక్కువ యధముడవని యెంచుకొనుచుండవలయును. నీవే అందరికంటే బలహీనుడవని భావించుకొనుము.

నీ మనసాక్షి బోధించురీతిని ప్రవర్తించుచుందువేని, పరులు నిన్ను గూర్చి పల్కుచుండు వ్యర్థప్రసంగములను లేశమాత్రమైనను సరకు చేయకుందువు.

సంకట సమయములందు శాంతమువహించి, అంతరంగికమున నిన్ను గూర్చియే ధ్యానించుచు, నిన్ను గూర్చి పరులు గావించు

చుండెడి యభిప్రాయములచే కలతనొందక మౌనమును వహించి యుండగ లుగుట అల్పవిషయము కాదు.

2. పరులు నిన్నుగూర్చి పలుకు మాటలమీద నీ శాంత మాధారపడి యున్నదని తలంపకుము. ఏలయనగా? నీవు చేయు కార్యములనుగూర్చి వారు మంచివాడుకలు పెట్టినను, లేక చెడువార్తలు కల్పించినను నీవెప్పటి వలెనే యుందువు.

సత్యమగు శాంతము మహిమయు నొందగలవు. అవి మాయందే గలవు. ఏవ్యక్తి మానవులను సంతోషపరుప వలయునను యత్యాశను కలిగియుండడో, లేక పరుల యసంతృప్తిని గూర్చి భయము చెందడో ఆవ్యక్తియే యమోఘమగు శాంతము ననుభవింపగలడు.

హృదయవ్యాకులతయును, ఇంద్రియ చాపల్యమును, యీ రెండును మానవులకు ప్రపంచవిషయము లందలి మితిమీరిన ప్రేమ చేతను సంప్రాప్తమగుచున్నది.

---

## సారాంశము

పరులకు మనయెడల ప్రతికూలాభిప్రాయములును, వారలు మనల గూర్చి చేయుచుండు పరిహాసములును, వారి మానసిక వ్యాకులతలును మనకు కోపమును కలగించి, యుద్రేక పూరితులనుగా చేయును. అట్లు జరుగుట యేలయన, వారు మనలగూర్చి యేర్పరచుకొనియెడి ప్రతికూలాభిప్రాయములను, వారు చేయుచుండెడి పరిహాసములను న్యాయమైనవి కావను నమ్మకము గలవారలమై, మనకవి యపాయకరములని తలంచెదము. ఇతరులు మనలనుగూర్చి తలంచుదానికన్న మనమింక నెక్కువ యధములమనియు, మనలో మన మెప్పుడు నవలయును. పరులకు మనయెడల గల గణ్యతయును లేక క్రోధసూచకములగు ముఖచిట్లింతలును వృక్షఛాయలవలె యశాశ్వతములనియును, ధూమము వలెను నీటియావిరివలెను కొలది కాలముననే యదృశ్యములగు నవి యనియు, మనకదివరకు లేనివానిని యుండకూడని వానిని చేకూర్పవ

నియు, మనకవసరమగునట్టియు మనకు కలిగి యున్నట్టియు యేవిషయములను తీసివేయజాలవనియు మనము తలంపవలయును.

పరులు మనలనుగూర్చి కలిగియుండెడు యభిప్రాయములను మననుగూర్చి వారు కావించు ప్రసంగములను మనము భగవంతుని దృష్టియందున్న దానికన్న నెక్కువ యోగ్యులుగాని అయోగ్యులుగ గాని చేయజాలవను నమ్మకము గల వారలమై వారి యభిప్రాయములను సంభాషణలను మనము లేశమాత్రమైనను లక్ష్యము చేయతగదు.

అయ్యో! భగవంతునకు మిక్కిలి ప్రీతికరములగు మనయందలి కొన్ని విషయములు మానవునిచే నెంతయెక్కువగ న్యూనత పరుపబడుచున్నవి.

జేసునాథస్వామికి మిక్కిలి ప్రీతికరమైనదేదియా యని యోచించుకొనుటకు మారుగా, పరులు మనలనుగూర్చి యెట్టి యభిప్రాయముల నేర్పరచుకొనుచున్నారాయను అంశమును గూర్చియే తలపోయుచున్నాము.

మానవులయెడల విధేయులమై యుండుటకన్న, భగవంతుని యెడల విధేయులమై ప్రవర్తించుటయే మిక్కిలి యుత్తమముగదా?

ప్రపంచమానవులను తృప్తిపరచుటకన్న, భగవంతునకు తృప్తికరముగ ప్రవర్తించుటయె మిక్కిలి యోగ్యముగదా? గనుక మన మటులేల ప్రయత్నములు చేయరాదు?

---

## 29 వ అధ్యాయము

## సంకట సమయములందు దేవుని ప్రార్థించుచు, వారిని నుతించుచుకొను చుండవలయును.

1 శిష్యుడు:- ఈ పరిశోధనయు సంకటములును నాకు సంప్రాప్తమగుటయందే సంతోషమును గలిగియుండెడి నాయేలికా! సర్వదా తమ నామము పొగడబడునుగాక! దీనినుండి నేను తప్పించుకొని పోజాలను.

తమ సహాయముచే నీ పరిస్థితి నాకు ప్రయోజనకరముగా పరిణమించునట్లు, నేను తమ సన్నిధికి పరుగిడవలసియున్నది. నా యేలికా! నేనిప్పుడు సంకటములందు చిక్కుబడియున్నాను. నా హృదయమునకు విశ్రాంతిలేదు. నాకిప్పుడు సంప్రాప్తించియున్న కష్టములచే మిక్కిలి బాధపడుచున్నాను.

ప్రియమగు తండ్రీ! నేనిప్పు డేమని మనవిచేసుకొనవలయును? ఇప్పుడీకష్టములలో చిక్కుబడియున్నాను. ఈ కష్టసమయమున నన్ను రక్షింపుడు.

అయితే నేను మిక్కిలి దీనత్వమును పొంది, మీచే రక్షింపబడునపుడు తమ ఘనత మిక్కిలి శ్లాఘింపబడుటకుగాను నేనీసమయమున తమ యందకు చేరియున్నాను.

నాయేలికా! నన్ను యీ సంకటములనుండి విముక్తి నొందింప తమకు నాయందు దయ గలుగుగాక. నేను నిరుపేదనుగాన నేను చేయు జాలునదేమిగలదు? తమను విడచి నేనెచ్చటికి పోగలను?

దేవా! యీ సమయమున సైతము నాకు శాంతమును దయ చేయుము. నా స్వామి! నాకు సాయముచేయుడు. నాకెన్నికష్టములు సంఘటిల్లి నేనెంత నలిమివేయబడినను భీతిల్లను.

2. ఇపుడిట్టి సంకటములమధ్య నే చెప్పకొనజాలినదేమిగలదు! స్వామి! తమ చిత్తానుసారముగ జరుగుగాక. నేనిట్టి సంకటములను బాధలననుభవించుటకు పాత్రుడనై యున్నాను. నేనీ సంకటములన్నియు తప్పక సహింపవలసినవాడనై యున్నాను.

సంకటము లనియెడి యీ తుపాను గడచిపోయి, మంచికాలము ప్రాప్తించువరకు, నేనీ సంకటముల సహించియుండ గలుగునటు లనుగ్రహింపుడు.

ఐతే నా దైవమా దయాస్వరూపుడవగు నా స్వామి! నేనీ కష్టములందు పూర్తిగా మునిగిపోకుండుటకుగాను, యింతకుపూర్వము పలుమారు తాము నాయందు దయగలవారలై చేసియున్నరీతిగా, యీ శోధనను

సైతము తొలగించి, దానికప్రాశతను తగ్గించుటకు సర్వశక్తిగల తమ హస్తము తెగించుచున్నది.

ఈ సంకటములను, విమర్శనలను సహించుట నాకెంతకష్టముగ నున్నదో, వీనిని మార్పుచెందునటులొనర్చుట మహోన్నతులగు స్వామీ మీ కుడిహస్తమున కంత సులభమే.

## సారాంశము

పరిశోధనలును సంకటములును మానవునకు మిక్కిలి యుపయోగకరములు కావచ్చును. ఏలయనగా ఇవియన్నియు మానవుని దుస్థితిని, బలహీనతను,దోషముల నాతనికి చక్కగా నెరుకపరుచును.

వీని నన్నిటినిగూర్చి మానసమున చింతించుకొనునటుల దీనత్వమును వహించియుండునటులను,యివియన్నియు తనకు సంప్రాప్తించుట న్యాయమని యంగీకరించునటులను, వీనినన్నిటినుండియు రక్షింప బడుటకుగాను భగవంతునికడకే పోవునటులను, దైవమునుండి తప్ప పరులెవరినుండియు నెట్టిసౌఖ్యములను కోరకుండునటులను సంకటములు విమర్శనలు మనకు ప్రోత్సాహము కలిగించుచుండును. గనుక సంకటాకృతమైయుండియు భగవంతునియెడల విశ్వాసమును వీడకుండెడు యాత్మ, తన నిట్టి దీనస్థితిలోనికి లాగుకొనివచ్చి పడవైచిన తన యేలికయు దైవమునగు భగవంతుని ప్రార్థించుచు, కొనియాడుచు యీ సంకటములనుండి కాపాడుమని మిక్కిలి దీనత్వముతో వేడుకొనును. అంతేగాక భగవదిచ్ఛకులోబడి వారి నియమములను కొనియాడుచు వారి యిచ్చానుసారముగ సర్వమును నిర్వహింపబడుగాక యని ప్రార్థించుచు తనను కాపాడుకొనుటకుగాను తన కవసరమగు శాంతమును భగవంతుని కరుణాప్రసాదములను పొందగలుటకుగాను తానెటులుండవలయునో దాని కనుగుణ్యముగ తనయిచ్ఛల ననసవరించుకొను చుండుటగాంచి మనము విశ్రాంతిజెందవలసిన యవసరములేదు.

## 30. వ అధ్యాయము

## దైవసహాయముకొరకై ప్రార్థించుటయు, దేవయిష్ట ప్రసాదమును తిరుగసంపాదించుకొన గలుగుదు మనియెడి నమ్మకమును కలిగియుండుటయు.

1. జేసునాథుడు:- కుమారా సంకట సమయములలో బలమొసంగెడు ప్రభువును నేనే. నీ స్థితిగతులు చక్కగనుండని సమయమున మాచెంతకురమ్ము. కష్టములు సంప్రాప్తించునపుడు తిరుగ మమ్ము ప్రార్థించుటకు చురుకుతనము లేనివాడవై నిరుత్సాహముతో మందగమనుడవై యుండుటచేతను మావలన నీవు పొందవలసిన సౌకర్యములను పొందుటలో యెక్కువ యాటంకముల నెదుర్కొనుచున్నావు.

ఏలయనగా? నీవు నిష్కపటముగ మమ్ము ప్రార్థించుటకుముందు మధ్యకాలములలో ననేక యితరసౌకర్యములకొరకై యాశించి లోకవిషయములందే యెక్కువ సంతృప్తిని బడయవలెనని కృషిసల్పుచున్నావు. అందుచే మాయందు విశ్వాసముంచువారిని కాపాడి రక్షించువారము మేమని నీవు గ్రహించువరకు బాహ్యవిషయములన్నియును నీకు ఎక్కువలాభకారులు కాకపోవుట తటస్థించుచున్నది. అంతియేగాక మానుండి నీకు శక్తివంతమగు సహాయముగాని లాభకరమగునట్టి సలహాగాని లేక చాలాకాలమువరకు నీ సంకటముల నణచియుంచగల యుపాయములుగాని నీకు లభించవు.

ఐతే సంకటములనియెడు తుపాను దెబ్బనుండి తప్పించుకొని తిరుగ ధైర్యమును తెచ్చుకొనినవాడవై నీయందు మాకుగల దయార్ద్రహృదయ వికాశముచే తిరుగ బలముగలవాడవుగమ్ము.

ఏలయనగా? శిథిలమైన వానినన్నిటిని పునఃనిర్మాణము గావించి వాని నెప్పటిస్థితికి తెచ్చుట మాత్రమేగాక, గణించుటకు వీలుగలుగునంత యెక్కువ పరిపక్వస్థితికి తయారుచేసి యిచ్చుటకుగాను మేము నీ సమీపమునందే యున్నాము.

2. మాకు కష్టములు విషయమేదేని కలదా? మేము వాగ్దానము మాత్రముచేసి దానిని నెరవేర్చకుండెడి వారమా.?

నీ విశ్వాసమెచ్చటగలదు? స్థిరమనస్కుడవై పట్టుదలను వీడకుండుము. శాంతమును వహించి మంచిధైర్యముకలిగి యుండుము. తగిన సమయమున నీకు సౌకర్యములు సిద్ధించును. మాకొరకై కనిపెట్టుకొనియుండుము. మే మేతెంచి నీ కష్టముల నివర్తింపజేసెదము. నిన్ను కలవరపెట్టునది మోహామే సుమా? నీకు భీతికొల్పునది వ్యర్థమగు భయమే.

ముందురానున్న కాలములో యేకష్టములు రానున్నవో యనెడు మానసిక వ్యాకులత నీకెట్టి లాభమును చేకూర్చును? దుఃఖపరంపరలే నీపైబడుచున్నవి.

"ఏదినము సంప్రాప్తించు కష్టము లాదినమునకు చాలును" (మత్తయి(VI-34)

ముందు రానున్నవని తలంచెడు కష్టములను లేక సంతోషమును గూర్చి చింతించుట వ్యర్థము. నిష్ప్రయోజనము. ఏలయనగా అవి బహుశా యెప్పటికిని సంప్రాప్తించక పోవచ్చును,

3. ఇట్టి భ్రాంతులచే మోసపోవుట మానవునకు సహజము. శత్రువులయొక్క సూచనలచే సులభముగా నాకర్షింపబడుట బలహీనమగు ఆత్మలక్షణమై యున్నది. ఏలయనగా? వాస్తవమగు విషయములచే నిన్ను భ్రమింపజేసి మోసగింపవచ్చునా యనిగాని, ప్రస్తుతపు విషయములయెడల ప్రీతినికల్పించిగాని లేక ముందురానున్న విషయములనుగూర్చి నీకు భీతినికల్గించిగాని, నిన్ను జయింపవచ్చునా యను విషయమునుగూర్చిగాని నీ శత్రువు లక్ష్యము చేయడు. గనుక నీ వెట్టిహృదయ వ్యాకులతనుగాని భయమునుగాని పొందకుము.

మాయెడల విశ్వాసముగలవాడవై యుండుము. మా కరుణయందు నమ్మకముంచుము. మేము మీకు దూరముగనున్నామని నీవు తలంచునపుడు పలుమారు మేము సమీపముననుండే యుందుము,

దాదాపుగా సర్వమును నీవు కోల్పోయితివని నీవభిప్రాయపడి దుఃఖించుచుండునపుడే, నీ వనేకమారులు గొప్ప పుణ్యమును సంపాదించుకొను సమయములై యున్నవి. నీవు కోరుకొనుచుండునటు లేదైనను జరుగక నీ వాంఛలకు వ్యతిరేకముగా సంభవించునెడల సర్వమును చెడిపోయినదని తలంపతగదు.

నీ కేదియో యొక సంకట మెచ్చటనుండియో ప్రాప్తించినను ప్రస్తుతపు నీ చిత్తవృత్తినిబట్టి యా సంకటమునుగూర్చి యభిప్రాయ మేర్పరచుకొనకుము, అట్టి సంకటమునుగూర్చి భయపడకుము. ఆ సంకటమునుండి తప్పించుకొనుట కుపాయము లేదని చింతింపకుము.

4. ఒకప్పుడు మేము నీ కేదియో యొక కష్టమును కలిగించునపుడు గాని, లేక నీవు మావలన యాశించెడు సౌకర్యములను తొలగించినపుడు గాని, మేము నీ క్షేమమునుగూర్చి తలంపక నిన్ను పూర్తిగ చేవదలితిమని తలంపకుము. ఏలయనగా స్వర్గరాజ్యమునకు గొంపోవు మార్గ మిట్టిదియని నీవును మాయితర సేవకులును కోరుకొనుచుండులాగున, ఫలసిద్ధి పొందుటకన్న మిక్కిలి కష్టానుభవములు కలవారై యుండుటయే మిక్కిలి ప్రయోజనకరము.

నీ రహస్య తలంపులన్నియును మేమెరుంగుదుము. కొన్ని సమయములందు నీ కెవ్విధమగు సౌకర్యముల నొసంగక, నిన్ను విడిచివేయుటయే నీ యాత్మకు మిగుల లాభకరమని మాకు తెలియును. ఏలయనగా? మేమటుల చేయకున్నయెడల నీవు పొందు వాంఛా పరితృప్తివలన గర్వముచే నుప్పొంగి నీ నిశ్చయస్థితిని కనిగొనజాలక వ్యర్థ సంతృప్తిని గలిగియుందువు.

మేము నీకేమి ప్రసాదించెదమో దానిని మేము తిరుగ న్యాయముగనే నీదగ్గరనుండి తీసికొనగలము. తిరుగ మాయిచ్చవచ్చినప్పుడు దానిని నీకనుగ్రహింపగల్గుదుము.

5. దానిని మేము ప్రసాదించినను అది యింకను మా సొత్తై అయియున్నది. గనుక మేము నీ దగ్గరనుండి దేనినైనను తిరుగతీసికొనునప్పుడు నీ స్వంతఆస్తిని మేమేమియు తీసికొనుటలేదు.

ఏలయనగా? నీకు ప్రసాదింపబడెడు ప్రతి యుత్కృష్టమగు బహుమానమును మావల్లనే ప్రసాదింపబడుచున్నది (జ్ఞాన్నే సు 1-17) మేము నీకు దుఃఖములను లేక యితర దురవస్థలను కలిగించుచున్నమేని దుఃఖముచే కృశించిపోకుము. హృదయభాగముచే కృంగిపోకుము. మేము తిరుగ నీస్థితిని అనతికాలముననే చక్కపరచగలము. నీభారములన్నియును సంతోషములోనికి మార్పుచేయుదుము. ఐనప్పటికిని మేము నీయెడల నీరీతిని వర్తింపవలసినప్పుడు న్యాయము ననుసరించియే యటులాచరింతుముగాన నీవు మాకెక్కువగ ధన్యవాదము లర్పింపవలసియున్నావు.

6. నీవు క్రమముగయోచించి, సత్యమును గ్రహించితివేని నీకేదైనను దురవస్థ తటస్థించునపుడు ధైర్యముచెడి ఖిన్నుడవై కలతనొందుటకుమారుగా సంతసమానసనన్కుడవై మాకు వందనములు అర్పింపవలయును.

నిన్ను చేవిడువక నీకు సంకటములను గలిగించి దుఃఖములపాలుజేయుటయే నీకు మిక్కిలి సంతోషకరమగు వరమని నీవు భావించుకొనవలయును.

నా తండ్రీ! నన్ను ప్రేమించునటులనే నేను మిమ్ము ప్రేమించుచున్నానని (జ్ఞాన్నే 15-9) మా ప్రియమగు శిష్యులకు మేము చెప్పియున్నాము. అశాశ్వతమగు నీ ప్రపంచ సౌఖ్యానుభవముకొరకై మేము వారిని పంపియుండిలేదు. పోరాటముసల్పుటకై పంపియున్నాము. పరులచే గౌరవింపబడుటకై వారిని మేము పంపియుండలేదు. ప్రపంచ మానవులచే ద్వేషింపబడుటకే పంపియున్నాము. కష్టించి పాటుబడుటకై పంపియున్నాముగాని మందమతులై యుండుటకుకాదు. విశ్రాంతి ననుభవించు చుండుటకై పంపియుండలేదు. శాంతమును వహించి యెక్కువ యోగ్యతను గడించుకొనుటకై పంపియుంటిమి. కుమారా! యీ విషయములన్నియును మరువక జ్ఞప్తియందుంచుకొనుము.

---

## సారాంశము

సంకటములందు తగుల్కొని దుఃఖించుచుండునపుడు మనమాచరించు మొదటి లోపమేమన ఘనము సంకటములయందుండునప్పుడు

వానినుండి మనకు ముక్తినిచేకూర్చి యూరటలను సౌకర్యములను యను గ్రహింపగల భగవంతుని శరణుజొచ్చుకయే ప్రతియూరటను వారి నుండి నిరీక్షించుట మొదటిలోపము.

తగినంత యుత్సాహముతోను, నమ్మకముతోను, భగవంతుని శరణుజొచ్చకుండుట రెండవలోపము.

అధైర్యపడి మనలను ముంచివేయునంతటి స్థితికి మనము తెచ్చు కొనిన సంకటములనుండి విముక్తి జెందగలమనియెడి యాశావిహీను లమై మితిమీరిన దుఃఖమునందు మునిగిపోవుట మూడవలోపము.

మన కెట్టిసంకటములు సంభవించినను అవియన్నియు భగవం తుడు మనకనుగ్రహించిన వరములని యెంచుకొనకుండుట నాల్గవ లోపము.

అట్టివరములను మనకు ప్రసాదించిన దైవమును శ్లాఘించి ప్రార్థించుచు, కృతజ్ఞతా పూర్వకవందనము లాచరింపవలయును. న్యాయముగునట్టియు నీతి, నియమబద్ధముగుటయు వారి కార్యనిర్వహణ కౌశల్యమును మనముపొగడుచు వారికి వందనము లర్పించుదుముగాక. అట్టిలోపము లేమియును మనయందు లేకుండునటుల జాగరూకులమై యుండవలయును. మహోన్నత శక్తివంతమగు భగవంతుని కరుణవలన గాక పరుల నెవరినుండియు నూరటలనుగాని, సౌకర్యములనుగాని, కష్ట విముక్తినిగాని యాశించక, ప్రప్రథమముననే మనము భగవంతుని శరణు జొరవలెను.

పట్టుదలతోను, నమ్మకముతోను భగవంతుని ప్రార్థించుచు అదే సమయమున భగవంతుని చిత్తానుసారముగ వారికిలొంగియుండి, విధేయు లమైయుందుము. శాంతమును వహించి ధైర్యయుతులమై సాహసముతో విడువని పట్టుదలకలవారమై యుందుముగాక.

మనము ప్రతిదినము మామూలుగా గావించుకొను చుండెడు ప్రార్థనలకు భంగము లేకుండునటుల భగవంతుని క్షేమ మనకు లభింపనున్న కాలముకొఱకును వారి రాకకొరకును శాంతముగ వేచి యుండవలయును.

సర్వవిధములగు పరిశోధనలనుండియును, మోహములనుండియు కష్టములనుండియు మనకు లాభము కలుగుటెట్లని తప్పించుకొనుట కిదియే మార్గము. పరిశోధనాదులను, విముక్తి తమ మహిమకొరకును మనముక్తి కొరకును భగవంతుడు మనకు దయచేయును.

---

## 31 వ అధ్యాయము

## సృష్టికర్తయొక్క దర్శనప్రాప్తికొరకై సృష్టివస్తువు లన్నిటిని విసర్జింపవలయును

1. నా ఏలికా! ఏ మానవుడుగాని సృష్టియందలి యే యితర పదార్థములుగాని నన్నాటంకపరుప జాలకుండునట్టి స్థితికి నేను రావలసియున్నయెడల ఇప్పటికన్న నింకనెక్కువ దైవానుగ్రహము నాపై రావలసిన యవసరముగలదు.

ఏలయనగా? ప్రపంచవిషయము లేవియైనను నన్నిచట యాటంకపరచి నిలిపియున్నంతకాలము నేను తమసాన్నిధ్యమునకు స్వాతంత్ర్యముతో యెగిరి రాజాలను.

పావురము రెక్కలవంటి రెక్కలు నాకుదయచేయు వారలెవ్వరు? తక్షణమే నేను యెగిరిపోయి విశ్రమించియుందును. (Ps L IV-7) అని చెప్పిన యోగ్యుడు మిక్కిలి మనోస్వాతంత్ర్యముతో తమవద్ద కెగిరివచ్చుటకెక్కువ కాంక్షగలవాడై యుండెను.

సర్వేశ్వరునియందు తప్ప యితరవిషయములందెందును దృష్టి నిలిపియుంచని నిష్కపట ప్రవర్తనుడగు మానవుడు మాత్రమే మిక్కిలి విశ్రాంతి కలవాడై యుండును.

ఈ ప్రపంచ విషయముల నాశింపకుండ వానికన్న పరులెవ్వరు యెక్కువ స్వాతంత్ర్యముగల వారలుగా నుండగలరు? ప్రతిమానవుడును సృష్టియందలి విషయములను తృణీకరించి వానికన్నిటికి నతీతుడై తనను సైతము పూర్ణముగా నిగ్రహించి, మానసిక మహానందములో

నిలిచి ప్రపంచవిషయము లేవియును తమతో సరిపోవజాలవని నెరుంగవలయును. సృష్టియందలి సర్వవిషయములనుండియు తొలగి, స్వతంత్రుడైయుండినగాని మానవుడు స్వాతంత్ర్య మానసముతో భగవత్ విషయముల పైపునకు తన దృష్టిని మరల్పజాలడు. సృష్టియందలి యనిత్యవిషయములన్నియు విడనాడి దైవధ్యాననిష్ఠయందు నిమగ్నలగువారు జనులుకొందరుమాత్రమే గలరు. ఇందుకై ఆత్మస్థితిని బాగుపరచి పైకిలేవనెత్తి యెక్కువ యున్నతస్థితికి గొంపోగలిగినంత గొప్ప దైవవరప్రసాద మవసరమైయున్నది. ఏలయనగా? అశాశ్వత సృష్టివస్తువులనుండి తమ్ము ప్రత్యేకించుకొనగల మానవుల సంఖ్య చాల స్వల్పము.

మానవుడు మనోవికాసముగలవాడై సృష్టివిషయముల నంటియుండక, స్వతంత్రుడై, భగవంతునితో పరిపూర్ణముగా చేరికయై యుండనియెడల యాతడెంత వివేకియైనను, యాతడెట్టి సంపన్నుడై యుండినను అది అంత యెక్కువైన విషయమైయుండదు.

బ్రహ్మాండమై, శాశ్వతపుణ్యరాశియై యేకమై వెలయుచున్న భగవంతుని తప్ప యితరవిషయముల వేనినైనను ఘనముగ నెంచు మానవుడు చిరకాలమువరకు నీచస్థితియందుండి క్రిందపడి పొర్లాడ చుండును.

భగవత్ సంబంధము కానిదంతయును శూన్యము. శూన్యమైనదనియె యెన్నబడవలయును. హృదయవికాశముగల దైవభక్తుని యొక్క జ్ఞానమునకును శాస్త్ర పండితునియొక్క జ్ఞానమునకును భేదముగలదు.

దైవ ధ్యానపరాయణులై యుండవలయునని వాంఛించువార లనేకులు గలరు. ఐతే అందుకొరకై యవసరమగు విషయములను సాధన చేయుటకు శ్రద్ధలేని వారలై యున్నారు.

గుర్తులయందును పంచేంద్రియములచే తెలిసికొనబడియెడి అంశములందును యెక్కువ గౌరవము చూపుచున్న మనము యింద్రియములను నిగ్రహించుటకు మాత్రము శ్రద్ధలేనివారలమై యుండుట మన ఆత్మాభివృద్ధికి మిక్కిలి విఘ్నకారి.

జ్ఞానులమని చెప్పుకొను మనము అశాశ్వతమగునట్టియు నీచమగునట్టియు విషయములందింత యాతురత గలవారలమై యింతయెక్కు

వగ శ్రమపడుచు మన అంతరంగిక విషయములంగూర్చి యోచించుకొనుటకుగాను మన యింద్రియములను పూర్ణముగా మన యదుపునందుంచికొనకున్నాము. ఇది యేకారణమువల్లనో ఇటుల చేయుచుండుటయందు మన యుద్దేశ్యమేమియో మనమిటులేల నటించుచుంటిమో నాకర్థమగుటలేదు.

4. అయ్యో కొలదికాలమువరకీ అంశములను గూర్చిన స్మరణయందుండి తిరుగ తక్షణమే యాంతరంగిక విషయములనుండి వెలుపలికేతెంచి యటునిటు గ్రుమ్మరుచున్నాము. అదియునుగాక మనమాచరించుచుండెడు కృత్యములను తీవ్రముగ విమర్శించుకొనుచుండుటలేదు. మన మేవిషయములందు కాంక్షగలవారమగుచుంటిమో గమనించుకొనుటలేదు. అదియునుగాక మన కర్మలయందు పవిత్రత లేనందుకుగాను మనము దుఃఖించుచుండుటయును లేదు.

మానవులు తమ జీవితమును పాప భూయిష్టమును చేసికొనుటచే జలప్రళయము సంభవించెను.

మన హృదయానురాగములు కలుషితములగుటచే మన హృదయమునుండి బయలుదేరు కృత్యములుగూడ కలుషపూరితములగును. నిర్మల హృదయమునుండి పవిత్రజీవితమను ఫలముసిద్ధించును.

5. ఒక వ్యక్తి యెంతవరకు కార్యాచరణ చేయుచున్నాడను అంశమునుగూర్చి విమర్శన చేయుచున్నాముగాని, యాతడాచరించిన కార్యముల నెంతసదుద్దేశ్యములతో నాచరించి యున్నాడను అంశమును గురించిమాత్రము మనము శ్రద్ధతో యోచించి చూచుచుండుటలేదు.

ఒక వ్యక్తి బలహీనుడా, బలశాలియా, సుందరుడా, సూక్ష్మబుద్ధిగలవాడా, మంచి రచయితా, మంచిజ్ఞానముగలవాడా, చక్కగా పాటుబడి పనిచేయువాడా యనెడు విషయములగూర్చి విమర్శన చేయుదుము గాని, యాతడెంత దీనత్వమును వహించిన మానసముగలవాడో, ఎంతశాంతము సహనముగలవాడో, ఎంత భగవత్ భక్తిపరాయణుడో, ఎంత అంతరంగిక పరిశుద్ధతగలవాడో, యను విమర్శనలు చేయువారు కొలదిమందిమాత్రము గలరు.

స్వాభావికముగ మానవులు మనుజునియొక్క బాహ్యవిషయము అనుగూర్చి యోచించెదరు, గాని భగవదనుగ్రహమో మానవుని అంతరంగికహృదయచర్యలను పరిశీలించును. మనుష్యస్వభావము పలుమారు మోసపోవుచున్నది. ఐతే వరప్రసాదదృష్టితో చూచువాడు దేవునియందు విశ్వాసముంచును, కనుక మోసపోవుటలేదు.

మన యాత్మను యుత్కృష్టము, గంభీర్యమగు భగవత్ ధ్యాననిష్టయందుండుటకు తగినంత వికాసముగలవానినిగా చేసికొనుటకు నమ్మదగినట్టియు, నిశ్చయమై నిస్సంశయమగునట్టియు, తప్పనిసరిమార్గము లేవియనగా,

a) పరిపూర్ణమానసిక స్వాతంత్రత
b) ఆత్మనిగ్రహము
c) శరీరమును, యింద్రియములను, మానసమును, హృదయమును సదా నిగ్రహించియుండుట
d) పవిత్ర సంకల్పములను గలిగియుండుట
e) అమోఘమగు భగవత్ విషయస్మరణ
f) మన మాటలనుగూర్చియు, చర్యలనుగూర్చియు, తలంపులు వాంఛలనుగూర్చియును, భగవంతుని సన్నిధానమున మిగుల కఠినముగ పరిశీలించుకొనుట

హృదయపూర్వక విధేయతను పరిపూర్ణ నిగ్రహత్వమును మన నుండికోరుచు, దేవుడు హృదయవాసియై యుండగా స్వల్పమగు స్వవిషయములనుగూర్చి యెక్కువపని కల్పించుకొననేల? పరులవిషయములనుగూర్చి చంచలత నొందనేల?

దైవానుగ్రహమును తృణీకరించియుండుట మనకెంత యపాయకరమగు అంశమోయని యెరుగుదుము. ఐనప్పటికి దుష్టప్రవర్తనకు పురికొల్పెడు భావములకు లొంగిపోవుటవలన మనకు సంభవించుచుండెడు నష్టములనుగూర్చి మనము లేశమాత్రమేనియు లెక్కచేయుటలేదు.

మనమెటుల ప్రవర్తింపవలయునని దేవుడు కోరుచున్నాడో యను అంశమునుగూర్చి లేశమాత్రమేనియు శ్రద్ధలేనివారమైయున్నాము.

## 32. వ అధ్యాయము

## స్వపరిత్యాగము - అక్రమకాంక్ష విసర్జనము.

1. జేసునాథస్వామి :- కుమారా నీవు పరిపూర్ణ పరిత్యాగ మొనరించినగాని పరిపూర్ణ స్వాతంత్ర్యమును బడయజాలవు. స్వలాభమును పాటించువారలును, స్వక్షేమకలవారలును, బంధీకృతులై యున్నారు. పలువిధవాంఛలుగలిగి పలువిధచింతలతో చంచలమానసులై, క్రీ జేసునాథస్వామినిగూర్చిన తలంపులేవియును లేక, తమ సౌఖ్యమునే పాటించుచు, పలుమారు అశాశ్వతములగు మాయోపాయములను పన్ను వారు ఆత్మస్వేచ్ఛ లేకయున్నారు.

ఏలయనగా భగవత్ సంకల్పితములుగాని వన్నియును నశించిపోవును. "సర్వమును విసర్జింపుము. నీవు సర్వమును కనుగొనియెదవు. వాంఛలనన్నిటిని విడచివేయుము. నీవు విశ్రాంతి నొందజాలుదువు" అను నీ చిన్ని యుపదేశవాక్యమును మనసునం దుంచుకొనుము. ఈ విషయమును చక్కగా యోచించి, నీ జీవితములో ప్రవేశపెట్టుకొనినచో నీవు సర్వమును గ్రహించుదువు.

2. శిష్యుడు:- నా యేలికా! ఇదియొక దినములో చేయగల కార్యము కాదు. చిన్నిబాలకుల యాటను బోలియుండునదిగాదు. వాస్తవముగ నీ చిన్నినీతివాక్యమునందు దైవభక్తుని పరిపూర్ణతయంతయు నిమిడియున్నది.

3. జేసునాథస్వామి:- కుమారా పరిపూర్ణ పుణ్యశాలురయొక్క మార్గమిట్టిదియని నీవు వినగనే కలతనొంది విగత ధైర్యుడవై, వెనుకకు మరలిపోవలదు. వెనుకకు మరలిపోక ఉత్సాహమును, యుద్రేకమును కలవాడవై, యోగ్యమగు కార్యాచరణకు గడంగవలయును. లేదా అట్టి పరిపూర్ణ పుణ్యుల మార్గముకొరకై నిష్కపటమగు వాంఛగలవాడవై యుండవలయును.

నీ వటుల ప్రవర్తించుచు, స్వప్రేమ లేనివాడవై, మా యాజ్ఞలకును, మేము నీపై నియమించిన పెద్దల యాజ్ఞలకును పరిపూర్ణ విధే

యుండవై ప్రవర్తించునంత యోగ్యమగు స్థితికివచ్చియుండిన మిక్కిలి యుత్తమము. అట్టి స్థితిలో నీవు మాకు మిక్కిలి సంతసము నొనగూర్చిన వాడవగుదువు. నీ జీవితమంతయును సంతోషముతోను, శాంతముతోను గడిచిపోవును.

నీవు పరిత్యజించవలసిన విషయములింక ననేకములు గలవు. వాని నన్నిటిని లేశమాత్రమైనను వెనుదీయక మాకు పరిపూర్ణముగ సమర్పణ గావింపకున్న, నీవు మావలన యాశించెడు వరప్రసాదములను బడయ జాలవు. "నీవు సంపన్నుడవు కొదలచిన అగ్నియందు పుఠము వేయబడిన బంగారమును మాదగ్గరనుండి విక్రయించుకొనుమని మేము నీకు సలహా నిచ్చుచున్నాము (Apoc. 3-18). ఇదియే ప్రపంచముయొక్క విష యములను లక్ష్యముచేయక వానినన్నిటిని పాదములక్రింద మట్టివైచు దైవజ్ఞానము.

లోకజ్ఞానమును, మానవులను, నిన్నునుమాత్రము సంతోషపగచు కొన వలయుననెడి యభిలాషను తృణీకరించివేయుము.

ఘనమైనవనియు, మిక్కిలినుతింప తగినవనియు, మానవులుచే యెన్న బడు విషయముల నన్నిటిని విడిచివైచి, నీచములని యెంచబడెడు విషయములను విక్రయించుకొనుమని మేము చెప్పియున్నాము. ఏల యనగా వాస్తవమగు దైవజ్ఞానము మిక్కిలి నీచమైనదిగను, యేవగింపదగి నదానివలెను, కనిపించుచుండును. మానవులట్టి జ్ఞానమునుగూర్చి అరుదుగ మాత్రమే తలంచెదరు.

ప్రతిమానవుడును తననుగూర్చి తాను మిక్కిలి నీచముగ నెంచు కొనుచుండవలయుననియు, ప్రపంచ మానవులచే ఘనముగా నెంచబడ వలయునను కాంక్షతో శ్రమపడకుమనియు నీకు బోధించునట్టి జ్ఞానమే దైవజ్ఞానము. అట్టి జ్ఞానమునుగూర్చి పలువిధ మానవులు ఘనముగా మాటలాడుదురుగాని, దానిననుసరించి ప్రవర్తింపక దూరముగా తొలగి యుందురు. అట్టి మానవుల కగోచరముగ నుండునటుల గుప్తపరుపబడి యున్న ఆ ముత్యమే యీ దైవ జ్ఞానము (మత్త. 8-46)

---

## సారాంశము

a) సర్వ ప్రపంచ విషయములను స్వార్థమును విసర్జింపవలయును

b) అక్రమవాంఛల నన్నిటిని యణగద్రొక్కి త్యజించవలెను

c) మన కోరికలన్నియును సంపూర్ణముగా శ్రీ జేసునాథస్వామికి

కర్పించి వారికి విధేయులమై వర్తింపవలయును

d) మనకు నీతిమార్గముల నుపదేశించుచు మార్గదర్శియై, జ్ఞానమును సమకూర్చెడు తండ్రివలె నుండుటకుగాను శ్రీ జేసునాథస్వామి తమకు బదులుగా యీ ప్రపంచమున నియమించినవారియెడల విధేయులమై వర్తించు చుండవలయును.

ఈ ధర్మోపదేశములన్నియును సమానముగా వివేకవంతమగు యభిప్రాయములను సూచించుచున్నవి. మిక్కిలి సున్నితములై ఖచితమైనవిగా నున్నవి.

ఈ న్యాయసూత్రములను పావనుడగు మన గ్రంథకర్త పలుమారులు మిక్కిలి యెక్కువ న్యాయసరణిని యుపదేశించుచుండెదరు.

ఏలయనగా; కొద్దిమాటలలో సత్యమగు క్రైస్తవ మతసంబంధమగునట్టియు భగవద్భక్తిపరాయణతకు సంబంధమగు నట్టియు ధర్మోపదేశము లిందు నిమిడి యున్నవి. వీరిచే బోధింపబడుచున్న వందనీయమగు నీ సూత్రములను సాధనచేయుటకై ప్రయత్నము చేయుదుముగాక. మన మటుల సాధనచేసి యనుభవమునకు తెచ్చుకొనగలుగుదుమేని సర్వమును విసర్జించినను విసర్జింపనటులే యుండగలము. భగవత్ దర్శనమును పొంది నవారమై మన మన్నివిషయములను గ్రహింప శక్తిగలవారలమగుదుము.

మనము మిక్కిలి వాంఛించుచున్న విశ్రాంతి, శాంతము, సౌఖ్యము సర్వేశ్వరునియందు కనుగొనజాలుదుము.

---

## 33 వ అధ్యాయము.

## మానవుని హృదయచాపల్యత, అంత్యమువరకు దేవుని యందే మనదృష్టినంతయు నిలిపియుంచుట.

జేసునాథస్వామి:- కుమారా నీకు తాత్కాలికముగ గలుగుచుండెడు హృదయానురాగములను నమ్మియుండకుము. ఏలయనగా అవియన్నియు వెంటనే మరియొక విధముగ మార్పుచెందుట తటస్థించును.

నీవుజీవించు యుండుకాలము నీకిష్టములేకున్నను పలువిధములగు మార్పులకు లోనై యున్నావు. అందుచే కొన్నికొన్ని సమయములందు నీవు యుత్సాహము కలవాడవై యుందువు. మరి కొన్ని సమయములందు చింతాక్రాంతుడవై యుందువు. ఈ నిముసమున హాయిగనుండెదవు. మరు సటి నిమిషమున సంకటములచే చలించి పోవుచుండెదవు.

దైవభక్తిశూన్యుడవై, ఎండి బీటబారిన భూమివలె కఠినహృదయుడవై పోయెదవు. కొన్నిసమయములందు యుత్సాహపూరితుడవై యుండెదవు. వెంటనే సోమరిపోతువయ్యెదవు. ఒక దినమున సంకటములచే భారముగల హృదయుడవయ్యెదవు. మరియొకదినమున తేలికహృదయము గలవాడవై యుందువు. ఐతే వివేకముగలవాడై, జ్ఞానమార్గానుభవముగల మానవుడు క్షణభంగురమైన యీ విషయములన్నిటికి యజమానుడై, తన హృదయస్థితినిగూర్చి లక్ష్యము చేయక ఇట్టి మానవ జీవితముయొక్క యస్థిరతా ప్రచండమారుతము యేదిశనుండి వచ్చుచున్నదను అంశముసుగూర్చి సరకు చేయకు. తన యాత్మయొక్క వాంఛయంతయును తానుపోయి చేరవలసియున్న సరియగు తన జీవితాశయము దెసకేసాగిపోవలయునని నాతడు కోరుచున్నాడు.

ఏలయనగా అతడు ఇటుల పలువిధమార్పులచే నిండియున్న మార్గము ననుసరించి పోవుచుండియును మాయందే నిలుప బడియున్న యాశయమనెడు ఏదృష్టిని విడువక, మాయందే కేంద్రీకరించి జీవయాత్రయందలి పలువిధమార్గములచే చంచలమానసుడు గాక, ఎప్పటివలెనే యొకేరీతిని మాదిశకే సాగివచ్చుచుండును.

2. అతని సంకల్పదృష్టి యెంతయెక్కువ పవిత్రముగనున్న,అంతయె క్కువ నిశ్చలతతో పలువిధములగు యీ తుపానులలో మునిగిపోవును. ఐతే పెక్కుమంది మానవు లీవిషయమున ఈ సత్ సంకల్పనా దృష్టి అంధకారావృతమైయున్నది. ఏలయనగా మానవులు తమ మార్గ మున తమ కభిముఖముగ నరుదెంచు యానందకరమగు వస్తువు దెస చూచెడు నైజగుణము గలవారైయున్నారు. తన లాభమును లేశమైనను పాటింపక పరిపూర్ణముగ స్వనిగ్రహము చేసియున్న మానవుడు మిక్కిలి యరుదు. అందుచేతనే యింతకుముందు కేవలము జేసునాధస్వామి కొరకే గాక, యూదులు లాజరస్అను వానిని చూచుటకు బెతానియా గ్రామ ములో నివసించుచున్న మార్తమరియమ్మలదగ్గరకు వచ్చియుండిరి. (జాన్. 11) గనుక సంకల్పదృష్టి చలించక యొకేరీతిని నిలిచియుండి సక్రమమైనదిగ నుండుటకుగాను అది పవిత్రముగ నొనర్పబడి, అడ్డము వచ్చెడు పలువిధములగు యాటంకములలో దేనిచేతను అడ్డుపరుపబడు లాగున మాదిశకు మరలింప బడవలయును.

---

## సారాంశము

మన హృదయము మిక్కిలి చంచలస్వభావము కలదై అలోచన చేయునదై యున్నది. ఎల్లప్పుడును శాంతము కొరకును మహో త్తమగు సౌఖ్యము కొరకును వెతకుచుండును. అట్టి శాంతము సౌఖ్యము నొనగూర్పజాలునని,మనమభిప్రాయపడెడు ప్రతి అంశమునందును యను రాగబద్ధమై యున్నది. అందుచే పలుమారులకి మోసపోవుచున్నది. సృష్టి వస్తువులలో దేనియందును తాను కాంక్షించుచున్న శాంతమును, ఆనంద మును కనుగొనజాలకున్నది. ఒక వస్తువునుండి మరియొక వస్తువుకడ కరుగుచున్నది అందుచేనది పలుమారు తన సంకల్పమును మార్చుకొనుచు ఒకదానినుండి మరియొకదాని కెగరి పోవుచున్నది.

వాస్తవముగ జ్ఞానిమాత్రమే మార్పుచెందని స్థిరసంకల్పములుకల వాడై యుండజాలును. వాస్తవమగు జ్ఞానియే నిష్కపటమగు నట్టియు

పవిత్రమై క్రమమగు సంకల్పములతో దేవునియందే విశ్రమించునట్టి మార్గమును స్పిరితుసాంక్తువలన నేర్చుకొనును.

ఆట్టిజ్ఞాని తనజ్ఞానమార్గమున తనకు సంభవించుచుండు విషయములలో దేనిమీదను తన సంకల్పములను నిలుపక, తాను ఏమహానీయమగు మేలుకొరకై బయలుదేరి చనుచుండెనో, దానిని తన దృష్టియందే నిల్పుకొని సాగిపోవుచుండును.

---

## 34 వ అధ్యాయము.

## సర్వేశ్వరునియందు ప్రేమగల మానవుడు అన్నివిషయముల కంటె నెక్కువగ దేవునియందే అమితానందమును గలిగియుండును

1. శిష్యుడు:- నా సర్వస్వమునైయున్న నా దైవమా! నాకింకేమి కావలసియున్నది. ఇంతకన్న నెక్కువ సౌఖ్యదాయియగు మరియొక విషయమేమి కోరుకొన కలిగియున్నాను!

ఆహా! ఎంత రుచికరమై, ఎంత మధురము లొలుకుచున్న వాక్యము. ప్రపంచమును ప్రపంచవిషయములను ప్రేమించు వారికిగాక, నిత్యుడగు శ్రీ జేసునాధస్వామిని ప్రేమించు వారలకే యీ వాక్యములు మిక్కిలి రుచికరమై మధురముగ నుండును.

నా దైవమా! నా సర్వస్వమా! గ్రహింప శక్తిగల మానవునకు కావలసినదంతయు చెప్పబడినది. పలుమారులు తిరుగ తిరుగ స్మరించుకొనుచుండవలయునను ప్రీతిగల వానికిది మిక్కిలి యానందదాయకమై యున్నది.

ఏలయనగా తాము సమీపమున నున్నప్పుడు సర్వ విషయములానంద దాయకములై యుండును. మీరు మా సమీపమున లేనప్పుడు సర్వ విషయములు నసహ్యాకరములుగ తోచుచుండును.

శాంతమును నెమ్మదిని ఆనందదాయకమగు సౌఖ్యమును తాము నా హృదయము కనుగ్రహించెదరు. మేము అందరిని గూర్చి సదభిప్రాయము గలవారమై యుండునటులను సర్వ విషయములందు తమ ఘనతనే కొనియాడు చుండునటులను చేయుచున్నారు.

తాము మా దగ్గర లేకున్నచో యే విషయమును మాకు చిరకాలము వరకు నిలిచియుండెడు సంతోషము నొనగూర్పజాలదు. ఏ విషయమైనను మా కనుకూలముగను రుచికరముగ నుండవలయునన్న తమ యనుగ్రహము సైతము మా యందుండి తీరవలయును. అయ్యది తమ జ్ఞానామృతముచే మిళితము గావింపబడవలెను.

2. తమ దయ రుచిచూచువారికి సర్వవిషయములును మిగుల రుచికరములుగ నుండును. దయను రుచి చూడనివాని కే విషయమైనను నెప్పుడైనను సంతోషము నొడగూర్ప జాలునా?

ఈ ప్రపంచజ్ఞానులును శరీరభోగ లాలసులును తమదివ్యజ్ఞానమునకు దూరమైయున్నారు. ఏలయనగా ప్రపంచవిషయములు మిక్కిలి ఆడంబరమైనవి. ప్రపంచవిషయానురాగముల ననుసరించియే పోవుచుంటిమా, మేము మరణించెదము.

ప్రపంచవిషయములను నిరసించి, ఇంద్రియనిగ్రహులై తమ ననుసరించి ప్రవర్తించువారలు నిశ్చయముగు యోగ్యులని యెరుంగ బడుదురు. ఏలయనగా ? వారు ప్రపంచవిషయము లందలి నూన్యతను గ్రహించి వాటిని విడిచిపైచి సత్యమును గ్రహింతురు. ఇంద్రియ బద్ధమగు శరీరానురాగమును యజ్ఞానమును త్యజించి ఆధ్యాత్మికతను పొందెదరు.

ఇట్టివారలు భగవంతు నెరుంగవలయునను కాంక్షగలవారై యుందురు సృష్టివస్తువులయందెట్టి యోగ్యతను వారు కనుగొనినను దానిని సృష్టికర్తకే యర్పించుచు వారిని నుతించెదరు.

ఐతే వాస్తవమునకు సృష్టికర్తయందలి మాధుర్యమునకు సృష్టివస్తువులయందలి రుచికిని, శాశ్వతసద్భాగ్యమునందలి యానందమునకును క్షణికములై గతించిపోవు విషయములందలి యానందములకును స్వయంభులై వెలయుచున్న మహాతేజస్సునందలి మాధుర్యమునకును

ఒకరిచే వెలిగింపబడెడు దీపముయొక్క కాంతియందు మాధుర్యము నకును మిక్కిలి వ్యత్యాసముగలదు.

3. ప్రపంచకాంతులను మీరియున్న శాశ్వతతేజోమయా! స్వర్గము నుండి తమ వికాశమును మాపైకి ప్రవర్తింపజేయుడు. తమ దివ్య తేజో పుంజము నాహృదయాంతర్భాగమువరకు చొచ్చుకొనిపోయి యందు విశ్రమించుగాక. తమ వికాసప్రభావముచే నా యాత్మ నిష్కల్మషమై ముద్దు మురిపెములతో పెంపబడినదై, జ్ఞానమునుపొంది యుత్సాహపూరితయై ఆనందపరవశత్వమున తమయందైక్యమై యుండుగాక. ఆహా కాంక్షనీయమగు యిట్టి పుణ్యదినమెపుడు సంప్రాప్తించునో గదా? స్వామీ ఎప్పుడు తమ దివ్య దర్శనా ఫలమును నా కనుగ్రహించి తమ యందు నన్నైక్యము గావించుకొనియెదరు?

ఇట్టి సుదినమును తాము నా కనుగ్రహింపకుండు నంతకాలమును నేను సంపూర్ణానందానుభవముగల వాడను గాజాలను. అయ్యో! పురాతన నైజ స్వభావమింకను నా యందు నిలిచియున్నది. ఈ దుష్ట స్వభావములు ఇంకను కొరత వేయబడి యుండ లేదు. నా దుష్టత్వమింకను పూర్తిగ చచ్చియుండలేదు. అది యింకను నా యాత్మ నెదిరించి పోరాడుచున్నది. నా యాత్మ రాజ్యమున నెమ్మదిగ నుండనీయక నా యంతరంగమున పోరాటము కల్పుచునే యున్నది.

ఐతే మహాంబుధుల గాంభీరతపై సైతము నధికారము వహించి యుండి తరంగముల యల్లకల్లోలతను శాంతిపరుపగల ఓ నా యేలికా లెండు, నాకు సాయము చేయుడు (కీర్త 38-10)

ఒండొరులతోడ పోరాటములు సల్పుచుండుట యందెక్కుడ యానందము కలిగియుండెడి నానా తెగలవారిని తాము చెదరగొట్టి యా పోరాటములన్నియు తమ దివ్య శక్తిచే నణచివేయుడు (కీర్త 17-31)

తండ్రీ! విస్మయము గొల్పజాలెడు తమ మహోత్కృష్ట నిర్మాణ చర్యలను మాకు కనుపరచి, తమ మహోన్నతశక్తి నుతింపబడునట్లు

చేయుడు. ఏలయనగా? ఓ సర్వేశ్వరా తమయందే మా ఆశయమును శరణ్యమును కలిగియున్నాము.

---

## సారాంశము

దేవుడే సర్వస్వము. ఈ విషయమును పలుమారులు మన పావన గ్రంథకర్తగారు చెప్పినట్లు వ్యక్తపరచగలము. దేవుడే మన సొత్తైయున్నచో మనము సర్వసంపదలు గలవారమే. వారులేని సంపద శూన్యము. దేవుడు మనయందున్నచో సర్వ విషయములును మిగుల మాధుర్యములై, ప్రేమింపదగినవై, సరసమైనవిగ నుండును. దేవుడు మనయందు లేకున్న సర్వము వ్యర్థమే. దైవజ్ఞాన బోధితమగు సారమంతయు నిదియే. ఈ దైవజ్ఞానోపదేశము నందలి తాత్పర్యమును హృదయపూర్వకముగ దేవుని ప్రేమించుచుండువారలే గ్రహింపజాలుదురు. తదితరులకిది యగోచరము, దైవ మహిమావిషయము లెంత మాధుర్యములైనవో రుచి చూడవలయునని కాంక్షించు వారలమైన యెడల, దేవుని మనము ప్రేమింపవలయును. ఇట్టి పరమ సుఖముకొరకు మనమెడతెగక పరిశ్రమించుచు, నిట్టూర్పులు విడచి చూడవలయును. కష్టములనుభవించుచు, పట్టుదలను వీడక ప్రయత్నములు చేయుచుండవలయును. ఈ మానవ జీవితమునందె పరమ సుఖమునందలి మాధుర్యమును ముందుగనె రుచిచూడగల్గుదుము.

సృష్టివిషయములను మనమెంత యెక్కువ, లేక తక్కువగ ద్వేషించుచుందుమో దైవ మహిమలయందలి మాధుర్యమంత యెక్కువగ, లేక తక్కువగ నుండును.

ఐతే మన యీ యూరటయును, సంతోషమును పరలోక జీవితమునందు మాత్రమే పరిపూర్ణమగును. అట్టి యూరటయందే మనమాశ గలవారలమై యుండవలయును, అట్టి యూరటను సంపాదించుటకే మనము దీక్ష నవలంభించవలయును. అట్టి యూరటయందే మనము కాంక్షగలవారమై యుండవలయును.

---

## 35 వ అధ్యాయము

## మానవజీవితమున శోధనలులేక సురక్షితముగనుండు మానవుడు లేడు.

1. జేసునాథస్వామి:- నీవీప్రపంచ జీవితమునందెప్పుడును సురక్షితముగ నుండజాలవు. ఐతే నీవు జీవించి యుండునంతకాలమును ఆధ్యాత్మికయుద్ధము అవసరమై యున్నవి. నీవు నీశత్రుకోటిచే సర్వదిశలయందును ముట్టడింపబడియున్నావు. అన్నిదిశలనుండియు వారు నీపై బడుచున్నారు. గనుక నీవిప్పుడే సమయమున శాంతియనెడు డాలు నుపయోగించుకొంటివేని, నీ వచిరకాలముననే గాయపరుప బడుదువు.

అదియును గాక మాకొరకై సర్వసంకటముల ననుభవింప వలయునెడి నిష్కపటవాంఛగలవాడవై, నీ హృదయమును మాయందు స్థిరముగ నుంచుకొనజాలవేని ఈ పోరాటమునందలి తీవ్రతకు నిలువజాలవు.

అర్చ్యశిష్టులు పొందియున్న జయమును పొందజాలవు. గనుక ధైర్యముతో సాగిపోవుచు, నిన్నెదిరించు ఆటంకముల నన్నింటిని వీర్యవంతమగు నీ హస్తముతో నణచివేయవలసి యున్నావు.

ఏలయనగా? విజయము పొందువానికి దివ్యవిందు ప్రసాదింప బడును. మందమతులు దురవస్థల పాలగుదురు.

2. ఈ మానవజీవితమున విశ్రాంతి ననుభవింపవలయు ననెడి కోర్కెగలవాడవైనచో, ఎన్నటికిని నశింపని శాశ్వతవిశ్రాంతి నెటుల బడయగలవు?

ఎక్కువ విశ్రాంతి ననుభవింపవలయునను పట్టుదలతో ఆశపెట్టుకొని యుండకుము. ఎక్కువ శాంతముకొరకు యభిలాషకలవాడవై యుండుము.

ఐహిక విషయములందుగాక స్వర్గలోకమున సత్యమగు నెమ్మది ననుభవింపవలయునను యాశతో శ్రమపడుము. మానవుల యెడలను

తదితర సృష్టి వస్తువులనెడలను గాక, దేవునియందే యట్టి నెమ్మది ననుభవింప నభిలాషకలవాడవై శ్రమపడుము.

దేవుని దివ్య ప్రేమకొరకై సర్వ సంకటములను అనగా: శ్రమ దుఃఖము, పరిశోధనలు, నిరసనలు, మనస్తాపములు, అవసరములు, శరీర జాడ్యములు, నష్టములు, అపవాదులు, అపనిందలు, గద్దింపులు, నిందలు, తత్తరపాటులు, దిద్దుబాటులు, తృణీకరింపులు, వ్యాధి సంకటములన్నియు ననుభవించుటకు సంసిద్ధుడవై యుండవలెను.

ఇట్టి సంకటానుభవములు, సద్గుణ సంపత్తికి సహాయకారులు. నూతనముగ క్రైస్తవమత మవలంభించిన జేసునాథస్వామి యను చరులను, పైని పేర్కొనబడిన సంకటములన్నియును పరిశోధించును.

ఇట్టి సంకటానుభవమువలన మనకు స్వర్గలోకమునం దమోఘముగు యానంద సౌఖ్యము లభించును. నీ వనుభవించు ఈ స్వల్పశ్రమకు ప్రతిఫలముగ శాశ్వత బహుమానమును, అల్పాందోళనలకు నిత్య మహిమను మేము ప్రసాదించుదుము.

3. నీవు కోరునప్పుడెల్లను ఆధ్యాత్మికోపశాంతులు కలిగియుండ వలయునని ఆశించుచున్నావా? మా అర్చ్యశిష్టుల విషయమున అట్లు జరిగియుండలేదు. అనేక సంకటములను, పలువిధ పరిశోధనలను, పలు విధములగు దుస్థితులను అనుభవించియున్నారు. ఐతే వారిట్టి సంకటము లన్నియును శాంతముగ సహించి, తమ యందెక్కువ విశ్వాసముంచు కొనక ముందు లభింపనున్న మహోన్నతమగు యశస్సుతో సరిపోల్చు కొని చూచిన తామనుభవించు సంకటము లెందుకును సరిపోవని తలచుచు దేవునియందె మిక్కిలి యెక్కువ నమ్మకమును నెలకొల్పు కొని యున్నారు.

ఇతరులెంతో మిక్కుటముగ దుఃఖించియును మిక్కిలి శ్రమపడి యును గడింపజాలని బహుమానమును నీవు వెంటనే పొందవలయు నను యాశకలవాడవై యున్నావు కాబోలు.

దేవుని దివ్య దర్శనముకొరకై కనిపెట్టుకొని యుండుము. మిక్కిలి ధైర్యమును వహించి ప్రవర్తింపుము. పవిత్రహృదయుడవై యుండుము. అధైర్యము జెందకుము. దైవానుగ్రహమునం దపనమ్మ

శము కలవాడవై యుండకుము. నీ ప్రయత్నములనుండి విరమింపకుము. సర్వేశ్వరుని మహిమకొరకై నీ శరీరమును, ఆత్మను పరిపూర్ణముగ నర్పింపుము. మేము నీ కనేక వరప్రసాదములను ధారాళముగ ననుగ్రహింతుము. నీ సంకటములన్నిటియందును మేము నీకు తోడునీడగ నుండి కాపాడెదము.

---

## సారాంశము

ఒకేవిధమగు యుపదేశములను యనేకరీతులుగ బోధించి చక్కగ గ్రహింపగలుగునటు లొనరించుటకై యోగ్యుడగు మనగ్రంథకర్త పలువిధ పద్ధతులును వినియోగించి యున్నాడు.

పలుమారులు మనగ్రంథకర్త యొకేవిధమగు విషయములను సంభాషించుచుండునుగాని, యొకేసమయములో వానికి కొన్ని నూతనాంశములను కైతము మిళితము చేయుచుండును. లేక తుదకు మరియొక విధమగు యభిప్రాయమునే గాని లేక యుక్తిగాని కలుపుచుండును.

మానవజీవితమున సంప్రాప్తింపనున్న సర్వసంకటములందును సహాయకారియై, సంకటములవలన బాధలనొందకుండ చేయజాలు శాంతగుణ సంపాదనకొరకై మనగ్రంథకర్త తనశిష్యులను పురిగొల్పునపుడు ఆయన యుపయోగింపక విడిచివచ్చిన పద్ధతులు లేనేలేవు.

పవిత్రమగు జీవితాశయములో జీవయాత్ర చేయుచున్న మానవునియొక్క జీవితమంతయును యుద్ధమును పోలియున్నది. పుణ్యామార్గవర్తనులకు పరలోక జీవితమునందనుగ్రహింపబడుటకుగాను, శాంతము విశ్రాంతియనెడు బహుమానములు నిలిపియుంచబడి యున్నవి.

అన్నిమూలలనుండియు మనపైబడనున్న శత్రువులచే ముట్టడింపబడినవారమై యున్నాము. ఈ శత్రుబలము నెదురించుటకు మనకు శాంతమనియెడు డాలుతప్ప యితర యాయుధము లేవియును లేవు.

మనకు సాయము చేయువారలెవరును లేక మనగతికి మనమే విడువబడిన వారలమైనచో, ప్రతివిషయమునందును మనము ఖేతిచెందవలసిన వారలమగుదము.

ఐతే దేవుడు తామే మనబలమై యుండెదమని వాగ్దానము చేసియున్నారు. మనము వారియందలి విశ్వాసమును, నమ్మకమును విడువకుందుమేని వారు మనకుతోడై, స్వయముగ మనకొరకై మనపక్ష మవలంభించి, మన శత్రువులతో పోరాటము సల్పుటను మానరు. మన శత్రుకోటపై మనకు పరిపూర్ణజయము చేకూర్చెదరు. పోరాటము ముగిసిన తదుపరి వారే మన జయఫలమయ్యెదరు. మన ప్రతిఫలము మిక్కిలి యపరిమితమైనదై యుండును.

---

## 36 వ అధ్యాయము

## మానవుల నిరర్థక తీర్మానములు

1 జేసునాథస్వామి:- కుమారా! నీ హృదయమును భగవంతునిపై స్థిరముగ నిల్పియుంచుకొనుము. నీ వమాయకుడవనియు, సుగుణశాలివనియు, నీమనస్సాక్షి సాక్ష్యమిచ్చునపుడు, పరులు నిన్నుగూర్చి ప్రకటించు నభిప్రాయములకు భయపడకుము. ఈ విధముగ కష్టపడుటయే యోగ్యము, సుఖకరము. హృదయ దీనత్వమును వహించి యుండువారలకిది దుఃఖకరముగ నుండదు. తన స్వశక్తిని నమ్మి, దానిపై యాధారపడియుండక, సృష్టికర్తయగు దేవునియందే నమ్మకమును కలిగియుండువారలకును యిటుల కష్టములనుభవించుట సంతాపకరముగా నుండదు. పెక్కుమంది మానవు లనేక విధములుగ మాట్లడుచుండెదరు, వారిమాటలను విశ్వసింపతగదు. ప్రపంచములో నందరిని సంతోషపరచుటయును సాధ్యముకాదు.

దేవునికై యందరిని సంతోషపరచ అర్చ్యశిష్ట చిన్నప్పగారు ప్రయత్నములు చేసియును, తా నందరియెడలను సంతోషముగ నుండినను, జనులు తననుగూర్చి యేర్పరచుకొనిన నానా విధాభిప్రాయములనంతగా లెక్కచేసియుండలేదు. ( 1 కొరింథి. 14-9)

2. ఇతరులకు జ్ఞానాభివృద్ధిని కలిగించుటకును, వారలమోక్ష ప్రాప్తికొరకును తనకు సాధ్యమైనంతవరకు తనశక్తికి తగినటుల శ్రమపడి

యున్నారు. కాని పరులు తననుగూర్చి చేసినతీర్మానములను, నిందలను అడ్డగింప జాలడాయెను.

అందుచే వారు సర్వమును సర్వజ్ఞానియగు దేవుని కర్పించి తనుగూర్చి పలుకబడిన దూషణవాక్యములకును, తమ ఇష్టమువచ్చిన రీతిని పరులు వెల్లడిచేయుచు వచ్చిన యపనిందలకును, శాంతభావము చేత తనను సమర్థించుకొనెను.

ఐనను బలహీనులకొక చెడుసాదృశ్యముగ నుండునేమోయను తలంపుతో వారు కొన్ని కొన్ని సమయములందు తగున్యాయమగు జవాబును చెప్పియుండిరి.

3. నశింపనున్న యీ మనుష్యమాత్రునిగూర్చి నీవు భీతిచెందనేల? అతడు నేడు జీవించియుండును. రేపటినుండియు తిరుగ నీకు కనుపింప కుండగనే పోవుచున్నాడుగదా.

దేవునియెడల మాత్రమే భయభక్తులుగలవాడవై యుండుము. నీవు మానవమాత్రులను చూచి భయమునొంద నవసరముండదు.

తన మాటలవలనను తానొనరించెడు చెరుపులవలనను ఎవ్వడైన నిన్నేమిచేయగలడు? మీదుమిక్కిలి వాడు తనకే యపకారము చేసికొనిన వాడగును. అదియునుగాక యాతడెంతటివాడైనను దేవుని న్యాయ తీర్మానములనుండి తప్పించుకొనజాలడు.

కేవలము మొరపెట్టుకొనుచు వాదించుటతో మాత్రము తృప్తి చెందియుండక, సర్వదా దేవుని నీకనులముందుంచుకొనుము. ప్రస్తుత కాలమున నీ వపజయము గాంచినటులును, నీకు తగియుండని యిక్కట్టును నీ వనుభవించుచుండినటులును నీకు తోచునేని, యావిషయము లను స్మరించుకొనుచు కృశించిపోకుము.

సహనశక్తిలేని కారణముచే, జయమునకు లోపము రానీయకుము. స్వర్గనివాసులమైయున్న మాయొక్క సహాయముకొరకై మావైపునకు తలయెత్తి మమ్ము ప్రార్థించుము. సర్వ సంభ్రమములనుండియు సర్వ దుస్థితులనుండియు నిన్ను కాపాడి రక్షించుటకును, ప్రతి మానవునకును

వానివాని చర్యల ననుసరించి తగిన ఫలములను యిచ్చుటకును, మేము శక్తిగల వారలమై యున్నాము.

పరులు కలిగించు మండ్రు అక్రమమగు అవమానములు, సావధాన ముగా యోచించకయే చేయు తీర్మానము, అపనిందలు, అపవాదములు, చెరుపులు, తిరస్కారములు, దౌర్జన్యములు మొదలుగాగల వన్నియును మన క్షేమమున కేమాత్రమును ప్రతికూలములు కాజాలవు. ప్రతికూల ములు కాకపోవుటయేగాక, మనలను దీనభావముగల వారినిగ నొనర్చి, శాంతగుణము నుపయోగపరచుకొనుచు, మనము పల్కెడు మాటలయం దును, మనచే యాచరింపబడెడు క్రియలయందును, జాగరూకతను వహింప గలిగి యుండునటులను, స్వర్గలోకమున మనము పొందవలసియున్న మన పరమసౌఖ్యములనన్నిటిని నిర్మాణము చేసికొని, వృద్ధిపరచుకొని, అలం కార యుతములుగ గావించుకొనుటకును, మనకు మిక్కిలి లాభకర మైనవిగ నుండును.

వాని యన్నిటియెడలను మనము తృణీకార భావముచే వహించి యుండి, వానిని స్వీకరించి, సర్వజ్ఞాన స్వరూపుడగు దేవుని కర్పింప వలయును.

బలహీనులయొక్క జ్ఞానాభివృద్ధి కవసరమగునప్పుడు తప్ప, మరె ప్పుడును అట్టి అపనిందాది సంకటములకు మనము తగియున్నను, తగి యుండకున్నను, మనము కలతనొందక, శాంతముగ నుండవలయును.

మానవులు మనలను దోషులని నిర్ధారణచేసి శిక్షించునప్పుడు, మనము సర్వేశ్వరునితో ధర్మాధర్మ విచారణశక్తితో మొరపెట్టుకొన వలయును. వారి తీర్మానమునకు మాత్రమే మనము భయపడవలసి యున్నాము.

దేవుని ప్రేమకొరకే మనము అందరికిని ప్రీతికరముగ నుండు లాగున ప్రవర్తించుటకొరకై ప్రయత్నము చేయుదుముగాన, అదేరీతిని మనము మానవులకు అసంతృప్తి కరముగ ప్రవర్తించినపుడు సైతము అట్టి మన ప్రవర్తన న్యాయమైనదనియు అగత్యమైనదనియు దేవుని ప్రేమకొరకై ఋజువు చేయుటకు ప్రయత్నము చేయుదుము.

## 37. వ అధ్యాయము

## హృదయ స్వాతంత్ర్యముకొరకై తన్నుతాను నిష్కల్మష మనస్సుతో పరిపూర్ణముగ దేవుని కర్పించుకొనవలయును.

1. జేసునాథస్వామి:- కుమారా! స్వనిగ్రహము గావించుకొనుము, మాదర్శనము నీకు లభించును. నీ యిచ్ఛవచ్చినరీతిని ప్రపంచవిషయముల నాశింపక, నీ స్వక్షేమముకొరకై వెతకుకొనుటలో శ్రమపడకుందువేని, నీ కెపుడును లాభకరముగానుండును. ఏలయనగా? నిన్ను మాకు పరిపూర్ణముగ సమర్పించుకొని తిరుగాడకుందువేని, నీ కెల్లప్పుడును వరప్రసాదము లెక్కువగ ననుగ్రహింపబడును.

2. శిష్యుడు:- నాయేలికా! నే నెన్ని పర్యాయములు స్వపరిత్యాగము గావించుకొనవలయును? ఏయే అంశములందు నా స్వాతంత్ర్యమును విసర్జింపవలయును?

3. జేసునాథస్వామి:- స్వల్ప విషయములందును, గొప్ప విషయములందును సర్వదా అన్ని వేళలయందును, స్వపరిత్యాగము గావించుకొని స్వాతంత్ర్యమును విసర్జించి యుండవలయును. మే మేమియును మినహాయింపు చేయము. సర్వ విషయములందును నీవు ఆత్మ సమర్పణము చేయవలయుననియే మా కోర్కెయైయున్నది.

బాహ్య విషయములందు అంతరంగమునను నీవు స్వేచ్ఛను విడువకున్న, నీ వెట్టుల మా వాడవయ్యెదవు. నీ వెంత శీఘ్రకాలములో స్వాతంత్ర్యమును చంపుకొని మాకు నిన్ను సమర్పించుకొనియెదవో, అంత యెక్కువగా నీకు క్షేమము. నీ వెంత పరిపూర్ణ నిష్కపట స్వపరిత్యాగ మొనరించుకొనియెదవో, అంత ఘనముగ నీవు మమ్ము సంతోషపరుప గలుగుదువు. అంత యెక్కువ లాభమును పొందగలుగుదువు.

4. కొందరు స్వపరిత్యాగము గావించుకొనియెదరుగాని, సంపూర్ణ పరిత్యాగము చేయుటలేదు. ఏలయనగా వారు భగవంతునియందు పరి

పూర్ణ విశ్వాసమును, నమ్మకమును కలిగియుండుటలేదు. అందుచేవారు తమ కవసరమగు విషయముల కొరకై తామే ముందుగా వెతకికొను టయందు మిక్కిలి శ్రద్ధ వహించుకొనుచున్నారు.

మరికొందరు మానవులు ఆరంభమున తమను పరిపూర్ణముగ దైవానుగ్రహమునకు లోఁజేసి కొనియెదరు. కాని తదుపరి ప్రపంచ వ్యామోహములచే ముట్టడింపబడి,ఆరంభమున తాము విసర్జించిన దానిని తిరుగ గైకొనుచున్నారు. వారలు తమ సుగుణముల నేమాత్రమును పెంపొందించుకొనజాల కున్నారు. ఇటుల ప్రవర్తించెడు మానవులు తమ్ము పరిపూర్ణముగ పరిత్యజించుకొని,దినదినమును మాకు యాహుతిగ సమర్పించు కొననియెడల పవిత్రమగు హృదయ స్వాతంత్ర్యమును సంపాదించు కొనజాలరు. అదియేగాక ఆనందదాయకమగు మాపరిచయ ప్రసాదమును పొందజాలరు.

ఏలయనగా? ఈ రీతిగా వారు చేయుజాలకున్నచో, మాతో దివ్య ఐక్యతయనునది యుండఁబోదు. అట్టి ఐక్యతను సంపాదింపజాలరు.

5. నిన్ను నీవు పరిత్యజించుకొనుము. మాకు నీయాత్మ సమర్పణ గావించుకొనుము. నీ కెక్కువ యాంతరంగిక శాంతము లభించును, అని మేము నీకు పలుమా రుపదేశించి యున్నాము. తిరుగ నా విషయము నే యిప్పుడు బోధించుచున్నాము.

అందరికి నీ సర్వస్వము నిచ్చివేయుము. నీ వేమియును వారలనుండి కోరుకొనకుము. మా యందు పరిపూర్ణ నమ్మకము గలవాడవై, ధైర్యముగ నిలిచియుండుము. మేము నీ వారమయ్యెదము. మాతో నీ వైక్యమయ్యెదవు. నీవు ఆంతరంగిక స్వాతంత్ర్యము కలవాడ వయ్యెదవు; అజ్ఞానాంధకారము నిన్నావరింపదు.

స్వకీయేచ్ఛను విసర్జించి సర్వసంగ పరిత్యాగివై, సర్వస్వము వదలి శ్రీ జేసునాథస్వామి ననుసరించి ప్రవర్తించుచు, అహంకారమును చంపుకొని మా కొరకై నిత్య జీవితమును జరుపుకొనుటకు ప్రయాసపడుము. ఇట్టి స్థితియందే లక్ష్యము కలవాడవై దానికొరకై దేవుని ప్రార్థించుచు, దానియందే కాంక్షకలవాడవై యుండుము. అప్పుడు బూటకమగు భ్రాంతియంతయు నదృశ్యమగును. దుష్ట మానసిక

కలతలును, అవసర చింతలును నశించిపోవును. మితిమీరిన భయమును అక్రమ ప్రేమయును అడుగంటిపోవును.

## సారాంశము

ప్రతి మానవుడును వైరాగ్యము కలవాడై యుండవలయునని సర్వేశ్వరుడు కోరుచున్నాడు. అట్టి వైరాగ్యము సర్వసాధారణమై,పరిపూర్ణమై యుండవలయును. ఎల్లప్పుడును ఒకే విధముగ మార్పుచెందనిదై యుండవలయును. వైరాగ్యభావ ముదయించినది మొదలుకొని, జీవితాంతము వరకును ఒకే విధముగ పరిపూర్ణమై, చలింపనిదై యుండవలయును. పరిపూర్ణ వైరాగ్యము కలిగియుండని వారిని, ఆరంభమున వైరాగ్యము కలిగి యుండి, కొంతకాలమైన పిమ్మట తాము విసర్జించిన విషయములను తిరుగ పొందువారిని, యీ రెండు తెగలవారిని దైవము సరిసమానముగనే ఖండించును. దేవునికి మిక్కిలి ప్రీతికరముగ నుండవలయునన్న,మన మర్పించెడు బలి అమోఘమైనదై యుండవలయును. దైవ ప్రేమాగ్ని యీ బలి వస్తువును పూర్తిగా దహించివేయ వలయును.

అశాశ్వతమగు ప్రయోజనము లన్నియును పోగొట్టుకొని శ్రీ జేసునాథస్వామి వలె పవిత్ర జీవనము గడిపి మరణించు మానవులకు మాత్రమే దేవుడు తమ ప్రేమను, వరములను, దివ్య బోధవలను, శాశ్వతానందములను దయచేయుదురు. ఇతరులకిట్టి వరప్రసాదముల ననుగ్రహింపరు.

క్రీస్తువుని పరిపూర్ణ పవిత్రత యంతయును ఈ పాఠమున తెలియజేయబడి యున్నది. మనము గావించుకొనియెడు సకల ప్రార్థనలును, మన ప్రయత్నములును, మన కాంక్షలును, ఇవన్నియును ఇట్టి పరిత్యాగము కొరకు మనలను ప్రేరేపించునవై యుండవలయును.

## 38 వ అధ్యాయము

## లౌకిక వ్యవహారములను క్రమముగ సమర్థించుకొనుచు కష్టదశయందు దేవుని శరణుజొచ్చి యుండవలయును

1. యేసునాథస్వామి:- కుమారా! ప్రతి స్థలమునందును నీ ప్రతి కార్యమునందును నీ లౌకిక వ్యవహారము లన్నిటియందును ప్రవర్తించుచుండియు, అంతరంగిక స్వాతంత్ర్యము కలవాడవై, నీకు నీవే కర్తవై యుండవలయును. సర్వ విషయములను నీ యధికారముక్రింద నుంచుకొని వానిపై యధికారమును వహించి యుండవలయును గాని, నీవు మాత్రము వానికి దాసుడవై యుండదగదు. స్వతంత్రుడవై వాస్తవమగు హెబ్రేయుడవుగా నుండవలయును.

దేవుని యెడల స్వాతంత్ర్యమునందును దైవ ప్రసాదములందు వారికిగల వాత్క్యానందమును నీవును భాగస్థుడవై యుండవలయును. దేవుని బిడ్డలు ప్రపంచ విషయముల కతీతులై వానిని మించిపోయి శాశ్వతములగు దైవ విషయములను గూర్చి యోచించుచుకొను చుండెదరు.
అశాశ్వతములగు ప్రపంచ విషయములను వారు ఎడమ నేత్రముతో చూచుచు, స్వర్గ విషయములను కుడి నేత్రములతో వీక్షించుచుండెదరు.

అశాశ్వతములగు ప్రపంచ విషయముల దెసకు తమ కాంక్షలను పోనీయక, వానికంటుకొని యుండక, దేవు డావిషయముల నెందు కొరకై నిర్మాణము చేసియుండెనో, మహోన్నతుడగు సర్వేశ్వరుడనెడు చిత్రకారు డావిషయముల నెందుకొరకై వినియోగింప నుద్దేశించెనో అందుకొరకై వానిని వినియోగించుచుండెదరు. దైవ నిర్మాణమునందలి ప్రతివిషయము క్రమమైనదిగను నియమానుసారముగ నున్నది.

2. ఈ విధముగ నీవు సర్వవిషయములందును బాహ్యావేషముల ననుసరించి ప్రవర్తింపక, నీవు చూచుచున్నట్టియు, వినుచున్నట్టియు, విషయములను విషయాసక్తిగల చూపుతో చూడక, ప్రతిసమయమునందును తక్షణమే మోయిజా చేయుచు వచ్చినరీతిని, దేవుని యుపదేశములను పొందుటకుగాను దేవతార్చనా స్థలమున ప్రవేశించినయెడల, కొన్ని

వేళలయందు దేవుడు దయచేయు జవాబును నీవు వినగలుగుదువు. పలు సందర్భములలో ప్రస్తుతపు విషయములను గురించియు ముందురానున్న విషయములగూర్చియు బోధింపబడి వెలుపలికి వచ్చెదవు.

ఏలయనగా మోషేయును తనకు కలుగుచుండు సందేహములను ప్రశ్నలను నివర్తించుకొనుటకు సర్వదా దేవతార్చన స్థలములో ప్రవేశించి, దేవుని శరణు వేడుకొనుచుండెడివారు.

మానవులవలన సంప్రాప్తించుచుండు అపాయములనుండియును, దుష్కార్యములనుండియును, తనను కాపాడుకొనుటకుగాను, దైవప్రార్థనా సాయముకొరకై ప్రార్థనామందిరములోనికి పరుగిడు చుండెడివారు.

అదేవిధముగా నీవును సేవమందిరమను నీ అంతరంగిక గదిలోని కరిగి, దైవసహాయము కొరకై నిష్కపటముగ దేవునిప్రార్థించుము. జోషువాయును ఇశ్రయేలు సంతతివారును గబియో సంతతివారి నీతులవలన మోసము చేయబడిరి. ఏలయనగా వారు ప్రప్రథమున దేవుని ప్రార్థింపక, మిక్కిలి సులభముగా మోహకరములగు మాటలకును, కపట భక్తికిని దాసులై పోయిరి.

---

## సారాంశము

మన మానసములను, హృదయములను చెదరగొట్టి,దుష్ప్రవర్తనలకు పురిగొల్పి మనలను భ్రష్టులుగ నొనరింప మిక్కిలి శక్తిగల వ్యాపారము లందుండియును, పరిపూర్ణమగు మానసిక హృదయ స్వాతంత్ర్యములను నిలుపుకొనియుండుట అంతరంగిక ఆధ్యాత్మికా జీవితములయందలి పరమ రహస్యములలో నొకటియై యున్నది.

బాహ్యవ్యాపారములు పలుమారు మన యాత్మను అంతరంగికము నుండి వెలుపలికిలాగి, తిరుగనది దేవుని సన్నిధానమున కరిగి దేవునిగూర్చి చింతసల్పుకొన కుండునటుల విఘ్నములను కలిగించుచుండును.

ఐతే బాహ్యవ్యాపారములందు నిమగ్నులమై యుండియును, దేవుని తృప్తిపరచుటకై మనలను వారి కర్పించుకొనియెదమేని, మనము చెదర

గొట్టబడిన మానసములును హృదయములును కలవారమై యుండగలుగుదుము; కాని పలువిధములగు మన వ్యాపారములందు మన మొకపని మాత్రము చేయవలయును. అది యేదియన, దేవుని తృప్తికొరకై శ్రమపడుటయే.

దేవునకు తృప్తికలిగించ వలయుననెడి వాంఛ, ప్రతి యితర కోర్కెల కలిగినదై యుండును. అట్టి కాంక్షలయందే మన పరిపూర్ణానందమును సౌఖ్యమును యిమిడి యుండవలెను.

---

## 39 వ అధ్యాయము

### మానవుడు తన స్వవిషయములం దెప్పుడును మితిమీరిన యాసక్తిగలవాడై యుండతగదు.

జేసునాథస్వామి :- కుమారా, నీ స్వకార్యనిర్వహణమంతయు నెల్లప్పుడును మాకు వదిలివేయుము. తగిన సమయమున మేమే దానిని నిర్వహించి పెట్టెదము.

మేము దానిని నిర్వహించువరకు కనిపెట్టుకొని యుండు వేని, నీ కనుకూలమగు రీతిని మేమే దానిని నిర్వహించితిమని నీవు కనుగొనుదువు.

2. శిష్యుడు:- నా యేలికా! నా మనస్ఫూర్తిగా నా కార్యము లన్నిటిని తమ కర్పించుచున్నాను. ఏలయనగా వానికొరకై నేను తీసుకొనగలిగెడు జాగరూకతవలన నేమియును ప్రయోజనములేదు.

భవిష్యత్కార్యములను గూర్చి మిక్కిలి శ్రద్ధబూని, అన్నిటికిని తయారై నన్ను తమ కర్పించుకొనవలయునని యెక్కువగా యభిలషించుచున్నాను.

3. జేసునాథస్వామి:- కుమారా! అనేక సమయములందు మానవుడు తాను కాంక్షించెడు కార్యమును మిక్కిలి యాతురతతో నెరవేర్ప మొదలిడును. దానిని తాను సంపాదించుకొనిన వెంటనే యాతడు

మార్పుచెందిన మనస్సు గలవాడగును. ఏలయనగా? మానవ వాంఛలు చిరకాలమువరకొకే విషయమునందు స్థిరముగ నిలిచియుండక, యొక విషయమునుండి మరియొక విషయమునకు పరుగిడుచుండెడు స్వభావము కలవైయున్నవి.

గనుక స్వల్ప విషయములందు సైతము నిన్ను నీవు త్యజింపగలిగి యుండుటయన కొద్దిపాటి కార్యముకాదు.

4. మానవుని స్థితియందలి యభివృద్ధి, స్వపరిత్యాగముపైని యాధారపడి యున్నది. స్వపరిత్యాగము చేయగల మానవుడు స్వాతంత్ర్యము కలవాడై సురక్షితుడై యుండగలడు.

ప్రతియోగ్యమగు కార్యమునకును విఘ్నములను కలిగించవలయునని కనిపెట్టుకొనియుండు పాతశత్రువు నీకు మోహమును కలిగించి, నిన్ను మోసముచేయుటకు ప్రయత్నముచేయక మిన్నకుండదు. రాత్రింబవగ లెల్లప్పుడును జాగరూకులై యుండని వారలనందరిని, తనచే పన్నబడియున్న మోసకరములగు యురులలోనికి లాగుటకుగాను అపాయకరములగు కుట్రలను పన్నుచునే యుండును. జాగరూకుడవై మెలగుచుండుము. మోహములందు చిక్కుకొనకుండుటకై దైవ ప్రార్థనలు గావించుకొనుచుండుమని శ్రీ జేసునాథస్వామి బోధించి యున్నారు. (మత్త. 26-41)

---

## సారాంశము

మనము చేయదలచిన కార్యమును చేయుటకుముందు, సర్వశక్తివంతులగు సర్వేశ్వరుని ప్రార్థించి, వారి సలహాలను పొందకున్నయెడల ఆ కార్యములను కాలముగాని కాలమునందైనను చేయుదుము, లేక యనుచితమగు రీతినైనను చేయుదుము. అటుగానిచో మనబుద్ధి చాపల్యతననుసరించి, మిక్కిలి యాతురతకలవారమై అట్టి కార్యాచరణ కొరకై దైవ నిర్ణయము ననుసరించి ప్రత్యేకింపబడిన సమయమున చేయక, అనుచితమగు సమయమున కార్యాచరణకై పూనుకొందుము.

అటుల కార్యాచరణకు గడంగుట తప్పు. అక్రమము. సాధారణముగ నట్టి ప్రవర్తనకు యాశాభంగమే శిక్ష. దుఃఖకారణమగు. నీ లోప

మును గూర్చి పావనుడగు మన గ్రంథకర్త గారు వివరించి చెప్పుటలేదు. అట్టి ఆశాభంగము సంప్రాప్తింప కుండునటుల మాన్యకొనజాలు మార్గములను మాత్రము మనకు చూపుచున్నాడు. ఆ మార్గము లేవియన:-

a) మన అక్కర లన్నిటిని దేవుని కర్పించుట.

b) కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భములందు దేవుని సలహాల కొరకై ప్రార్థనలు గావించుకొనుట.

c) ముందెపుడో భగవదేచ్ఛ ననుసరించి ప్రవర్తించెదమని తలంచు కొనక, యిప్పటినుండియే వారి యిష్టానుసారముగా ప్రవర్తించుట. మిక్కిలి యాతురతతో గూడిన మన వాంఛలన్నియును మనకు దుఃఖమును అపఖ్యాతిను అలసటను కలిగించెడు విషయములందు ప్రవేశము కలవారలనుగా నొనర్చుటకై, మన శత్రువులచేపన్నబడిన యురులవంటివని తలంచుచుండవలయును. ఇటుల తలంచుకొనకుండుట మన చంచలతయై యున్నది.

ముందెన్నడో రానున్న విషయములను గూర్చి యశాంతి నొందనవసరములేదు. దేవునికి తృప్తికరముగ నుండునటుల మనము వారికి విధేయులమై లొంగియుండ వలయును. తల్లిదండ్రులు మనలనెట్లు దయాశ్రద్ధలతో కాపాడుదురను నమ్మకమును కలిగియుందుమో, అటులనే దైవ నిర్మాణములందును పరిపూర్ణ నమ్మకము కలిగియుండవలయును. సర్వసాధారణ స్వపరిత్యాగము గావించుకొన వలయును.

మోహాపుటురులయందు చిక్కుబడకుండుటకుగాను జాగరూకతతో విడువక సదా దేవునిగూర్చి ప్రార్థనలు సల్పుకొను చుండవలయును. ప్రతి నిముషమును మన మవసరముగ సాధన చేయవలసిన యభ్యాసము లివియే.

పరిపూర్ణ జ్ఞానమునందలి మన యభివృద్ధి నంతయును నీ యభ్యాసముల మీదనే యాధారపడి యున్నది.

---

## 40 వ అధ్యాయము

### మానవునియం దెట్టియోగ్యతయును లేదు. ఆతడేవిషయము నందును తాను ఘనుడననియు, శ్లాఘాపాత్రుడననియు, నెంచుకొన తగదు

1. శిష్యుడు:- నా యేలికా, మానవునిగూర్చి మీరంతగా జాగ్రత్తను వహించుట కాతడేమాత్రము యోగ్యతగలవాడై యున్నాడు? తాము వానికి తమ దర్శనభాగ్యము ననుగ్రహించుటకు మానవపుత్రు డెంతటివాడు? (కీర్త.8-5) తమ దయ నాతనికి ప్రసాదించుటకు తగిన యర్హత యాతని యందేమిగలదు? నాయేలికా, నన్ను చేవిడచుచున్ననేని, నేనందుకొరకై మొరపెట్టుకొనతగినంత కారణము నాకు గలదు. నామనవిని తామంగీకరింపనిచో, దానిని గూర్చి న్యాయప్రకారము నే నేమి చెప్పుకొనజాలుదును?

ఏలినవారా! నేను వ్యర్థుడను. నే నేమియు చేయజాలని యసమర్థుడను. నాయం దెట్టి యోగ్యతయును లేదు. అన్ని విషయములందును నేను లోపము చేయుచు, క్రమము తప్పి నడచుచున్నాను. నా నాటికి ఏమియు లేని దుస్థితులలో పడి పోవుచున్నాను. తాము నాకు రక్షణ దయచేసి, ఆంతరంగిక యుపదేశము లనుగ్రహింపకేని, నేను మిక్కిలి మందమతినై యుత్సాహశూన్యుడనై దుర్వృత్తులయందు పడిపోవుదును.

2. ఐతే నా ప్రభువా! మీరెల్లప్పుడు మార్పులేనివారై యొకేవిధముగ నిలిచియున్నారు. సర్వకాలములయందును తాము యోగ్యులు న్యాయవంతులు, పవిత్రులు. మీ నిర్మాణకార్యము లన్నిటిని మిక్కిలి యుక్తముగను, న్యాయముగను, పవిత్రముగను నిర్వహించుచు, మిక్కిలి జ్ఞానముతో నడుపుకొని పోవుచున్నారు.

నేను నాజీవయాత్రయందు ముందుకు సాగిపోవుటకు మారుగా, వెనుకబడి యుండవలయునను కాంక్షగలవాడనై యున్నాను. నే నెల్లప్పుడును మారిపోక, యొకేవిధముగ నుండుటలేదు. ఒకే కాలములో నేను యెన్నోవిధములుగా మారిపోవుచున్నాను.

ఇది ఇటులున్నను, మీరు నాయెడల కనికరమ్మాదయులై తక్షణము నా కభయహస్తమును దయచేయుదురేని, నాస్థితి త్వరితకాలము లోనే యెక్కువ బాగుపడును.

ఏలయనగా? మానవ సహాయము లేకనే, ఏలినవారు నాకు సహాయము చేయగలరు. నా ముఖ మేమాత్రమును చూడక, నాహృదయము జ్ఞాన వికాశము కలదై, తమయందే విశ్రమించుటకు తగినంత బలము కలదగునటుల యేలినవారే యనుగ్రహింపగలరు.

3. అందుచే నాకు యూరటను కలిగింపగల మానవులెవ్వరును లేనందున తమయందలి భక్తికొరకుగాని, తమకొరకై వెదకుకొనవలసిన యవసరములనుబట్టి గాని, మానవయూరటను విసర్జించివైచి యుండుట యెటులో, ఆ మార్గమును నేను చక్కగా గ్రహించియుందునేని, నాకు మిక్కిలి క్షేమకరము. అప్పుడు న్యాయముగ తమ యనుగ్రహముపై నేను ఆధారపడి యుండవచ్చును. నాకు తా మనుగ్రహించెడు నూతన యాదరణను తలంచుకొని సంతసింప వచ్చును.

4. నాకు సంబంధించిన విషయములన్నియును చక్కగ నిర్వహింప బడినప్పుడెల్లను, సర్వవిషయములకును మూలాధారులగు తమకు వందనము [illegible]ంచుచుండెదను.

ఐతే నాస్థితినిగూర్చి యోచించి చూచుకొనిన, నేను కేవలము వ్యర్థుడను. తమ దృష్టిలో నేనెందుకును కొరగాని నూచ్యుడను. మిక్కిలి చలించెడు మానసముగలవాడను. లేశమాత్రమైనను బలము లేనివాడను. ఇట్టి నేను కీర్తిని జూచుకొని గర్వింపగలను? నేనొక గణ్యుడనుగా శ్లాఘింపబడవలయునని యెటుల కాంక్షించుదును? నా యందలి నిష్ప్రయోజకత్వమును గూర్చియే నేను గర్వపడవలసినది!

ఇదియంతయు మిగుల నిరుపయోగకరము, డాంభికము. డంబమంతయు నొకచెడ్డ అంటువ్యాధివంటిది. ఏలయనగా అది వాస్తవమగు మహిమను పొందనీయక, దేవునియొక్క కరుణాప్రసాదమును కోల్పోవు నటుల చేయును.

ఏలయనగా మానవుడు తనను గూర్చి తాను తృప్తిపొంది యుండు నపుడు, తమకు యసంతృప్తిని కలిగించువాడగును. మానవుల పొగడ్త

కొరకై వెతకుకొనుచు శ్రమపడునపుడు, నరుడు వాస్తవమగు సుగుణము లను పోగొట్టుకొనువాడగును.

5. యథార్థమగు మహిమ, పవిత్రానందము, మానవుడు తన్ను మరచి మిమ్ము మహిమ పరచుటయందును, తన స్వశక్తియందు గాక మీనామము నందు సంతోషించుటయందును, సృష్టివస్తువులందు గాక తమయందే తన సంతృప్తిని బడయుటయందును సమకూరునని తెలిసికొనవలయును.

నేను కోరు తామే మహిమ పరుపబడుదురుగాక! తమ నిర్మాణ కార్యములే నుతింపబడునుగాక! పవిత్రమగు తమ నామము స్మరింప బడునుగాక!

నాయందలి యేవిషయమును గూర్చియు మానవులు నన్ను పొగడ కుందురుగాక; దేవరవారి నామహిమ. తామే నా హృదయానందము. దినము.అతయును తమనే నుతించుకొనుచు, తమయందే సంతోషించు చుండెదను.

నన్నుగూర్చి నేనేమియు నుతించుకొనను. నాయందలి దోషము నేనే తలంచుకొనుకొందును.

6. ఇతరుల పొగడ్తలకై దాంభికులు ప్రయత్నించిన ప్రయత్నించు దురుగాక. నేనుమాత్రము దేవునినుండి వచ్చు మహిమకొరకే వెతకు కొనుచు శ్రమపడియెదను.

మానవమహిమ, యశాశ్వతమగు గౌరవము, సర్వ ప్రపంచ వైభ వము; యివియన్నియును శాశ్వతమగు దేవరవారి మహిమతో సరిపోల్చి చూచిన, కేవలము వ్యర్థమును సూన్యమునై యున్నవి.

సత్యస్వరూపులును, దయామయులు నగు నా దైవమా! సర్వ పొగడ్తలును, గౌరవములును, శక్తియును, ప్రతాప మహిమలును కల్ప కల్పాంతములవరకు తమకే చెందునుగాక.

## సారాంశము

ప్రకృతి నియమముల ననుసరించి, మనమందగ మేమియును లేని వారలము. దేవుని కటాక్షము ననుసరించి చూచిన, మనమందరము కేవ లము పాపులము.

మనయందరియందును బలహీనతయును చంచలత్వమును విశ్రమమై యున్నవి. మనము పుణ్యకార్యము లేవియును చేయజాలకున్నాము. పాపకృత్యములందే మనస్సు గలవారలమైయున్నాము. ఆరంభమునందున్న మన సామాన్యస్థితికే మనము మెంగియుందుము. ఈ విషయములందలి సత్యము మనస్వప్రేమను నాశనముచేసి, గర్వము నణచివైచి దీనత్వమును వహింప జేయుటకుతగినదని యెంత గణింపబడునదై యుండినను, మనకు నిరాశను కలిగింపగూడదు, ఏలయనగా మనకు కావలసినదంతయును దేవునియందే మనము గాంచగల్గుదుము. సర్వశక్తివంతమగు దైవకరుణా సహాయమును సంపాదించుకొనుటకుగాను మనము మనబీదతనము నొప్పుకొని, మానవ యూరటలనన్నియు విసర్జించి, దైవ సంబంధమగు యూరటలుగాక తదితరములగు నే విషయముల కొరకును యాశపెట్టుకొనక, వానిని దయచేయుమని ప్రార్థింపకుండవలయును. మానవయూరటలను మనము గాంచజాలనపుడు, దేవుని శరణుజొచ్చుట, వారిపై యాధారపడి యుండుట, మిక్కిలి యానందకరమగు యవశ్యకతయని మనము నిశ్చయముగ తెలిసికొనజాలుదుము.

ఓ నాఏలికా! తాము మాకు లేనియడల మేమేమియు లేని నిరుపేదలమగుదుము. ఐతే మేము తమను కనుగొనజాలుదుమేని, మీయందే సర్వమును గాంచగల్గుదుము.

---

## 41. వ అధ్యాయము

## అశాశ్వతమగు కీర్తిగౌరవములను తృణీకరింపవలయును.

1. జేసునాథస్వామి:- కుమారా ఇతరులు గౌరవసంపాదనాపరులై నీకన్న ఎక్కువయున్నతస్థితియందుండుటయును నీవు పరులచే ద్వేషింపబడి, నీచపరుపబడుటయును చూచుకొని చింతింపకుము.

స్వర్గవాసులమగు మా దెసకు నీ హృదయమును మరల్చుము. ఈ ప్రపంచమునందు మానవుల వలన నీవనుభవించుచున్న యవమానములవలన నీకేమియును వ్యసనము లేకుండును.

2. శిష్యుడు:- స్వామీ! నేను చీకటియందున్నాను. ఎందుకను కొరగాని యహంకారము నన్ను త్వరితగతిని దుష్ప్రవర్తనమందు ప్రవేశింప చేయుచున్నది. చక్కగా స్వవిమర్శన గావించుకొనియెదనేని, సృష్టియందలి యే వస్తువల్లను యెల్లప్పుడును నాకే విధమగు నపకారము జరిగియుండలేదు. అందుచే మిమ్ము గూర్చి నేనే విధముగను న్యాయము కొరకు మొరపెట్టుకొన జాలకున్నాను.

ఏలయనగా పలుమారు నేను మీకు వ్యతిరేకముగ దుఃఖకరము లగు యనేక పాపము లాచరించి యున్నాను. గాన నాపై సృష్టియందలి సమస్త జీవులును శత్రుత్వమును వహించి, కత్తులు దూయుటకు తగిన న్యాయమగు కారణములున్నవి. గనుక యీ విభ్రమములను, పరులచే ద్వేషింపబడుటయును నేను న్యాయముగ ననుభవింప వలసినవే, కాని తాము గౌరవింపబడి శ్లాఘింపబడవలసి యున్నారు.

ప్రపంచ మంతటి చేతను యసహ్యించుకొనబడి విసర్జింపబడుటకును, లేశమాత్రమైనను శ్లాఘింపబడుటకును మనఃపూర్వకముగా యిష్టపడి తయారుగా నుండనిచో, నేను ఆంతరంగిక శాంతమును, బలమును లేనివాడనై జ్ఞానవికాసహీనుడనై పోవుదును. తముతో పరిపూర్ణ ఐక్యతను పొందజాలను.

---

## సారాంశము

ఈ జీవితమున గౌరవమును అభివృద్ధియును యీ రెండు నాశింప వలసినట్టియు, సంపాదింప ప్రయత్నముచేయ దగినట్టియు అంశములు కావు. ఈ విషయముల నాశించుటకు మారుగా వానిని విసర్జింప వలసియున్నది.

ప్రపంచ గౌరవము, అభివృద్ధి, యీ రెండును మన జీవితకాలమున యింక నెక్కువ వ్యాకులతకును వ్యగ్రకాంక్షలకును మూలాధారమై యున్నవి. ఈ రెండును అశాశ్వతస్వభావము గలవై యున్నవి. త్వరలో నశించిపోయెడి నైజస్వభావము కలవై యున్నవి. వానివలన మనకు చేకూరునని మనమెంతో యాశతో కనుపెట్టుకొనియున్న సం

తృప్తిని మనకు చేకూర్ప శక్తిలేనివైయున్నవి. ఏలయనగా మనమీ ప్రపంచగౌరవమును, యాధిక్యతను పొందినవెంటనే అవి మనకంత సంతోషకరములుగ గాన్పింపవు.

అందుచే వానికొరకై మనము చూపియున్న పరిత్యాగమునకు తగినంత విలువకలవై యుండలేవని మనము వెంటనే తలంచెదము. ఈరీతిని మన మాశాభంగులమై, తిరుగ మరియొక విషయమునం దత్యాశ గలవారమై దానికొరకై ప్రయత్నము చేయుదుము. దానిని మనము సంపాదించుకొనినపిమ్మట క్రిందటి విధముననే యీ విషయమున సైతము ఆశాభ్యాశాపీడితులమై మన కాంక్షలను శాంతిపరచుటకు తగినదికాదై యున్నట్టుల గ్రహించుదుము. మానవులవలన మన మనుభవించెడు యవమానముల వలనను, అపకారములవలనను, నిందలవలనను మనము లేశమాత్రమైనను కలత నొందదగదు. ఉద్రేకపూరితులము కాగూడదు.

మనము సైతము పలుమారులు దైవేచ్ఛకు వ్యతిరేక ప్రవర్తలమై వారికి ఘోరమగు కోపమును కలిగించుచు, దూషించుచు, పాపకృత్యముల నొనరించియుండలేదా? గనుక మానవుని వలన మన మనుభవించెడు చెడ్డ యాదరణనుగూర్చి మనమెటుల న్యాయానుసారముగా మొరపెట్టు కొనగలుగుదుము?

జేసునాథస్వామి మానవసంరక్షణ కొరకేగదా స్వర్గము నుండి భూలోకమున కేతెంచియుండిరి. ఎవ్వరినిరక్షింప వారుభూలోకమున నవతరించిరో, యా మానవులే వారిని యొట్టిహింసల పాలుచేసి యుండలేదు? వారియెడల నెంతఘోర యపనిందలను కల్పించి, వారి నెంత పీడించియుండిరి? ఐతే మానవు లారీతిని వారిని నవమానపరచి, హింసల పాలుజేసి పీడించినను, జేసునాథస్వామి యెంత సాత్విక భావమును వహించియుండిరి. ఎంతదీనత్వముతో హింసలను, యవమానములను సహించియుండిరి. అనుభవించి యుండిరి: ఎంత పంత్యాగము చేసియుండిరి. తనకట్టి ఘోరసంకటములను కలిగించిన దుష్టమానవుల యెడల వారెంతత్యాగము కలవారై యుండిరి! ఈ విషయములన్నియును మన మనస్సునందున్నవా?

మనమెునర్చిన పాపఫలితములుగ మనమిపుడనుభవింప వలసిన కష్టములను, క్లేశములను మనము జేసునాథస్వామి యెట్టిభావములతో కష్టముల ననుభవించి యుండిరో, యటులనే సహించియుండుట మన విధియై యున్నది.

పావనచరితులు, పరమార్థ చింతగలవారును తమకు మానవులు కావించిన చెరుపులను, యవమానములను యెంతమనఃపూర్వకతతో ఆనందముగా ననుభవించియుండిరో యోచించుకొనుము. జేసునాథ స్వామికొరకై వారు చెరుపులను, యవమానములను మిక్కిలి యుల్లాసముతో భరించి యుండిరి. సంకటములన్నిటిని వారుమిక్కిలి మహోన్నతమగు వరములుగ పరిగణించుకొనిరి.

తమ దివ్యనాయకునికొరకై యట్టి సంకటాదుల ననుభవించుటకు తగినయోగ్యత కలవారలని తలంపబడినందుకుగాను, వారుమిక్కిలి భాగ్యశాలురమని యెంచుకొనిరి. గనుక పరులు మననుగూర్చి గావించెడు అవమానములకును అపకారములకును, చెరుపులకును మనము భీతిల్ల తగదు. మనము వానినిగూర్చి భయమునందుటకు మారుగా ప్రపంచస్తవములను గూర్చి భయపడవలయును.

స్వర్గవాసియగు మన పరమపితయొక్క యనుమతిలేనిది మన శిరముపైనుండి యొక వెంట్రుకయైనను క్రిందపడదని మనము తలంచునప్పుడు ప్రపంచమునందు మనకేవియో సంకటములు సంభవించునని కలతచెందుట యెంతబుద్ధిహీనతయై యున్నది!

---

## 42 వ అధ్యాయము

## మానవులనుండి మనకు శాంతి లభించుననెడి నమ్మకమును కలిగియుండ తగదు.

1. జేసునాథస్వామి:- కుమారా నీ వేదొకమానవునితో స్నేహము గలవాడవై యుంటివను కారణముచే వానివలన నీకు శాంతము లభించు

వని నమ్మకము గలవాడవై యుందువేని, నీవు శాంతహీనుడవై పోవుటయేగాక, మిగులమిక్కిలి మోసపోయెదవు.

ఐతే, నిత్యసత్య స్వరూపుడగు దేవుని శరణుజొచ్చెదవేని, నీ స్నేహితుడొకడు నిన్నొడబాసి పోవునప్పుడుగాని, మరణించునపుడుగాని నీవు చింతాక్రాంతుడవు గాకుండెదవు.

నీ స్నేహితునియెడల నీవు చూపుచుండెడు ప్రేమను, మాయందు నిలిపియుంచుకొనవలెను. ఈ ప్రపంచ జీవితమున నీకు యోగ్యముగ కనుపించు వాడెవడైనను సరియే, నీ కెవడు మిక్కిలి ప్రియమైనవాడుగా తోచుచుండినను సరియె, వానిని మాకొరకై ప్రేమించుము.

మేము లేనియెడల నీ కెవ్వరితోడి స్నేహమైనను ఫలవంతమగునది కాజాలదు. స్నేహము చిరకాలమువరకు నిలిచియుండజాలదు. అదియును గాక, యట్టివానితో నేస్తము సత్యమైనదిగను, పవిత్రవంతమైనదిగ నుండ జాలదు. ఏలయనగా ఆ స్నేహమునకు కర్తలము మేము కాదు. నీకు సంబంధించిన వరకు మానవ సంపర్కముతో నీకు పనిలేనట్లుగా నీ ప్రాణస్నేహితుల విషయమున సహితము నీ స్నేహానురాగములను చంపుకొనవలయును.

2. ప్రపంచ సౌకర్యములనుండి మానవుడెంత దూరముగ తొలగి యుండునో, దేవునికి మానవుడంత దగ్గర చేరికగల వాడగును. మానవుడు తన నెంత తక్కువ వానినిగా భావించుకొనుచు,యెంత యెక్కువ నీచమైనవాడనని తలంచుకొనునో, అత డంతయెక్కువగా పైకి లేచి దేవుని సామీప్యమునకు పోయి చేరును.

ఐతే తానొక యోగ్యుడనని చెప్పుకొనియెడు మానవుడు, దేవుని కరుణా ప్రవాహము తనదెసకు ప్రవహింపకుండునటుల యడ్డుపరచుకొనుచున్నాడు. ఏలయనగా స్పిరితుయొక్క దయ యెల్లప్పుడును దీన హృదయుని కొరకై వెదకుచుండును.

నిన్ను నీవు పరిపూర్ణముగ త్యజించి, సృష్టి విషయములయందలి ప్రేమను విసర్జింప గలుగుదువేని, అమోఘమగు దేవుని కరుణా ప్రవాహము నీలోనికి ప్రవహించును;

నీకు సృష్టి విషయములయెడ గల యనురాగముచే వానియందే నీ దృష్టినంతయు నిలిపి, దేవునిగూర్చి యోచింపకుందువేని, దేవుడు తన కరుణా వీక్షణములను నీ దెసనుండి మరల్చుకొనియెదరు.

సృష్టికర్త కొరకుగాను సర్వ విషయములందలి యనురాగమును జయించియుండ నేర్చుకొనుము. అప్పుడు నీవు దైవజ్ఞానమును పొందగలుగుదువు. ఎంతస్వల్పవిషయమైనను దానియందు నీవు మితిమీరిన ప్రేమ గలవాడవై దానిని ఘనముగ నెన్నుకొనియెదవేని, ఆ స్వల్పవిషయమే మహోన్నత యోగ్యస్వరూపుడగు దేవుని సన్నిధినుండి నిన్ను వెనుకకు లాగి నీ ఆత్మను కలుషరచును.

---

## సారాంశము

ఇతరులతో మన స్నేహము దృఢమైనదిగాను, శాశ్వతమైనదిగాను నుండవలయునన్న, మనకేవిధమగు చిక్కులును, సంకటములును, దుఃఖములును రాకుండవలయునని మనము వాంఛించినను, మన స్నేహముల కన్నిటికిని దైవమే ఆ స్నేహబంధమై మనను బంధించవలయును.

మన హృదయాపేక్షల కన్నిటికిని దేవుడే ముఖ్యమాత్రమును ఆశింపతగిన విషయమును, యుద్దేశ్యమునై యుండవలయును. వారు మాత్రమే మనహృదయములకు పరిపూర్ణతృప్తిని కలుగచేయుదురుగాన, మనహృదయములు కొంతవరకు ప్రపంచవిషయములం దనురాగము కలిగియుండుటయు, మరికొంతవరకు వారియం దనురాగము కలిగి యుండుటయు దేవుని కంగీకారముకాదు.

దేవునియందును, దేవునికొరకును, చేయబడని స్నేహమంతయును మిక్కిలి బలహీనమైనది. గనుక మనము పరిపూర్ణ హృదయపూర్వకముగ దేవుని ప్రేమింపవలయును. ఏలయనగా మన హృదయములన్నిటికిని దేవుడే కేంద్రమై యున్నాడు. వారుమాత్రమే మన హృదయకాంక్షలను నెరవేర్పజాలుదురుగాన, మన హృదయములన్నియును వారికే చెందవలసియున్నవి.

---

# 43. వ అధ్యాయము

## శుష్క లౌకిక శాస్త్రజ్ఞానము.

1. జేసునాథస్వామి:- కుమారా! మానవబోధితములగు చమత్కార సామెతలతోడను, లోకోక్తులతోడను కూడినవాక్యము నాలకించి, మెత్త బడిన మానసము కలవాడవై వాని ప్రేరేపణల ననుసరించి ప్రవర్తింప కుము. ఏలయనగా కేవలము మాటలవలన స్వర్గము లభింపదు. సత్ప్రవర్తనయందే స్వర్గము కలదు.

మా యుపదేశవాక్యముల నాలకింపుము. అవి నీ హృదయమును ప్రజ్వలింపజేసి మనోవికాసమును కలిగించును. అందుచే పాపములను గూర్చిన పరితాపముగల వాడవగుదువు. అట్టి పరితాపము వలన ననేక యూరటలు బడయ గలుగుదువు.

నీవొక ఘనమగు పండితునివలెను, జ్ఞానివలెను కనుపించవల యునను యుద్దేశ్యముతో దేనినైన నభ్యసింపకుము. నీయందలి దుష్ప్రవర్తనా నాశనము కొరకగు నుద్దేశ్యముతో నభ్యసింపుము. ఏలయనగా మిగుల కఠినమగు సంశయ విషయములను గూర్చి వివరించి చెప్పగలుగు తెలివి తేటలకన్న, నీయందలి దోషములను నశింప జేసికొన గల్గుటయే యెక్కువ యుపయోగకరము.

2. నీవు విద్య నభ్యసించి, పలువిషయములను గ్రహించిన తరువాత, తిరుగ నీవొకవిధమగు యారంభదశకు రావలసిన వాడవే యగుదువు. మానవునకు జ్ఞానము గరుపవలసిన వారము మేమే గాని, యితరు లెవ్వరును గారు.

మానవ మాత్రుడు గరపుదానికన్న నెక్కువ తేటతెల్లమగు జ్ఞానము ప్రసాదించువారము మేమే. మే మెవ్వరికి బోధించెదమో, వార నతికాలముననే జ్ఞానమును పొందగలరు. బుద్ధి సూక్ష్మతయందెక్కువ యభివృద్ధిని గాంచగలరు.

విచిత్ర విషయములనుగూర్చి జిజ్ఞాసా పరులై మానవుల వలన నట్టి అంశములనుగూర్చి నేర్చుకొన ప్రయాసపడుచు, మమ్ము సేవించు మార్గమునుగూర్చి తెలిసికొన నిచ్ఛలేని మానవులు దురదృష్టులు.

సమయము రానున్నది, అప్పుడు మహా మహోపాధ్యాయుడగు వట్టియు, దేవదూతల కందరకును ప్రభుడైనట్టియు జేసునాథస్వామి మానవులందరు నేర్చుకొనిన విషయములను గూర్చి వినుటకై, అనగా ప్రతిమానవుడును నేర్చుకొనిన ధర్మాధర్మ విచారణాశక్తిని పరిశీలింప దయచేయుదురు. అప్పుడు జెరుసలేము పట్టణమంతటిని వారు దివిటీచేత ధరించి వెతకెదరు. అజ్ఞానాంధకారముచే మరుగుపడియున్న విషయము లన్నియు బహిరంగ పరుపబడును. అప్పుడు శాస్త్రజ్ఞానము గలవార మని వాదములు సల్పుచు, గర్వముచే విర్రవీగుచుండు శాస్త్రపండితులు నోరు మెదల్పజాలక తలలు వాల్చెదరు.

3. ఒక త్రుటికాలములో దీనహృదయుల మానసములకు వికాస మును కలిగించి, వారు దశవత్సరకాలము పాఠశాలలయందు విద్యా భ్యాసముచే గడింపజాలిన దానికన్న, నెక్కువగ శాశ్వతమగు సత్య మునుగూర్చి యనేక విషయములు గ్రహింపజాలెదు జ్ఞానమొసంగు వారము మేమే.

శబ్దగర్భితములై గూఢార్థముగల పెద్దపెద్దమాటలను నుపయో గింపక, యభిప్రాయభేదములచే సంభ్రమును గలిగింపక, గౌరవమును పొందవలయునన్న దురాశ కలుగకుండునటుల వితండతర్కవాదములు సేయక, జ్ఞానమును బోధించు వారము మేమేసుమీ!

ప్రపంచ విషయములను ద్వేషించి, విసర్జించుమార్గములను ఈ జీవితవిషయము లందేమాత్రము ననురాగము లేకుండునటుల వాని నన్ని టిని గాంచి, యసహ్యించుకొనియెడు పద్ధతులను, శాశ్వతానంద దాయక ములగు విషయములకొరకై వెతకుకొను నుపాయములను, గౌరవమును, గౌరవమునందాసక్తి నొందక, దానినుండి తొలగియుండు క్రమమును, పరులు తనను గూర్చి వ్యాపింపజేసెడు యపనిందలను సహించియుండు టను, మాయందే యాశయంతయు నిలుపుకొని యుండగలుగుటను, దైవవిషయములను తప్ప యితరము లేవియును కాంక్షింపకుండుటను, అన్నిటికన్న నెక్కువగ భయభక్తులతో మాయందే ప్రేమగలవారలై యుండుటను మేమే బోధించెదము.

4. ఏలయనగా ఒక మానవుడు మాయందే పరిపూర్ణ ప్రేమ కలవాడై యుండుటచేత దైవవిషయ జ్ఞానముకలవాడై, తాను గ్రహింపజాలిన దైవవిషయ జ్ఞానములను గూర్చి, మిక్కిలి నద్భుతముగ బోధింపగలైను.

అతడు సూక్ష్మబుద్ధిచే గ్రహింపగల చమత్కారవిషయములను గూర్చి యభ్యసించిన దానికన్న, నెక్కువగ సర్వవిషయ పరిజ్ఞానము వల్లనే లాభము పొందియున్నాడు.

ఐతే మేము కొందరితో సామాన్యవిషయములను గురించియే ముచ్చటింతుము. మరికొందరకు సూచనలతోడను యుపమానాది యలంకారములతోడను మనోహరముగ బోధించెదము. మరికొందరు మానవులకు దైవ మహిమలను మిక్కిలి విపులముగ నెరుకపరచు చున్నాము.

పుస్తకముల యందలి వాక్యాభిప్రాయములు యొకే విధముగ నుండును. కాని మానవులందరును వాక్యాభిప్రాయముల నొకేరీతిగా భావించుటలేదు. ఏలయనగా అంతరంగమున సత్యమునుగూర్చి బోధించు బోధనోపాధ్యాయులము మేమై యున్నాము.

మానవ హృదయ పరిశీలన చేయువారము మేమే. మానవుల యాలోచనలను గుర్తెరుంగు వారము మేమే. సర్వకార్య నిర్వహణమును జరుపుకొని పోవువారమును మేమే. న్యాయసమ్మతమని మాకు తోచిన రీతిని పాపపుణ్యముల ఫలములను వారి వారి వర్తనల ననుసరించి ప్రసాదించు వారముకూడ మేమే.

---

## సారాంశము

గర్వులతోను సత్యమును తమకు తెలిసిన వారివలె యూహించు కొనుచు ప్రవర్తించుచుండు యహంకారావేశులతోను దైవమెప్పుడును సంబంధము గలిగియుండదు. తమలో తాము వ్యర్థమగు తృప్తిగలిగి యుండు వారలకును తమనెరుక పరచదు.

ఏలయనగా అట్టి గర్వులకును అహంకారావేశులకు స్వాతిశయము గల వారికిని తమ నెరుకపరచిన యెడల, తమకు మాత్రమే చెందవలసి యున్న యశస్సంతయు నశించును. ఐతే హృదయ దీనత్వమును వహించి యుండు వారలయం దాకీతిని జరుగదు. దీనభావముగల వారలకు మిక్కిలి యుత్సాహకరములగు నట్టియు, సార్థకమగునట్టియు వరప్రసాదములను దేవుడనుగ్రహించును. ఏలయనగా దీనహృదయులు తమ శక్తి సామర్థ్యములనుగూర్చి గర్వపడక, తాము మిక్కిలి ఘనులమని భావించుకొనక, తమ శక్తిపైని నమ్మకముంచుకొనక, తమ దుస్థితిని గూర్చియు తమ పాపములను గూర్చియు గ్రహించిన వారలై, తమ దుస్థితులనుండి తమను లేవనెత్తి పాపరహితులుగ నొనర్చి దేవుని ప్రేమకు తగిన యర్హతగల వారినిగా తమను చేయజాలునట్టి, మహోత్కృష్ట దైవము పైనే పరిపూర్ణ నమ్మకముగల వారలై ఆధారపడియుందురు.

నా యేలికా! నా యేలికా! యని మమ్ము సంబోధించు వారలందరును స్వర్గలోకమును పొందజాలరు. కాని స్వర్గమునందధిష్ఠించియున్న పరమ పితయొక్క యిష్టానుసారియై వర్తించువాడే స్వర్గమున ప్రవేశింపగలడు, అని జేసునాథస్వామి నుడివియున్నారు.

---

## 44 వ అధ్యాయము

## బాహ్యవిషయములను మనపై వేసికొనకుండుట

1. జేసునాథస్వామి:- కుమారా, పలువిషయములలో నీవేమి ఎరుగనివాడవై యుండుటయే యుత్తమము. నీవీప్రపంచమున మరణించిన వానివలెను లోకమంతయును ప్రమానుపై కొరతవేయబడిన దానివలెను భావించుకొనుట మంచిది.

పలువిషయములను నీ పెడచెవిని బెట్టి, నీ శాంతమునకు సంబంధించిన విషయములను మాత్రము నాలకించుచుండుట తగినపని.

నీ కసహ్యాకరములును అసంతృప్తికరములగు వానినెల్లను కనులెత్తి చూడనైన చూడక, వానిని దాటిపోవుట ప్రయోజనకరము. వాద

ప్రతివాదము లేవియు పెట్టుకొనక, ప్రతిమానవుడును తన యిచ్ఛానుసారముగ ప్రవర్తించుచుండుట చూచి మిన్నకుండుటయే మంచిది.

నీవు దేవునికి ప్రీతికరముగ నుండునటుల ప్రవర్తించుచు, వారి న్యాయతీర్మానములను గూర్చి యోచించుచుండవేని, నీ అపజయమువలని న్యూనతను నీవు సులభముగ సహించియుండగలవు.

2. శిష్యుడు:- నా ప్రభూ! మేమెంత దౌర్భాగ్యస్థితిలోనికి వచ్చుచున్నాము! అశాశ్వతమగు విషయములు నష్టమగుటచూచి మిక్కిలి దుఃఖించుచున్నాము. కొద్ది లాభములకొరకై మానవులు మిక్కిలి కష్టశ్రమల ననుభవించుచున్నారు. కాని ఆత్మనాశమును గూర్చి లేశమైనను యోచించుకొనుచుండుటలేదు. లేశమాత్రమైన నావిషయమును మనస్సున కెక్కించుకొనుటలేదు. లవమాత్రమైనను లాభకరములుగాని విషయములలో మన యోచనలన్నియును నిండిపోవుచున్నవి. అన్నిటికన్న నెక్కువ యవసరమగు విషయములన్నియును అలక్ష్యము చేయబడుచున్నవి. ఏలయనగా మానవుడు బాహ్యవిషయములందే పరిపూర్ణముగ మునిగిపోవుచున్నాడు. ఐతే వెంటనే తెలివితెచ్చుకొని జాగరూకతతో ప్రవర్తింపనియెడల, యాతడు బుద్ధిపూర్వకముగ బాహ్యవిషయములందె తెగక మునిగి యుండవలసినవాడగును.

మన ఐహిక ...నములచే కలత పెట్టబడుచున్నాము. సందేహములందు చిక్కుకొనుచున్నాము. ఏలయనగా మనమీ ప్రపంచ విషయములందు మితిమీరిన శ్రద్ధాళులమై యున్నాము.

మన హృదయశాంతమును కలతపెట్టి, మనకు మిగుల విసుగు జనింపచేయు విషయమిదియే. మనము ప్రపంచవిషయములను గ్రహించుటకును చూచుటకును, వినుటకును యిచ్ఛలేనివారలమై యున్నయెడల, పైని ఉదహరించిన హృదయ శాంతాభంగమును మానసిక చంచలతను మాన్పుకొనజాలుదుము.

ఈ ప్రపంచమున మనము మరణించినవారివలెనే యుందుము. ప్రపంచమంతయును మనకు మానుపైని కొరతవేయబడిన దానివలె కనుపించునుగాక! మనమును ప్రపంచమునకు కొరతవేయబడినవారివలె కనిపించెదముగాక! అప్పుడే మన మమోఘమగు శాంతము ననుభవింతుము.

అశాశ్వతమగు ప్రపంచ సంపదలు నష్టమగుటనుగూర్చి దుఃఖించుచున్నాము. అట్టి నష్టములనుగూర్చియే మిక్కిలి యోచించుచున్నాము. అవి మనకు సంప్రాప్తించునపుడు మనమెపుడును యూరటనొందినవారము కాము., ఐతే ఆత్మయొక్క నాశనము సంప్రాప్తించునపుడు, దానిని త్వరగా మరచిపోవుచున్నాము. క్రీస్తునకు మిక్కిలి నష్టదాయకమగు విషయ మిదియే యైనను, అట్టి నాశమును మన మతిశీఘ్రముగ మానసమున యోచించుకొనక, వదిలివేయుచున్నాము. ప్రపంచవస్తువులను కోల్పోయినప్పుడు సహింపజాలక మిక్కిలి దుఃఖించుచున్నాము గాని, దైవమా! మా పుణ్యరాశియై యున్నట్టి తమ్మును కోల్పోవుచున్నందుకు లేశమాత్రమైనను దుఃఖించుటలేదు.

---

## 45 వ అధ్యాయము

### మానవులందరు విశ్వాసనీయులు కారు. మన మాటలలో మనమెంత సులభముగా పొరబడుచున్నాము.

1. శిష్యుడు:- ప్రభువా! మానవునివలన సహాయము కలుగునను ఆశ వ్యర్థమైనది. కాన స్వామీ! సంకట సమయములందు నాకు సాయముచేయ ననుగ్రహింపుడు.

విశ్వసింప తగినవారలని నేను తలంచుకొనిన వారలయందు అట్టి సుగుణములు లేకుండుటయును, విశ్వసింప తగనివారలని నేనెంచుచుండు వారియం దట్టిసుగుణసంపద గలిగియుండుటయు. ననేకమారులు గ్రహించియున్నాను.

కనుక మానవులయం దాశపెట్టుకొని యుండుట మిక్కిలి వ్యర్థము. ఏలికా! న్యాయప్రవర్తనులగు వారి క్షేమమంతయును తమయం దేగలదు. నా ప్రభువా, నా దైవమా, నాకేమి సంభవించినను తమ మహిమయే శ్లాఘింప బడునుగాక.

మేము మిక్కిలి బలహీనులము. మనస్థిమితము లేనివారలమై యున్నాము. మే మతిశీఘ్రముగ మోసపోవుచు, మారిపోవుచున్నాము.

2. కొన్ని సమయములందు ఏదియో యొక మోసము నందుగాని, లేక యితర సంభ్రమములు చిక్కుల యందుగాని, పడిపోకుండునంత యెక్కువ జాగరూకత గలవాడై యుండగలిగినట్టియు, అన్ని విషయము లందును అంతయెక్కువ సమీక్ష్యకారియై యుండగలిగినట్టియు మానవుడెవడు గలడు!

ఐతే ప్రభువా, తమయందు విశ్వాసము గలిగియుండి మిక్కిలి నిరాడంబర నిష్కపట హృదయముతో మీకొరకై వెదకుచుండు మానవుడు సులభముగ పతితుడు గాడు.

అతడేదియో యొక సంకటమునందు చిక్కుబడి యున్నను, త్వరలో రక్షింపబడి, తమవలన సౌకర్యములను పొందగలుగును. ఏలయనగా తమయందు విశ్వాసము కలిగియుండువానిని తామెప్పటికిని విసర్జింపరు.

తన స్నేహితునకు సంప్రాప్తించెడు సర్వ సంకటములందును విశ్వాసము వీడకుండునట్టి, నిజమగు స్నేహితుడు లభించుట యరుదు. ప్రభువా యేలికా, తాముమాత్రమే సర్వసందర్భములందును మిక్కిలి విశ్వాసపాత్రులై యున్నారు. తాముతప్ప అట్టివారలితరులెవ్వరును లేరు.

3. నా మానసము మిగుల స్థిరముగ కుదుటబడియున్నది; జేసునాథస్వామియందే పాదుకొనియున్నది, అని చెప్పగల మానవుడెంత జ్ఞాని!

నేనును అట్టి యదృష్టశాలినే యైనచో, మానవులవలని భయము నన్నింత సులభముగా వ్యాకులపరచి యుండదు. మానవుని వ్యర్థపు పలుకుల వలన నాకంత సంతాపము కలుగదు.

ముందు రాబోవు సంగతులన్నియు నెవ్వరు ముందుగా గ్రహింపగలరు! ముందు రానున్న కష్టములు రాకుండునట్టుల తగు జాగరూకత గలవారలెవరున్నారు?

ఐనప్పటికిని, ముందుగా సంభవించునని కనుగొనబడిన విషయములే పలుమారు మనకపకారము కలిగించుచుండగా, మనముటుల తలంపని విషయములు మనకు మిక్కిలి దుఃఖకరములగు కష్టములను తెచ్చిపెట్టక మానునెట్లు?

ఐతే నిర్భాగ్యుడనై దిక్కుమాలిన నేను మునుముందుగా జాగ్రత్త తీసికొనుటకు కారణమేమి?

పరులు చెప్పెడి మాటలయందు నేనేల యంతనమ్మకము కల వాడనై విశ్వసించియుంటిని! పలువురిచే మిక్కిలి ఘనముగా నెన్న బడి, దేవదూతలమని పిలువబడినను మనము కేవలము మనుష్య మాత్రులమును, బలహీనులము కామా?

దేవర వారిని తప్ప యితరుల నెవ్వరిని మేము నమ్మియుండ గలము? తాము సత్యస్వరూపులు; ఇతరులను మోసము చేయువారు కారు. తమను మోసము చేయువారలెవ్వరును లేరు. అంతేగాక ప్రతి మానవుడును అసత్యవాదియే; బలహీనుడే; చపలచిత్తుడే. ఆశా భంగము చేయువాడే! కాన బాహ్యమున కొంతెంత మంచివాడుగ గనిపించుచుండినను, వానిమాటలెంత యింపుగానున్నను, వానిని వెంటనే నమ్మతగదు.

4. మానవులనుగూర్చి మిగుల జాగరూకులమై యుండవలయు ననియు, తమ యింటివారలే తన శత్రువులనియు, దేవుడిక్కడగల డక్కడగలడు చూడుమని యెవడేనియు చెప్పినయెడల, నమ్మరాద నియు, మిక్కిలి యోగ్యమగు రీతిని ముందు జాగ్రత్తగ మాకు హెచ్చరిక చేసియున్నారు. నేనిట్టి సందర్భములయందనేకమారులు నష్టపడి, కష్టములనుభవించి, చివరకు సత్యమును నేర్చుకొని యున్నాను. నేనికముందు జాగరూకతగలవాడనై నా బుద్ధిహీనతను యెక్కువ జేసికొనకుండుటకై, నాకీ యనుభవము పాఠముగ నుం డును గాక!

జాకరూకుడవై హెచ్చరికతో నుండుము. నేను నీకు చెప్పిన విషయమును నీయందే రహస్యముగ నుంచుకొనుము, అని యొకానొకడు చెప్పుచున్నాడు.

కాని నేను నా నోరుమూసికొని పరుల కెవ్వరికిని యీ సంగతిని తెలుపక, రహస్యముగనుంచి, అది రహస్యముగనే యున్నదని తలంచు చుండగ, దేనిని రహస్యముగ నుంచుమని యాతడు కోరి

యుండెనో, యావిషయము నాతడే రహస్యముగ నుంచజాలక, తక్షణమే మాగుట్టును బయలుపరచి తన దారినిపట్టి తాను పోవుచున్నాడు.

ఓ నాయేలికా, యిట్టికథలనుండియును, వివేకహీనులగు మానవుల నుండియును నన్ను కాపాడి, వారిచే దిక్కుబడి వారివలెనే ప్రవర్తింపకుండు నటుల నాకనుగ్రహింపుడు.

నే నెప్పుడును సత్యవాదినై యుండునటులను, మాటతప్పని వాడనై యుండునట్లును, యనుగ్రహింపుడు. కపటప్రసంగములుచేయు నాలుకను నానుండి తొలగింపుడు.

ఏ విషయములను సహించియుండ నాకిష్టములేదో, యా అంశములను నే నాచరింపక, తగు జాగరూకత గలవాడనై యుండ వలయును. పొరుగువారలను గూర్చి యే విషయమితరులతో ముచ్చటించకుండుటయు, పరులను గూర్చి యెవరైనను మాకేమైన చెప్పినచో దానిని నమ్మకుండుటయు, మే మితరులనుగూర్చి వినిన అంశములను పరుల కెరుకపరుపక, రహస్యముగ నుంచుటయును, మా మానసము నెవ్వరికిని పట్టియివ్వకుండుటయును, మా హృదయముల నెప్పుడును పరిశీలించి చూచుచు, తమకొరకై సర్వదా వెదకుకొను చుండుట యును, మాకు వినవచ్చెడు ప్రతిమాటయందును నమ్మకము కలిగియుండకుండుటయు, మా అంతరంగిక సంబంధమగునట్టియు బాహ్యావిషయ సంబంధమగునట్టియు, సర్వవిషయములును తమయిష్టాను సారముగ జరిగి పోవుగాకయని మేము కోరుకొను చుండుటయును, యెంత యోగ్యమగు విషయములు! ఎంత శాంత దాయకములు!

మానవుల యెన్నికయందు గొప్పవాడుగా కనుపడకుండుటయు, వారలచే పొగడ్తను చేకూర్పగలుగునటుల తోచుచుండు విషయముల కొరకు వెతుకుకొనుచు శ్రమపడకుండుటయును, జీవితమునందలి లోపములను సవరించి చక్కపరుప జాలినట్టియు, యుత్సాహమును పురికొల్ప జాలునట్టియు అంశముల ననుసరించి, వివేకముగ వర్తించుట యును, యివి యన్నియును దైవానుగ్రహమును పదిలముగ భద్రపరచుకొనుటకు సురక్షితమగు మార్గములు.

మానవులు తమయొక్క సుగుణములనుగూర్చి మునుముందుగనే అతియాతురతతో పొగడుటవలన, అనేకులు నష్టములపాలై యున్నారు.

మోహముచే నిండియున్నట్టియు, ఇంద్రియాను రాగముల పోరాటమున కాస్పదమై యున్నట్టియు, యీ దిక్కుమాలిన జీవితకాలమున దైవానుగ్రహమును యితరుల కెవరికి నెరుకపడ కుండునటుల దాచిపెట్టుకొని యుండజాలుట యెంత ప్రయోజనకరము!

---

## సారాంశము

మానవునియొక్క యస్థిరత, చాంచల్యత, నిస్సారత దుర్గుణములు మొదలగు వానినిగూర్చి విశదీకరించి చెప్పి, తదుపరి యోగ్యుడగు మన గ్రంథకర్త చివరకు మిక్కిలి వివేకముతో నీ క్రిందివిషయములతో ముగించుచున్నారు.

(a) ప్రతి అవస్థయందును, అందును ముఖ్యముగా దుఃఖములును కష్టములును సంఘటిల్లు నపుడు, క్రీస్తువుడు నిష్కపటముగునట్టియు, నమ్మకముగునట్టియు, స్థిరముగునట్టియు, యుదార స్వభావము కలిగినట్టియు, సర్వశక్తివంతుడగునట్టియు, సర్వమునకు స్నేహితుడగునట్టియు దేవుని యందే తన నమ్మకమంతయును నిల్పియుంచుకొనవలయును.

b) మెచ్చుకొనతగిన నమ్మకముగల మానవుడెవ్వడును లేడు.

c) మానవులెవ్వరును రహస్యముల నెప్పుడును గుప్తముగ నుంచజాలరు.

d) పై కారణములనుబట్టి మానవులు చెప్పుచుండెడి సంగతులను నమ్మకముతో చెవియొగ్గి నాలకింప తగదు.

e) పరులతో అమాయకత్వముగ మాటలాడతగదు. మన గ్రంథకర్త గమనించియున్న యీ విషయములు మిక్కిలి సత్యములై నవి. ఇవి యన్నియును మన ప్రతిదిన ప్రత్యక్షానుభవమువలన ప్రామాణికముగా తెలియపరుప బడుచున్నవి.

వారు మనకొసగుచున్న కలహాలు మిక్కిలి విజ్ఞాన దాయకములు. మన ప్రతిదిన జీవితానుభవమునం దీఅంశములన్నియును మనకు తేటతెల్లమగుచునే యున్నవి.

---

## 46 వ అధ్యాయము

## మానవులు మనలనుగూర్చి పోటుమాటలు పల్కునపుడు, మనము దేవునియందు నమ్మకమును విడువరాదు

1. యేసునాథస్వామి:- కుమారా, చలించక నిశ్చితితో నిలిచియుండుము. మాయందు నమ్మకము కలవాడవై యుండుము. ఏలయనగా పరులు నిన్నుగూర్చి పలుకు మాటలు నిన్నేమిచేయగలవు? అవి యన్నియును కేవలము శబ్దమాత్రములు. గాలిచేకొట్టుకొని పోవునే గాని, రాతియందు ప్రవేశింపజాలవు.

పరులు నిందించెడు విధముగ నీవు యదార్థముగ నేరము చేసియున్నయెడల, నీ నేరమును సవరించుకొనవలయునసెడి స్థిరసంకల్పమును గావించుకొనుము.

నీయందలి ధర్మాధర్మ విచారణశక్తి ననుసరించి, నీవు నేరస్థుడవు కాని యెడల, పరులు నిన్నుగూర్చి పల్కెడు కర్ణకఠోరవాక్యములను దేవునికొరకై యనుభవింపవలయునసెడి సంకల్పమును తిరుగనేర్పరచుకొనుము.

నీకు దండనగా విధించబడెడు కఠినమగు కొరడాదెబ్బలను తినుటకు తగిన ధైర్యమింకను లేనివాడవైనచో, పరులు నిన్నుగూర్చి పల్కెడు స్వల్ప యపనిందావాక్యముల నాలకించి, సహించియుండుట మిక్కిలిస్వల్పవిషయము. అట్టి స్వల్పవిషయములను గూర్చి నీవేల హృదయసంకటము నందెదవు. నీవింకను విషయాసక్తుడవై యుండుటచే, పరుల వాక్యములయెడల నీవు చూపవలసియున్న దానికంటె అనవసరముగా నెక్కువ ప్రాముఖ్యత చూపుచున్నావు. నీ వాచరించిన నేరములనుగూర్చి ఖండింపబడుట కిష్టములేకున్నావు. నీ నేరములను సమర్థించుకొనుటకై యేవియో కొన్ని సాకులు చెప్పుటకై శ్రమపడుచున్నావు.

2. మిక్కిలి చక్కగా స్వపరీక్ష గావించుకొనుము. ప్రపంచాను
రాగము లింకను నీయందు దాగియుండుటను కనుగొనగలవు. మానవు
లను సంతోషపరుప వలయుననెడి వ్యర్థమగు కాంక్ష నీయందున్నటుల
తెలిసికొనియెదవు. ఏలయనగా నీవెప్పుడైనను నీలోపములకు గాను దీన
పరుపబడి కలవరపెట్టబడుట కనిష్టమై యుందువేని అప్పుడు నీవు
సత్యమగు హృదయ దీనత్వము గలవాడవు కావనియు, ప్రపంచవిషయా
నురాగము లింకను నీవు విసర్జించియుండలేదనియు, ప్రపంచమంతయు
కొరతవేయబడియున్నదని నీకింకను గాన్పించుటలేదనియు స్పష్ట
మగును. ఐతే మేముపదేశించు నీతిసూత్రముల నాలకింపుము. పరులు
నిన్నుగూర్చి పల్కెడు పదివేల కష్టకఠోరవాక్యములను సహితము నీవు
లక్ష్యము చేయవు.

మానవులు తమ దుష్టస్వభావముల ననుసరించి, నిన్నుగూర్చి
తాము కల్పింపశక్తిగల ఘోరమగు నపవాదములు నీ కర్ణములందుచొర
నీయక, లేశమైనను సరకు చేయకుంటివేని, దానివలన నీకేమియును
చెరుపురాదు అందుచే వారు నీ కణుమాత్రపు సంకటమునైన కలి
గించలేరు.

ఏమానవుడు పవిత్ర హృదయుడు గాడో, యేమానవుడు తన
దృష్టియందు సర్వేశ్వరుని నిలిపికొని యుండడో, అట్టి మానవుడు తనను
గూర్చి పల్కెడు నిందావాక్యమునకై నతిసులభముగ కల్లోలిత
మనస్కుడగును.

ఐతే మాయందు నమ్మకము గలవాడై యుండి, తాను అభి
ప్రాయపడినరీతిని ప్రవర్తించుట కాశింపని మానవుడు, లేశమాత్రమైనను
మానవభయము లేకుండ యుండును.

సర్వ రహస్యవిషయములను విమర్శించి, తీర్మానములు చేయు
వారము మేము. ప్రపంచము నందంతట నేది యెటుల జరిగిపోవుచున్న
దని మాకెరుకయై యున్నది. పరులకు చెరుపుచేయువారిసంగతి మేమెరు
గుదుము. అట్టి చెరుపువలన కష్టపడువారిని మేమెరుగుదుము. అందరి
మానవుల హృదయ రహస్యములన్నియును బహిరంగపరుపబడును.
ఈ విషయము మా యనుమతివల్లనే జరుగును. (లూక 11-35)

నేరము చేసియున్నవాడెవడో అమాయకుడెవడో, యను తీర్మానము మేము చేయుదుము. నిందించువానిని, నిందింపబడినవానిని, వీరిద్దరిని మేమే విమర్శించెదము. మానవులిచ్చెడు సాక్ష్యము పలుమారు మోసకరమైనదిగ నుండును.మా తీర్మానము మిగుల సత్యమైనది; అది స్థిరముగ నిలిచియుండును. దాని నెవ్వరును మార్పు చేయజాలరు. కొలది మంది మాత్రమే మా తీర్మానములను పరిపూర్ణముగ తెలిసికొన గలరు.

బుద్ధిహీనుల నేత్రములకు మా తీర్మానములు అక్రమమైనవిగ కనుపించినను అవి సర్వదా లోపరాహిత్యమై తప్పిపోవనివై యుండును. ప్రతి తీర్మానమునందును నీవు మా సముఖమునకు పరుగిడవలయునే గాని, నీ స్వంత యభిప్రాయముపై నాధారపడి యుండతగదు.

న్యాయమార్గాను వర్తియగు మానవునకు దేవునివలన నేమి సంభవించినను, యాతడే మాత్రమును కలతచెందడు. (కీర్త. 22-21) ఆతని విషయమై ఎవరైనను తప్పుడభిప్రాయములను వెల్లడిపుచ్చుచు లేని, వాని నాతడేమాత్రమును లక్ష్యముచేయడు.

ఆతనియం దారోపింపబడిన నేరములనుగూర్చి న్యాయసరణి నాతడు క్షమింపబడినను, యాతడు వ్యర్థముగ సంతోషింపడు. ఏలయనగా మానవుని హృదయ కుహురములను పరిశీలించువారము మేమని యును, ముఖలక్షణములను బహిరంగ చిహ్నములనుబట్టి మేము న్యాయాన్యాయ తీర్మానములు చేయుమనియు నాతని కెరుకయె.

మానవ తీర్మానముల ననుసరించి, మెచ్చుకొనబడ దగినదిగా గణింపబడున దంతయును, మాదృష్టిలో పలుమారు నిందార్హమై యున్నది.

5. శిష్యుడు:- ఓ నాయేలినవారా, సర్వశక్తిమంతుడవును శాంత మూర్తివైనట్టియు దైవమా!

మానవునియొక్క దౌర్బల్యము కుటిలత్వము తమకు చక్కగ విశదమై యున్నవి. నామనస్సాక్షియొక్క శక్తి సామర్థ్యములు చాలకున్నవి! తామె నాబలమైయుండుడు. తామె నా నమ్మకమైయుండుడు.

నా కెరుకబడని విషయములు తమకు విశదమయ్యేయున్నవి. నన్ను తాము పెట్టెడు చీవాట్లలో ప్రతిదానికని నేను మిక్కిలి దీనత్వము వహించియుండవలయును. మిక్కిలి సాత్విక భావముతో దానిని సహించి యుండవలయును.

స్వామీ, తమను ప్రార్థించుచున్నాను. నాయందు దయగలవారలై, నేనీరీతిని దీనత్వమును వహింపక, శాంతముగ సహించియుండనప్పుడెల్లను నన్ను క్షమింపుడు. తిరుగ ఇంతకన్న నెక్కువ బాధలను నే ననుభవించునటుల నే యనుగ్రహింపుడు.

గుప్తమైయున్న నామనస్సాక్షిని గూర్చి, ప్రతివాదము చేయుటకు తగిన న్యాయప్రవర్తనుడనై యున్నాననియెడి నాతలంపుకన్న, నాతప్పులను గూర్చిన క్షమాపణను పొందుటకు - మీదయయే నాకు మిక్కిలి యుపయోగకరముగ నున్నది.

నామనస్సాక్షి నన్ను నిందింపకున్నను, అందుమూలముగా నేనొక న్యాయప్రవర్తనుడనని చెప్పుకొనుటకు వీలుపడదు. తమ యనుగ్రహము లేనిది, మానవులయందొక డేనియును తమ దృష్టియందు నీతివర్తనుడుగ కనుపించజాలడు.

---

## సారాంశము

a) మానవులచే చేయబడు న్యాయతీర్మానములను లెక్కసేయరాదు.

b) మానవతీర్మానములు మనకు వ్యతిరేకముగ నుండునప్పుడు కలతనందరాదు.

c) మానవతీర్మానములు తన కనుగుణముగ నుండిన సంతసింపతగును. ఏలయనగా మనచర్యలనుగూర్చి న్యాయ విమర్శన గావింపవలసిన న్యాయాధిపతి దేవుడే గాని యితరులుకారు.

d) కేవలము మనస్సాక్షియే మన భయమును తీర్చునదై యుండతగదు.

e) మన నడతనుగూర్చి మానవులిచ్చెడు వ్యతిరేకాభిప్రాయములు వాస్తవమైనవనియు, న్యాయమైనవనియును తేలినయెడల, వారు మనలను

గూర్చి చేయు దూషణములు నిందలు నవర్గణలు ఛీవాట్లు మొదలగు. వానిననుసరించి, మననడతను మనము చక్కపరుచుకొనవలయును.

f) లేక వారు మననుగూర్చి కల్పించుకొనెడి యభిప్రాయము లసత్యములుగను, అన్యాయమైనవిగను, పగ సాధించుటకై కల్పించుకొనబడినవిగను స్థిరపడినప్పుడు, అవియన్నియును:—

g) మనము దీనత్వమును శాంతమును వహించి యుండుటయం దెక్కువ యభివృద్ధిని పొందజాలుటకు మనకు సహాయకారులై యుండు నటుల వానిని వినియోగించు కొనవలయును.

h) మనము దీనత్వమును వహించి, న్యాయప్రవర్తనులమని కనబడుటకు గాను లేశమాత్రమును శ్రమపడకూడదు.

i) ఈవిధిని నిర్వహించుటయందు మనమెన్నిమారులు యశక్తులమై తప్పిపోవుచుంటిమో, అన్నిమారులును అట్టి మనలోపములను క్షమింపుమని దేవుని ప్రార్థింపవలయును.

j) మన మాచరించినది న్యాయమని చూపుటకుగాని, లేక నేరమని తేలినదానిని క్షమించుమని వేడుటకుగాని, మనకుగల యాధారము పైని నమ్మియుండతగదు.

k) ఎప్పటికిని క్షీణింపని దేవునిదయపైని మనమోక్షమునకు మూలాధారమగు దేవుని మీదను యాధారపడియుండవలెను. ఈ పైవిషయములను శిష్యునకు బోధించుటకై గ్రంథకర్త పెక్కుకారణములను పలువిధములగు యుక్తులను కనుపరచి యున్నారు.

నిర్ణయింప బడియున్న నీతి సూత్రములనుండి స్వభావికముగా బయలుదేరు పర్యవసానములివియే. సాధనచేయ వలసినదని మనము ప్రోత్సాహింపబడుచున్న విషయము లివియే. ఈ యుపదేశములవలన మనము గడింపవలసిన ఫలములివియే.

ఇట్టి వరప్రసాదములను దేవునివలన మనము పొందుటకు, మన మిపుడు నేర్చుకొనియున్న ప్రార్థనను గావించుకొనుటకన్న నెక్కువ యుపయోగకరమగు విషయమేమియును లేదు.

## 47 వ అధ్యాయము

## శాంతమగు జీవితముకొరకై, దుఃఖకరములగు ప్రపంచ విషయములన్నిటిని సహించి యుండవలయును

1. జేసునాథస్వామి—కుమారా! మాకొరకై నీవు చేయపూనిన కార్యములయందలి శ్రమలను తలంచుకొని భయము జెందకుము.

నీకు సంప్రాప్తించెడు సంకటములచే నధైర్యపడి చంచల మానసుడవు గాకుము. మేము నీకు చేసియున్న వాగ్దానమును జ్ఞప్తియందుంచుకొని, బలముగలవాడవై సర్వసందర్భములందు నూరటగలవాడవై యుండుము. గణింపశక్యముగాని బహుమానమును నీకు ప్రసాదించుటకు మేము శక్తిగలిగి యున్నాము.

ఇచ్చట నీవు చాలకాలమువరకు శ్రమపడ నవసరములేదు. సర్వదా దుఃఖములచే పీడింప బడవలసిన వాడవు గావు. కొద్దికాలము కనిపెట్టుకొని యుండుము. నీ కష్టములు కడతేరుటను నీవు చూడగలవు.

సమయము వచ్చును, అగడియనుండి నీ శ్రమలును, కష్టములును అంతమొందును. ఈ జీవితమునందు జరిగిపోయిన దంతయును కడు స్వల్పము. అన్నియును గతించిపోవును.

2. నీ వాచరింప పూనుకొనియున్న దానియెడల లక్ష్యముంచి, చక్కగా సమర్థించుకొనుము. మా ద్రాక్షావనమునందు విశ్వాసముతో చక్కగా పని చేయుము. అప్పుడు నీవు మమ్మే నీ బహుమానముగా బడయ గలుగుదువు.

దైవ విషయములను గూర్చి వ్రాయుము. దైవ విషయములను పఠింపుము. దైవనామమును గానము చేయుము. అనవసర ప్రసంగములు చేయక, మౌనముగా నుండుము. మమ్ముగూర్చి ప్రార్థనలు గావించుకొనుము. పరులు నీయెడల గావించు యవమానములను, యపనిందలను, సంకటములను మిక్కిలి ధైర్యముతో సహించియుండుము.

శాశ్వత జీవితమును పొందవలయుననిన, యివియన్నియు ననుభవించినగాని, యింతకన్న నెక్కువ పోరాటములు సల్పినగాని, నీవు తగిన యోగ్యతగలవాడవు గాజాలవు.

ఒక సమయమున నీకు శాంతము లభింపనున్నది. ఆసమయము దేవునకే ఎరుక. ఇప్పుడునీవు చూచుచున్న రాత్రింబవళ్లు లనియెడునవి ఆ కాలమునకు లేవు. అది శాశ్వతముగా ప్రకాశవంతమై యుండును. ఆనందప్రభలచే నిండియుండును. ఆ కాలమున నీవు స్థిరమగు శాంతమును విశ్రాంతియు ననుభవించెదవు.

మరణింప వలసియున్న శరీరమునుండి నాకు ముక్తిమార్గమును చూపువా రెవరు? అని నీ యాత్మ అప్పుడు ప్రలాపింపదు.

అయ్యో యీ ప్రపంచమున నా జీవనయాత్ర మిక్కిలియెక్కువగనున్నదే అని నీవప్పుడు దుఃఖించవు.

ఏలయనగా ఆ సమయమున నీవు దివ్యమగు దేహారోగ్యము గలవాడవై యుందువు. నీ కప్పుడు మరణమనునది యుండదు. ఎప్పటికిని చెడని దేహారోగ్య భాగ్యమును గలిగియుందువు. మనోనిశ్చలత హృదయానందము పవిత్రవ్యక్తికిని లభించును.

3. ఇంతకుముందు ఈ ప్రపంచమానవులకు మిక్కిలి నసహ్యాకరములుగ తోచినట్టియు, యీ ప్రపంచమున జీవించియుండుటకు సైతము తగిన యర్హత లేనంత నీచులుగ నెన్నబడినట్టియు అగ్ర్యాశిష్టులు, స్వర్గమునందనుభవించుచున్న నాశన రహితములగు పుణ్యఫలములను కనుల గాంచువేని, తక్షణమే నిస్సందేహముగ నిన్ను నీవు మిక్కిలి హీనపరచుకొని, యితరులపైని నిరంకుశాధికారమును వహించియుండుటకన్న సర్వజనులకును దాసుడవై, వారలకు సేవచేయునంతటి హీనస్థితికొరకై నీవు మిక్కిలి శ్రమపడుచు వెతకుకొనవలయు ననెడి కాంక్షకలవాడవగుదువు.

ఈ మానవ జీవితమునందు నీ వనుభవించియున్న భోగములతో గూడిన దినములను, తిరుగపొంద వలయునసెడి కాంక్షలేనివాడవై దేవుని కొరకై సంకటముల ననుభవించుటకే మిక్కిలి సంతోషము కలవాడవై, మానవుల యెన్నికయందు దేమాత్రమును పేరు ప్రతిష్టలులేని

సర్వసామాన్యునివలె గణింపబడుట నీపాలిటి యమోఘమగు భాగ్యమని తలంచుకొనెయెదవు.

**4.** ఆహా ఇట్టి మనోహరమగు విషయానుభవముల రుచినెరింగి యుండి, ఈ విషయములన్నియును నీ హృదయమున స్థిరముగ నిలుపుకొన్నచో, ఒక్కమారైనను మొరపెట్టుకొనకేటుల ధైర్యమును వహించి యుండగలవు?

నాశన రహితమగు జీవితముకొరకు కష్ట శ్రమలన్నిటిని సహించి యుండగలవా? స్వర్గలోకమును కోల్పోవుట లేక సంపాదించుట యనునదంత సల్పవిషయముకాదు. కనుక స్వర్గదిశకు నీమోమునెత్తి చూడుము. ఈ ప్రపంచమునందు గొప్ప పోరాటముసల్పిన అర్చ్యశిష్టులిపుడెంత యానందము ననుభవించుచున్నారో, యెంతక్షేమముగ నెంత విశ్రాంతి ననుభవించుచున్నారో కనుగొనుము. వీరందరును సర్వకాలమును పరమపిత రాజ్యమున నాతోనే కలసి నివసించుచుండెదరు.

---

## సారాంశము

దేవుడు దయచేసియున్న వాగ్దానములు విశ్వాసపాత్రములు. వారు దయజేయుచున్న వరప్రసాదములు మిక్కిలి యమోఘమైనవి. గనుక నిస్సందేహముగ స్వర్గలోకమున మన కనుగ్రహించెదమని వాగ్దత్తముచేసినవారి బహుమానమెంత యమోఘమై యుండునో తలంప నశక్యము. మనము దానిని వర్ణింపజాలము.

మన బోధకుడు శాశ్వత జీవితమునుగూర్చి దేవుడు మనకు సంతోషముగ బహిరంగపరచిన విషయములనుగూర్చి సంగ్రహముగ తెలిపియున్నాడు.

స్వర్గలోకమునం దనుభవించెడు సౌఖ్యమును, సంతోషములను గూర్చి మనకు తెలిపియున్న విషయములతో, యీ జీవితమున మనమనుభవింపగలిగిన బాధలన్నిటిని సరిపోల్చి చూతము. ఈ ప్రపంచమునందు మన మనుభవించెడు స్వల్పమును, కొద్దికాలమువరకు మాత్రము నిలిచి

యుండునట్టి బాధలను, మనము స్వర్గమునం దనుభవింపబోవు అనంతమై ఊహాతీతమగు సంతోషమునకును యేమాత్రమును పోలికలేదు.

అర్చ్య. చిన్నప్పగారు నొక్కిచెప్పిన నీతిసూత్రమిదియే. ఈ నీతి సూత్రమునుండి మనము గ్రహింపవలసిన ఫలము లేవియనగా: ఈ ప్రపంచమున మనకు సంప్రాప్తించెడు శరీరబాధలును సంకటములును యెంత కఠినములైనవైనను, వానినిగాంచి మన మాశలుడిగిన వారలమై యధైర్యము నొందతగదు.

అపారమగు ఆనందమే ప్రతిఫలముగాగల ప్రపంచ సంకటము లనుగూర్చి, విలపించునంత లోపము మనము చేయకుందుముగాక.

ఎలయనగా మనమనుభవించెడు సర్వ శరీరబాధలయందును ప్రపంచ విమర్శనలయందును, పోరాటములందును, మోహములందును మనకొరకై స్వర్గలోకమున నాశన రహితానంద సౌఖ్యమును, అపార మగు వైభవమును, యమోఘమగు శాంతమును, కలతచెందని విశ్రాంతిని, యశస్సును, తయారు చేసియుంచెడు జేసునాధస్వామిని గూర్చియే యోచించుకొను చుండవలయును.

---

## 48. వ అధ్యాయము

### నిత్యానందదినము; మానవజీవితమునందలి సంకటములు.

1. శిష్యుడు:- స్వర్గమునందలి ఆనందదాయకమగు రాజభవనమా, అనంతమై రాత్రియనునది లేక, మహోన్నత స్వరూపుడగు దేవునిచే ప్రకాశింప చేయబడుచుండెడు పుణ్యదినమా, సర్వదా సంతోషకరమై క్షేమకరమై మార్పులేమియు నందకుండెడు దివ్య దివసమా, నిన్నేమని వర్ణింపవలయును? ఇట్టి మహానందదాయకమగు కాంతివికాసము మనపై వ్యాపించి, అశాశ్వతమగు ప్రపంచ విషయములన్నియును కడముట్టిన యెడల, మనమెంతయో భాగ్యశాలుర మయ్యెదముగదా!

అట్టి దివ్యకాంతివికాసము శాశ్వత ప్రభలచే ప్రకాశమానమై అర్చ్యశిష్టులపైని నిశ్చయముగ తన కాంతులను వెదజల్లును. ఐతే

యాత్రికులవలె యీ ప్రపంచమున జీవయాత్రచేయుచున్న మనకీ సుకాలము దూరమునందుండి తెరచాటున కనుపించుచుండు కాంతివలె గోచర మగుచుండును.

2. ఈ సుదినమెంత యానందకరమైనదో, స్వర్గనివాసులుమాత్రమే యెరుంగుదురు. ఐతే శృంగారవనమునుండి తరుమగొట్టబడిన హేవబిడ్డ లగు మనకు, ఈ ప్రపంచ జీవితము మిగుల కఠోరమై, విసుగు పుట్టించు నదిగ నున్నదని విలపించుచున్నాము.

ప్రపంచజీవితము కడు స్వల్పమైనది. సంకటములతోను, దుఃఖములతోను నిండియున్నది. ఈ జీవితకాలములో మానవుడు పాప కృత్యము లాచరించుచు, కల్మషుడగుచున్నాడు. పలువిధములగు కామ. క్రోదాధి మనోవికారము లనియెడు వలలయందు తగుల్కొని, నానా విధ భయములచే కంపించుచు, లెక్కకుమీరిన చింతలచే శాంత హీనుడై, పలువిధజిజ్ఞాసలచే చెదరగొట్టబడిన మానసముకలవాడై,నిష్ప్రయోజకరములగు నానావిధాడంబరములచే మోసము చేయబడుచు, నానావిధలోపములచే పరివేష్టింపబడి, యనేకశ్రమలచే గ్రుక్కి ప్రపంచ విషయానురాగములచే కలతపెట్టబడి,రోగములచేబలహీనుడై, లేమిడిచే వేదనల పాలగుచున్నాడు.

3. అయ్యయ్యో ! ఈ కష్టములన్నియును కడతేరు టెప్పుడోగదా ! దిక్కుమాలిన యీ పాపదాస్యములనుండి నేనెప్పుడు ముక్తినొంద జాలుదును!

నా యేలికా ! నేను దేవరవారిని మాత్రమే ధ్యానించెడు యానందము నాకెపుడు లభించును ? నేను తమయందు పరిపూర్ణానంద మెప్పు డనుభవింపగలను ? ఎప్పుడు సత్యమగు స్వాతంత్ర్యమున కెట్టి విఘ్నములు లేనివాడనై యుండగలను? శరీ- మానసముల కేవిధ సంకటములు లేనివాడనైయుండ శక్తుడనగుదును. ఎప్పటికిని కలతపెట్టబడక సురక్షితమైయుండు స్థిరమగు యాంతరంగిక, మానసిక శాంతము నెప్పు డనుభవింప గలను ?

స్వామీ ! నేనెప్పుడు మీ దర్శన భాగ్యము ననుభవింప గల్గుదును! స్వర్గరాజ్య మహిమనుగూర్చి ధ్యానింపగల భాగ్యము నాకెప్పుడు

సంప్రాప్తించును? అప్పుడే మీరు పరిపూర్ణముగా నా సర్వస్వమై యుండెదరు!

స్వర్గమున తమతోడ సౌఖ్యముగ నుండుటకుగాను, తమ ప్రియుల కందరికిని తాము తయారుచేసి సంసిద్ధముగ నుంచిన దివ్య సమయము నా కెప్పుడు ఆసన్నమగును!

అయ్యో! నే నిప్పుడు నా శత్రుదేశమున దేశభ్రష్టునివలె నిర్భాగ్యుడనై, దిక్కుమాలిన వానివలె విడువబడియున్నాను. ప్రతి దినమును పోరాటములే జరుగుచున్నవి. ఘోరమగు దుస్థితులు నా పాలబడుచున్నవి.

స్వామీ! నేను తమతోడ గలిసి యెక్కువ అన్యోన్యముగ సుఖమనుభవింప వలయుననెడు గొప్ప యాశగలవాడనై యెదురుచూచుచున్నాను. కాని అట్టి భాగ్యమునందజాలకున్నాను.

స్వర్గ విషయములను పట్టుకొమ్మలవలె యాధారము చేసికొన వలయుననెడు కాంక్షగలవాడనై యున్నాను. కాని ప్రపంచ విషయములు నాశనమొనరింప బడక, నిలిచియున్న విషయానురాగములను నన్ను క్రిందకు బలముగ పడలాగుచున్నవి. సర్వ ప్రపంచ విషయములను వర్జించి, వానికన్నిటి కతీతుడనై యుండవలయునన్న మనస్సు కలవాడనై యున్నాను. నా యిాప్సితమునకు వ్యతిరేకముగ నే శరీర సంబంధమగు ననురాగములకు నేను లొంగియుండవలసి వచ్చుచున్నది.

ఈ రీతిని నేను మిక్కిలి దురదృష్టుడనై, సౌఖ్యమన నేమియో యెరుంగని వాడనై యున్నాను. ఈ విధముగ నేను పోరాటము సల్పుకొనుచు, నాకు నేనే భారమై పోవుచున్నాము. ఇట్టి దురవస్థ నాకు సంప్రాప్తించినను, నా యాత్మ తమ సన్నిధికి రావలయునను సంకల్పము కలదై యున్నది.

5. స్వర్గవిషయములను గూర్చి మానసికముగ యోచించుకొనుటకు మొదలిడగనే, తక్షణమే విషయసుఖాసక్త ఆలోచనలు తండోపతండములుగ నరుదెంచి, నాపైబడి దేవునికి నేచేయు ప్రార్థనలకు భంగము

కలిగించుచున్నవి. అయ్యో యీ విధముగ నేను ఆంతరంగికముగ నెన్ని కష్టము లనుభవించుచున్నాను! ఓనా దైవమా, నన్నువిడిచి దూరముగ తొలగిపోకుము. తమ దీన సేవకుడనైన నాయందు దయాగ్రహముగలవారై, నన్ను విసర్జించి యుండకుడని ప్రార్థించుచున్నాను.

తమ దయ యనెడుమెరపుకాంతులను వెదజల్లి, నాదుఃఖము లన్నిటిని చెల్లాచెదరుగ చేసివేయుము. నాశత్రుమండలిచే పన్నబడియున్న మాయలనియెడు భూతముల నన్నిటిని పారిపోవునట్లు చేయుము.

నా యింద్రియములను తమ సముఖమునకు పిలిపించుకొనుము. ప్రపంచవిషయములన్నిటిని నేను మరచిపోవునటు లనుగ్రహింపుము. కేవలము కల్పితములగు నాదుష్టభావములన్నిటిని యసహ్యించుకొని, విసర్జించు శక్తిని దయచేయుము.

నా దైవమా, నేను డాంబిక ప్రవర్తనగల వాడనై యుండకుండునటుల నాకు సాయముచేయుము. దివ్యామృతస్వరూపా, తమ దర్శన భాగ్యము నాకొసగుము. తమ సముఖమున నేను సర్వకలుష విముక్తుడనై, నిలిచియుండునటుల దీవింపుము. ప్రార్థన సమయములలో సేవగ వారినిగూర్చి స్మరించుకొనునపుడు, యితర తలంపులు గలవాడనగుచో నన్నుదయతోడ క్షమించుము.

ఏలయనగా ప్రార్థనా సమయములందు మనస్సు చెదరినవాడనై యనేకమారులు నా భౌతికశరీరము నెచ్చట యుండునో, యచ్చట నామానసము హృదయము నిలిచియుండుటలేదు.

నా యోచన లెచ్చటనుండునో, యచ్చటనే నేనుందును. నాప్రేమాస్పదమగు విషయ మెచ్చటనుండునో పలుమారు నాయోచన లచ్చట నుండును.

సహజముగ నాకు సంతసమును చేకూర్చువట్టియు లేక యభ్యాసమువలన నా కానందకరములుగ తోచునట్టియు విషయము లేవిగలవో, యీ విషయములు మిక్కిలి త్వరితముగ నామానసమునకు తోచుచుండును.

6. ఈ కారణము వలననే సత్య స్వరూపులగు తమరు "ఎచ్చట నీ ధనాగారము గలదో, యచ్చట నీ హృదయముండు" అని వక్కా

ణించి యున్నారు. (మత్తై. 6-21) నేను స్వర్గలోకమును ప్రేమింతు నేని, స్వర్గ విషయములను గూర్చియే మనస్ఫూర్తిగ యోచించు చుందును.

లేక నేను ప్రపంచమునం దెక్కువ ప్రేమగలవాడనై యున్నచో, ప్రపంచ భోగభాగ్యములనె తలంచుకొనుచు, నెక్కువ యానందము గలవాడనై యుందును. ప్రపంచ దుస్థితులందలంచి కలత నొందుదును.

నేనీ భౌతిక శరీరము నెడల ప్రేమగలవాడ నైనచో, శరీర సంబంధమగు భ్రమా కల్పితమగు యూహాపోహాలలో మునిగి తేలు చుందును.

నేను ఆత్మయందు ప్రేమగలవాడ నైనచో, యాధ్యాత్మిక విషయములను గూర్చియే సంతోషించు చుందును. ఏలయనగా ఎట్టి విషయములందు ప్రేమగలవాడనై యుందునో, అట్టి విషయములను గూర్చియే సంతోషముగ ప్రస్తావించు చుండెదను. అట్టి విషయములను గూర్చి వినుటయందే యెక్కువ కాంక్షగలవాడనై యుండెదను. అట్టి విషయములనే జ్ఞప్తియందుంచు కొనియెదను. ఐతే, నా యేలికా! నిష్కళంకమగు మనస్సాక్షి కలవాడనై తమను గూర్చి పవిత్రప్రార్థనలు సల్పుటకొరకును, అంతరంగికముగను బాహ్యముగను ప్రపంచ విష యానురాగములన్నియు విసర్జించి, తమ దేవదూతల సంఘములో చేర్చు కొన బడుటకు తగిన యోగ్యతను యర్హతను సంపాదించు కొనుటకును, ఏ మానవుడు తమ కొరకై ప్రపంచ విషయములందు జోక్యమును కలి గించుకొనక తొలగియుండునో, ప్రకృతి సిద్ధముగా తన కలవడియున్న దుష్ట స్వభావమును తిరస్కరించి, దేవుని యందలి భక్తిశ్రద్ధల సహాయ ముచే శరీర సంబంధమగు వాంఛలన్నిటిని నశింపజేసి యుండునో, యా మానవుడే తమ యాశీర్వాదములను పొందగల యదృష్టవంతుడు.

---

## సారాంశము

శాశ్వత జీవితమెంత యాహ్లాదకరముగ వర్ణింప బడినది! ప్రస్తుత మానవ జీవితమునందలి సంకటములకును, ముందురానున్న నిత్య జీవితము

నందలి సౌఖ్యమునకు గల తారతమ్యము నింత న్యాయముగ చూపగల వారలు స్వీరితుసాంక్తు సర్వేశ్వరుడు తప్ప మరెవ్వరు గలరు? ఈ సందర్భమున చెప్పబడిన వాక్యములకు నూతనముగ నింక యొక్కవచేర్చి చెప్పవలసిన వేమియును లేవు.

ఈ చెప్పబడిన అంశములను సవరింప యత్నించుదుమేని, వాని బలమును భావమును తగ్గించిన వారల మగుదుము.

ప్రథమున నివి మన మానసముల కెక్కి, మనయందు కొంత వివేకమును పురిగొల్పునేని, వాని వలన మనయందేర్పడు మానసిక స్పష్టత లేకారణముచేత అంత స్వల్పకాలముననే గతించి పోవుచున్నవి? అంత యమూల్యమగు మంచి ముక్తియమును సంపాదించుకొనుటకై, మనమేల సర్వ ప్రపంచ విషయములను విసర్జింప కున్నాము?

మహోన్నతమగు సుఖమును పొందుటకై, మత నియామకములగు మార్గములన్నిటిని మనమేల వినియోగించకున్నాము? మానవ జీవితమున మన మనుభవింపవలసిన తలవంపులకును, అవమానములకును, అపనిందలకును, సంకటములకును ప్రతిఫలములుగా మనకు స్వర్గలోకమున నిత్యానందము, బుద్ధిచే యోచించి తెలియజాలనంత ఘనమగు యశస్సు ప్రసాదింపబడనున్నవి. గాన నట్టి యానందమునకును యశస్సునకును కారణములగు నిందలను, యవమానములను, తలవంపులను, సంకటము లను [illegible]ని మనము చలింపరాదు.

---

## 49 వ అధ్యాయము

### నాశనరహితమగు జీవితముకొరకై వాంఛ, అట్టి జీవిత సంపాదనకొరకై పోరాటము సల్పెడు వారలకు వాగ్దత్తము చేయబడిన వరములు

1. జేసునాథస్వామి:- కుమారా! శాశ్వతానందముచే నీహృదయము పూరింప బడవలయుననియును, మా నిత్య దివ్య తేజస్సును ధ్యానించుటకై శరీర బంధములనుండి నీవు విముక్తి పొందవలయుననెడి కాంక్ష నీలో

అంకురించుటను నీవు గ్రహించినప్పుడు, నీ హృదయము విస్తరించుటకు ఆ దైవ ప్రేరేపణను పూర్ణమనస్సుతో స్వీకరింపుము.

దేవుడు నీయెడల చూప ననుగ్రహించెడు యుదారతకు కృతజ్ఞతా సూచకములగు వందనములర్పించుము. ఏలయనగా అట్టి యుదారస్వరూపుడు నీయెడల మిక్కిలి దయను చూపుచు, నిన్ను సందర్శించుచున్నారు. మిక్కిలి మనఃపూర్వకతతో నిన్ను పురిగొల్పుచున్నారు. సహజముగ నీయందుండు దురితభారముచే నీవు ప్రపంచవిషయములందు పడిపోకుండుటకై మిక్కిలి బలముతో నిన్ను పైకెత్తుచున్నారు.

నీ విట్టిస్థితికి చేరగల్గినది నీ తలంపుచేతగాదు; నీ ప్రయత్నముల చేతనుగాదు. నీవు సద్గుణసంపత్తియందు వృద్ధిగాంచి యెక్కువ హృదయ దీనత్వమును వహించి, ముందురానున్న పోరాటములకు తయారై యుండుటకును, మాకు మిక్కిలి సమీపవర్తివై, మనఃపూర్వకతతో మాకు సేవచేయుటకును, పరిపూర్ణహృదయాపేక్షతో శ్రమపడుటకును, దైవానుగ్రహమువలనను దైవ దర్శన లాభమువల్లను యిట్టి మంచిస్థితికి తేబడియున్నావు.

2. కుమారా, అనేకమారులు పొగ రాజకుండగనే యగ్ని మండుచున్నది. గాని అగ్నిజ్వాలలు పొగలేకుండ నెప్పుడును పైకి పోవుచుండుటలేదు. అదేరీతిని కొందరి వాంఛలు దైవసంబంధమగు విషయముల కొరకై ప్రజ్వరిల్లుచు పైకిలేచుచున్నవి గాని, వారి వాంఛలు శరీర సంబంధమగు మోహములు లేనివై యుండలేదు. గనుక దేవునిగూర్చి వారంతపట్టుదలతో ప్రార్థించునది పూర్తిగా, దేవునియొక్క మహిమ కొరకు కాదు.

అనేకవిధముగ ఎక్కువ బలము గలదని నీవు సూచించుచువచ్చిన నీ కాంక్షయును పలుమారులు పైవారల వాంఛను బోలియే యున్నది.

ఏలయనగా స్వలాభాపేక్ష సంపర్కము కలిగియుండు విషయము లన్నియును పవిత్రమైనవి కావు.

3. నీవు నీకు ఆనందకరమగునట్టియు అనుకూలమగునట్టియు విషయములకొరకై ప్రార్థించక, మాకు సంతోషకరమగునట్టియు మా గౌర

వమునకు తగినట్టియూ విషయములకొరకై మమ్ము ప్రార్థింపుము. ఏలయ
నగా నీవు సదభిప్రాయము గలవాడవైనచో, నీవాంఛననుసరించిగాక
మా నియామకముల ననుసరించి ప్రవర్తింపవలసియున్నావు. నీవు వాం
ఛించు అన్నివిషయములకంటే, మా నియామకములనే ముందు యెన్ను
కొనవలసియున్నావు.

నీవు కోరుకొనునదేదియో మాకు తెలిసియే యున్నది. నీవు దాని
కొరకై చింతించుచు, నిట్టూర్పులు విడుచుచుండుట మేమాలకించు
చున్నాము.

ప్రస్తుతము దైవపుత్రులనుభవించుచున్న మహిమాతిశయ స్వాతం
త్ర్యములను నీ వనుభవింప వలయునని కోరుకొనుచున్నావు.

ఆనందోత్సవములతో నిండియుండు శాశ్వతమోక్షజీవము నిన్ను
సంతోషపెట్టుచున్నది. ఐతే నీకీ సమయమింకను సమీపించి యుండ
లేదు. ఇది యింకను యుద్ధసమయము: శ్రమలను పరిశోధనలను యనుభ
వింపవలసిన సమయమై యున్నది.

మహోన్నతమగు పుణ్యమును పూర్తిగా పొందవలయునని కోరు
దువు. ఐతే ప్రస్తుతకాలమున దానిని పొందజాలవు. మేమే యాపుణ్య
రాశియై యున్నాము. దేవుని రాజ్యస్థాపనా కాలమువరకు కనిపెట్టు
కొనియుండుము.

4. నీవీ ప్రపంచ జీవితమునందింకను పరిశోధింపబడవలసియున్నావు.
అనేక కష్టముల ననుభవింపవలసియున్నావు. కొన్ని సమయములందు
నీకు పరిపూర్ణముగను, తృప్తికరముగను మాయూరటలు ప్రసాదింపబడవు.

నీ స్వభావమునకు సైతము సరిపడని కార్యాచరణయందును, కష్ట
ముల ననుభవించుటయందును ధైర్యమును వహించియుండుము. సాహస
ముగల వాడవై యుండుము. నీవునూతన మానవుడవు కావలయును.

పలుమారులు నీ సంకల్పములకు వ్యతిరేకములగు కార్యములను
నాచరింప వలసియుందువు. నీ సంకల్పానుసారముగ చేయవలసిన
దేదియో దానినట్టె కట్టిపెట్టియుంచుము. ఇతరులకు సంతోషకరము
లగు విషయములు సమకూర్చుచుండుము. నీకు సంతోష కరములగు విష

యములు నివర్తింపబడక, తప్పిపోవు చుండును. ఇతరులుచెప్పు చుండెడు వార్తల నెవరును పాటింపరు.

5. ఇతరులు తాము కోరెడు విషయములను పొందగల్గుదురు. నీవు యాచించునది లభ్యపడకుండును. ఇతరులు మానవులచే ఘనులని యెన్న బడియెదరు.

కార్య నిర్వాహకత్వమును యితరులకు అప్పగించు చుండెదరు. నీ వెందుకును పనికిరాని వ్యర్థుడవని తలంచెదరు. ఇట్టి సందర్భములను చూచి, మానవస్వభావము అప్పుడప్పుడు దుఃఖించుచు కృశించిపోవు చుండును. ఇట్టిసంకటములను నీవు శాంతముగ నోర్చుకొనియుండుట యన్న స్వల్పవిషయము కాదు.

ఈ విషయములందును, వీనిని పోలియుండెడు అనేక యితర విషయములందును, దేవునియందు విశ్వాసము గలిగియుండు సేవకుడు పరిశోధింపబడుట వాడుకయై యున్నది.

ఇట్టి విషయములన్నియు నత డేమాత్రము విసర్జింపగలిగి యుండునో, లేక సర్వవిషయములందును పరిశీలనలకు నిలువలేక తప్పి పోవునో, చూచుటకై పరిశోధింపబడు చుండును.

నీ యిష్టమునకు వ్యతిరేకములగు విషయములన్నిటిని చూచు చుండియును, అట్టి విషయములందే సంకటము లనుభవించుచు, నిన్ను నీవు హీనపరచుకొను అవసరము కలవాడవై యుండువుగాని, యితర విషయములం దొక్కదానియందును నీ కట్టి యవసరమెపుడు నుండదు. ఇట్టి యవసరము ముఖ్యముగ నెప్పుడు సంభవించుననగా, పరస్పర సంబంధము లేనట్టియు, లేశమాత్రమైన నెందుకును కొరగానట్టియు సందర్భములందు, నీవు సంకటము లనుభవింప వలయుననియు, హీన పరచుకొన వలయుననియు నియమింప బడునపుడు, నీకట్టి యవసరము గలదు. ఏలయనగా నీవు తిరస్కరించుటకు ధైర్యము లేనట్టి గొప్ప యధికారుల యేలుబడిక్రింద నుండుటచే, నీ సంకల్పమును పూర్తిగ విసర్జించి, యితరుల యాజ్ఞ ననుసరించి ప్రవర్తించుట నీకు కఠినముగ తోచవచ్చును.

6. ఐతే నాకుమారా, ఇటుల నీవనుభవింప వలసిన శ్రమయొక్క ప్రతిఫలములను గూర్చియు, నీ శ్రమలన్నియు నెంతత్వరితములో గతించి పోవునోయను అంశమును గూర్చియు, ఈ శ్రమ లనుభవించుటవలన ప్రాప్తించనున్న బహుమానమెంత మహోన్నతమైనదని నీ మానసమున చక్కగ యోచించుకొనుము. ఈ శ్రమవలన నీవు లేశమాత్రమైనను కలతనొందవు. నీ వనుభవింప వలసియున్న సంకటములలో మిక్కిలి బలమగు సౌకర్యములను స్వీకరింప గల్గుదుము. ఏలయనగా నీ విపుడు మనఃపూర్వకముగ విసర్జించెడు నీ స్వల్పమగు కోర్కెకు ప్రతిఫలముగ స్వర్గలోకమున నీ కిచ్చినంత పరిపూర్ణ సంతృప్తి సదా ననుభవింపగల్గు దువు. అక్కడ సర్వమేలుల ననుభవింగలవు. అట్టి మేలుల నెపుడైనను కోల్పోవుదు వేమోయను భయము యచట లేదు.

స్వర్గలోకమున మనమిరువురమును ఒండొరులతోడ నైక్యమై యుండెదము. అచటనీకు ప్రత్యేక కాంక్ష లేమియుండవు. అచ్చట నిన్నె దిరించు వారెవరు నుండరు. దోషివని నిన్ను గూర్చి నిందారోపణ చేయు వారు నుండరు. నీవు చేయదలచిన కార్యముల కెవ్వరును విఘ్నములను కలిగింపరు. నీ మార్గముల కెవ్వరు నడ్డమురారు.

నీవు కోరునదంతయును యొకేమారు నీ వచ్చట కనుగొన గలుగు దువు. నీ యాత్మ నచట పరిపూర్ణముగ తృప్తిపరచగలవు.

ఇచట నూతన జీవితమున నీ వనుభవించెడు యమర్యాదలకు ప్రతిఫలముగ నీవు స్వర్గలోకమున గొప్ప యశస్సు ననుగ్రహింతుము.

నీవీ జీవితమున ననుభవించు దుఃఖములకు ప్రతిఫలముగ, స్వర్గమున పొగడ్తయనెడు వస్త్రముచే నిన్నలంకరించెదము. నీవీలోకమున మిక్కిలి నీచస్థానము నెన్నుకొని, దానియందు నిలిచియుండి నందుకు ప్రతిఫలముగ, స్వర్గలోకమున సర్వకాలము నిలిచియుండెడి రాజసింహా సనముపైని నధిష్టింతుము.

ఈ మానవ ప్రపంచమున విధేయుప్రవర్తనగలవాడవై యుండి నందుకు ఫలమును స్వర్గమున గాంచగల్గుదువు. నీవీ ప్రపంచమున పాప పరిహారార్ధమై యనుభవించియున్న తపోఫలముగా స్వర్గలోకమున నానందము ననుభవింతువు.

ఈ ప్రపంచమున విధేయుడవై యితరులకు లొంగి ప్రవర్తించినందుకు ఫలముగ, స్వర్గలోకమున మహిమతో గూడిన మకుటమును ధరింతువు. గనుక నీవిప్పుడీ మానవప్రపంచమునం దందరికిని లొంగియుండి, వినమ్రుడవై నీ కాజ్ఞల నిడుచున్నవా రెవరాయను అంశమును గూర్చి తలంపకుము. ఐతే యొక విషయమున మాత్రము మిక్కిలి జాగరూకుడవై ప్రవర్తింప వలయును. అదియేదియన:-

నీపై యధికారియైనను నీ సరిసమానులైనను లేక నీకన్న తక్కువ స్థితియందుండు వారైనను సరియే, నీ నుండి యేదికోరినను, యే కార్యమునైన నాచరింపుమని వారు లేశమాత్రము నీకు సూచించినను, అది అంతయును యోగ్యమైనదనియే భావింపుము. ఆ కార్యమును నిర్వహించుటకు నిష్కపటముగ శ్రమపడుము.

ఒక మానవు డొక విషయము కోరనిమ్ము, మరియొకడు మరియొక దానికొరకై వెదకికొననిమ్ము. ఇంకొక మానవుడు తానొకానొక అంశమునందు ఘనుడనని తలంచుకొననిమ్ము. మరియొకడు వేరొక విషయమున ఘనుడనని యెంచుకొననిమ్ము. అత్యధికముగ పొగడబడనిమ్ము. ఐతే నీవుమాత్ర మేయంశమునందును సంతసింపకుము. నిన్ను నీవు ద్వేషించుకొనుటయందే మిక్కిలి సంతసము గలవాడవై యుండుము. మాకు మిక్కిలి తృప్తిగలిగించుటయందును, మా యెడల గౌరవమును చూపుటయందును సంతోషము గలవాడవై యుండుము.

నీవు జీవించియున్నను, మరణించి యున్నను, దేవుడు నీయందు ఎక్కువ మహిమపరచబడువాడై యుండవలయును. నీవు వాంచించ వలసిన దంతయు నిదియే సుమీ!

---

## సారాంశము

మనయందు ఆశను పురికొల్పుట యుక్తమని దేవునికి తోచినపుడు, అట్టి వారియుద్దేశమును తృప్తిపరచుటకై మనము మనల వారికర్పించుకొనుట యోగ్యము. ఐతే అపాయకరమగు కష్టస్థితి యొకటి గలదు. అదియేదియన, మనము వాంఛించుదానిని మితిమీరి కోరరాదు.

మన కవసరమగు దానికన్న నెక్కువ కోరతగదు. మన మటులకోరు దానిని సంపాదించుకొనుటకై యనుభవింపవలసిన సంకటముల ననుభవించుటకును, చేయవలసిన పనులను శ్రమపడి చేయుటకును మనఃపూర్వకముగ తయారై యుండవలయును.

• దేవుడు మన కనుగ్రహించెదమని వాగ్దానము చేసియున్న బహుమానములయందలి రుచిని ముందుగనే మనము రుచిచూచునప్పుడు, అట్టియూరటలవలన మనము చైతన్యము గలవారలమై, దేవుని ప్రేమకొరకై మనమనుభవింపవలసిన సర్వవిధపరిశోధనలను, పోరాటములను, శ్రమలను, దుఃఖములను, అలసటలను ననుభవించుటకు తగినంత బలమును చేకూర్చుకొని, సాహసము గలవారలమై యుండుటకై మన మనుభవించెడు యూరటల నుపయోగించుకొన వలయును.

శాశ్వతానందమును పొందగలమను ఆశయును, ముందు రానున్నదని మనము కనిపెట్టుకొనియున్న సంతోషమును, శాశ్వతానందము లభించుననెడు నమ్మకమును, ఈ మూడింటివలనను మనము శ్రద్ధలేనివారమై చురుకుతనమును విడిచి, మందమతులము సోమరులమై యుండ తగదు.

---

## 50 వ అధ్యాయము.

## నిర్భాగ్యు మానవుడు తనను దేవుని కర్పించుకొన వలయును

1. శిష్యుడు:- నా దైవమా, పావనుడవగు యోపరమపితా! ఇప్పుడును నిత్యముం డెల్లప్పుడును మీరు నుతింపబడుదురుగాక! మీ యిచ్ఛవచ్చినరీతినే సర్వమును జరుగుచు, తా మొనరించున దంతయును సర్వదా యోగ్యమైనదిగా నెంచబడునుగాక. తమ దాసుడనైన నేను నన్ను గూర్చియును, మరి యితరమానవులగూర్చియును సంతోషింపక, కేవలవారిని గూర్చియే సంతసించుచుండెదను. ఏలయనగా తామే సత్యమగు సంతోషము; తామే నా యాశ! తామే నా పుణ్యఫలము!

తమ సేవకుడనైన నాకు తా మనుగ్రహించినది తప్ప యితర మేమిగలదు? తాము దయచేసినది సైతము నాయందెట్టి యర్హతలేకున్నను నాకు ప్రసాదించియున్నారు. తాము నన్ను సృష్టించి, నాకు దయచేసిన వన్నియును తమ స్వంతమై యున్నవి.

నేను కడు బీదవాడను. పసితనమునుండియును నానా శ్రమ లనుభవించుచున్నాను. కొన్ని సమయములందు నాయాత్మ కన్నీరు విడచుచు, నెక్కువగా దుఃఖించుచున్నది. పలు విధములగు కామక్రోధాది మనో వికారములచే ముట్టడింపబడి, కొన్ని సమయములందు తనలో తాను కలతనొందు చున్నది.

శాంతము వలని సంతోషముకొరకై, నే నతికాంక్ష కలవాడనై యున్నాను. తమ యూరటచే పోషింపబడుచున్న తమ బిడ్డ లనుభవించుచుండెడు శాంతమును, నాకు దయచేయుడని ప్రార్థించుచున్నాను.

2. శాంతమును దయచేసి పవిత్రమగు సంతోషమును నా హృదయమున కలిగింతురేని, తమ బీదసేవకుని యాత్మ మిక్కిలి తృప్తినొంది, భక్తితో తమను శ్లాఘించుకొనుచుండును.

ఐతే పలుమారు సంభవించునటుల నన్ను తాము కాపాడక తొలగి యుంటిరేని, ఏ మానవుడును మీ నియముల ననుసరించి ప్రవర్తించజాలక పోవును. అంతేగాక మోకరించి దుఃఖింపవలసి యుండును. ఏలయనగా నిన్న మొన్న తమ కరుణామృతము వానిపై ప్రవహించునపుడు, వానిని తాము తమరెక్కలక్రింద భద్రపరచుకొని, వాని నెదురుకొనుచున్న ప్రపంచ మోహామునుండి వానిని రక్షించుచుండినపుడు వాని స్థితి యెటులుండెనో యిప్పుడటు లుండుట లేదు.

3. కరుణానిధివగు ఓ నాతండ్రీ! పవిత్రుడవై సర్వకాలమును స్తుతింపబడుచుండెడి దైవమా, తమ బీదసేవకుడనైన నేను పరిశోధింపబడవలసిన గడియవచ్చినది.

పరిపూర్ణ ప్రేమాపాత్రుడవగు స్వామీ, తమకొరకై తమ సేవకుడనైన నేను, యీ సమయమున నేదియో కొన్ని కష్టము అనుభవించుట తగియున్నది.

పరమపితా! తమకు ముందుగనే విదితమైయున్న సమయ మాసన్నమైనది. తమ దాసుడనైన నేను కొలదికాలము వరకు బాహ్యమున పీడింపబడు చుండుటయు, అంతరంగికముగ తమను గూర్చిన చింతనలతో జీవింపవలసినట్టియు, ప్రపంచ మానవులచే కొద్దిగా చిన్నచూపు చూడబడిన వాడనై హీనపరుపబడి, వారి దృష్టియందు మిక్కిలి వ్యర్థుడనై యుండవలసినట్టియు, సంకటములతోను రోగములతోను మిక్కిలిగ దుఃఖించి,నూతన జ్ఞాన ముదయింపగనే తమతోడగలసి తిరుగ పైకిలేచి స్వర్గమునందు నుతింపబడవలసి నట్టియు సమయము వచ్చియున్నది.

పావనమూర్తియగు నాతండ్రీ, అంతయును మీరీవిధముగ నిర్మించి యున్నారు. ఇది దేవర వారి కోర్కెయై యున్నది. తాము నియమించిన దంతయును జరిగితీరును.

4. ఏలయనగా తమదయకొరకై ఈ ప్రపంచమునం దెన్నిమారులైనను సర్వ సంకటములను, ఆసంకటము లెవ్వరి వలన నాకు సంభవింపవలయునని తాము నియమించియున్నారో, వారిచే ననుభవించి దుఃఖించుటయే తాము తమ స్నేహితులకు అనుగ్రహించెడి వరప్రసాదమైయున్నది.

తమ అనుమతి లేక తమ నిర్ణాణము లేక ప్రపంచమునందేదియును జరుగదు. ఓనాప్రభువా! తమ నిర్ణాణముల యందలి న్యాయమును నేను గ్రహింపగలుగుటకును, నాహృదయము నావరించియున్న గర్వమును అహంకారమును విసర్జించి యుండుటకును,నన్ను తాము దీనస్థితికి తెచ్చుట నాకు మిక్కిలి క్షేమము (కీర్త 118-71)

మానవులనుండి గాక, తమనుండియే యూరటలకొరకు వెతకుకొను వాడగునటుల, నన్ను మానవుల మధ్య సిగ్గుచే ముఖమును క్రేలాడ వేసికొని యుండవలసిన స్థితియందుండుటకు నాకు మిక్కిలి హితకరములైనవియే.

5. ఇందు మూలముగ మిక్కిలి గూఢమై తెలిసికొన శక్యము గాని తమ న్యాయతీర్మానములను గాంచి, భయము చెందియుండుటకు నేను నేర్చుకొనియున్నాను. న్యాయయుక్తముగనే సన్మార్గులను దుష్టులచే

శిక్షించు మానవాతీతమగు తమ న్యాయపద్ధతులగూర్చి, భీతిల్లకుండుటకు నేర్చుకొనియున్నాను.

నేనొర్చిన దుష్కృత్యములకు గాను నన్ను లేశమాత్రమైనను దయదలచి వదలివేయక, నాకు బాధకలుగునట్లు బలమైన దెబ్బలతో నన్ను శిక్షించి, నాశరీరమంతయును నలుగగొట్టినందుకు గాను తమకు నేను వందనము లర్పించుచున్నాను. గాయములను గలిగించుచు తిరుగ మాన్పుచు, స్వర్గవాసియైయున్నయో ఆత్మలోక వైద్యశిఖామణీ! మానవులను వారాచరించెడు పాపకృత్యముల ననుసరించి పాతాళమువరకు నణగద్రొక్కి, తిరుగ స్వర్గలోకమునకు గొంపోవుచుండు నాయేలిక యగు దైవమా! తాము తప్ప యీ ప్రపంచమునందు నాకు సౌకర్యముల ననుగ్రహింపగల వారలెవ్వరును లేరు. నేను తమ క్రమశిక్షణయందున్నాను. తమ దివ్యహస్తమున వెలయుచున్న రాజదండముచే శిక్షించి, నాకు నీతి నేర్పుడు.

6. నాప్రియమగు తండ్రీ! నేను తమ హస్తములందున్నాను. నా ప్రవర్తనను సవరించుకొని చక్కపరచుకొనుటకు గాను, నన్ను శిక్షించెడు తమ హస్తము నందలి రాజదండమునకు తలయొగ్గి నిలిచియున్నాను.

నా వక్రబుద్ధులను విసర్జించి, తమ యిచ్ఛానుసారముగా ప్రవర్తించుటకు తమ కరదండము చే నన్ను దండించుడు. తాము సాధారణముగా చేయు ననుగ్రహించుచుండు వరుల, సర్వకాలము లందును నేను తమ యాజ్ఞానువర్తినై ప్రవర్తించుటకు గాను, తమయందు విశ్వాసముగల శిష్యునిగా మాత్రము చేసికొనుడు. నన్నును నా సర్వస్వమును తమ కర్పించుకొనుచున్నాను. నాయందలి దోషములన్నియును మాన్పి, నన్నును నా సర్వస్వమును సవరించి, నన్ను కల్మషరహితునిగ చేయ ననుగ్రహింపుడు.

ఇకముందెప్పుడో శిక్షింపబడి బాగుపరుపబడుటకంటె, యిపుడే తగినంత బాధ ననుభవించుట యుక్తమము కదా! స్వామీ తాము సర్వము నెరిగినవారైయున్నారు, తమ కగోచరము గాకుండునటుల మా హృదయములందు గుప్తపరచుకొని దాచుకొనగల దేదియును లేదు.

ముందు జరుగునున్న విషయములు తమకు ముందుగనే విదితములై యుండును. అట్టి విషయములనుగూర్చి మీ కెవ్వరును ముందుగ తెలుప నవసరము లేదు.

నా యభివృద్ధి కేదియవసరమో, పాపమనియెడి త్రుప్పును తుడిచి వేయుటకు సంకటానుభవ మెంత యుపయోగకరమైనదో తమ కెరుకయే కదా !

నా విషయమున తమ యిచ్ఛానుసారముగ జరిగిపోనిండు. ఇతరులకన్న మీకు స్పష్టముగా విదితమగు నాదుష్ట జీవితమును ఏవగించుకొనకుడు.

నేను గ్రహింపవలసిన వన్నియును గ్రహించునటులును, ప్రేమింపవలసిన వన్నియును ప్రేమించునటులును తమకు ప్రీతికరమగు విషయములన్నియును నేను నుతించునటులును తమదృష్టియందు అమూల్యమని యెంచబడున వన్నియును మిక్కిలి యతిశయమైనవిగ నెన్నుకొనునట్లును, తమకు తుచ్ఛములుగ తోచు వాటినన్నిటిని నేను ద్వేషించునట్లును యనుగ్రహింపుడు.

నేనీ బాహ్యనేత్రములతో చూచి గ్రహించినరీతిని పరుల చర్యలనుగూర్చి యెట్టి తీర్మానమును చేయకుండునటులను, తాము చెప్పుచుండు విషయములేవియో నెరుగని మానవుల చెవులకు ప్రీతికరముగ చెప్పునటులను నాకనుగ్రహించండి. ఐతే నేత్రగోచరమయ్యెడు ప్రపంచ విషయములను, అగోచరమగు యాధ్యాత్మికా విషయములను గురించియు న్యాయానుసారముగా తీర్మానములు గావించుటకు, అన్నిటికన్న నధికముగ నెల్లప్పుడును యోగ్యమగు మీచిత్తముకొరకును మీ స్తుతికొరకును వెతకుకొనుటకు తగినబుద్ధిని నాకు దయచేయుడు.

తీర్మానములు గావించుటలో ననేక సందర్భములందు మానవులు తప్పుడభిప్రాయముగలవార లగుచున్నారు. ఐహిక విషయములందు ప్రీతిగల మానవులు తమ కనులకు గోచరములగు వానిని మాత్రము ప్రేమించుచు మోసపోవుచున్నారు.

మానవుడు తనతోటివారలచే నెక్కువగ గణింపబడినంత మాత్రమున తాను గొప్పవాడు కాగలడా? కలుషప్రవర్తనుడగు మానవుడు

మరియొక కలుషమానవుని పొగడుచుండుట చూడ నెటుల యున్న దనగా:—

వంచకుడు మరియొక వంచకుని, డాంభికవర్తనుడు మరియొక డంభాచారిని, అంధుడు మరియొక అంధుని, బలహీనుడింకొకబలహీనుని పొగడుచు, మోసము చేయునటులున్నది.

నిశ్చయముగ విచారించిచూచిన, వీరలలో యొకడు మరియొకనిని పొగడుచు, నట్టి పొగడ్తవలన నాతనిని సంభ్రమపరుపుచున్నాడు. ప్రతి వ్యక్తియును మీ దృష్టియందెట్టివాడై యుండునో, అట్టివాడే యగును గాని, మరియొక రీతిగా నుండజాలడు. అని మిక్కిలి దీనత్వమును వహించియున్న అర్చ్య. ఫ్రాంసిస్‌గారు వక్కాణించియున్నారు.

---

## సారాంశము

విమర్శనాసమయములందును, మనోవికార హేతుసందర్భములందును, శరీరబాధల ననుభవించునప్పుడును, యీ మానవునకుండవలసిన దివ్యమగు సంకల్పములనుగూర్చి నీ యధ్యాయమున చదువుచున్నాము.

పవిత్రములగు యీ సంకల్పములను కలిగియుండవలయునని గ్రహించి, విశ్వాసముగల యాత్మ దేవునిగూర్చి ప్రార్థనలు సల్పుకొనవలయును. గనుక మన మవలంభింపవలసిన కేవలము ముఖ్యమగు ఒకే సాధనమేదియనః దుఃఖసమయములందును, శరీరబాధల ననుభవించునపుడును, నిరుత్సాహ సమయములందును, విసుకుచెంది యుండునపుడును, చిక్కుమాలిన దుస్థితులయందు చిక్కుకొని యుండునపుడును, పైని పేర్కొనబడిన సంకల్పములను మనయందు పురికొల్పగలిగెడు ప్రతి విషయమును మనము వదిలిపెట్టక, నుపయోగించవలయును. అట్టి పట్టులను మనకు ప్రసాదింపుమని దేవుని ప్రార్థింపవలయును. పాపులగు మానవులను రక్షించుటకై మానవులచేతనే పలువిధములగు యవమానములను యపనిందలను కష్టముల ననుభవించి, తుదకు ప్రానుపైని కొరత వేయబడిన జేసునాధుని దివ్యపాదకమలముల ప్రోలి వినమ్రులమై సాష్టాంగవందనము లర్పించుచు, మిక్కిలి పవిత్రవంతమగు వారి కృపా

వృష్టిచే తడుపబడియున్నట్టియు, ఏవిధమునను కొరతబడి యుండక నట్టియు, నీ ప్రార్ధనను పలుమారు స్మరించుకొనవలయును.

---

## 51 వ అధ్యాయము

## మనము ఘనకార్యములను సాధన చేయజాలనపుడు, అల్పకార్యములనే అభ్యసింపవలయును.

1. జేసునాధస్వామి:- కుమారా నీవెల్లప్పుడును సద్గుణ సంపాదన యందు మిక్కిలి తీవ్రమగు కాంక్ష కలిగియుండజాలవు. మహోత్కృష్ట దైవ ధ్యానమున నీవు నిశ్చల మనస్సుతో సర్వదా నిలిచియుండలేవు.

ఐతే కొన్ని సమయములందు నీ జన్మపాప ఫలితముగ నీవు మిక్కిలి నీచకార్యము లాచరించుటయు, నీకిష్టము లేకున్నను విసుకుతో హేయమైన ఈ మానవ జీవితభారమును మోయుటయును అగత్యమై యున్నది.

నశింపవలసియున్న యీ మానవ శరీరభారమును ధరించి యుండు నంతకాలము, ఆయాసమును హృదయభారమును అనుభవించుచుందువు.

నీవు నశించు శరీరధారివై యుండునంతకాలము నీ శరీరభార మున . . .ంచుకొని పలుమారులు పరితపింప వలసినవాడవే సుమా!

ఏలయనగా విరామమేమియు లేకుండ, ఆధ్యాత్మికా సాధనల యందును దైవసంబంధమగు చింతనలందును నిమగ్నుడవై యుండ జాలవు.

2. ఇట్టి సందర్భములందు నీవు దీనమగునట్టి బాహ్య సత్క్రియలను నిర్వహించుచు, అలసట తీర్చుకొనుచు యుల్లాసము గలవాడవై యుండ వలయును. మేమరుదెంచి నిన్ను సంధింతుమనియెడు చలింపని స్థిరమగు యాశతో, కనిపెట్టుకొని యుండవలెను. తిరుగ మేము నిన్ను సంధించి నీ వేదనలనుండి నిన్ను విముక్తుని జేయువరకు, నీ దౌర్భాగ్యస్థితిని నీ మానసిక నీరసత్వమును, మిక్కిలి శాంతముగ సహించి యుండ వలయును.

నీ శరీరబాధలన్నియును మరచి శాశ్వతమగు విశ్రాంతిని పొందు లాగున మేమనుగ్రహించెదము.

వికసిత హృదయుడవై, మేము నియమించియున్న న్యాయమార్గమున నడచుటకు మొదలిడునపుడు, వేదగ్రంథములనియెడు యానందకరమగు క్షేత్రములను నీ కనులయెదుట తెరచియుంచుదుము.

అప్పుడు నీవు ఈకాలమునం దనుభవింప వలసియున్న సంకటములను, ముందురానున్న మహోన్నత మహిమతో సరిపోల్చుకొని చూచినచో, అనుభవింపవలసిన సంకటములు లేశమాత్రమైనను సరిపోజాలవని నీవు చెప్పగలుగుదువు. (రోమను 8-18)

## సా రాం శ ము

ఇట్టి దుఃఖకరములగు సమయములు పలుమారు సంప్రాప్తించుచుండును. మన మానసిక యుత్సాహము క్షీణించునపుడు, దైవభక్తిని గూర్చిన స్మరణను మానసమున నిల్పియుంచుకొనజాలమని మనము గ్రహించినపుడు, మన యాధ్యాత్మికా సాధనలు మనకు సంకటములైనప్పుడును, మనము ప్రార్థనలకును దైవ చింతనలకును అసర్థులమై పోవునపుడును, మనకు దుఃఖకాలము సంప్రాప్తించినదని తలంపవలయును.

ఇట్టి దుఃఖ సమయములందు మన మవలంభించి నడువవలసిన మార్గమేదన: మన దుస్థితులనుగూర్చి పరితపించవలయును. మిక్కిలి దీనత్వమును వహించియుండవలయును. పాపఫలితముగ మనకు సంప్రాప్తమైన సంతాపకరమగు స్థితినిగూర్చి రోదనము చేయవలయును. జ్ఞానవర్థకమగు విషయములందు బహిరంగముగ ప్రవేశింప వలయును.

ఈ విషయములు కష్టమైనవిగ నుండుట వాస్తవమే. కాని స్వప్రేమ మూలమున నవి యంత ప్రీతికరములుగ నుండవు. మనలను బహిష్కృతులనుజేసిన దైవమునే తిరుగ ప్రార్థించునటుల మనను పురికొల్పుటకవి లాభకరములుగ నుండును. ఇట్టి సమయమున పూర్ణహృదయానురాగముతో దీనత్వమునువహించి, మిక్కిలి యుత్సాహముతో ప్రార్థనాపూర్వకముగా రక్షకునికి మనవి చేసికొనియెదము.

## 52. వ అధ్యాయము

### మానవుడు తాను దేవుని ఆదరణలకు తగిన యోగ్యత గలవాడనని యెంచుకొనక, దండనకు మాత్రమే తగినవాడని తెలిసికొన వలయును.

1. శిష్యుడు:- నా ఏలికా! ఏలినవారిచే యాదరింపబడుటకు నేనెట్టి యధ్యాత్మికా సుధింపులకు తగిన యర్హతగలవాడను గాను. గనుక నన్ను నిరుపేదగా నొనర్చి, దిక్కుమాలిన స్థితియందు జారవిడుటలో తాము నాయెడల న్యాయయుక్తముగ నే ప్రవర్తించిరి.

ఏలయనగా? కన్నీరు కాల్వలుగట్టి,మహాసాగరముగ పరిణమించు నంతగా నే నేడ్చినను, తమవలన సౌకర్యములను స్వీకరించుటకు తగిన యర్హతగలవాడనుకాను. నేను పలుమారు ఘోరమగు పాపములను నాచరించి యుండుటచేతను, తమవలన దండనదెబ్బలను యితర శిక్షల ననుభవించుటకుమాత్రమే నేను అర్హుడనై యున్నాను.

కాన, న్యాయముప్రకారము తమువలన నేను మిగుల స్వల్ప సౌకర్యములను సైతము పొందుటకు తగినయోగ్యత లేనివాడనైయు న్నాను. ఐతే నీతినిలయమును కరుణానిధులు నగు దైవమా, తాము సృష్టించియున్న వస్తువులు నశింపుకావలయుననెడి తలంపు తమకెపు డును లేదు. తమ దయనుపొందుటకు తగిన యర్హతగలవారలకు తమ కనికరభాగ్యమును చూపుటకుగాను, మానవమాత్రుడు గణింపలేనంత యెక్కువసౌకర్యములను తమ సేవకునికి తామనుగ్రహించుచున్నారు.

ఏలయనగా తాము దయచేసెడి యాదరణ మానవులవలని యాద రణ వంటిదిగాదు. ఏలినవారా! తమ దివ్యసౌకర్యములను నాకనుగ్ర హించుటకు నేనేమిపుణ్యము చేసియున్నాను?

నే నెప్పుడును పుణ్యకార్యము లొనరించియున్నటుల నాకు జ్ఞప్తిలేదు. కాని నే నెల్లపుడును దుష్టకార్యము లాచరింపవలయునను సంకల్పములకే లొంగి ప్రవర్తించుచు, నా లోపములను సవరించు కొనుటలో లేశమైనను ఉత్సాహము లేనివాడనై, మందమతినై యుంటి

షనియే నాకు తెలిసియున్నది. నేనిప్పుడు చెప్పునది సత్యమని తమరెరు
గుదురు. నేను మరియొక విధముగ చెప్పుదునేని తాము నాకు వ్యతిరేకు
లగుదురు. నన్ను కాపాడువారలెవరు నుండరు. నేజేసిన పాపములకు
ఫలితముగ శాశ్వతనరకాగ్నిని నే ననుభవింప వలయునుగాని, నేనింకెం
దుకును యోగ్యతకలవాడను కాను.

వాస్తవముగ నే నందరిచేతను తిరస్కరింపబడి, ద్వేషింపబడు
టకే యర్హుడనని యంగీకరించుచున్నాను. తమ భక్తులలో నేనొకడనని
పిలువబడు యోగ్యత నాకు లేదు. ఇటుల చెప్పుట నాకు మిక్కిలి కష్ట
ముగానున్నను, తమ దయను సులభముగ సంపాదించుకొనుటకుగాను
సత్యముగా నే నాచరించుచున్న పాపకృత్యములం గూర్చి నన్ను నేనే
ఖండించుకొను చున్నాను.

3. నేరము లాచరించినట్టియు, అందుచే శాశ్వతమైన తత్తరపాటు
నొందుచున్నట్టియు నేనేమిచెప్పగలను? నా ఏలినవారా! నేను పాపము
లాచరించి యున్నాను. కనికరహృదయులై నన్ను క్షమింపుడు. అని
యీ ఒక్కమాటతప్ప, నే నింకేమియును చెప్పజాలను. గాఢాంధకార
బంధురమగు మరణమనియెడు కారుమేఘముతో కప్పబడియున్న
భయంకర పాపులలోకమునకు పోవుటకు ముందుగనే నా దుఃఖమును
గూర్చి మొరపెట్టుకొనుటకు గాను నా కనుమతి దయచేయుడు.
(జోబు 10-20, 21)

తమ పాపములకు పశ్చాత్తాపము నొంది దీనత్వము వహించియుం
డుటతప్ప, నేరస్థులగు పాపులనుండి మీ రేమియును కోరుటలేదు.

నిశ్చయముగ పశ్చాత్తాపమువల్లను, హృదయదీనత్వమువల్లను, మన
పాపములనుగూర్చి దేవునివలన మనము క్షమింపబడవచ్చునను యాశ
కలుగుచున్నది. కలతనొందుచున్న మనస్సాక్షికి కొంతవరకు శాంతము
కలుగుచున్నది. అంతకుముందు కోల్పోయియున్న దేవయిష్టప్రసాదము
తిరుగ లభింపనున్నది. దైవకోపమునుండి మానవుడు రక్షింపబడు
చున్నాడు.

సర్వేశ్వరుడును పశ్చాత్తాపము నొందు పాపిపైన తిరిగి స్నేహ
భావము గలిగియుండును.

(23)

ఏలినవారా తమ సముఖమున దూపముగ యాహుతియయ్యెడు సాంబ్రాణి సుగంధముకన్న, మిక్కిలి దీనత్వమునువహించి నేనాచరించిన పాపములనుగూర్చి హృదయపూర్వక పశ్చాత్తాపమును పొందుటయే తమకు మిక్కిలి ప్రీతికరమగు హోమమై యున్నది.

పవిత్రమగు తమ పాదపద్మములకు ప్రక్షాళన గావించుటకై తాము మిక్కిలి ప్రియపడెడు తైలమే యీ మనఃపూర్వక పశ్చాత్తాపము; ఏలయనగా తామింతవర కెన్నడును పాపములనుగూర్చి దీనత్వముగా హృదయపూర్వక పశ్చాత్తాపము నొందువారలను ద్వేషించి యున్నవారలు గారు.

భయంకరమగు శతృబృందమునుండి తప్పించుకొనిపోయి, దాగియుండుటకు తగిన సురక్షితమగు ప్రదేశమిచ్చటనే యున్నది. ఇతర ప్రదేశములం దెచ్చటనైన కల్మషపరుబడిన దంతయును, యీ దివ్యస్థలముననే చక్కచేయబడి కల్మషరహితముగ నొనర్పబడును.

---

## సారాంశము

తననుగూర్చి తీవ్రముగ పర్యాలోచనజేసికొనుచు, తాను దైవ యూరటలను పొందుటకు తగిన యర్హతగలవాడనై యుంటినని తలంచుకొనక, తాననుసరించియున్న పలువిధములగు పాపకృత్యములను గూర్చి తాను అర్హుడుగాడని తెలిసికొనును.

ఐతే దేవుడు వానికి మనోవికాసమును గలిగించి నడుపుచుండు నేని, తానొనరించియున్న పాపములవలన మానవుడు మిక్కిలి దీనుడై తన నేరముల నంగీకరించుచు పశ్చాత్తాపము నొందునేని, దేవుని యపారకరుణయెడల తండ్రియందు బిడ్డలకుండెడు సత్యమగు నమ్మకమును కలిగియుండునేని, తన పాపములన్నియును క్షమింపుమని నిండు హృదయముతో దేవుని వేడుకొనునేని, తన పుణ్యాపాపములను విమర్శించెడు న్యాయకర్తయగు దేవుని తృప్తిపరచుటకును, తనఏలినవారితో సమాధానమును కుదుర్చుకొని వారి దయను సంపాదించుకొనుటకును, వారివలన శాంతమనియెడు ముద్దును స్వీకరించుటకును యితర సంకల్పములేవియు నవసర ముండవు.

## 53. వ అధ్యాయము

## ఐహికవిషయాలోలురగు మానవులకు దైవవరప్రసాద మనుగ్రహింపబడదు.

1. జేసునాథస్వామి :- కుమారా, మేము మానవుల కనుగ్రహింప దలచెడు వరప్రసాదము మిక్కిలి యమూల్యమైనది. బాహ్యవిషయముల తోను మానవ ఓదార్పులతోను మిళితమైయుండుట మా వరప్రసాద ములకు వీలుపడదు. గనుక అట్టి మా వరప్రసాదమును పొందవలయు ననెడి కోరిక కలవాడవైనచో, దానికి ప్రతికూలములగు విషయము లన్నియును విసర్జించుము.

నీకొరకై యేకాంతస్థలము నొకదానిని సిద్ధపరచుకొనుము. అం దేకాంతముగ నివసించుటయం దెక్కువ ప్రీతి గలవాడవై యుండుము. ఇతరులతో సంభాషింపవలయుననెడి కోర్కె గలవాడవై యుండకుము.

అందుకు మారుగా నీవాచరించియున్న పాపకృత్యములనుగూర్చి విచారపడుచు, నీమనస్సాక్షిని కల్మషరహిత మొనర్చుమని మిక్కిలిభయ భక్తులతో దేవుని ప్రార్థింపుము.

ఈ ప్రపంచ విషయము లన్నియును కేవలము శూన్యములని భావించుకొనుచు, బాహ్యవిషయములను నమ్మియుండక, దేవుని సముఖ మునను వారికి సేవజేయుచు కనుపెట్టుకొని యుండుము.

ఏలయనగా నీవు మాకు సేవజేయుచు అదేకాలమున అశాశ్వత మగు ఐహిక విషయముల నందలి యానందములలో మునిగియుండజాలవు.

నీతో పరిచయము గలిగియుండువారలను, నీవు ప్రేమించుచుండు వారలను చేరక, వారిని విసర్జించి వారినుండి వేరై యుండుము. అశాశ్వ తమగు సౌకర్యముల దిశకు నీ మానసమును పోనీయకుము. అందులకై అర్చ్యశిష్టరాయప్పగారు ఈ ప్రపంచమున నున్నపుడు. "మీరందరును పరదేశీయులవలెను యాత్రికులవలెను ప్రవర్తింపుడు," అని జేసునా థుని భక్తుల నందరిని హెచ్చరించి యున్నారు.

2. ఐహిక విషయములందు హృదయానురాగ బద్ధుడుగాని మానవుడు, అవసాన కాలమున దేవునియందెక్కువ నమ్మకము కల వాడై యుండును.

ఐతే పాపాచరణవలన దుర్బలమైయున్న ఆత్మ, ప్రపంచ విషయములయం దిటుల పరిపూర్ణానురాగ బద్ధముగాని హృదయమును గలిగి యుండ జాలదు.

ఇంద్రియాను వర్తియగు మానవుడు ఆంతరంగిక హృదయముగల వాడనుభవించుచుండు ఆత్మ స్వాతంత్ర్యమును గ్రహింపజాలడు.

ఐతే ఆతడు వాస్తవమగు జ్ఞాన వికాసముగలవాడై యుండ కోరునేని, తనదగ్గరనుండు వారిని దూరముగ నుండువారిని విసర్జించి వారియందెట్టి లక్ష్యముంచక తననుగూర్చియే జాగ్రత్తవహించి యుండ వలయును.

నీవు నిన్ను పరిపూర్ణముగ జయింప గలుగుదువేని, బాహ్య విషయములన్నిటిని మిక్కిలి సులభముగ జయింప సమర్థుడ వయ్యెదవు. తన్ను తాను జయించి యుండుటయే పరిపూర్ణ విజయము.

ఏలయన తన్ను తాను జయించినవాడు, తనయింద్రియములను బుద్ధి వివేకములకును, బుద్ధిని అన్నివిషయములలో మాకును లొంగి యుండునటుల చేసికొనగల వాడగును. శరీరమును అదుపులో నుంచు కొను మానవుడు తనను తాను జయించిన వాడగుటయేగాక, ప్రపంచ మును జయించిన వాడగును.

3. ఈ విధముగ నీవు యభివృద్ధి నొందుచు, పైకిపోవ కాంక్షగల వాడవైనచో, నీ యాచరణలన్నియును మిక్కిలి ధీరత్వముతో నారం భించి స్వాపేక్షయందును స్వలాభమును పాటించుచుండు ప్రపంచ విషయముల నెడలను, నీయందు దాగియున్న మితిమీరిన యక్రమ యాపే క్షనంతయును వ్రేళ్ళతోడ పెరికివేసి నాశన మొనర్పవలయును. నీయందు నీవు జయింప వలసియున్న దుష్టత్వమంతటను మితిమీరిన స్వప్రేమయే మూలము. ఇట్టిదుర్గుణము నొకమారు జయించి యణగ ద్రొక్కగలుగుదువేని, వెంటనే యమోఘమగు శాంతము చేకూరును

ఐతే మానవులలో కొలదిమంది మాత్రమే తమ్మావహించియున్న యహంకారమును చంపుకొనుటకై ప్రయాసపడియెదరు. ఈ కొలది మందిసైతము తమ్ము తాము పరిపూర్ణముగ జయించుటకు ప్రయాసపడు చుండుట లేదు. గనుక వారింకను మోహములందు డగుల్కొని జ్ఞానమార్గమున వృద్ధినొందజాలకున్నారు. ఐతే యేమానవుడు ఆత్మ స్వాతంత్ర్యము గలవాడై మాతో ప్రవర్తింప కొంతుగలవాడై యుండునో, యాతడు తనయందు చెలరేగియున్న యక్రమ యనురాగములన్నిటిని క్రుంగ చేసి, సృష్టివిషయములలో ఐహిక విషయములలో దేనియందును కామ కొంతుగాని ప్రత్యేకప్రేమగాని లేనివాడై, ప్రపంచ విషయములన్నిటిని వర్జించి యుండగలడు.

---

## సారాంశము

దైవాభిమానమును సంపాదించుకొనుటకుగాను, స్వేచ్ఛాపూర్వకముగ ప్రపంచ విషయములనుండి వేరై యుండవలయును. మనలను మనము పరిత్యజించుకొని దైవధ్యానము, దైవప్రార్థన మొదలగు సాధనల యందు కాలము గడుపుటయే మనముఖ్య ప్రయత్నమై యుండవలయును.

బహిరంగ విషయములయెడల మనమెంతయెక్కువ విసర్జనా భావము గలవారమై యుందుమో, అంతరంగిక యాధ్యాత్మిక సంపాదనయందు అంతయెక్కువ పెంపుగలవారమై యుందుము. ప్రపంచవిషయములనెడల మనకు గల వ్యామోహమున కంతకును స్వప్రేమయే మూలకారణము గాన, ఇట్టి స్వప్రేమనే మనము చంపవలయును,

నిన్ను నీవు ప్రేమించుకొనుట యనెడి దుష్టగుణమును జయించి యణచివేయుదువేని, యితరదుర్గుణము లన్నిటిని మిక్కిలి సులభముగా నాశనమొనరింప గలుగుదువు.

మన పావనగ్రంథకర్త మనకిచ్చెడు ప్రశంసనీయమగు సలహా నియ్యదియే. వీరిసలహాల నుపయోగించుకొని పుణ్యమునందభివృద్ధినొందెదముగాక.

---

2. ఐహిక విషయములందు హృదయానురాగ బద్ధుడుగాని మానవుడు, అవసాన కాలమున దేవునియందెక్కువ నమ్మకము కల వాడై యుండును.

ఐతే పాపాచరణవలన దుర్బలమైయున్న ఆత్మ, ప్రపంచ విషయములయం దిటుల పరిపూర్ణానురాగ బద్ధముగాని హృదయమును గలిగి యుండ జాలదు.

ఇంద్రియాను వర్తియగు మానవుడు ఆంతరంగిక హృదయముగల వాడనుభవించుచుండు ఆత్మ స్వాతంత్ర్యమును గ్రహింపజాలడు.

ఐతే ఆతడు వాస్తవమగు జ్ఞాన వికాసముగలవాడై యుండ కోరునేని, తనదగ్గరనుండు వారిని దూరముగ నుండువారిని విసర్జించి వారియందెట్టి లక్ష్యముంచక తననుగూర్చియే జాగ్రత్తవహించి యుండ వలయును.

నీవు నిన్ను పరిపూర్ణముగ జయింప గలుగుదువేని, బాహ్య విషయములన్నిటిని మిక్కిలి సులభముగ జయింప సమర్థుడ వయ్యెదవు. తన్ను తాను జయించి యుండుటయే పరిపూర్ణ విజయము.

ఏలయన తన్ను తాను జయించినవాడు, తనయింద్రియములను బుద్ధి వివేకములకును, బుద్ధిని అన్నివిషయములలో మాకును లొంగి యుండునటుల చేసికొనగల వాడగును. శరీరమును అదుపులో నుంచు కొను మానవుడు తననుతాను జయించిన వాడగుటయేగాక, ప్రపంచ మును జయించిన వాడగును.

3. ఈ విధముగ నీవు యభివృద్ధి నొందుచు, పైకిపోవ కాంక్షగల వాడవైనచో, నీ యాచరణలన్నియును మిక్కిలి ధీరత్వముతో నారంభించి స్వాపేక్షయందును స్వలాభమును పాటించుచుండు ప్రపంచ విషయముల నెడలను, నీయందు దాగియున్న మితిమీరిన యక్రమ యపేక్షనంతయును వ్రేళ్ళతోడ పెరికివేసి నాశన మొనర్పవలయును. నీయందు నీవు జయింప వలసియున్న దుష్టత్వమునకంతకును మితిమీరిన స్వప్రేమయే మూలము. ఇట్టిదుర్గుణము నొకమారు జయించి యణగ ద్రొక్కగలుగుదువేని, వెంటనే యమోఘమగు శాంతము చేకూరును

ఐతే మానవులలో కొలదిమంది మాత్రమే తమ్మావహించియున్న యహంకారమును చంపుకొనుటకై ప్రయాసపడిరియెదరు. ఈ కొలది మందినైతము తమ్ము తాము పరిపూర్ణముగ జయించుటకు ప్రయాసపడు చుండుటలేదు. గనుక వారింకను మోహాములందు దగుల్కొని జ్ఞానమార్గమున వృద్ధినొందజాలకున్నారు. ఐతే యేమానవుడు ఆత్మ స్వాతంత్ర్యము గలవాడై మాతో ప్రవర్తింప కాంక్షగలవాడై యుండునో, యాతడు తనయందు చెలరేగియున్న యక్రమ యనురాగములన్నిటిని క్రుంగచేసి, సృష్టివిషయములలో ఐహిక విషయములలో దేనియందును కామ కాంక్షగాని ప్రత్యేకప్రేమగాని లేనివాడై, ప్రపంచ విషయములన్నిటిని వర్జించి యుండగలడు.

---

## సారాంశము

దైవాభిమానమును సంపాదించుకొనుటకుగాను, స్వేచ్ఛాపూర్వకముగ ప్రపంచ విషయములనుండి వేరై యుండవలయును. మనలను మనము పరిత్యజించుకొని దైవధ్యానము, దైవప్రార్థన మొదలగు సాధనలయందు కాలము గడుపుటయే మనముఖ్య ప్రయత్నమై యుండవలయును.

బహిరంగ విషయములయెడల మనమెంతయెక్కువ విసర్జనాభావము గలవారమై యుందుమో, అంతరంగిక యాధ్యాత్మిక సంపాదనయందు అంతయెక్కువ పెంపుగలవారమై యుందుము. ప్రపంచవిషయములయెడల మనకు గల వ్యామోహమునకంతకును స్వప్రేమయే మూలకారణము గాన, ఇట్టి స్వప్రేమనే మనము చంపవలయును.

నిన్ను నీవు ప్రేమించుకొనుట యనెడి దుష్టగుణమును జయించి యణచివేయుదువేని, యితరదుర్గుణము లన్నిటిని మిక్కిలి సులభముగా నాశనమొనరింప గలుగుదువు.

మన పావనగ్రంథకర్త మనకిచ్చెడు ప్రశంసనీయమగు సలహానియ్యదియే. వీరిసలహాల నుపయోగించుకొని పుణ్యమునందభివృద్ధినొందెదముగాక.

---

2. ఐహిక విషయములందు హృదయానురాగ బద్ధుడుగాని మానవుడు, అవసాన కాలమున దేవునియందెక్కువ నమ్మకము కల వాడై యుండును.

ఐతే పాపాచరణవలన దుర్బలమైయున్న ఆత్మ, ప్రపంచ విషయ ములయం దిటుల పరిపూర్ణానురాగ బద్ధముగాని హృదయమును గలిగి యుండ జాలదు.

ఇంద్రియాను వర్తియగు మానవుడు ఆంతరంగిక హృదయముగల వాడనుభవించుచుండు ఆత్మ స్వాతంత్ర్యమును గ్రహింపజాలడు.

ఐతే ఆతడు వాస్తవమగు జ్ఞాన వికాసముగలవాడై యుండ గోరునేని, తనదగ్గరనుండు వారిని దూరముగ నుండువారిని విసర్జించి వారియందెట్టి లక్ష్యముంచక తననుగూర్చియే జాగ్రత్తవహించి యుండ వలయును.

నీవు నిన్ను పరిపూర్ణముగ జయింప గలుగుదువేని, బాహ్య విషయ ములన్నిటిని మిక్కిలి సులభముగ జయింప సమర్థుడ వయ్యెదవు. తన్ను తాను జయించి యుండుటయే పరిపూర్ణ విజయము.

ఏలయన తన్ను తాను జయించినవాడు, తనయింద్రియములను బుద్ధి వివేకములకును, బుద్ధిని అన్నివిషయములలో మాకును లొంగి యుండునటుల చేసికొనగల వాడగును. శరీరమును అదుపులో నుంచు కొను మానవుడు తనను తాను జయించిన వాడగుటయేగాక, ప్రపంచ మును జయించిన వాడగును.

3. ఈ విధముగ నీవు యభివృద్ధి నొందుచు, పైకిపోవ కాంక్షగల వాడవైనచో, నీ యాచరణలన్నియును మిక్కిలి ధీరత్వముతో నారం భించి స్వాపేక్షయందును స్వలాభమును పాటించుచుండు ప్రపంచ విషయముల నెడలను, నీయందు దాగియున్న మితిమీరిన యక్రమ యపే క్షనంతయును వ్రేళ్ళతోడ పెరికివేసి నాశన మొనర్పవలయును. నీయందు నీవు జయింప వలసియున్న దుష్టత్వమంతకును మితిమీరిన స్వప్రేమయే మూలము. ఇట్టిదుర్గుణము నొకమారు జయించి యణగ ద్రొక్కగలుగుదువేని, వెంటనే యమోఘమగు శాంతము చేకూరును

ఐతే మానవులలో కొలదిమంది మాత్రమే తమ్మావహించియున్న యహంకారమును చంపుకొనుటకై ప్రయాసపడిరియెదరు. ఈ కొలది మందిసైతము తమ్ము తాము పరిపూర్ణముగ జయించుటకు ప్రయాసపడు చుండుటలేదు. గనుక వారింకను మోహాములందు దగుల్కొని జ్ఞానమార్గ మున వృద్ధినొందజాలకున్నారు. ఐతే యేమానవుడు ఆత్మ స్వాతంత్ర్యము గలవాడై మాతో ప్రవర్తింప కాంక్షగలవాడై యుండునో, యాతడు తనయందు చెలరేగియున్న యక్రమ యనురాగములన్నిటిని క్రుంగ చేసి, సృష్టివిషయములలో ఐహిక విషయములలో దేనియందును కామ కాంక్షగాని ప్రత్యేకప్రేమగాని లేనివాడై, ప్రపంచ విషయములన్నిటిని వర్జించి యుండగలడు.

---

## సారాంశము

దైవాభిమానమును సంపాదించుకొనుటకుగాను, స్వేచ్ఛాపూర్వకముగ ప్రపంచ విషయములనుండి వేరై యుండవలయును. మనలను మనము పరిత్యజించుకొని దైవధ్యానము, దైవప్రార్థన మొదలగు సాధనల యందు కాలము గడుపుటయే మనముఖ్య ప్రయత్నమై యుండవలయును.

బహిరంగ విషయములయెడల మనమెంతయెక్కువ విసర్జనాభావము గలవారమై యుందుమో, అంతరంగిక యాధ్యాత్మికా సంపాదనయందు అంతయెక్కువ పెంపుగలవారమై యుందుము. ప్రపంచవిషయములయెడల మనకు గల వ్యామోహమునకంతకును స్వప్రేమయే మూలకారణము గాన, ఇట్టిస్వప్రేమనే మనము చంపవలయును,

నిన్ను నీవు ప్రేమించుకొనుట యనెడి దుష్టగుణమును జయించి యణచివేయుదువేని, యితరదుర్గుణము లన్నిటిని మిక్కిలి సులభముగా నాశనమొనరింప గలుగుదువు.

మన పావనగ్రంథకర్త మనకిచ్చెడు ప్రశంసానీయమగు సలహా నియ్యదియే. వీరిసలహాల నుపయోగించుకొని పుణ్యమునందభివృద్ధినొందెదముగాక.

---

## 54. వ అధ్యాయము

### మన స్వభావమునుండియు, దేవయిష్ట ప్రసాదము నుండియు బయలుదేరు విభిన్న ప్రేరేపణలు.

1. యేసునాథస్వామి :- కుమారా, నీ స్వభావమునుండియు మా వర ప్రసాదములనుండియు నీయందేర్పడుచుండెడు ప్రేరేపణలను వివేకుడవై గమనింపుము.

ఏలయనగా ఈ ద్వివిధప్రేరేపణ లొండొంటికి వ్యతిరేక గమనములుగలవై యుండును. వాని గమనము లతిసూక్ష్మములై, సూక్ష్మబుద్ధిచేమాత్రమే తెలిసికొనవచ్చును. వీని వ్యత్యాసమును జ్ఞానవంతుడును ఆంతరంగిక వికాసముగలవాడు మాత్రమే తెలిసికొనగలడు.

మానవులందరు నేదియోయొక మేలునే కోరుచుందురు. గనుక తామాచరించెడు చర్యలయందును తాముచెప్పెడు సంగతులందును యేదియోయొక మంచియున్నట్లే నటించుచుండెదరు. గనుక పెక్కుమంది యీ మంచియనెడు వ్యాజముచే మోసపోవుచున్నారు.

2. ప్రకృతి మిక్కిలి కృత్రిమమైనది. పలుమందిని సత్యమునుండి దూరముగాగొనిపోయి, తానే తన కడగతియని వారుభావించునట్లు చేయుచుండును. దేవయిష్టప్రసాద మన్ననో, నిష్కపటమైనది. దైవానుగ్రహమునందు లేశమైనను దుష్టత్వమును సూచించెడు క్రీనీడయైనను లేదు. మోసకారి కాదు. సమస్తమును దైవప్రీత్యర్థము యాచరింపబడునట్లు లోనరించుచుండును: దేవయిష్ట ప్రసాదముచే ప్రేరేపింపబడు వారలందరును దేవుడే తమ యంత్యగతియని తలంచుచు, వారియందే స్థాపింపబడిన హృదయము గలవారై యుందురు.

3. ప్రకృతి తాను పరులచే హీనపరుపబడి యణచబడియుండుటకును పరులచే జయింపబడి వారికి లొంగియుండుటకును లేక, తానే బుద్ధిపూర్వకముగ నితరులకు విధేయించి పర్తించుటకును ఇష్టపడకున్నది.

దైవయిష్టప్రసాదముచే ప్రేరేరింపబడెడు మానవుడు, స్వనిగ్రహుడై ఇంద్రియసుఖముల నెదిరించి విధేయుడై ప్రవర్తించుటకు శ్రమ

పడుచు, పరులచే జయింపబడుటకు ఆశగలవాడై యుండును. క్రమశిక్ష ణను ప్రేమించుచున్నాడు. ఇతరులపైని యధికారము వహించుటకు ఇష్టపడడు. అధికారమునకు లోనై నిలచుచు, జీవయాత్ర జరుపుకొన వలెనని కోరుకొనుచుండును. దేవునికొరకై వినమ్రుడై మానవులందరికిని విధేయుడై, దీనత్వమును వహించియుండుట కెప్పుడును సంసిద్ధుడయి యుండును.

4. ప్రకృతి యెప్పుడును స్వలాభముకొరకై పాటుపడును. పరుల వలన నెట్టిలాభములను బడయవచ్చునా యని యాలోచించుచుండును. దేవయిష్టప్రసాదము తనకు ప్రయోజనకరము లగునట్టియు, లాభకర ములగునట్టియు విషయములనుగూర్చి తలంచుకొనక, తనవలన నితరుల కుపయోగకరములగు విషయములనుగూర్చి యోచించుచుండును.

5. ప్రకృతికి పరులవలన గౌరవమర్యాదలను పొందుటయనిన సంతోషము. కాని దైవయిష్టప్రసాదము మిక్కిలి విశ్వాసముతో గౌర వమును, ఘనతను దేవునికే యర్పించుచుండును.

6. ప్రకృతి యితరులవలని సిగ్గుతువమానములనిన భీతినొందును. కాని దేవుని వరప్రసాదము జేసునాధస్వామి ఘనతకొరకై పరులవలన పరిభవింపబడుటకు సంతసించును.

7. తన ప్రకృతిస్వభావముచే మానవుడు సోమరియై, సర్వదా శరీర విశ్రాంతియందే ప్రీతిగలవాడగుచుండును. దేవయిష్టప్రసాదముగల మాన వుడెపుడును సోమరియై యుండజాలడు. పాటుపడి పనిచేయుటయన యాతని కమితానందము.

8. మానవుని నైజస్వభావ మెపుడాతనిని మిగుల వింతయగునట్టియు అందమగునట్టియు విషయములకొరకై వెతకునట్లు ప్రోత్సహించుచు, అతిసాధారణమైన విషయముల నెడ నలక్ష్యముగలవాడై యుండునటుల చేయుచుండును. కాని వరప్రసాద ప్రేరితుడగు మానవుడన్ననో సాధా రణమగునట్టి విషయములతోనే తృప్తినొందినవాడై, అల్పవిషయము లను తిరస్కరింపకుండును. పాతగుడ్డపేలికలనే ధరింప యిష్టముగల వాడై యుండును.

9. నైజస్వభావప్రేరితుడగు మానవుడు యశాశ్వత విషయములందు గణ్యతగలవాడై యుండును. ఐహికలాభములందు సంతసముగలవాడగును. నష్టములు సంభవించునపుడు చలించిన మానసముగలవాడై దుఃఖములపాలగును. పరులు తననుగూర్చిపల్కెడు అల్పమగు కీడుమాట లకుసైతము మిక్కిలి కోపోద్రేకు డగుచుండును. ఐతే వరప్రసాదప్రేరితములగు సంకల్పములుగల యాతడు శాశ్వతవిషయములందే నిమగ్నుడయి యుండును. నష్టములు సంప్రాప్తించునప్పుడును చలింపకుండును. పరులు తన్నుగూర్చి కరకుప్రసంగములు చేసినను, యుద్రేకపూరితుడు గాకుండును.

ఏలయనగా అట్టిమానవుడు తన భాగ్యము సంతోషము యీ రెండును నాశనరహితమగు స్వర్గలోకమునందే కలవని భావించుకొనుచు, అట్టి విశ్వాసమునె గలిగియుండును.

10. నైజస్వభావముగల మానవుడు పేరాశ ప్రేరితుడై యుండును. పరులకు తానేదైన నిచ్చుటకన్న, పరులవల తానేదైనను పొందవలయు ననెడి కాంక్షనే యెక్కువగ కలవాడై యుండును. తానే సర్వమును గలిగియుండవలయునను కాంక్షగలవాడై యుండును.

దేవయిష్టప్రసాద ప్రేరితుడు మిక్కిలి త్యాగశీలుడై, కపట హృదయుడుగాక స్వాపేక్షలేనివాడై స్వల్పమాత్రపు విషయములతో తృప్తిగాంచుచు, తాను పరులనుండి యేదియైనను స్వీకరించుటకన్న పరులకు తాను ధర్మముచేయుటయే ఆనందదాయకమని అభిప్రాయ పడును. నైజస్వభావముగల మానవుడు ప్రపంచవిషయములందును తన యెడలను వ్యర్థాడంబరములందును, అక్రమ యనురాగములు గలవాడై దేశద్రిమ్మరివలె పలువిధములుగ తిరుగుచుండును.

11. దేవయిష్ట ప్రసాదాశీర్వాదమును పొందియున్న మానవుడు సృష్టి విషయములను విసర్జించి ప్రపంచ విషయములందు చిక్కుపడక, ఇంద్రియానువర్తియగు భౌతిక శరీరముయొక్క వాంఛల నసహ్యించుకొనుచు, ద్రిమ్మరక పడిమందిలో తలయెత్తుకొని తిరుగుటకు సిగ్గుపడుచు దైవవిషయముల నెడలను, పుణ్యసంపాదనయెడలను మనస్సుగలవాడై అందు కొరకే శ్రమపడుచుండును.

12. నైజస్వభావముగల మానవుడు ఇంద్రియానురాగములను తృప్తిపరచుటకై, బాహ్య విషయములనుండి ఆరుదలను మనస్ఫూర్తిగా స్వీకరించుచుండును. ఐతే దైవవగ ప్రసాదములచే ప్రేరేపింపబడు మానవుడు దేవునినుండియే ఓదార్పులను స్వీకరింపవలయునని శ్రమపడుచు, మహోన్నత యోగ్యరాశియగు దేవునియందే యితర విషయము లన్నిటికన్న నెక్కువ సంతసమును గలిగియుండవలయునని కోరుచున్నాడు.

13. నైజస్వభావముగల మానవుడొనర్చున దంతయును లాభము కొరకును, స్వక్షేమము కొరకును చేయుచుండును. పరులకొరకై యుచితముగ నేదియు నొనరింపడు. ఒకానొకవేళయం దాతడే సత్కార్యముల నాచరించినను, అట్టి కార్యములవలన తనకు సమానమగునట్టియు లేక పరులకు గలుగనున్న లాభముకన్న నెక్కువలాభము నందుగాని శ్లాఘ్యమునందుగాని ఆశగలవాడై చేయుచుండును. తానొనర్చిన కార్యములు చేసిన బహుమానములు మిక్కిలి విలువ గలవని తనను ప్రజలు పొగడవలయునను అక్రమ యాపేక్షగలవాడై యుండును.

దైవప్రేరితసంకల్పములుగల మానవుడెప్పుడును నశింపనున్న విషయములకొరకై వెతుకుకొనుటయందు శ్రమపడక, తానొనరించు సర్వకార్యములకును ప్రతిఫలముగ దేవుని కరుణాప్రసాదమును తప్ప నితరమేమియు వాంచింపక, శాశ్వతానందమును పొందుటకై యీ జీవితమున తాను చేయవలసిన ప్రయత్నముల కవసరమగుదానికన్న నెక్కువగ దేనియందును కాంక్షలేనివాడై యుండును.

14. నైజస్వభావముగలవాడు తనకెక్కువమంది బంధువులును, స్నేహితులును కలరని సంతసించును. తన వంశమునుగూర్చియు వంశపు మర్యాదనుగూర్చియు గర్వించుచు, ప్రగల్భములు కొట్టుకొనుచుండును. తనకన్న నెక్కువ యున్నత యధికారము నందున్నవారలముందు నక్కవినయములు చూపుచు, వారి దయకొరకై ప్రాకులాడుచు, మిగుల నీచముగ ప్రవర్తించుచుండును. భాగ్యవంతులముందు ముఖస్తుతులు చేయుచుండును. తనవంటి నైజస్వభావులను శ్లాఘించుచుండును. ఐతే దైవభక్తుడు తన విరోధులను సైతము ప్రేమించుచు, తనకు పెక్కుమంది స్నేహితులు గలరను గర్వముచే నుబ్బి యుప్పొంగక, మిక్కిలి ఘన

9. నైజస్వభావప్రేరితుడగు మానవుడు యశాశ్వత విషయములందు గణ్యతగలవాడై యుండును. ఐహికలాభములందు సంతసముగలవాడగును. నష్టములు సంభవించునపుడు చలించిన మానసముగలవాడై దుఃఖముల పాలగును. పరులు తననుగూర్చిపల్కెడు అల్పమగు కీడుమాట లకుసైతము మిక్కిలి కోపోద్రేకు డగుచుండును. ఐతే వరప్రసాదప్రేరితములగు సంకల్పములుగల యాతడు శాశ్వతవిషయములందే నిమగ్నుడయి యుండును. నష్టములు సంప్రాప్తించునప్పుడును చలింపకుండును. పరులు తన్నుగూర్చి కరకుప్రసంగములు చేసినను, యుద్రేకపూరితుడు గాకుండును.

ఏలయనగా అట్టిమానవుడు తన భాగ్యము సంతోషము యీ రెండును నాశనరహితమగు స్వర్గలోకమునందే కలవని భావించుకొనుచు, అట్టి విశ్వాసమునె గలిగియుండును.

10. నైజస్వభావముగల మానవుడు పేరాశ ప్రేరితుడై యుండును. పరులకు తానేదైన నిచ్చుటకన్న, పరులవల తానేదైనను పొందవలయు ననెడి కొంక్షనే యెక్కువగ కలవాడై యుండును. తానే సర్వమును గలిగియుండవలయునను కొంక్షగలవాడై యుండును.

దేవయిష్టప్రసాద ప్రేరితుడు మిక్కిలి త్యాగశీలుడై, కపట హృదయుడుగాక స్వాపేక్ష లేనివాడై స్వల్పమాత్రపు విషయములతో తృప్తిగాంచుచు, తాను పరులనుండి యేదియైనను స్వీకరించుటకన్న పరులకు తాను ధర్మముచేయుటయే ఆనందదాయకమని అభిప్రాయ పడును. నైజస్వభావముగల మానవుడు ప్రపంచవిషయములందును తన యెడలను వ్యర్థాడంబరములందును, అక్రమ యనురాగములు గలవాడై దేశద్రిమ్మరివలె పలువిధములుగ తిరుగుచుండును.

11. దేవయిష్ట ప్రసాదాశీర్వాదమును పొందియున్న మానవుడు సృష్టి విషయములను విసర్జించి ప్రపంచ విషయములందు చిక్కుపడక, ఇంద్రియానువర్తియగు భౌతిక శరీరముయొక్క వాంఛల నసహ్యించుకొనుచు, ద్రిమ్మరక పదిమందిలో తలయెత్తుకొని తిరుగుటకు సిగ్గుపడుచు దైవవిషయముల నెడలను, పుణ్యసంపాదనయెడలను మనస్సుగలవాడై అందు కొరకే శ్రమపడుచుండును.

12 నైజస్వభావముగల మానవుడు ఇంద్రియానురాగములను తృప్తి పరచుటకై, బాహ్య విషయములనుండి ఆరుదలను మనస్ఫూర్తిగా స్వీకరించుచుండును. ఐతే దైవవగ ప్రసాదములచే ప్రేరేపింపబడు మానవుడు దేవునినుండియే ఓదార్పులను స్వీకరింపవలయునని శ్రమపడుచు, మహోన్నత సౌభాగ్యరాశియగు దేవునియందే యితర విషయము లందన్నిటికన్న నెక్కువ సంతసమును గలిగియుండవలయునని కోరుచున్నాడు.

13. నైజస్వభావముగల మానవుడొనర్చిన దంతయును లాభము కొరకును, స్వక్షేమము కొరకును చేయుచుండును. పరులకొరకై యుచితముగ నేదియు నొనరింపడు. ఒకానొకవేళయం దాతడే సత్కార్యముల నాచరించినను, అట్టి కార్యములవలన తనకు సమానమగునట్టియు లేక పరులకు గలుగనున్న లాభముకన్న నెక్కువలాభము నందుగాని శ్లాఘ్యము నందుగాని ఆశగలవాడై చేయుచుండును. తానొనర్చిన కార్యములు చేసిన బహుమానములు మిక్కిలి విలువ గలవని తనను ప్రజలు పొగడవలయునను అక్రమ యాపేక్షగలవాడై యుండును.

దైవ ప్రేరితసంకల్పములుగల మానవుడెప్పుడును నశింపనున్న విషయములకొరకై వెతకుకొనుటయందు శ్రమపడక, తానొనరించు సర్వకార్యములకును ప్రతిఫలముగ దేవుని కరుణాప్రసాదమును తప్ప నితరమేమియు వాంఛింపక, శాశ్వతానందమును పొందుటకై యీ జీవితమున తాను చేయవలసిన ప్రయత్నముల కవసరమగుదానికన్న నెక్కువగ దేనియందును కాంక్షలేనివాడై యుండును.

14. నైజస్వభావముగలవాడు తనకెక్కువమంది బంధువులును, స్నేహితులును కలరని సంతసించును. తన వంశమునుగూర్చియు వంశపు మర్యాదనుగూర్చియు గర్వించుచు, ప్రగల్భములు కొట్టుకొనుచుండును. తనకన్న నెక్కువ యున్నత యధికారము నందున్నవారలముందు నక్క వినయములు చూపుచు, వారి దయకొరకై ప్రాకులాడుచు, మిగుల నీచముగ ప్రవర్తించుచుండును. భాగ్యవంతులముందు ముఖస్తుతులు చేయుచుండును. తనవంటి నైజస్వభావులను శ్లాఘించుచుండును. ఐతే దైవభక్తుడు తన విరోధులను సైతము ప్రేమించుచు, తనకు నెక్కువమంది స్నేహితులు గలరను గర్వముచే నుబ్బి యుప్పొంగక, మిక్కిలి ఘన

మగు సుగుణము గలవాడై, తన కుటుంబమునుగాని తనకుటుంబ మర్యాదలుగాని తన జననమునుగాని గొప్పగా పరిగణించుకొనడు; ధనవంతుల కన్న బీదలకు నెక్కువగ సహాయపడును. అధికార పదవియందున్న వారియెడలకన్న అమాయకులందే యెక్కువ దయగలవాడై యుండును. సత్యప్రవర్తనగల వారలనుగాంచి సంతసించుచుండునుగాని, మోసకారులను చూచి మెచ్చుకొనడు.

ఇంక నెక్కువ వరప్రసాదములను పొందుటకును మంచి సుగుణముల నలవరచుకొని, దైవపుత్రుడగు జేసునాథు ననుసరించి ప్రవర్తించుటకు ఉత్సాహము గలవారలగుటకుగాను, యోగ్యవర్తనులను దర్శించి యప్పుడెల్ల వారికి ప్రోత్సాహమును గలిగించుచుండును.

15. నైజమానవుడు బీదరికమును గూర్చియును తనకు సంప్రాప్తించెడు సంకటములను గూర్చియును మొరపెట్టుకొనును. భక్తుడు లేమిడిని నిశ్చలతతో సహించియుండును.

16. లౌకికుడు సర్వమును తనదిగా భావించుచు, తనకొరకుమాత్రము శ్రమపడుచు వాదించుచుండును. భక్తుడు సర్వమునకు మూలాధారుడగు దేవునికే సర్వము నర్పించుచున్నాడు. తా నాచరించియుండు సత్కార్యము తనశక్తి సామర్థ్యములవలన నెరవేరినదని చెప్పుకొనడు. తా నెక్కువ సామర్థ్యము గలవాడనని దురహంకారాభిప్రాయమును గలిగి యుండడు. పరులతో నెప్పుడును వాదప్రతివాదములు పెట్టుకొనడు. ఇతరుల యభిప్రాయములకన్న తన యభిప్రాయములే యంగీకరింపబడవలయునను కోర్కెగలవాడై యుండడు. తన బుద్ధికితోచిన ప్రతి యోచనయందును తన హృదయమునం దేర్పరచుకొనిన ప్రతి యభిప్రాయమునందును నిత్యజ్ఞాన స్వరూపుడగు దేవునికిని, వారి విమర్శనలకును తాను లొంగియుండును.

17. లౌకికమానవుడు రహస్యములను తెలిసికొన గోరుచుండును. వార్తలను వినగోరుచుండును. బాహ్యమున లౌకిక వ్యవహారములందు సౌఖ్యమును కలిగించుకొనుచు, నానావిషయములందు యింద్రియ సుఖానుభవమునం దాశక్తి గలవాడై యుండును. ఇతరులు తననుగూర్చి యెక్కువగ చెప్పుకొన గోరుచుండును. పరులవలని మెప్పులను పొగడ్త

అను చేకూర్పగల కార్యములను చేయనిచ్ఛగలవాడై యుండును. కాని భక్తుడు లోకవార్తలను వింత సమాచారములను వినుటయందు శ్రద్ధ లేనివాడై యుండును. ఏలయనగా ప్రపంచమునం దేదియును శాశ్వతమగు నూతన అంశములేదుగాన, ఇవియన్నియు జన్మపాపఫలితముగా బయలుదేరుచున్నవని యాతడెరుంగును.

అందుచే దైవప్రేరణముచేత నేర్పడు భావములవలన అట్టి మానవుడు ఇంద్రియముల నణచియుంచెడు మార్గమును తెలిసికొని, తనలో తానః పొందెడు వ్యర్థతృప్తిని డంబప్రవర్తనను విసర్జించుటను నేర్చుకొనుచున్నాడు. ఇతరులవలని మెప్పును, పొగడ్తను పొందుటకు తగిన యర్హతగల తన కృత్యములనుగూర్చి పరులలో డంబముగా చెప్పుకొనక, అట్టి విషయములను దీనభావముతో గుప్తముగ నుంచుకొను చుండును.

ప్రతివిషయమునుండియు తనకుగల ప్రతిశాస్త్ర పాండిత్యమునుండియు ఆధ్యాత్మికలాభమును, దేవునికిస్తుతిని, ఘనతను సంపాదించుటకై శ్రమపడుచుండును. తననుగూర్చిగాని, తాను చేయు కార్యములను గూర్చిగాని యితరులు మెచ్చుకొనవలయునని కాంక్ష లేనివాడై యుండును. ఐతే కేవలము ప్రేమచే వరప్రసాదముల ననుగ్రహించుచుండు దేవుడు నుతింపబడునుగాక యని యాతడు కోరుచుండును.

18. ఇట్టి మహిమగల దేవయుష్టప్రసాదము, అస్వాభావికమగు జ్ఞానప్రకాశము దేవుడు మనకొసగు ప్రత్యేకవరము. మోక్షప్రాప్తికి యర్హత గలిగియున్న యోగ్యులగు వారియందు కనుగొనబడు చిహ్నాము. శాశ్వతముక్తిని దయచేయుదుమని దేవుడు మన కనుగ్రహించెడు వాగ్దత్తము.

దేవుని వరప్రసాద మహిమవలన మానవుడు ఐహిక విషయానురాగములనుండి విముక్తుడై, దైవవిషయములం దెక్కువ ప్రేమగలవాడై జ్ఞానఫలము పొందుచున్నాడు.

గనుక మనమెంత యెక్కువగ మన నైజస్వభావము నణగద్రొక్కి, మనకు లొంగినదానినిగా చేసికొనగలమో, అంతయెక్కువగ మనము దేవునివలన వరప్రసాదములను బడయగల్గుదుము.

ఆంతరంగిక పవిత్రతగల మానవుడు తానను భవించుచుండెడు నూతన దైవవరములవలన నానాటికి తన ప్రవర్తనను దేవునిచే చూపఁబడిన మార్గముల ననుసరించి చక్కఁపరచుకొనుచుండును.

---

## సారాంశము

లౌకికమును, పారలౌకికమును చక్కఁగ గ్రహించునటుల నైజమును దేవయిష్టప్రసాదమను రెంటిని, రెండు ప్రత్యేకవ్యక్తులుగా గ్రంథకర్త వర్ణించుచు, వానికి మానవునియందలి కలిగెడు పలువిధములగు మానసిక వికారములన్నిటిని యారోపించుచున్నాడు. అనగా పతన మానవ స్వభావమువలన ప్రేరేపింపబడెడు దుష్టసంకల్పముల ననుసరించి మానవుడు ప్రవర్తించునేని, యాతని కోర్కెలును తలంపులు వాని చర్యలును సర్వమును దుష్టములై యుండును. అట్టిమానవు డాచరించెడు కర్మ లన్నియును అసంపూర్ణమై యుండును. అంతియేగాక యా మానవుడు కామక్రోధాది మనోవికారములకు లొంగి,దుష్కృత్యము లాచరించుచు పాపియగును. దుష్కృత్యము లన్నిటికిని మానవుని నైజస్వభావమే మూలకారణమని చెప్పుచు, వీనినన్నిటిని దానికే యారోపించుచున్నాడు.

ఇందుకు వ్యతిరేకముగ దైవయిష్టప్రసాద ప్రేరితుడగు వ్యక్తి తన సంకల్పముల ననుసరించి ప్రవర్తించునేని, యాతని కోర్కెలును, తలంపులును, యాత డాచరించెడు కర్మలును మిక్కిలియు క్రమమైనవిగ నుండును. ఆ మానవుడు పవిత్రమైన భక్తుడై సర్వసద్గుణ సంపన్నుడగును. వీనినన్నిటికిని సర్వమేలులకును మూలాధార మగు దైవప్రేమకే తా నర్పించు చుండును.

లౌకికుడు పాపమువలన తనయందలి యన్యాయకత్వమును నీతి ప్రవర్తనను కోల్పోయి, తనయందుగల దేవుని యాకారమును కురూపిగా చేసికొనును. జన్మపాపమును నవరించుటకుగాను బయలుదేరిన నూతన ఆదమగు (జేసునాథుడు) మానవునకు తగినంత వరప్రసాదము నను గ్రహించుచున్నారు. అట్టివరప్రసాదముల కనుగుణ్యముగ ప్రవర్తించుచుండునేని, యా వరప్రసాద ఫలితముగ మోక్షము పొందగల్గును.

అర్చ్య. పౌలుగారు నుడివినట్లు మన స్వభావిక న్యాయధర్మరీత్యా పావనత్వమును గలుగజేయు వరప్రసాదముల వలనను, మనయందలి స్వాభావికమగు నైజధర్మమువలనను, మనకలవడియున్న దాతృత్వభావమువల్లను స్పిరితుసాంక్తువు మానవునియొక్క హృదయమున. వాసముచేయుటకు, పూర్వము వానికి మనోవికాసమును సత్ సంకల్పములను కలిగించి, యుత్సాహపూరితునిగ నొనర్చి, ప్రోద్బలపరచుచు తగిన సవరణలను గావించును. ఈరీతిని దోషవిమోచనకొరకై యాతనిని తయారుచేసి క్రమపద్ధతియందుంచును. ఆరంభమునం దనుగ్రహింపబడియున్న సౌమ్యస్థితికి యనుకూలుడగ నున్నటుల తోచునేని, స్పిరితుసాంక్తు జ్ఞానస్నానము వలనగాని పాప సంకీర్తనవలనగాని వానియాత్మలో నైక్యమగును. ఆ మానవునియందు ప్రవేశించి వానిని పవిత్రవంతముగ నొనర్చి వానికి జ్ఞానవికాసమును కలిగించి, సత్ సంకల్ప సంపదగల వానినిగా చేయును.

లౌకికుడు ప్రత్యక్ష పాపమువలన దుర్గుణములును, దురభ్యాసములును, అక్రమ యనురాగములునుగలవాడై యున్నాడు. వాని మానస మెప్పుడు ననేక సంశయములచే కప్పబడియుండును. ఆతని హృదయాపేక్షలన్నియును వినాశన కరములైనవిగ నుండును. కుళ్ళి నశింపనున్న యాతని శరీర భావముచే నాతనియాత్మ పీడింపబడుచుండును. ఇట్టిదుష్ట మానుషత్వమునే నైజస్వభావమని గ్రంథకర్త పిలుచుచున్నాడు.

దైవసేవకుని ముఖ్యవిధి యేమనిన, వానివాని ఫలితములననుసరించి యీ ద్వివిధ జీవిత వ్యత్యాసములను గ్రహించుటయే. ఐతే అన్నిటికన్న నెక్కువగ మిక్కిలి జాగరూకతతో స్పిరితుసాంక్తును సంరక్షించుకొనుచు, దేవుని ప్రతిబింబమును, మానవుని నడతను సవరించి చక్కపరచు స్పిరితుసాంక్తును పోగొట్టుకొనరాదు.

## 55 వ అధ్యాయము

## మానవుని నైజస్వభావముయొక్క దుష్టత్వము, దైవానుగ్రహముయొక్క మహిమ.

1, శిష్యుడు :- నన్ను తమపోలికగా సృజియించిన నా యేలినవారా, పాపకూపమునకును అధోగతికిని నన్నులాగెడు నా దుష్ట నైజగుణమును జయించుటకై, ఘనమైనదనియు నా ముక్తిసంపాదనకు యగత్యమైనదనియు తాము బహిరంగముగ ప్రకటించిన యీ వరప్రాదమును అనుగ్రహింపుడు.

ఏలయనగా పాపనియమము నా మానసపోకడలను నిరోధించుచు, ననేకసందర్భములందు నన్ను భోగాసక్తతకు దాసుడనగునటుల చేయుచున్నదని, యింద్రియానువర్తి యగు నా శరీరస్థితివలన నాకు తెలియవచ్చుచున్నది. దివ్యమగు తమ ప్రసాదముచే నా హృదయము నమోఘముగనింపి నాకు సహాయముచేయ తా మనుగ్రహింపరేని, కామక్రోధాదిమనోవికారములను నేనడ్డగింపజాలను.

2. ఆరంభమునుండియు సర్వదా పాపకార్యములకే నన్ను పురిగొల్పుచున్న నా [illegible]గమును జయించుటకు మీ యనుగ్రహమత్యవసరము.

ఏలయనగా మూలపురుషుడగు ఆదాము పాపముచే భ్రష్టుడై పొందినశాపము మానవులందరిమీదను వ్యాపించియున్నది. అందుచే తమరు మిక్కిలి యోగ్యముగను క్రమమైనదిగను సృష్టిజేసిన మానవప్రకృతిసైతము మిక్కిలిదుష్టమై, బలహీనమైయున్నది. ఏలయనగా దాని స్వభావముచే అది దుర్మార్గమునకు నీడ్చుకొనిపోబడుచు, నధోగతిపాలగుచున్నది.

మిగిలియున్న కొలదిబలము సైతము బూడిదయందు కప్పబడియున్న అగ్నిరవ్వవలెనున్నది. తన కంగీకారముగ నుండున దంతయును నెరవేర్చుటకు తగిన సామర్థ్యములేక, పరిపూర్ణ సత్యవికాశమును తా ననుభవింపకుండినను, న్యాయమగు పరిపూర్ణ హృదయానురాగముగలదై యుండజాలక, యోగ్యతాయోగ్యతలకును, సత్యాసత్యములకును గల

పరస్పర తారతమ్యములను గ్రహింపశక్తిలేక, మానవ స్వాభావిక తత్వము ఒక పొగమంచుచే యావరింపబడి యున్నది,

3. అందుచే ఓదైవమా, నా మనస్సాక్షి బోధించురీతిని తాము నియమించునవన్నియు యోగ్యమైనవనియు, న్యాయమైనవనియు, పవిత్రవంతము లైనవనియును గ్రహించినవాడనై, నేను దూరముగ తొలగిపోవలసిన దుర్మార్గమును పాపమునుగూర్చి నన్ను నేను ఖండించుకొనుచు తమ దివ్యనిర్మాణమునందలి న్యాయమును తలంచుకొని సంతోషపడుచున్నాను. కాని యింకను నాబుద్ధి న్యాయము ననుసరించి ప్రవర్తింపక యింద్రియానురాగములకే లొంగిపోవుచున్నది.

అందుచే సత్కార్యము లాచరింపవలయు ననెడి బుద్ధిగలవాడనై యున్నను, నేనటుల ప్రవర్తించుచుండుట లేదు. (రోమ 7-18) గనుక నేను పలుమారులు సత్కార్యములు చేయవలయునను సంకల్పము చేసికొనుచున్నాను. కాని నేను బలహీనుడ నగుటచే మీ వరప్రసాద సహాయము నాకు లేనందున, స్వల్పయాటంకములు కలిగినను త్రుళ్ళిపడి వెనుకడుగు వేయుచు, నా సంకల్పములన్నిటిని విసర్జించుకొనుచున్నాను.

అందుచే, పరిపూర్ణ జ్ఞానసంపాదనామార్గము నెరిగియున్న వాడనయ్యును, అందుకొరకై నేనాచరింపవలసిన దేదియో విపులముగ గ్రహించుచుండినను, నాయందలి దుష్ప్రవర్తనా భారమువలన క్రుంగిపోయినవాడనై, మిక్కిలి యుత్తమ కార్యములను చేయ సామర్థ్యము లేనివాడనై యున్నాను.

4. నా యేలినవారా, యోగ్యమగు కార్యము నారంభించి సాగించుకొనిపోయి దానిని సానుకూలపరుచుటకు తమ వరప్రసాదము నాకు మిక్కిలి యవసరమై యున్నది. ఏలయనగా తమ వరప్రసాము లేనిది నేనేమియు చేయ సమర్థుడను కాను. ఐతే తమ వరప్రసాదము నాకు బలము ననుగ్రహించునపుడు, మీయందు సర్వకార్యములను నిర్వహింప శక్తిగలవాడనై యుందును.

దైవవరప్రసాదమా, నీ తోడ్పాటులేనిచో మోక్షప్రాప్తికి మేము చేయు కృషియంతయు నిష్ఫలము. సహజమగు మా మానవస్వభావము వలన మాకేమియును ప్రయోజనములేదు.

తమ వరప్రసాదము లేనిదే ఎట్టిశాస్త్రములైనను ఎట్టి సంపదలును ఎట్టి శరీరాలంకారములును శరీరబలమును ఎట్టి చమత్కార బుద్ధియైనను ఎట్టి వాక్పటుత్వమైనను మీ దృష్టిలో నిరర్థకములు.

ఏలయనగా స్వభావ సిద్ధములగు శక్తి సామర్థ్యములు యోగ్యులకును అయోగ్యులకును నేకరీతిగానే నుండును. కాని వరప్రసాదము లేక దైవప్రేమగలిగి జీవించుటగాని, అందు మూలముగ మోక్షానందమును పొందుటగాని సాధ్యము కాదు. మీ దివ్యవరప్రసాదముచే నలంకరింపబడియున్నవారలు శాశ్వత జీవితము ననుభవించుటకు తగు యోగ్యత గలవారలని కొనియాడబడుచున్నారు.

రానున్న విషయములనుగూర్చి ముందుగనే చెప్పజాలెడు దూరదృష్టియు, యద్భుత చర్యలను చేయగలశక్తి సామర్థ్యమును గొప్ప యాలోచన శక్తియును నెంత యుత్కృష్టమైనవైనను, దైవవరప్రసాదము లేకున్నచో నెందుకును కొరగావు. దైవప్రేమ లేకున్నచో కేవలము తమయందలి విశ్వాసమును నమ్మికయును యేలినవారికి యంగీకారములుగ నుండజాలవు.

మహోన్నత భాగ్యమగు దైవవరప్రసాదమా, తెలివిహీనుని సుగుణసంపన్నునిగను, మహోత్కృష్ట పుణ్యశాలిని మిక్కిలి దీనహృదయునిగను, చేయజాలెడుశక్తి నీయందే గలదు. రమ్ము నాయందు ప్రవేశించుము. నా ఆత్మ యలసటచేతను మానసిక నీరసత్వముచేతను సొమ్మసిల్లి మూర్ఛపోకుండునటుల, నీ యూరటతో నన్ను పూర్ణముగ నింపివేయుము.

నాయేలికా, తమ సముఖమునందే మీ యనుగ్రహమును పొందవలయునని తమతో మనవిచేసికొని బ్రతిమలాడుచున్నాను. ఏలయనగా నా నైజతత్వము కాంక్షించెడు విషయములం దొకదానినైనను నేను పొందజాలకున్నను, తమ వరప్రసాదము నాకు చాలును.

నేను విషయానురాగములచే మోహితుడనై అనేక సంకటముల వలన దుఃఖము కలవాడనగుచున్నాను. తమ వరప్రసాదము నాకుండునంతకాలము నేనెట్టి కీడునుగురించి భీతిజెందను. తమ వరప్రసాదమే

నా బలము. శత్రుబలముకన్న తమ వరప్రసాదమే యెక్కువ బలము గలదైయున్నది. జ్ఞానులందరికంటె నెక్కువ జ్ఞానముకలది.

6. తమ వరప్రసాదము సత్యమును బోధించెడు గురువు, క్రమశిక్షణ యందు తర్ఫీదుచేయు నుపాధ్యాయుడు; హృదయ వికాసదాయి; దుఃఖితులగువారికి నోదార్పు: చింతలను తరుమగొట్టుచు, భయమును పటాపంచలు చేయును.

అట్టి తమ వరప్రసాదము నాయందు లేకున్నచో, నేనుచచ్చియుండిన నొకమొద్దును బోలియుందును. నిష్ప్రయోజనమై కాల్చివేయబడుటకుతప్ప నింకెందుకును కొరగాని మొద్దునై యున్నాను. గనుక నా ఏలినవారా, సర్వదా తమ వరప్రసాదము నాయందుండి, నన్నెప్పుడును విడువకుండు నటులును, నేనెప్పుడును సత్కార్యములనే చేయుచుండ వలయునను సంకల్పములు కలవాడనై యుండుటకును నన్ను పురిగొల్పుచుండునటుల జేసునాథునిద్వారా నాకనుగ్రహింపుడు: ఆదాము పాపమువలన అంకురించిన పతన మానవనైజ గుణమువలన పురిగొల్పబడు మనో వికారములతో మేమెప్పుడును పోరాటము సల్పవలసియున్నది. మా యెడల మేమే పావనమగు కౄరత్వమును చూపుకొనుచు, మా దుష్ట సంకల్పములను విసర్జింకొనవలయును. మా నైజదుష్టత్వముపైని జయము సులభముకాదు. మాయంతటమేము లేశమాత్రమైనను దానినిగూర్చి యోచింప జాలకున్నాము. మీ వరప్రసాద ప్రాబల్యమువలన యున్నతిస్థితికి గొనిపోబడకున్నచో, అట్టిజయమును గాంచుటకొక యడుగైనను ముందువేయజాలము.

---

## సారాంశము

అట్టి వరప్రసాదముయొక్క గణనాతీతమగు విలువనుగూర్చియు అపరిత్యాజ్యమగు యావశ్యకతను గూర్చియు ననుభవపూర్వక బోధనమును మన మానసములందు గలిగించుటకుగాను, క్రింది యధ్యాయమునందలి ప్రార్థన శ్లాఘనీయముగ సంధానము చేయబడుచున్నది. స్పిరితుసాంతు దయచేసెడి మిక్కిలి మనోజ్ఞమగు యీవరప్రసాదము కొరకు వేడుకొను

టకై మహోన్నతుడగు దేవుని ప్రార్థించుటకు తగిన ధ్యానశ్లోకమై యున్నది.

దైవప్రసాద యావశ్యకతనుగూర్చి నమ్మకముగలవారు, దాని సాయములేనిది మనమేమియును చేయజాలమనియు, దాని సాయముచే సర్వవిషయములను నిర్వహింప గలమనియు గ్రహించినవారు, దానిని దయచేయుమని విడువక పట్టుదలతో ప్రార్థింపవలయునుకదా !

దేవునికి మనయందుగల దయచే వారు తమ వరప్రసాదమునందేమాత్రము మన కనుగ్రహించినను, అట్టి వరప్రసాదమున కనుగుణ్యముగ ప్రవర్తించెడి వారిహృదయము లోనికి రాజేసుకొనుట కెల్లప్పుడును సిద్ధముగ నుండెదరు.

దైవవరప్రసాదము మనను వెంబడించుచు, సర్వకాలములందును మనయందే నిలచి యుండునటు లనుగ్రహింపుడని వేడుకొనుచు, పైనుదహరించిన యుద్దేశములతో మన ప్రతిదినప్రార్థనను చేయుచుందుము గాక !

## 56. వ అధ్యాయము

### స్వపరిత్యాగ[illegible] స్లీవభారమును వహించి, జేసునాథు ననుసరించి ప్రవర్తించు చుండవలయును.

1. జేసునాథస్వామి:- కుమారా, నిన్ను నీ వెంత యెక్కువగ విసర్జింప గల్గుదువో, అంతయెక్కువగ నీవు మాతో నైక్యము గాగలుగుదువు.

బాహ్యవిషయ విసర్జనవలన శాంతమెటుల చేకూరుచుండునో, అటులనే స్వపరిత్యాగమువలన నాంతరంగికముగ నీవు మాతో నైక్యమయ్యెదవు.

మారుమాట చెప్పక గొణుగుకొనక, మా యిష్టానుసారముగ నిన్ను నీవు విసర్జించుకొనుట యెటులో నీకుబోధింప నెంచుచున్నాము. మేమే ప్రపంచమునకు ప్రాణమై యున్నాము (జాను14-6)

మార్గము లేనిది పోవుట సాధ్యము కాదు. సత్యము లేనిది తెలిసికొనుట యనునది యుండదు. ప్రాణము లేనిది జీవించుటయనునది యుండదు. నీవనుసరించి పోవలసిన మార్గమును మేమే! నీవు విశ్వసింపవలసిన సత్యము మేమే! నీవు పొందవలసిన నిత్య జీవము మేమే. అతిక్రమింపకూడని మార్గము మేమే. అమోఘమైన సత్యము మేమే. అంత్యము లేని జీవము మేమే. సత్యమగు జీవము మేమే. సూటియగు మార్గము మేమే. ఉత్కృష్టమగు సత్యము మేమే. నిత్యమగు జీవము మేమే. మా మార్గము ననుసరించి ప్రవర్తించెదవేని, సత్యమును గ్రహింపగలవు. సత్యము నీకు స్వాతంత్రమొసంగును. నీవు శాశ్వత జీవితమును బడయగలవు. నిత్య జీవమునందు కాంక్షగలవాడవైనచో, దైవ నిబంధనలను పాలింపుము. (మత్తై 19-7)

2. సత్యమును గ్రహింపవలయునను కోర్కెగలవాడవైన, మాయందు నమ్మకముంచుము. నీవు పరిపూర్ణజ్ఞానమును పొందగోరుదువేని, సర్వ పరిత్యాగమొనర్చుము.

నీవు మా శిష్యుడవు కావలయునన్న, స్వపరిత్యాగము గావించుకొనుము. దైవాశీర్వాదము నందగల జీవితమునం దిచ్ఛగల వాడవైనచో, యీ ప్రపంచ జీవితమును పరిత్యజించుము. స్వర్గమునం దెక్కువ భాగ్యమును పొందవలయుననిని, ఈ ప్రపంచమున దైన్యమును వహించియుండుము. మాతో రాజ్యమేలుట కోరింతువేని మమ్ము ననుసరించి నీ శిలువను మోసికొని మా వెంట రమ్ము. ఏలయనగా మ్రానుపైని కొరత వేయబడి సర్వసంకటముల ననుభవించిన మా సేవకుడు మాత్రమే మా మోక్షమార్గమును కనుగొని, సత్యమగు జ్ఞానవికాసమును పొందగలుగును.

3. శిష్యుడు:- జేసుప్రభో, మీరు చూపెడు మార్గము మిక్కిలి సంకుచితమై కష్టపరంపరలచే నిండి, ఇరుకైనదై యున్నది. ప్రపంచ విషయాలోలురగు మానవులకు నిందాస్పదముగ తోచుచున్నది. గనుక స్వామీ లోకనిందలపాలై మిమ్మనుసరించి వెంబడించగలవాడనై యుండునటు లనుగ్రహింపుడు. ఏలయనగా శిష్యుడు తన గురువుకన్న మించినవాడు గాడు. సేవకు డెపుడును తన యజమానుని కన్న గొప్పవాడుగాడు.

తమ సేవకునికి, ముక్తియును పవిత్రతయును యేలినవారి జీవము నందే కలదు. గాన యీ బీదసేవకుడు అట్టి తమ జీవమును గురించి ధ్యానింపగలుగు నట్టుల అనుగ్రహింపుడు.

నేనేమి పఠించినను, వినినను నాకు లవమాత్రమైనియు నుల్లాసము గలుగదు.

4. జేసునాథస్వామి:- కుమారా, నీవిపు డేవిషయములను చదివి గ్రహించితివో, ఆ రీతిని కొనసాగించుదువేని యదృష్టశాలివగుదువు. ఏ మానవుడు మా నిబంధనలను చేకొని వానినన్నిటిని పాటించునో, యాతడే మమ్ము ప్రేమించువాడగును. మేము వానిని ప్రేమింతుము. మేము వానికి మాదర్శనము ననుగ్రహింతుము. (జాను 14-21)

మా తండ్రియొక్క రాజ్యములో మాతో కలిసి యాసీనుడై యుండునట్లు చేయుదుము. (దర్శ 3-21)

5. శిష్యుడు:- స్వామీ, నిశ్చయముగ తామిపుడు నాకిచ్చిన వాగ్దానము ప్రకారమే జరుగునుగాక. అట్టి దివ్యగతికి తగిన యర్హత గలవాడ నగుదునుగాక! శిలువను స్వీకరించినాను. ఇదిగో మీ హస్తములనుండి శిలువను అంగీకరించినాను. మీరు దానిని నాపై పెట్టిన విధముగనే నేను దానిని సహించుదును. మరణమువరకు సహించి మోసెదను.

నిశ్చయముగ యోగ్యుడగు దైవభక్తుని జీవితమంతయును సంకటములతోను, దుఃఖములతోను నిండియుండును. ఐతే ఇట్టి సంకటానుభవమే యాతనిని స్వర్గమునకు గొనిపోవును.

అట్టి సంకటావరణమగు జీవితము నారంభించినాము. తిరుగ వెనుకడుగి వేయుట అనుచితము. ఆ మార్గము ననుసరించిపోక, దానిని విసర్జించుటయు తగదు.

6. సోదరులారా, ధైర్యమును వహింపుడు. మనమందరమును సాగి ముందుకుపోవుదము రండు. రక్షకుడు మనమధ్యనే యుండును.

జేసునాథునికొరకై మనము శిలువను చేకొని యున్నాము. వారి కొరకే మనము దీనిని భద్రపరచుకొనవలయును. వారు మనకు సహాయులై యుండెదరు. వారు మననాయకుడు. వారే మనకు దారిచూపు

వారు. మన ప్రభువు మనముందు సాగిపోవుచున్నారు. వారు మన కొరకై పోరాటము సల్పుదురు.

ధైర్యశాలురవలె మనమందరమును వారి ననుసరించి వెంట పోవుదము రండు. భయముచే నెవ్వరును వణకిపోకుడు. రణరంగమున మిక్కిలి శౌర్యముతో పోరాడి, ప్రాణములు కోల్పోవుటకు సైతము సంసిద్ధులమై యుందుముగాక! జేసునాధుని స్లీవయనెడు ధ్వజమును విడచి పారిపోవుటచే మననీతికి కళంకము తెచ్చిపెట్టుకొనిన వారమయ్యెదము.

---

## సారాంశము

జేసునాధుడు బోధించిన నీతిసూత్రముల నన్నిటిని మన గ్రంధకర్త మిక్కిలి నిపుణతతో సమర్చి యీ యధ్యాయమున కూర్చియున్నారు.

మనము స్వపరిత్యాగము గావించుకొనవలయుననియు, మన యవసానకాలమువరకు జేసునాధునితో గూడ వారివలెనే మనమును స్లీవను మోసికొనిపోవుచు, వారి ననుసరించి ప్రవర్తింపవలయుననియు ఋజువు చేయుటకుగాను మన గ్రంధకర్త వివరణ చేసియున్నాడు.

ఈ నీతిసూత్రములనుగూర్చిన దీర్ఘాలోచనవలన నిత్య సత్యమగు నీతిసూత్రములయందలి ప్రాముఖ్యత నింకను ఎక్కువ బలపడగలదు. సహజముగ మనకు మనమే యేర్పరచుకొనవలసిన యభ్యాసమేమనగా ? ఈ దివ్యవాక్యములను పలుమారు చదువుకొనుచు చదివినవానిని గ్రహించుడు. వానిభావములను మన మానసములందును హృదయములందును ముద్రించుకొనుటకు తగినశ్రమ తీసికొనుచు, యీ నీతిసూత్రముల ననుసరించి, ప్రవర్తింపగలుగునట్టి శక్తినిచ్చు వరప్రసాదమును దయచేయుమని దేవుని ప్రార్థించవలెను. మనము మరణకాలము వరకు మన స్లీవనెత్తుకొని, మన మోక్షమార్గము, శాశ్వతసత్యము, శాశ్వతజీవమునునగు జేసునాధు ననుసరించి, ప్రవర్తించువరమును పొందెదముగాక.

---

## 57. వ అధ్యాయము

### తప్పిదము నొనరించునపుడు మానవుడు అధైర్యపడకూడదు.

1. జేసునాథస్వామి :- కుమారా సంపన్నులై మంచిస్థితియందుండునప్పుడు ఓరిమియును దైవభక్తియును కలిగియుండుటకన్న, దారిద్ర్యమునందుండునపుడు శాంతమును హృదయదీనత్వమును కలిగియుండుటయే మాకు మిక్కిలి సంతోషకరము. పరులెవరైనను నిన్నుగూర్చి కొంచెము వ్యతిరేకముగ మాటలాడిన, నీవేల వ్యాకులపాటు నందెదవు? అంతకన్న నెక్కువగ నిన్నుగూర్చి మాటలాడినను నీవు చింతనొంద తగదు.

గతించిపోయినదానిని పోనిమ్ము. నిన్నుగూర్చి యిటుల వ్యతిరేకముగ మాటలాడుట కిది మొదటిపర్యాయము గాదు. నూతన అంశమును గాదు. నీవు చాలకాలము జీవించుదువేని, యిటుల మాటలాడుటకిది కడపటిపర్యాయమును గాదు.

దుస్థితులు లేనంతకాలము నీవు ధైర్యశాలివిగానే యుందువు. అంతేగాక నీ వితరులకు మంచిసలహాల నీయగలుగుదువు. నీ మాటలచే వారికి ధైర్యమును పురిగొల్పగలుగుదువు. ఐతే నీ వెన్నడును తలంపని సంకటమేదైనను నీ కకస్మాత్తుగ సంఘటిల్లునప్పుడు, నీ సలహాలు నీ ధైర్యములు అదృశ్యమైపోవును. స్వల్పకష్టములందు సైతము నీవు పలుమారు అనుభవించుచున్న నీ బలహీనతను గూర్చి యోచించుకొనుము. ఐతే యిట్టికష్టస్థితులు నీకు పలుమారు సంప్రాప్తించుచుండుటయే నీకు మేలు.

ఇట్టిస్థితులను నీకు సాధ్యమగునంతవరకు నీ హృదయమున ప్రవేశింపనీయకుము. అది నీమానసమున కెక్కినను అందుచే ధైర్యమును వీడకుము. దీర్ఘకాలమువరకు దానియందే చిక్కుబడియుండకుము. నీవీకష్టస్థితిని సంతోషముతో స్వీకరింపజాలనియెడల, తుదకట్టిస్థితిని శాంతముగ సహించినవైన యుండుము. ఆ స్థితిని సహించియుండ నీ కిష్టములేకున్నను, దానియెడల నీలో నీకాగ్రహము కలుగుచుండునటుల నీకు తోచుచుండినను, దానిని నీలో నీవణచివేయుము. దుర్బలమానసులకు చెడ్డనిదర్శ

కము గా నుండెడు యెట్టి హద్దుమీరినమాటను నీ నోటినుండి వెలువడ నీయకుము.

నీయందు రేగుచున్న మనోక్షోభ అచిరకాలముననే యుపశమించును. అంతరంగికముగ నీవనుభవించుచున్న బాధ, దేవునిదయ నీ పైకి తిరుగరాగానే మిక్కిలి మాధుర్యముగ మారిపోవును.

మీరు మాయందు నమ్మకముగవారై మిక్కిలి భక్తితో మమ్ము ప్రార్థింతురేని, యింతకుముందుకన్న నెక్కువ సౌకర్యముల నొసగి మీకు సహాయ పడుటకై మేము సిద్ధముగనున్నాము; అని మనరక్షకుడు వక్కాణించియున్నాడు.

2. నీ మానసమును శాంతముగ నుంచుకొనుము. కష్టములన్నిటి యందును సమభావమును వహించియుండుము. ఇంక నెక్కువకష్టము లను సహించి యుండుటకై ఆయత్తపడియుండుము.

పలుమారులు దుఃఖములు ప్రాప్తించు చున్నవనియును, మిక్కిలి ఘోరశోధనలచే పరిశోధింపబడు చుంటివనియును నీ మానమునకు తట్టి నప్పుడు, నీ కింకేమియును లాభము లేదనియును సర్వమును కోల్పోయితి వనియును చింతింపకుము.

3. నీవు కేవలము మనుష్య మాత్రుడవుగాని, దేవుడవుగావు. నీవు యింద్రియములను వశిర్తియైయున్న దేహాధారివిగాని దేవదూతవుగావు. స్వర్గవాసులగు దేవదూతలయందును, దివ్య యుద్యానవాసులగు ప్రథమ దంపతులయందును సైతము పవిత్రస్థితి కల్మషపడి యుండగా, నీ వెల్లప్పుడును సద్గుణ సంపన్నుడవై యుండగలవని యెటుల తలంచగలవు?

మొరపెట్టు వారినందరిని తిరుగ మంచిస్థితికి లేవనెత్తి, రక్షించు వారము మేమే. తమ దుర్గుణములను గుర్తెరింగినవారల నందరిని మా దైవత్వమునకు గొంపోవువారము మేమే.

4. శిష్యుడు :- నా ప్రభూ, ఇప్పుడు తాము చెప్పిననీతి వాక్యము లెన్నబడుగాక! దేవరవారి వాక్యము జుంటితేనె కన్నను మాధుర్యము కలదై యున్నది.

తమదివ్య బోధలచేనాకు తాము ధైర్యమును పురికొల్పకున్న యెడల, ఇట్టిఘోరసంకటము లందును మనోవేదనముల యందును హృదయ పరితాపము లందును, నేను చేయవలసిన దేమిగలదు ?

ఈ నాజీవయాత్రనుండి మోక్షమనియెడు రేవునకు చేరగలుగు నపుడు, నే ననుభవించిన కష్టములెన్నియైన నేమి ? నాకుమంచి మరణము ననుగ్రహింపుడు. ఈ ప్రపంచమునుండి మంచి జీవయాత్రనుసల్పి, వెడలిపోవునటుల కరుణింపుడు.

నా స్వామీ, నన్నెప్పుడును మరువక, తమరాజ్యమును చేరుటకు సూటియగు రాజమార్గమున నన్ను నడుపుడని ప్రార్థించుచున్నాను.

---

## సారాంశము

మన మాచరించెడు తప్పిదములకును మనయందలి దోషములకును లోకులు మనకు కలిగించు చీకాకులకును మనము ఖిన్నులమైయధైర్యము నొందరాదు. సహజ మానవ స్వభావమునుబట్టి ఇడుములను మన మానసమునందు కష్టముగ నెంచుకొనుట వాస్తవమే, ఐతే దైవప్రేరిత సంకల్పమువలన అట్టిచింతలను యణచివేయుట యావసరము. మనయందారంభమున తలయెత్తెడు ప్రతికూల ప్రాథమిక మనోవికారమును, ఆగ్రహమును, మనము యణచుకొనవలెను.

ఏలయనగా ఒక మాటయైనను, లేక ఆగ్రహచిహ్నమగు అల్పచర్యయైనను మననుండి వెలువడిన యెడల అవి మన మనోదుర్బలమును జూపుచు, యితరమానవులకొక చెడుమాతృకగా నుండును. మనయందలి దోషములనుగూర్చి మిక్కిలి దీనత్వమును వహించి యుండవలయును. కాని వానినితలంచుకొని దుఃఖముచే కలతనొందినహృదయులమైయుండ తగదు. పాపములు మన్నింపబడునను నమ్మకము వదలరాదు. మనము నిష్కల్మషులమై యుండుటకు దేవదూతలముగాము. విషయానురాగములకులోనై మనోవికారములచే నీడ్చుకొని పోవబడుచుండునట్టియు, మాంస రుధిరాదులచే నిర్మింపబడి మిక్కిలి బలహీనమగునట్టియు, దేహధారులమగు మనుష్యమాత్రులము. అందుచే మనము కొన్ని సమయము

లందు పతితులమై పోవుచుందుము. మనము దీనత్వమును వహించియుం డుటకును మనయందు దుష్టత్వమును గ్రహించి యంగీకరించుచు మన దుస్థితులనుండి మనను పైకిలేవనెత్తి రక్షింపగల జేసునాథుని యందు పరిపూర్ణవిశ్వాసము గలవారమై వారి శరణుజొచ్చుటకు మనను పురి గొల్పుకొనుటకై దేవుడు మనకట్టిస్థితులు గలుగ ననుమతించును.

---

## 58 వ అధ్యాయము

## మహోన్నతమగు దైవవిషయములను గూర్చియు, దేవుని న్యాయతీర్మానములనుగూర్చియు, మానవుడు పరిశీలన చేయతగదు.

1. జేసునాథస్వామి :— ఈ మానవుడేల యింత నిర్భాగ్యుడై యున్నాడు? మరియొకడేల యంతమహోన్నత వరప్రసాదములు గలవాడై యున్నాడు? ఈతడేల ఇట్టి దుఃఖములపాలై యున్నాడు. అతడేల యంతయెక్కువ సుఖియైయున్నాడు? అను ఇత్యాదివిషయములనుగూర్చి గోప్యమగు దేవుని న్యాయతీర్మానములపై కుప్కువాదములు చేయకుండుటకై జాగరూకత వహింపుము.

ఈ విషయము లన్నియును మానవున కగోచరములు. దేవుని న్యాయతీర్మానమునందలి రహస్యముల నెట్టి తర్కవాదములచేతను, యెట్టివిచారణా సామర్థ్యములచేతను గ్రహింపజాలవు.

కనుక దైవవిషయములను దైవతీర్మానములను పరిశీలన చేయవలయుననెడి సంకల్పమును నీ గర్భశత్రువగు పిశాచము నీకు కలిగించునపుడు, లేక ఏదొక జిజ్ఞాసాపరుడు అట్టి విషయములను గూర్చి నీతో ప్రస్తావించుట తటస్థించినపుడు, దీర్ఘదర్శితో గలసి ఈరీతిని చెప్పుము. ఓ ప్రభువా, మీరు న్యాయస్వరూపులు, మీ తీర్మానములు న్యాయమైనవి. (కీర్తన 118-28) దేవునితీర్మానములు సత్యమైనవి. నిర్దుష్టములైనవి. మా తీర్మానములనుజూచి మీరు భయపడవలయును గాని వానిని

విమర్శింపతగదు. ఏలయనగా అర్చ్యశిష్టులయందలి యర్హతనుగూర్చి, వారలందరియం దెవ్వరెక్కువ పావనత్వముగలవారని, స్వర్గవాసులయం దెక్కువ యుత్కృష్టులెవరా యని విమర్శనలను గాని, తర్కవాదము లనుగాని చేయకుము.

ఇట్టి పరిశీలనవలనను, వాదప్రతివాదముల వలనను పలుమారులు కలహములును నిష్ప్రయోజనకరములగు తర్కములును బయలుదేరుచు అహంకారమును వృథా యాడంబర శ్లాఘ్యతయందలివాంఛను కలిగించి, వానిని వృద్ధిచేయును.

అందువలనను ఓర్వలేనితనమును కలహములును బయలుదేరును. తర్కవాదములు చేయువారలలో యొకడొక పావనుని ఘనుడని చెప్పగా, మరియొకడు మరియొకరిని ఘనుడని చెప్పుచు, వాదముతో పెనుగులాడుచుండుట తటస్థించును.

కనుక నిట్టి గోప్యమగు విషయములందు కాంక్షగలవారలై వాని నెరుంగగోరుటయు, వానినిగూర్చి పరిశోధింప దలంచుటయు నిష్ప్రయోజనములు. అది మోక్షవాసులకు అసంతృప్తికరముగ నుండును. ఏలయనగా మేము శాంతము నొడగూర్చు దైవముగాని కలహములను పురిగొల్పువారము గాము. మే మనుగ్రహింపనున్న శాంతము, మానవుడు దీనత్వమును వహించుటలోనే నిశ్చయముగ నిమిడియున్నది గాని, తననుగూర్చి పెద్దగా తలచుకొనుటయందు లేదు.

3. కొందరు, కొంతమంది స్వర్గవాసులయెడలను మరికొందరు మరికొందరియెడలను అనురాగము గలవారలై యుందురుగాని, వారు చూపెడి యనురాగము మానవులకు సహజముగనుండు యనురాగమే గాని దైవసంబంధమగు ప్రేమగాదు.

మోక్షవాసుల నందరిని అట్టి పావనస్థితికి తెచ్చినవారము మేమే. వారికి మా వరప్రసాదముల ననుగ్రహించి, మహిమగల వారలనుగా నొనర్చినాము. వారిలో ప్రతి పుణ్యాత్ముని యోగ్యతలను మే మెరిగియే యున్నాము. మా వరప్రసాద మాధుర్యమును వారికిచూపి, వారు దుస్థితులందు పునఃప్రవేశము కాకుండునటుల చేసి కాపాడినాము. సృష్టి యారంభముననే మాకు ప్రియులగు వారినందరిని మే మెరుగుదుము.

తదితర మానవులనుండి వారిని మేము ప్రత్యేకించి యెన్నుకొని యున్నాము; మొందుగా వారు మమ్ము ఎన్నుకొని యుండలేదు.

వారలకు మా వరప్రసాదముల ననుగ్రహించి, మా సముఖమునకు రండని పిలిచి, వారియెడల దయార్ద్రహృదయులమై మా సముఖమునకు రప్పించికొనియున్నాము. పలువిధములగు శోధనలందు వారిని మేము సురక్షితముగ నడపియున్నాము. వారిని అమోఘముగ నాదరించి సౌకర్యముల నొసగియున్నాము. పట్టుదల గలవారలై యుండునటుల తోడ్పడినాము. వారిశాంతమునకు తగిన ఫలమును తుదకు దయ చేసినాము.

4. పరిశుద్ధులలో ప్రథములెవరైనది అధములెవరైనది, మాకెరుకయె. వారినందరిని గాఢముగ ప్రేమతో యాలింగన మొనర్చుకొనియెదము. వారలందరియందును యెక్కువగా శ్లాఘింపబడువారము మేమె. అన్ని వస్తువులకన్న నెక్కువగ నుతింపబడవలసిన వారమును మేమే.

ఈ పుణ్యపురుషులకందరకు పూర్వము నెట్టియోగ్యతలును లేకున్నను, వారిని పొగడ్తకుతగిన యున్నతస్థితికి తీసికొనివచ్చి, శాశ్వతులై యుండువారలనుగా యేరుకొనియున్నాము. గాన వారందరియందును మేమెక్కువ గౌరవింపబడవలసిన వారమై యున్నాము.

గనుక మా సముఖమందున్న అర్చ్యశిష్టులలో కడాపటి వానిని సైతము యేమానవుడు ద్వేషించునో, యాతడు అర్చ్యశిష్టులలో ఘనులగువారిని సైతము గౌరవింపనివాడగుచున్నాడు.

అర్చ్యశిష్టులందెవ్వరినైనను ఏదొకడు అగౌరవపరచి యవమానపరచుచు నీచపు మాటలు పల్కువయెడల, అట్టివాడు మమ్మును, స్వర్గలోకమునందున్న యితర అర్చ్యశిష్టులను యగౌరవపరచినవాడగుచున్నాడు.

ప్రేమబంధముచే వారందరును యేకమై యున్నారు. వారందరు నొకేవిధమగు సంకల్పములను యభిప్రాయములను కలవారలై, యొకే కోర్కెగలవారలై యున్నారు. వారందరు నొండొరులయెడ పవిత్రప్రేమతో బంధించబడి యున్నారు.

5. వీనియన్నిటికన్న మిక్కిలి యుత్కృష్టమగు విషయ మేమన వారు తమ్ము తాము ప్రేమించుకొనుటకంటె మా యందెక్కువ ప్రేమాబద్ధులై యుండెదరు. ఏలయనగా వారు తమను తాము మించినవారలై తమ స్వప్రేమను విసర్జించి, మాయందలి పరిపూర్ణ ప్రేమాలాలసులై మాయం దైక్యమై యున్నారు. అట్టి అఖండ ప్రేమయందే వారు శాశ్వతానందము ననుభవించుచు, విశ్రమించుచున్నారు.

అర్చ్యశిష్టులను మానుండి వేరుపరుప జాలునదేదియును లేదు. వారిని యధైర్యరపచి చిన్నబుచ్చ జాలునవియు లేవు. ఏలయనగా శాశ్వత సత్యముచే వారు పరిపూర్ణులై యుండుటచే ఇతరు లెవ్వరును చల్లార్చుటకు శక్యముగాని దివ్య ప్రేమాగ్నిచే ప్రజ్వరిల్లు చుండెదరు.

గనుక ఐహిక విషయాసక్తులై, యింద్రియ సుఖనిమగ్నులై, కేవలము పశువాంఛా పరవశులై, తమ సంతృప్తియందుమాత్రమే ప్రేమగవారలై, ప్రేమించుటయన్న నేమియో యెరుంగని మానవులు అర్చ్యశిష్టులనుగూర్చి వాదింపక మౌనముగ నుందురుగాక.

అట్టి మానవులు తమ యిచ్ఛానుసారముగ అర్చ్యశిష్టుల యోగ్యతలనుగూర్చి ఘనముగనో నీచముగనో మాటలాడెదరు గాని, నిత్య సత్య స్వరూపుడగు దేవునికి ప్రీతికరముగ నుండునటుల మాటలాడజాలరు.

6. వారలలో ననేకమంది యమాయకులై యిటుల మాటలాడెదరు. అందును ముఖ్యముగ, లేశమాత్రపు జ్ఞానవికాశము గలిగి, పరిపూర్ణ యాధ్యాత్మికా ప్రేమతో నెవ్వరిని ప్రేమింప నెరుగని మానవు లిటుల మాటలాడుచుండెదరు.

ఐతే వీరలు స్వభావ సిద్ధమగు ననురాగము వల్లను, సహజముగ మానవుల కొండొరుల యందుండు స్నేహభావము వల్లను అర్చ్యశిష్టులలో కొంతమంది యెడల ప్రేమగలవారలై యుందురు.

ఐహిక విషయములను గూర్చి వారెట్టి హృదయభావములను గలిగి యుందురో, స్వర్గవిషయములను గూర్చియును నట్టిభావములే గలవారలై యుందురు.

పరిపూర్ణజ్ఞాన వికాసములేని యజ్ఞానులగు వారి భ్రమాకల్పితము లగు తలంపులకును, పరిపూర్ణజ్ఞానులై దైవసహాయముచే యోచించువారి భావములకును, అపారమగు వ్యత్యాసముగలదు.

7. కావున కుమారా, నీ శాస్త్రజ్ఞానమున కగోచరమగు నిగూఢవిషయములను గూర్చి జిజ్ఞాసాపరుడవై యుండక, జాగరూకుడవై యుండుము. అయితే నీవు కడపటి వాడవుగా నుండుట తటస్థించినను, స్వర్గప్రాప్తికొరకు పాత్రులగు వారలలో నీవు నొకనిగ గణింపబడ గోరితి వేని, అందుకొరకై ప్రయత్నము చేయుటయే నీపనిగా పెట్టుకొనుము.

దేవుని రాజ్యమందు నెక్కువ పవిత్రులెవరు, యెక్కువ ఘను లెవరను విషయము నేదొకడు గ్రహింప గలిగినను, అట్టిజ్ఞానమువలన తాను దీనత్వమును వహించి, మిక్కిలి భయభక్తులతో మమ్ము శ్లాఘింపని యెడల యాతనికి గలుగు ప్రయోజనమేమి? ఇట్టి తర్కవాదములు చేయుటకన్న మానవుడు తానాచరించిన పాపకృత్యములనుగూర్చి దుఃఖించుచు, సుగుణముల నలవరచుకొనుటయందు లేశమాత్రమైనను వృద్ధిగాంచ కుండుటను జూచి చింతించుచు, తానెంత హీనస్థితిలో నున్నాడను అంశములనుగూర్చి యోచించుకొనుట దేవునికి ప్రీతికరము, తనకు ప్రయోజనకరము.

అర్చ్యశిష్టులకు సంబంధించిన రహస్యములనుగూర్చి వ్యర్థముగ పరిశోధన గావించుటకన్న, కన్నీరుగార్చుచు భక్తిపూర్వకమగు ప్రార్థన మూలమున వారలను వేడుకొనుచు, మిక్కిలి దీనత్వముతో దివ్యమహిమ గలవారి సహాయముకొరకై వారిని బ్రతిమిలాడు కొనుటయే మిక్కిలి యుత్తమమగు కార్యము.

8. అర్చ్యశిష్టులందరును సుఖులైయున్నారు. మానవులు తమ్ము ప్రసంగములను విసర్జించి సంతుష్టులై యుండగలుగుదురేని, అర్చ్యశిష్టుల కది మిగుల సంతృప్తినిచ్చును. వారు తమ యోగ్యతలనుగూర్చి తమ్ము తాము పొగడుకొనరు. అదియుంతయు దేవుని కర్పించెదరు. ఏలయనగా మా యపారమగు కరుణచే మేమే వారికా యోగ్యతలన్నియు ననుగ్రహించి యున్నాము.

దేవునియెడల వారమితప్రేమ గలవారై యమితానంద తరంగము లపై తేలియాడు చున్నారు. అందుచే వారిమహిమ కేమియును లోటు లేదు. వారిసౌఖ్యమునకు తరుగులేదు. వారెంతయెక్కువ మహిమాతిశయములు గలవారై యున్నారో, అంత హృదయదీనత్వమును వహించి మాకు మిక్కిలి చేరువయందుండి మావలన నెక్కువగ ప్రేమింపబడుచున్నారు.

అందుచే వారు తమ కిరీటములనుతీసి సింహాసనమునకు ముందుంచి సింహాసనాసీనులపై యున్న ఆది అంత్యము లేని మమ్ము పూజించుచున్నారు.

9. దేవుని రాజ్యమందు మిక్కిలి ఘను డెవరని, పెక్కుమంది పరిశోధనలు చేయుదురు. ఇట్టి పరిశోధకులు స్వర్గమునందుండు కడాపటివారలతో సైతము సరితూగ గలరాయను అంశమును గుర్తెరుగ జాలకున్నారు.

స్వర్గమునం దందరు నుత్కృష్టులే. అట్టివారలలో కడాపటివాడై యుండుటయు నొకగొప్ప విషయమే. ఏలయనగా అచటనుండు వారలందరును దేవుని బిడ్డలనియే పిలువబడుదురు. అందరును దేవుని సంతానమే. స్వర్గమునందు కడాపటి అగ్ర్యశిష్టుడును ఎంతో గొప్పస్థితియందుండును. కాని నూరు వత్సరములు జీవించినను పాపియే మరణించును.

ఏలయనగా స్వర్గలోకమునం దందరికన్న గొప్పవా రెవరని శిష్యులు ప్రశ్నించునపుడు వారికీ క్రింద నుదహరింపబడిన ప్రత్యుత్తర మీయబడినది.

హృదయములను మార్చుకొని, పసిబిడ్డలవలె దీనత్వము వహించి యుండనియెడల, మీరు స్వర్గలోకమున ప్రవేశింపజాలరు. చిన్నబిడ్డలవలె నెవ్వడు దీనహృదయుడై యుండునో, యాతడే స్వర్గలోకమున నందరికన్న నెక్కువయోగ్యుడు (మత్తే. 18. 1.3.4)

10. చిన్నపాపలవలె దీనత్వమును వహించియుండుట నే మానవులు నీచముగా నెంచుదురో, వారనర్థకముల పాలయ్యెదరు. ఏలయనగా స్వర్గద్వారము అట్టివారలను లోనికి రానీయదు.

ప్రపంచవిషయములందే నెక్కువ సౌకర్యములను కలిగియుండు సంపన్నులు దురదృష్టులే, ఏలయనగా నిరుపేదలు స్వర్గలోకమున ప్రవేశింపగలుగుచుండగా, ప్రపంచసౌఖ్యముల ననుభవించుచుండు సంపన్నులు వెలుపల ప్రలాపించుచు నిలిచియుండెదరు.

దీనత్వమును వహించియుండు మానవులారా ! ఆనందముగానుండుడు. బీదతనమునచే గ్రుక్కిపోవుచున్న పేదలారా! సంతోషముగానుండుడు. ఏలయనగా మీరు సత్యమార్గవర్తనులగుదురేని, స్వర్గలోకమంతయు మీ సొత్తైయుండును.

## సారాంశము

జీవుని యుద్దేశ్యములను, శాశ్వత న్యాయతీర్మానములను దైవమహిమలయొక్క గూఢార్థమును గ్రహింపగల శక్తిసామర్థ్యములు మనకు లేవు. ఈ సందర్భమున మనమేమియు నెఱుగని యమాయకులమైయుండు స్థితియందే యుండవలయునని దేవుని యభిమతమైయున్నది. కావున అట్టిస్థితియందుండుటయే మనకు మిక్కిలి ప్రయోజనకరము.

కనుక నీ విషయములగూర్చి తర్కవాదములు చేయుటయు, లేక పరిశోధనలలోనికి దిగవలయునని కోరుటయు అక్రమ జిజ్ఞాసయైయున్నది. దైవనిర్మాణము లన్నిటిని పూజింతుముగాక.

స్వర్గమునందు మహోన్నతపదవి నలంకరించినవా రెవరని చింతింపక, అచ్చట మనకును తావు సంపాదించుకొనుటకై తగు పాటుబడుదముగాక.

## 59 వ అధ్యాయము.

## మన యాశను నమ్మకమును దేవునియందే నిలిపియుంచుకొనవలయును.

1. శిష్యుడు:- ప్రభూ, ఈ ప్రపంచజీవితమునందు నాకుగల నమ్మకమేమి? ఈ ప్రపంచమునందు గోచరమగుచుండు సర్వవిషయములలో

దేనినుండి నా కెక్కువ ఆదరణల లభించును? దైవమా, లెక్కించతగము గాని కరుణావరప్రసాదముల ననుగ్రహించు తమయందు గాక మరెవ్వరి యందు నమ్మక ముంచగలను? తమవలన గాక మరెవ్వరినుండి నేను సౌకర్యములను బడయజాలుదును? తాము లేనిది నే నెటుల సుఖినై యుండగలను? తాము నా యండనైయుండగా నేను కష్టముల ననుభవించినది లేదు.

తమనుకోల్పోయి సంపన్నుడనై యుండుటకన్న, తమకొరకై నిరుపేదనై యుండవలయుననియే నేను కోరుకొనుచున్నాను. తాము లేనిది స్వర్గసౌఖ్యము ననుభవించుటకన్న, తమతో గూడ నీ ప్రపంచమున పరదేశీయునివలె, యాత్రికునివలె నుండుటయే నాకు ప్రియము.

తామెచ్చట వెలసియుందురో నచ్చటనే స్వర్గముగలదు. తామెచ్చటనుండరో యా స్థలమున మరణము, నరకము తప్ప మరేమియు నుండబోదు.

దేవరవారియందే చిరకాలమునుండి ఆశపెట్టుకొని యున్నాను. తమకొరకై నేను నిట్టూర్పులు విడచుచు, రోదనముచేయుచు, తమను ప్రార్థింప వలసినవాడనై యున్నాను.

నా దైవమా, నా కవసరమగునవన్నియు సకాలములో నిత్తురని నాకు కావలసిన సహాయముకొరకు తమయందు నా పరిపూర్ణనమ్మకము నుంచుచున్నాను.

తమరే నా యాశరైయున్నారు. నాకు ఓదార్పులను దయచేయువారును తమరే.

2. మానవులెప్పుడును తమ స్వలాభమునే పాటింతురు. దేవరవారు నా ముక్తిని, నా శ్రేయమునుమాత్రమే తమ గురియందుంచుకొని, అన్ని సందర్భములును నా కనుకూలముగ నుండునటుల అనుగ్రహించుచున్నారు.

పలువిధములగు మోహములందు చిక్కుకొనునటుల జేసినను, పలు దుర్దశలందు పడవేయుచుండినను, ఇదియంతయు నా మేలుకొరకే తామొనరించియుండిరి.

తమకు ప్రియులగువారి నందరిని పరిపరి విధములుగ పరిశోధింప వలయునను కోరికగలవారగుటచే, తా మటుల చేయ ననుగ్రహించు చున్నారు. నాకు తాము పరిపూర్ణ స్వర్గసౌఖ్యముల ననుగ్రహించు నపుడు, తమను నే నెటుల ప్రేమించి కొనియాడవలయునో, యటులనే, తాము నన్ను పరిశోధించునపుడును నేను తమను ప్రేమించుచు కొనియాడుదును.

3. గనుక నా దైవమా! నా యాశయంతయును తమ సేవయందే పెట్టుకొనియున్నాను. నేను తమనే యాశ్రయించుచున్నాను. నా సంకటములలోను నా మనోక్షోభలందును తమకే మనవిచేసికొనుచు న్నాను.

ఏలయనగా తాముగాక, ఇతరులందరును దోషపూరితులై యస్థిరులై కనుపించుచున్నారు. తమరే నాకుతోడ్పడి సాయముచేసి బలమునుచే కూర్చి, నీతిసూత్రముల నుపదేశించి నన్ను కాపాడనియెడల, నా స్నేహ బృందమునుండి నాకేమియును లాభములేదు. బలమగువార లుండియును సాయము చేయజాలరు. వివేకవంతులుండియును నాకు ఉపయోగకరమగు సలహాల నీయజాలరు.

ఉద్దండ పండితులచే రచింపబడిన సద్గ్రంథముల వలనను నాకేమియును ఆదరువల చేకూరదు. నన్నెట్టి సంపదయు సంరక్షింపజాలదు. రహస్యమగు నట్టియు రమ్యమగునట్టియు ప్రదేశమేదియును నన్ను కాపాడజాలదు.

4. మా శాంతము కొరకును సౌఖ్యము కొరకును యుపయోగకరము లుగ నుండునటుల తోచువిషయము లన్నియును తమరు లేనియెడల నెందుకును కొరగావు. శూన్యములని తోచుచుండుటయేగాక మా సౌఖ్యముకొరకు లేశమాత్రమును తోడ్పడజాలవు.

అందువలన దేవరవారే మాకు సర్వమేలులకును మూలాధారమగు చలమను బోలియున్నారు. తామె మాజీవితము యొక్క యౌన్నత్యము. తామే అత్యున్నతమగు జ్ఞానస్వరూపులు, అన్నిటికన్న తమ యందే మానమ్మకము గలిగి యుండుట తమసేవకుల యమోఘమగు సౌకర్యము.

స్వామీ నాదృష్టి తమయందే నిలుపుకొని యున్నాను. వరప్రసాదముల దాతా, తమయందే నా నమ్మకము కలవాడనై యున్నాను. నా ఆత్మయె తమ దివ్యనిలయమగుటకును శాశ్వతమగు తమ మహిమా పీఠమగుటకును యాశీర్వాదములచే దానిని దీవించి పావనమొనర్పుము.

రాజ్య ప్రతాపమును వహించియున్న తమ దివ్యనేత్రములకు కోపము కలిగించెడు విషయమేదియును తమ మహిమా దేవాలయమున లేకుండునటు లనుగ్రహింపుడు. తమ యోగ్యాతా మహిమకు తమ యాధిక్యతకు తగినటుల నన్నానరింపుడు.

మరణచ్ఛాయచే కప్పబడియున్న ప్రదేశములలో దేవర వారికి చాలదూరమున దేశభ్రష్టునివలె గ్రుమ్మరుచున్న తమ యీ బీద సేవకునియొక్క ప్రార్థనలను చెవియొగ్గి యాలకింపుడు. నశింపనున్న యీ జీవితమునం దనేక యాపదలమధ్య చిక్కుబడియున్న తమ బీద సేవకుని యాత్మను కాపాడి రక్షింపుడు.

తమ దివ్యవరప్రసాద సహితముగ శాశ్వతప్రకాశముగల తమ రాజ్యమునకు శాంతమార్గమున మీ బీదసేవకుని నడుపుకొని పొండని పార్థించుచున్నాను.

---

## సారాంశము

ఆంతరంగిక లేక బాహ్య విమర్శనల వలనను మనము దుఃఖింపవలసి వచ్చినపుడు దేవుని శరణు జొచ్చుదముగాక. వారుమాత్రమే మనకు సాయమొనర్చ గల్గుదురను విశ్వాసముతో ప్రార్థింతుముగాక.

దేవుని యనుమతి లేనిది యెట్టి మోహములు గాని పరిశోధనలు గాని సంకటములుగాని మనకు సంప్రాప్తింపవు. అదియునుగాక మన శక్తికిమించిన పరిశోధనలందు వారెప్పుడును మనలను చిక్కుపరుచరు. ఈ జీవితమున మన మనుభవింపవలయునని వారెట్టిపరిశోధనలను మనకై నిర్మాణము చేసియున్నను, అవి యన్నియును మన పావనత్వము కొరకై యేర్పాటు చేయబడి యున్నవి. మిక్కిలి పట్టుదలతో దైవసహాయముతో నట్టి పరిశోధనలన్నిటిని జయించి తీరవలయును.

---



# క్రీస్తునాథుని అనుసరణము

## 4 వ భాగము

### జేసునాథుని పిలుపు

"కష్టపడుచు భారముచే కృంగియున్న మానవులారా! నాయొద్దకు రండు. మీ నేదదీర్చి బలము ననుగ్రహింతును." (మత్తే 11:28)

"నేను ఇయ్య దలచెడు అప్పము ప్రపంచ జీవనము కొరకై యొసంగెడు నా మాంసమై యున్నది." (జాను 6:52)

"మీరు దీనిని స్వీకరించి, భుజింపుడు. ఇది నా శరీరము. ఇది మీ కొరకై యర్పింపబడుచున్నది. నా జ్ఞాపకార్థము మీరు దీనిని చేయుడు." (1 కొరిం 11:24)

"నా మాంసమును భుజించి, నా రక్తమును పానముచేయు మానవుడు నాయందును నేను వానియందును వాసముచేసెదము." (జాను 6-57)

"నేను చెప్పుచున్న విషయములే జ్ఞానము. అవి జీవమునై యున్నవి." (జాను 6:64)

---

## 1 వ అధ్యాయము.

### దివ్య సత్ప్రసాదమును మనము భయభక్తులతో స్వీకరింపవలెను.

1. శిష్యుడు :- నిత్య సత్య స్వరూపుడవగు స్వామీ! పై వాక్యములన్నియు తామొకేమారు పలుకకున్నను, ఒకే స్థలమునందు లిఖింపబడకున్నను, ఆవాక్యములన్నియు తాము పల్కినవే గదా! అవి తమ

సత్యవాక్యములగుటచేతను ఆవాక్యముల నన్నిటిని కృతజ్ఞతా పూర్వకముగను, విశ్వాసముతోడను, స్వీకరింప వలసిన వాడనై యున్నాను. ఈవాక్యములను నాముక్తికొరకై తాము వచించియున్నారు గాన, యవి నాస్వంతమై యున్నవి. ఈవాక్యములను తిరుగ విడదీయబడుటకు వీలు లేనటుల నాహృదయమునందు నాటబడునట్లు తమ దివ్య వాక్కులను నేను సంతోషముతో స్వీకరించు చున్నాను. ఇంత మధురమై, కోమలమునై, ప్రేమ పూరితమగునట్టి తమదివ్య వాక్కులు, నాకు ధైర్యమును పురికొల్పుచున్నవి గాని, నేజేసిన పాపములన్నియును నన్ను భీతిల్లజేయుచున్నవి. అయితే కలుషపడియున్న నా మనస్సాక్షి, యట్టి యగోచరమగు దైవరహస్యముల దరికి పోకుండ నన్ను నడ్డగించుచు వెనుకకు లాగుచున్నది. తమ వాక్యముల మాధుర్యము నన్ను తమ సముఖమునకు రమ్మని యాహ్వానించుచున్నది. కాని నేనాచరించియున్న పెక్కు దుష్కృత్యములు నన్నణచి వేయుచున్నవి.

2. నేను తమతోడ భాగస్తుడనై యుండగోరునెడల, శాశ్వత జీవమును, నిత్యానందమును కాంక్షించునెడల, యమృతత్వము నొసంగెడు భోజనమును స్వీకరించి, భుజించుటకు నమ్రకముతో తమ సన్నిధికి రావలసినదని నన్ను తామాజ్ఞాపించుచున్నారు.

"మిక్కిలి భారమును మోయుచు శ్రమపడుచున్న మానవులారా! మీరందరు మాచెంతకురండు. మేము మీకు సేదదీర్చి మరల బలమును చేకూర్తు"మని తాము చెప్పుచున్నారు. పావనమగు తమదివ్య శరీరమును సత్ప్రసాదమూలమున భుజియింపరమ్మని, పాపిని, కడు బీదనైన నన్ను పిలుచుచున్నారు. ఓ నాదైవమా! నా ప్రభువా నా పాపకర్ణములకీ వాక్యములెంత యమృతతుల్యములై యున్నవి!

1. ఓ దేవా! మీ సన్నిధికి రాసాహసించుటకు నేనేంతటివాడను? ఉత్కృష్టమగు స్వర్గమహా మండలము సైతము తమను నిముడ్చుకొన జాలకున్నది. అయినను "మీరందరును మాసముఖమునకు రండ"ని తాము మమ్మందరిని పిలచుచున్నారు.

2. మమ్మింత ప్రేమపూర్వకముగ తామాహ్వానించుటకు హేతువేమి? తగిన సత్కార్యములేవియు నేను జేసినవాడను కానని నాకు

చక్కఁగా తెలియును. అట్టి నేను తమ సముఖమునకు వచ్చుట కెటుల సాహసింతును?

3. మహా కనికర హృదయులగు మిమ్మును పాపములచే నొప్పించిన నేను, నా హృదయమున తమ్మునెట్లు ప్రవేశపెట్టు కొనగలను? దేవదూతలును, అతిదూతలు సైతము, తమ సముఖమున భయభక్తులతో నిలచియుందురు. న్యాయప్రవర్తనులగు అర్చ్యశిష్టులు సైతము తమను గాంచి భయపడెదరు. అయినను "అందరు మాదగ్గరకురండు" అని తాము చెప్పుచున్నారు. ఓ మా ఏలినవారా! యీ వాక్యమును తామే వక్కాణించియుండని యెడల, అది సత్యవాక్కని యెవరు విశ్వసింపగలరు? ఇత్యాది తమ యాజ్ఞయే కానిచో, తమ సముఖమున కేతెంచుట కెవ్వరు సాహసించెదరు?

4. న్యాయప్రవర్తనుఁడగు నోయుఁడు తాను మఱికొందరితో తన్ను రక్షించుకొనుటకుగాను యొక నావను నిర్మాణముచేయుటకు నూరు సంవత్సరములు శ్రమపడి యుండెను. ప్రపంచసృష్టి కర్తయగు దేవుని భయాభక్తులతో గూడిన మర్యాదతో నాలో ప్రవేశపెట్టు కొనుటకు తగురీతిని యొక స్వల్పకాలములో నేనెటుల తయారు కాగలను? తమ సేవకుడును, తమ ముఖ్య స్నేహితుడునగు మోయీజు తమ నిబంధనములు లిఖింపబడియున్న పలకలను, జాగరూకతతో పదిలపరచియుండుటకు నశింపని కట్టెతో యొక పేటికను తయారుచేసి, దానిని నిష్కల్మషమగు మేలిమి బంగారముతో కప్పియుంచెను. నీచుడనైన నేను, చట్టనిర్మాణకర్తయును, విశ్వమునకు జీవ ప్రదాతయునగు, తమ్ము నింత సులభముగ నాయందు ప్రవేశపెట్టుకొన ఎటులాసింపగలను. ఇస్రాయేలు రాజులందరియందు నెక్కువ జ్ఞానవంతుడగు సలోమోనుడు తమ దివ్యనామ స్తోత్రమునకై దేదీప్యమానమగు దేవాలయమును నిర్మించుటకు యేడు సంవత్సరముల కాలమును వినియోగించియున్నాడు. ఆ దేవాలయమును తమకు సమర్పణచేయుటకై ప్రతిష్ఠోత్సవమును యెనిమిది దినములు జరిపియున్నాడు. ఈ యుత్సవ సందర్భమున శాంతికొఱకై వేయి బలులను సమర్పించియున్నాడు. ఒడంబడికా మందసమును, దానికొఱకై ప్రత్యేకింపబడిన స్థలమున, బాకా నాదములతో, మిక్కిలి యుత్సాహముతో పండుగ జరిపి, పవిత్రవంతమగు

రీతిని స్థాపించియున్నాడు. నేను మానవులందరియందును మిక్కిలి నికృష్టమగు అధముడను. నీచమగు పాపిని. అరగంట కాలమైనను తమ యందు భక్తినిలిపియుండ గలవాడను గాకున్నాను. ఒకప్పుడైనను, యీ అరగంటకాలము నెటుల వినియోగింపవలసి యుండెనో, అటుల భక్తియుందు వినియోగించి యుండినచో, దైవాశీర్వాదమునుపొంది, యదృష్టవంతుడనై యుండెడివాడను గదా!

5. ఓ నా స్వామీ! తమ ప్రీతికొరకై వారలెంత ఘనవాక్యముల నాచరింప ప్రయత్నములు చేసియుండిరి! అయ్యో నేచేయు ప్రయత్నములు యెంత స్వల్పమైయున్నవి. తమ్మును స్వీకరించుటకు సిద్ధపడుటకుగాను నేను యెంత స్వల్పకాలమును మాత్రము వినయోగించుచున్నాను. అరుదుగ నిట్టి దివ్యవిషయమును గూర్చి యాంతరంగికముగ చింతించుచున్నాను. అంతకన్న మిక్కిలి యరుదుగ ధ్యానములేని వాడనై యున్నాను. అయినప్పటికి, నా యాంతరంగిక యాతిథ్య మొసగుటకు నే నాహ్వానించునది దేవదూతనుగాదు. దేవదూతల యేలికనే యాహ్వానించుచున్నాను. గనుక జీవమునకు మూలాధారమగు తమదివ్య సముఖమున నేనుండునపుడు, నేనెట్టి యనుచితమగు తలంపులను కలిగియుండ తగదు. ప్రపంచ విషయ వాసనలేవియును నా మనస్సున కంటియుండ రాదు.

6. అయినప్పటికిని పవిత్రప్రసాదమును గలిగియుండిన వాగ్ధత్త మందసమునకును, వర్ణింప శక్యముగాని వరముల కొటపట్టగు తమ పవిత్ర శరీరమునకును మిక్కిలి యమితమగు వ్యత్యాసముగలదు. ముందు రానున్న విషయముల సూచించుట కొరకై నియమింపబడిన పురాతనపు బలులకును, వానినన్నిటిని పూర్తిచేయుచు, తా మిప్పుడర్పించియున్న తమ శరీర బలికిని, మిక్కిలి వ్యత్యాసము గలదు.

7. ఐతే, పవిత్రమగు తమ సముఖమునందుండియు, నే నెందుచే మిక్కిలి భక్తికాంక్షలులేని వాడనై యున్నాను? పావనచరితులగు పితామహులును, దీర్ఘదర్శులును, వారు వీరు అననేల రాజులును, యువరాజులును, తమ యేలుబడి క్రిందనుండు సర్వజనులును, దివ్యమగు తమ యర్చనయెడల నంతయెక్కువ భక్త్యానురాగములను కనుబర

చుట జూచియుండను, పవిత్రమగు దివ్య సత్ప్రసాదమును స్వీకరించుటకింక నెక్కువ శ్రద్ధతో తయారై యుండకుండు టేల ?

8. భక్తిపరుడగు దావీదు రాజు గతించిన కాలములో తన పితామహులకు దేవు డనుగ్రహించిన పలువిధ వరప్రసాదములను స్మరించుకొనుచు, దైవ యుత్సవమును జరుపుచు, వాగ్దత్త మందసమునకు ముందు తన శక్తినంతయు వినియోగ పరచుచు నాట్యము సల్పియుండెను. నానా విధ గాన సాధనములను తయారు చేయించి కీర్తనలను రచించి, ప్రచురపరచి, మిక్కిలి సంతోషముగ వానిని గానము చేయించెను. స్పిరితుసాన్తును గైకొని, వరప్రసాద పూరితుడై, వీణను ప్రయోగించుచు, తాను నదేరీతిని గానముచేయుచు భగవంతుని ప్రార్థించెను. ! దేవుని పరిపూర్ణ హృదయపూర్వకముగ ప్రేమించుటయును, ప్రతిదినము నేకగ్రీవముగ వారిని నుతించుచు, వారిమహిమను పొగడుటయును ఇస్రాయేలు సంతతి వారలందరిచేతను నభ్యసింప జేసెను. ఆ కాలమునందు వాగ్దత్త మందసమునకు ముందు, అంత ఘనముగ దేవుని నంత ఘనముగ స్తోత్రముచేయుట తటస్థించి యుండగా, మిక్కిలి దివ్యమగు శ్రీ జేసునాథుని దివ్య శరీరమును స్వీకరించుటకు దివ్య సత్ప్రసాద సముఖమున, నేనును, క్రీస్తువులందరును, మీ యెడల గలిగియుండవలసిన గౌరవమును, భక్తియును, నెంతయెక్కువయై యుండవలయును!

9. అనేకులు అర్చ్యశిష్టులయొక్క పరిశుద్ధవస్తువులను దర్శించుట కొరకు దూర స్థలముల కరుగుచుందురు. వారుచేసియున్న అద్భుతచర్యలనుగూర్చి విని, విస్మయ మానసులగు చుందురు. వారి దివ్యమందిరములను గాంచుచు పీతాంబరములందును సువర్ణములందును మూతవేయబడియున్న, వారి పవిత్రశల్యములను ముద్దిడు కొనియెదరు. నా స్వామీ! మానవసృష్టికర్తయును, దేవదూతల యేలికయు అనంత పరిశుద్ధులగు మీరు నాముందు పీఠముపై దర్శనమిచ్చుచున్నారు. పలుమారు మానవులీ విషయములను కనుగొనలేక, నూతన విషయముల గాంచవలయునను జిజ్ఞాసా ప్రేరేపిత మానసులగు చున్నారు, కాని యట్టి జిజ్ఞాసచే లేశమాత్రమును తమ ప్రవర్తనను సవరించుకొను ఫలమునొంద జాలకున్నారు. అందుకు ముఖ్యముగ, మానవులెప్పుడు తా మొనరించిన పాపములనుగూర్చి ననుతాపము లేనివారలై యుందురో, అప్పటివరకు

రీతిని స్థాపించియున్నాడు. నేను మానవులందరియందును మిక్కిలి నికృష్టమగు అధముడను. నీచమగు పాపిని. అరగంట కాలమైనను తమ యందు భక్తినిలిపియుండ గలవాడను గాకున్నాను. ఒకప్పుడైనను, యీ అరగంటకాలము నెటుల వినియోగింపవలసి యుండెనో, అటుల భక్తియందు వినియోగించి యుండినచో, దైవాశీర్వాదమునుపొంది, యదృష్టవంతుడనై యుండెడివాడను గదా!

5. ఓ నాస్వామీ! తమ ప్రీతికొరకై వారలెంత ఘనవాక్యముల నాచరింప ప్రయత్నములు చేసియుండిరి! అయ్యో నేచేయు ప్రయత్నములు యెంత స్వల్పమైయున్నవి. తమ్మును స్వీకరించుటకు సిద్ధపడుటకుగాను నేను యెంత స్వల్పకాలమును మాత్రము వినయోగించుచున్నాను. అరుదుగ నిట్టి దివ్యవిషయమునుగూర్చి యాంతరంగికముగ చింతించుచున్నాను. అంతకన్న మిక్కిలి యరుదుగ ధ్యానములేనివాడనై యున్నాను. అయినప్పటికి. నా యాంతరంగిక యాతిథ్యమొసగుటకు నే నాహ్వానించునది దేవదూతనుగాదు. దేవదూతల యేలికనే యాహ్వానించుచున్నాను. గనుక జీవమునకు మూలాధారమగు తమదివ్య సముఖమున నేనుండునపుడు, నేనెట్టి యనుచితమగు తలంపులను కలిగియుండ తగదు. ప్రపంచ విషయ వాసనలేవియును నా మనస్సున కంటియుండ రాదు.

6. అయినప్పటికిని పవిత్రప్రసాదమును గలిగియుండిన వాగ్దత్తమందసమునకును, వర్ణింప శక్యముగాని వరముల కొటపట్టగు తమ పవిత్ర శరీరమునకును మిక్కిలి యమితమగు వ్యత్యాసముగలదు. ముందు రానున్న విషయముల నూచించుట కొరకై నియమింపబడిన పురాతనపు బలులకును, వానినన్నిటిని పూర్తిచేయుచు, తా మిప్పుడర్పించియున్న తమ శరీర బలికిని, మిక్కిలి వ్యత్యాసము గలదు.

7. ఐతే, పవిత్రమగు తమ సముఖమునందుండియు, నే నెందుచే మిక్కిలి భక్తికాంక్షలులేని వాడనై యున్నాను? పావనచరితులగు పితామహులును, దీర్ఘదర్శులును, వారు వీరు అననేల రాజులును, యువరాజులును, తమ యేలుబడి క్రిందనుండు సర్వజనులును, దివ్యమగు తమ యర్చనయెడల నంతయెక్కువ భక్త్యానురాగములను కనుబర

చుట జూచియును, పవిత్రమగు దివ్య సత్ప్రసాదమును స్వీకరించుట కింక నెక్కువ శ్రద్ధతో తయారై యుండకుండుటేల ?

8. భక్తిపరుడగు దావీదు రాజు గతించిన కాలములో తన పితామహులకు దేవు డనుగ్రహించిన పలువిధ వరప్రసాదములను స్మరించుకొనుచు, దైవ యుత్సవమును జరుపుచు, వాగ్దత్త మందసమునకు ముందు తన శక్తినంతయు వినియోగ పరచుచు నాట్యము సల్పియుండెను. నానా విధ గాన సాధనములను తయారు చేయించి కీర్తనలను రచించి, ప్రచురపరచి, మిక్కిలి సంతోషముగ వాటిని గానము చేయించెను. స్పిరితుసాన్తును గైకొని, వరప్రసాద పూరితుడై, వీణను ప్రయోగించుచు, తాను నదేరీతిని గానముచేయుచు భగవంతుని ప్రార్థించెను. ! దేవుని పరిపూర్ణ హృదయపూర్వకముగ ప్రేమించుటయును, ప్రతిదినము నేకగ్రీవముగ వారిని నుతించుచు, వారిమహిమను పొగడుటయును ఇస్రాయేలు సంతతి వారలందరిచేతను నభ్యసింప జేసెను. ఆ కాలమునందు వాగ్దత్త మందసమునకు ముందు, అంత ఘనముగ దేవుని నంత ఘనముగ స్తోత్రముచేయుట తటస్థించి యుండగా, మిక్కిలి దివ్యమగు శ్రీ జేసునాథుని దివ్య శరీరమును స్వీకరించుటకు దివ్య సత్ప్రసాద సముఖమున, నేనును, క్రీస్తువులందరును, మీ యెడల గలిగియుండవలసిన గౌరవమును, భక్తియును, నెంతయెక్కువయై యుండవలయును!

9. అనేకులు అర్చ్యశిష్టులయొక్క పరిశుద్ధవస్తువులను దర్శించుట కొరకు దూరస్థలముల కరుగుచుందురు. వారుచేసియున్న అద్భుతచర్యలనుగూర్చి విని, విస్మయ మానసులగు చుందురు. వారి దివ్యమందిరములను గాంచుచు పీతాంబరములందును సువర్ణములందును మూతవేయబడియున్న, వారి పవిత్రశల్యములను ముద్దిడు కొనియెదరు. నాస్వామీ! మానవసృష్టికర్తయును, దేవదూతల యేలికయు అనంత పరిశుద్ధులగు మీరు నాముందు పీఠముపై దర్శనమిచ్చుచున్నారు. పలుమారు మానవులీ విషయములను కనుగొనలేక, నూతన విషయముల గాంచవలయునను జిజ్ఞాసా ప్రేరేపిత మానసులగు చున్నారు, కాని యట్టి జిజ్ఞాసచే లేశమాత్రమును తమ ప్రవర్తనను సవరించుకొను ఫలమునొంద జాలకున్నారు. అందుకు ముఖ్యముగ, మానవులెప్పుడు తా మొనరించిన పాపములనుగూర్చి ననుతాపము లేనివారలై యుందురో, అప్పటివరకు

ఫలము నొంద జాలకుందురు. మానవావతారమును వహించిన నా దైవమా! దివ్య సత్ప్రసాదములో తమ పూర్ణ దర్శనము ననుగ్రహించుచున్నారు. తమ మహిమకు తగిన భక్తితో మేము దేవరవారిని మా హృదయ నివాసులుగా చేసికొనునప్పుడెల్లను, శాశ్వత మోక్షఫలమును యమోఘముగ ననుభవించుచున్నాము. ఇట్టి ఫలప్రాప్తిపై స్థిర నమ్మకము చేతను, భక్తిపూర్వకమగు యాశచేతను, నిష్కాపట్యమగు వాక్యముచేత నాకర్షింపబడుచున్నాముగాని, మానసిక చపలత్వము చేతను, పరిశోధనా బుద్ధి చేతను, యింద్రియ సుఖనిరతత్వముచేతను గాదు.

10. ప్రపంచ సృష్టికర్తలై యుండియును, మా కనుల కగోచరమై యుండెడు సర్వేశ్వరా! మానవుల విషయమున తామెంత యద్భుతముగ వర్తించుచున్నారు. ఈ దివ్య సత్ప్రసాద మూలమున తమచే నెన్నుకొనబడిన మీ ప్రియులందరును, మిమ్ము స్వీకరించులాగున తమ్ము వారి కర్పించుచు, వారికొరకై సర్వవిషయముల నెంత మనోహరముగ, నెంత ప్రేమపూర్వకముగ నేర్పాటు చేయుచున్నారు. ఏలయనగా! యీ అంశము మానవునియొక్క గ్రహింపున కంతయు మించియున్నది. ఈ విషయ మసాధారణమగు భక్తుల హృదయముల నాకర్షించుచు, వారి ప్రేమను ప్రజ్వరిల్ల జేయుచున్నది. ఏలయనగా: మిక్కిలి దివ్యమగు నీ దివ్య సత్ప్రసాదము వలన జీవితమునంతయును సవరించుకొనవలయునని, ప్రయత్నము చేయుచుండునట్టి తమయందు విశ్వాసముగల వారందరును పలుమారులు తమయందలి గొప్పభక్తి, ప్రేమ యనెడు దివ్య వరప్రసాదములను పొందుచున్నారు.

11. మహనీయమై, గూఢమై వెలయుచున్న దివ్య సత్ప్రసాదమా! యేసునాథుని యందు విశ్వాసముగల వారలు మాత్రమే నిన్నెరుంగగలరు. వారియందు నమ్మకములేని వారలును పాపమునకు బానిసలై యుండు వారలును, నిన్ననుభవింప జాలరు. ఈ దివ్య సత్ప్రసాద దేవద్రవ్యానుమానములో నమితమగు దేవవరప్రసాద మనుగ్రహింపబడుచున్నది. ఆత్మ గోల్పోయి యున్న సుగుణము తిరుగ నొసంగబడుచున్నది. పాపముచే కురూపిగా చేయబడిన ఆత్మ సౌందర్యమంతయును తిరుగ వచ్చుచున్నది. కొన్ని సమయములందు యీ దివ్యసత్ప్రసాద

మొసంగు వరప్రసాద శక్తి యెంతయనగా! ప్రసాదింపబడిన యీ భక్తాలో ధిక్యతచే మానవుని కేవల మానసము మాత్రమేగాక, బలహీనమగు యీ భౌతిక శరీరము సహితము బలమును పొందుచున్నది. మోక్ష ప్రాప్తి నొందువారలకు మిక్కిలి యాశయును, ఫలమునగు జేసునాథుని స్వీకరించుటకు హృదయానురాగముచే నాకర్షింపబడక, మన మందర మును మందమతులమై యలక్ష్యముగ నుండి నందుకొనను మన స్థితి మిక్కిలి జాలికరమై యున్నది. అట్టి స్థితికి మన మందరమును ప్రలాపింప వలసిన వారమై యున్నాము.

12. ఏలయనగా ! జేసునాథుడే మనలను పవిత్రులుగ చేయువారలు. వారే మన విమోచన కర్త. వారే యీ ప్రపంచ జీవయాత్రికుల కొరకు దల. వారే అర్చ్యశిష్టుల శాశ్వత మోక్షానందము. కనుక భూలోకము నంతటిని సంరక్షించుచు, స్వర్గలోకమునందు సంతసము నొడగూర్చు నీ పరమ రహస్యమును గూర్చి అనేకులు అలక్ష్యము చేయకపోవుటను జూచి మనము మిక్కిలి దుఃఖింపవలసి యున్నది. ఇట్టి మహోన్నతమగు దైవ వరమును గూర్చి చింతింపకయు, ప్రతి దినమును స్వీకరింపకయు, అజ్ఞానాంధకారావృతమై కఠినమైయున్న హృదయముగల మానవుడే యీ వరము నెడల నింత యుపేక్షాభావమును వహించుచుచున్నాడు.

13. ఈ పవిత్రమగు దివ్యసత్ప్రసాదమును మాత్రమే ప్రపంచమునం దంతటికిని ఒకే గురువు సమర్పించు నెడల, యీ దేవద్రవ్యానుమానమును వీక్షించుటకై, యట్టి స్థలమున కరుగుటకు మానవులెంత యెక్కువ కొంక్ష గలవారై యుందురు? అయితే ప్రతి దేవాలయమునందును యీ దివ్య సత్ప్రసాదము యీయబడుటచేతను అందరి గురువులచే అర్పింపబడుట చేతను, దేవుడు మనయెడల చూపుచున్న ప్రేమకటాక్ష మెంతయని మనము గమనించుటలేదు.

ఓ దయాస్వరూపులగు జేసుస్వామి! గొర్రెలను బోలిన మమ్మం దరను రక్షించు మాపాలిటి రక్షణకర్తా! అభాగ్యులమై యాత్రికులవలె! గ్రుమ్మరుచున్న మాకందరకును అమూల్యమగు తమ దివ్యశరీరమును, పావనమగు తమ రక్తము నొసంగి పోషింతుమని వాగ్దత్తమిచ్చియున్నారు గదా? "కష్టములనుభవించుచు, భారముచే కృంగియున్న మమ్ము నేడు

దీర్చేదము" రమ్మని తామే స్వయముగా నాహ్వానించుచున్నారే! దయగల తండ్రీ! మేమందరమును తమకు వందనము అర్పించుచున్నాము. ఈ దివ్య దేవద్రవ్యానుమానమునందు జేసునాథస్వామి పావనమగు తమ శరీరమును, రక్తమును మనకర్పించుచున్నారు. ఈ దివ్య సత్ప్రసాదము నందే పావనమూర్తియగు దేవుని సర్వశక్తిని పరిపూర్ణ భాగ్యమును సద్గుణములను మానవావతారమెత్తిన సర్వేశ్వరునియందలి యోగ్యతలను మనము స్వీకరించగలము. జేసునాథుడు మనకనుగ్రహించెడి యిట్టి దివ్య సత్ప్రసాదమునందలి మహిమ లెవరు గ్రహింపగలరు? అర్చ్యశిష్ట అగు స్త్రీనువారు నుడివియున్నట్లు; "దేవుడు సర్వశక్తివంతుడై యున్నను, తమ్ము తాము సమర్పించుటకన్న ఘనమైన దానినేమియు మనకనుగ్రహింపజాలరనియును; సర్వసంపన్నుడై యుండియు, తమ యపార తా ఘనాగారమునుండి ఇంతకన్న నితర గొప్పమేలు లేవియు చేయజాలరనియు, స్వయంభువై యుండియు మూర్తీభవించిన తన పితయొక్క జ్ఞానముతో మన హృదయములను యున్నతస్థితికి దెచ్చుటకుగాను, యీ దివ్యసత్ప్రసాద స్వీకారముద్వారా తాము మన హృదయప్రవేశులై, మనలనందరిని యోగ్యప్రవర్తనగల వారలనుగ మార్చి, తమతో ఐక్యము చేసికొనుటకన్న యితరమార్గమును కనిపెట్టజాలరనియు మనము గుర్తింపవలసియున్నది."

## సారాంశము

అయితే మనమందర మొక విషయమునుగూర్చి మనో హృదయానందము గలవారలమై యుండవలయును. అది యేదియన: మనమిపుడు స్వీకరించుచున్న పవిత్రవిందునందు మనమేమియును పోగొట్టుకొనకుండుటకై యుదార హృదయులైన దేవరవారు సర్వసంపదలను పరిపూర్ణజ్ఞానమును ప్రేమను నిమిడ్చియున్నారు. ఈవిషయమును స్మరించుకొనుచు మనము మిక్కిలి యానందము గలవారమై యుండవలయును.

వారటులేల చేయుచున్నారన:- అందుమూలముగ మనము దేవుని శారీర మాంసములతో పోషించి మానవాతీతమగు దివ్యజీవనము జీవించుటకు సమర్థత గలవారినిగా మనల నొనర్చుటకే వారటుల చేయుచున్నారు. పవిత్రమగు నా యన్యోన్య సంసర్గ సంస్కారమునందు తమ నూతన జీవితమును మన కనుగ్రహించుటకై మన శిరములపై

నూతన జీవితాధారులై పరివేషించియున్నారు. తమ నూతన జీవమును మనకనుగ్రహించుటవలన వారి ప్రేమ సంపదలన్నియును మనయాత్మయందు ప్రవేశపెట్టెదరని త్రెంటుసభవారు వక్కాణించియున్నారు. నారక్షకా! తమ దివ్యప్రసాదమును మాకనుగ్రహించిన పిమ్మట, నిశ్చయముగ తామెక్కువ వరములను దయచేయుదురు. గనుక దివ్యసత్ప్రసాద దేవద్రవ్యానుమానమునందు తమనే పూర్తిగాను, నిండు హృదయముతోను స్వీకరింప మాకనుగ్రహింపుడు. మాకొరకై తాము మిగుల పేరాళముగ దయచేయు వరములన్నియును మిగుల యమూల్యములైనవియే గాని, ఇవన్నియును తమకన్న తక్కువైనవి కావు. పూజనీయమగు దివ్యసత్ప్రసాదమునందు తమను సైతము మాకు దయచేయునంత ప్రేమగలవారలై యున్నారు. ఇతర హక్కులనుబట్టి, మానవుని హృదయ మిదివరకే దేవుని స్వంతమై యుండగా అట్టి హృదయమును స్వాధీనపరచుకొనుటకై దేవుడు దివ్యసత్ప్రసాదము ద్వారా వేంచేసి యుండునపుడు మహా దివ్యసత్ప్రసాదము ననుభవించు యే మానవుడు తన హృదయమును దేవుని స్వాధీనముచేయక యుండగలడు?

---

## 2 వ అధ్యాయము.

### దివ్యసత్ప్రసాదమున మానవుని యెడల దేవుడు చూపిన అమోఘమగు దయయును, త్యాగమును విశదమగుచున్నవి.

1. శిష్యుడు:- నా యేలినవారా, తమ యోగ్యతా ధర్మమునందును తమ ప్రేమయందును విశ్వాసము గలవాడనై నేను రోగపీడితుడనై నారక్షకుని యొద్దకును, ఆకలిదప్పుల బడసి నా జీవమునకు మూలాధారమగు దేవుని యొద్దకును, దరిద్రుడనై పరలోకరాజు దగ్గరకును సేవకుడనై నా ప్రభువుదగ్గరకును; సృజియింపబడిన యొక నీచమానవుడనై, సృష్టికర్తయొద్దకును; నిర్భాగ్యుడనై కోమల హృదయుడగు నా సౌకర్యదాయియొద్దకును, నేను చేరి యాశ్రయించుచున్నాను. అయితే తామే నాయొద్దకు విచ్చేయుచున్నారే! ఇట్టి మహాభాగ్యము నాకెట్టుల సంప్రాప్తించినది! తాము తమనే నాకు దయచేయుటకు నేనేపాటి యోగ్యత గలవాడను? నావంటి పాపి తమను దర్శింప నెట్టుల సాహ

సము చేయగలడు? పాపాత్ముని సమీపించుటకు మీ రేల యనుగ్రహించితిరి? తమ సేవకుని తామెరిగియే యున్నారు. ఇటుల తమ యభిమానమునకు తగిన పాత్రత గలవాడనుటకు, అతని యందేమియు తగిన యోగ్యత లేదని తమకు తెలిసియున్నది. గనుకనే నపాత్రుడనని యంగీకరించు చున్నాను. తమ యోగ్యతను నేను కొనియాడుచున్నాను. తమకు నాయెడల గల మితిమీరిన దాతృత్వమునకు నా వందనము లర్పించుచున్నాను. ఏలయనగా: తామిది యంతయును నాయెడల తమకుగల దయచేతనే చేసియున్నారు గాని, నా యోగ్యతలను బట్టిగాదు.

తమయోగ్యతను నేనింకను చక్కగ గ్రహించుటకును, అందుచే నా యెడల తామింక నెక్కువ దాతృత్వమును చూపుటకును, తమయనుగ్రహమున కెక్కువ పాత్రత గలవాడనగునటుల నన్ను దీనభావముగల వానినిగా చేయుటకును, యీ రీతిని తాము నా యెడల కనికరహృదయులై యున్నారు. ఇటు లొనర్చుటయే తమకు ప్రీతికరమగుట చేతను, అది యటులనే యుండవలయునని తాము నియమించి యుండుటచేతను తమ ఘనతకు తగిన యిట్టి స్వల్పకార్యమును సైతము దయతో చేయు సమ్మతించుటలో తమ యోగ్యతను చూచుకొని నేను మిక్కిలి యానందించుచున్నాను. నాయందలి దుష్ప్రవర్తన యిందుకు విఘ్నకారి కాకుండ వలయునని నేను కోరుచున్నాను.

2. మిక్కిలి మనోహరమై ఘనమగు దాతృత్వ భావముచే వెలయుచున్న పరమతండ్రీ, పవిత్రమగు తమ శరీర ఘనతనే మానవుడును వర్ణింపజాలడు. అట్టి తమ దివ్యశరీరమును నేను స్వీకరించుచున్నాను. అందుకొరకై యెడతెగక తమ నెపుడును శ్లాఘించుచు, తమ యెడలనెక్కువ గౌరవమును చూపుచు, అనేక వందనము లర్పింపవలసి యున్నాను. ఐతే, ఓనా ప్రభువా! తమనెంత ఘనముగ గౌరవింపవలసి యుండెనో, అంత యెక్కువగ గౌరవమును తమయెడల చూపజాలకున్న నేను, తమయందలి భక్తిచే మనమున పొందవలయునను కోర్కెనుగలిగియున్న నేను, యీ దివ్యసత్ప్రసాదమున తమ సముఖమునకు సమీపించునపుడు, నా హృదయమునం దేమని తలంచు కొనుచుండవలయును? తమ సముఖమున మిక్కిలి పరిపూర్ణ దీనహృదయుడనై మీ యపారమగు దయను నాశక్తికిమించి శ్లాఘించుటకన్న నాఆత్మకు మిక్కిలి

యుత్తమమైన దేదియును లేదు. ఓ దైవమా! తమను నేను శ్లాఘించుచు న్నాను. నేను సర్వకాలములందును తమను పొగడుచున్నాను. నేను స్వతిరస్కారమును గావించుకొనుచున్నాను. మీపాత్రత కొరకై నన్ను నేను హీనపరచుకొనుచు తమకు విధేయుడనై, మీయేలుబడికి లొంగి యున్నాను.

3. తాము మహా పవిత్రులై యున్నారు. నేను పాపులలో ఘోర పాపినై యున్నాను. తమదిశకు తలయెత్తియైనను చూచుటకు అర్హత లేని నా యొద్దకు తాము దిగివచ్చుచున్నారు. నాతో కలసి యుండ వలయునను కోరికగలవారలై యున్నారు. విందునకు నన్నాహ్వా నించుచున్నారు. నేను భుజించుటకై నాకు స్వర్గసంబంధమగు దేవ దూత లారగించెడు యప్పమును దయచేయ కోరికగలవారలై యున్నారు. మీరు నాకు దయచేయుచున్న అప్పమనునది నిశ్చయముగ తమరే! స్వర్గమునుండి భూలోకమున కవతరించి, ప్రపంచమున కంత కును ప్రాణదానము చేయుచున్న జీవాధారియైయున్న మీరే యా యప్పము.

4. దీనినుండియే తమ ప్రేమప్రవాహము బయలుదేరుచున్నది. ఆహా! తమ దాతృత్వమెంత శోభాయమానముగ వెలుగుచున్నది! మాకనుగ్ర హించుచున్న యిట్టి దివ్యసత్ప్రసాదమునకుగాను మేము మీకెన్ని వందనము లర్పింపవలసియున్నాము. స్వామీ! దివ్యసత్ప్రసాద నిర్మాణో ద్దేశము మానవులకెంత హితకరమై యుపయోగకారియై యున్నది! మేము భుజించుటకుగాను తమ దివ్య శరీరమునే మాకు భోజనముగ తామర్పించుచు మాకిప్పుడాచరించుచున్న విందు యెంత రుచికరమై ఆనందకరముగ నున్నది! స్వామీ! తమచే నాదరింపబడుచున్న యీ కార్యమెంత ఆశ్చర్యకరమైయున్నది! నాయేలికా! తమ సుగుణమెంత శక్తివంతమైయున్నది! తమ సత్యమెంత యమోఘమైయున్నది! మీవాక్య ముచొప్పుననే సర్వమును సృష్టింపబడియెను. మీయాజ్ఞ ననుసరించియే సర్వమును కొనసాగుచున్నది.

5. ఓ యేలినవారా! తాము నిజమగు దైవమును, నిజమగు మానవు డునై యున్నారు. కొద్దిపాటి అప్పమునందును, ద్రాక్షారసమునందును

తాము పరిపూర్ణముగ నిండియుండిరియును, మిమ్ము స్వీకరించిన మానవునిచే భక్షింపబడియును క్షీణించి వ్యయపరుపబడకున్నారు. ఇది యెంత వింతయగు అద్భుతమై యున్నది! మిక్కిలి విశ్వసింపవలసిన కృత్యమై యున్నది. మానవమాత్రుడెవ్వడు నిట్టి యద్భుతమును గ్రహింపజాలడు. ప్రభువా! మీకట్టి లోటుపాటులును లేవు. ఈ దివ్యదేవద్రవ్యానుమానముద్వారా తాము మాయందు నివసించుటకు సంతసము గలవారలై యున్నారుకదా? నా హృదయమును కళంకరహితముగ నుండునటుల భద్రపరుపుడు. తామటు అనుగ్రహింతురేని సంతోషకరమగునట్టి మనస్సాక్షిని గలవాడనై నా శాశ్వత ముక్తికొరకు తాము ముఖ్యముగ నిర్ణయించినట్టి తమ గౌరవముకొరకును తమనెల్లప్పుడును స్మరియించుకొనుచుండుటకును, తాము స్థాపించిన యీదివ్య రహస్యము అను పలుమారు నెరవేర్చు శక్తిగలవాడనై యుందును.

6. నాయాత్మా! యీ కన్నీటికనుమలో యిట్టి గొప్ప బహుమానమును నీకనుగ్రహించి యిట్టి మహోత్కృష్టమగు ఆదరణను నీకు ప్రసాదించినందుకు మిక్కిలి సంతోషముతో దేవునికి వందనము అర్పింపుము. ఏలయనగా: నీ వెన్నిమారులు యీ దివ్యరహస్యమును స్మరియించుచు, జేసునాథుని శరీరము స్వీకరించుచుందువో, అన్నిమారులు నీ రక్షణకార్యమును ఆచరించిన దానవగుదువు. అందు మూలమున జేసునాథుని యోగ్యతలన్నిటియందును నీవు పాలి భాగస్తురాలివై యుందువు. ఏలయనగా : శ్రీ జేసునాథునియందు వెలయుచున్న త్యాగమెపుడును క్షీణించిపోవునది గాదు. వారు గావించిన పాపపరిహారక్రియ యాధిక్యత యెప్పటికిని తరిగిపోవునది కాదు. గనుక నిందుకొరకై నీవెల్లప్పుడును నీ మానసికశక్తిని నూతనపరచుకొనుచు అందుకొరకై ప్రయత్నముచేయుచు నీ ముక్తికొరకై యేర్పరుపబడిన యీ దివ్యరహస్యమునుగూర్చి మిక్కిలి జాగరూకతతో ధ్యానించుకొనుచుండుము. నీవు దివ్యపూజ చేయునపుడుగాని, యితరులుచేయుచుండ నీవు చూచునపుడుగాని ఆదే సమయమున జేసునాథస్వామి మరియ మహాతల్లి గర్భమున మానవరూపున జన్మించి మానవులరక్షణకొరకై స్లీవపైని కొరతవేయబడి వ్రేలాడుచు బాధలననుభవించుచు

ప్రాణములను గోల్పోవుటను నీ కన్నులయెదుటను చూచినట్లుగా ఎంచుకొనుము.

---

## సారాంశము

పావనమగు దివ్య దేవద్రవ్యానుమానమును సమీపించునపుడు మన మెట్టి భావములు గలవారలమై యుండవలయునో, నీవు స్వీకరింపబోవుచున్న దైవ మహిమను గూర్చియు, వారి రాజ ప్రతాపమును గూర్చియు యోచించుకొనుము. దేవుని సమీపమునకు చేరదలచుచున్న నీచుడవును పాపియునగు నీయందలి తుచ్ఛత్వమును గూర్చియు అనర్హతను గూర్చియు దుఃఖించుము. వారి సముఖమున దీనహృదయుడవై నిలువుము.

నా ప్రభూ! తమ సముఖమునకు ధైర్యముచేసి వచ్చుటకు నే నెవ్వడను? నేను మిగుల నయోగ్యుడను. అయ్యో! అట్టి నీచుడనగు నా దగ్గరకంత దీనత్వమును వహించి తామే స్వయముగా దయచేయుచున్నారే! ఒకవంక తమ పావనత్వమునందలి యుత్కృష్టతను యొండొకవంక, నా యాత్మయొక్క దుష్ప్రవర్తనను గూర్చి నేను యోచించి చూచుకొనునప్పుడు తమను స్వీకరించుటకు మిక్కిలి యనర్హుడ నని తాము నా హృదయమున ప్రవేశించుటకు యవకాశమిచ్చెడు స్థితియందు నేను లేనని నిజముగా నే నంగీకరించుచున్నాను. ఐతే నా పవిత్రత కొరకును నా ముక్తికొరకును తమరే నాకు ముఖ్యముగ కావలసినవారను విషయమును తమ యోగ్యతాధిక్యతను గుర్తెరిగిన వాడనై, నా రక్షకుడవగు తమ సముఖమునకు పవిత్రమగు నమ్మకముతో సమీపించెదను. ఏలయనగా! "రోగపీడితులకు తప్ప, మంచి దేహారోగ్యము గలవారికి వైద్యునితో నేమియు పనిలేదు." అని తమరు బోధించియున్నారు. తప్పుడు మార్గమునందు ప్రవర్తించుచు, నశించి పోవునంత యపాయకరమగు స్థితియందుండు వారలను రక్షించుట కొరకై వెతకుకొనుచు వచ్చునట్టి, మానవుని యెడలగల మీ ప్రేమనే నేను కొనియాడుచు, పావనమగు నమ్మకముతో మిమ్ము జేరవచ్చుచున్నాను. నిశ్చయముగ నే నొక ఘోరపాపిని. కాని యికమీదట

నే నటులుండబోను. తమ సముఖమున యూరటను గాని, సంతోషమును గాని పొందుట కనర్హుడను. కాని నా దుర్దశలన్నిటిని తెలిసికొనిన వాడనై వాని నన్నిటిని తమ దివ్యపాద సన్నిధానమున సమర్పించుకొని అచ్చట విశ్రమించెదను.

---

## 3 వ అధ్యాయము

## పలుమారులు దివ్యసత్ప్రసాదమును స్వీకరించుచుండుట మిక్కిలి లాభదాయకము.

1. శిష్యుడు:- నాప్రభూ! ఇదిగో నేను తమ సముఖమునకు వచ్చియున్నాను. తాము దయచేసెడి బహుమతిచే నేను బాగుపడుటకును తాము పేదవారలకొరకై తమ దయాధిక్యతచే తయారుచేసియుంచిన తమ దివ్య విందునందు నేను మిక్కిలి యానందము ననుభవించుటకును, తమ సన్నిధానమునకు వచ్చియున్నాను. నేను కాంక్షింపవలసినదియు, కాంక్షింపగలిగిన దంతయును తమయందేగలదు. తమరే నా మోక్షము. తమరే నా విమోచనాకర్తలు. నా యాశయును, బలమును, ఘనతయును, నా యానందమును తమరే. గనుక నా యాత్మను తమవైపునకు మరలించియున్నాను. ఈ దినము మీసేవకుని యాత్మను సంతోషముతో నింపివేయుడు. ఈ సమయమున తమను మిక్కిలి భక్తి గౌరవపూర్వకముగ స్వీకరింపవలయునను కాంక్షగలవాడనై యున్నాను. తమ దివ్య శరీరముతో పోషింపబడవలయునని నాయాత్మ మిక్కిలి యపేక్షించుచున్నది. నా హృదయము తమతో నైక్యము కావలయునని కాంక్షించుచున్నది.

2. తమనే నాకు దయచేయుడు. నా కంతే చాలును. ఏలయనగా: తాముగాక వేరేమియును ప్రయోజనకరముగ నుండదు. తాము లేనిది నేను జీవింపజాలను. తమ దర్శనము దయచేయనిది నేను జీవయాత్ర జరుపుకొనజాలను. స్వర్గలోక సంబంధమగు యీ దివ్య యాహారమును పోగొట్టుకొని, మార్గమధ్యమున సొమ్మసిల్లి పడిపోకుండుటకుగాను నేను

పలుమారులు తమ సన్నిధి కరుదెంచి నా యాత్మయొక్క యారోగ్యము కొరకును బలము కొరకును దివ్యౌషధముగా తమను స్వీకరింప వలసి యున్నది. ఏలయనగా: మిక్కిలి దయగల ఓ నా తండ్రీ! ఒకానొకప్పుడు తాము జనులకు నీతిబోధనలు చేయుచు పలువిధములగు రోగములను నివారణ చేయుచు, వారు మార్గమధ్యమున అలసటచే పడి పోవుండుటకుగాను, "వారలను పస్తుతో పంపుట నాకిష్టములేదు." అని వక్కాణించి యున్నారుకదా! తమభక్తులను కనికరించుటకై యీ దివ్య సత్ప్రసాదములో వేంచేసియున్న తాము పైరీతిగానే నాయందును ప్రవర్తింపుడు. తమరే నా యాత్మయొక్క మనోహరమగు ఆహారము. అర్హమగు రీతిని తమను భుజించువాడు నిత్యానందము ననుభవించుటకు వారసత్వపు హక్కుగలవాడై తమతో పాలిభాగస్వామిగా నుండగలడు. పలుమారులు పాపమార్గమునబడి, పాపకృత్యము లాచరించుచున్నట్టి నేను, అచిరకాలముననే మందగమనుడనై, యలసటచే పడిపోయెడి నేను, చెడిపోయిన నాబలమును తిరుగ చక్క చేసికొనుటకును, నా యాత్మను నిష్కల్మషముగ నొనర్చుకొని, దానికి యుత్సాహమును కలిగించుకొనుటకును పలుమారులు ప్రార్థనలు గావించుకొనుచు, పాప సంకీర్తనము చేయుచు, తమదివ్య శరీరమును స్వీకరింప వలసినవాడనై యున్నాను. నేనటులచేయక బహుశా చాలకాలము వరకు ఉపేక్షించి యున్నయెడల, దివ్యమగు నా సంకల్పమును కొనసాగించుకొనక విడచియుండు వాడనగుదును.

3. ఏలయనగా బాల్యమునుండియు మానవుని యింద్రియములు అతని దుష్టమార్గమునకే నీడ్చుకొనిపోవు స్వభావముగలవై యున్నవి. దివ్యమగు తమ యౌషధము వానికి దయచేసి తాము సహాయము చేయని యెడల, నతి శీఘ్రకాలముననే యాతడింకను యెక్కువ నధముడై పోవును గనుక యీ మహాదివ్య సత్ప్రసాదము దుష్టులను యోగ్యాభివృద్ధిగల వానినిగా జేయును. ఏలయనగా, యీ మహాదివ్య సత్ప్రసాదమును భుజించుచు లోక పూజచేయు చుండునప్పుడే యింత యెక్కువ తృణీకారముతో యశ్రద్ధగలవాడనై యున్నచో, యీ మహాదివ్య సత్ప్రసాదమను యౌషధమును సేవింపక యిట్టిగొప్ప సహాయముకొరకై వెతకు కొనకుంటినేని, నాస్థితి మరెట్లుండునోగదా! ప్రతిదినమును

పూజచేయుటకు నేను తగినవాడను కాకున్నను, పూజచేయుటకు తగిన విధమున సంసిద్ధుడను కాకపోయినను, తగిన సమయములందు నద్భుతముగు నీ దివ్యరహస్యములను స్వీకరించుటకును, అంత మహోన్నతమగు దివ్య సత్ప్రసాదము భుజించుటకు పాలిభాగస్థుడనుగా నుండగలుగుటకై ప్రయాసపడియెదను. ఏలయనగా: నశింపవలసియున్న భౌతిక శరీర ధారియై యున్నయాత్మ తమనుండి దూరముగ తొలగియుండి విదేశ వాసము సల్పుచుండెడు నంతకాలము, పలుమారు తన దైవమును గూర్చి తలంచుకొనుచు, భక్తియుక్తముగు మానసముతో తాను ప్రేమించుచున్న దేవుని స్వీకరించుటయే దాని ముఖ్య ఓదార్పు.

4. ఓ నాప్రభూ! సృష్టికర్తవును, రక్షకుడవునగు నా దైవమా! తమ పరిపూర్ణ దైవత్వముతోను, మానవత్వముతోను యీ బీద యాత్మ కడకు దానియాకలి దీర్చుటకై దయతో వేంచేయుట నా యెడల తమకు గల మహనీయమైన ప్రేమాధిక్యతచేతనే గదా! తనప్రభువును దైవమును నగు తమను భక్తిపూర్వకముగ స్వీకరించి, అందుచే ఆధ్యాత్మికా సంతోషమును పొందగల యోగ్యతగల ఆత్మ యెంత యదృష్టవంతమైనది! ఆహా! మహనీయుడగు ప్రభునకు నా ఆత్మ విందు చేయుచున్నది! ప్రేమగల సహచరుని కాహ్వాన మొసంగుచున్నది! ప్రేమగల యతిథిని తన గృహమున ప్రవేశపెట్టుకొను చున్నది! ఎంత విశ్వాసముగల స్నేహితుని గైకొనుచున్నది! తాను వాంఛింపగల వారలందరికన్నను, తాను ప్రేమించు వారలందరికన్నను, ఎక్కువగ ప్రేమింపబడుటకు తగిన యోగ్యత గలిగినట్టి తన దైవమునే యాలింగనము చేసికొనుచున్నది! ఓ నామిక్కిలి ప్రియుడవగు దైవమా! స్వర్గలోకము, భూలోకము వాని సర్వ యలంకారములతో సహా మీ సముఖమున మౌనము వహించి యుండునుగాక! ఏలయనగా: అవి యెంత యలంకారమును గలిగి యుండినపైనను, అవి యన్నియును తమ దాతృత్వమువలన ప్రసాదింపబడిన బహుమానములై యున్నవి. అపార జ్ఞాన స్వరూపులగు తమ పేరు ప్రతిష్ఠాలంకారముల ముందవి యెందును కొరగావు.

---

## సారాంశము

మహాదివ్య సత్ప్రసాదమును స్వీకరించుటకు మన మందగమును పట్టుదల గలిగి యుండవలయును. దివ్యసత్ప్రసాదమును పలుమారు స్వీకరించు చుండుటకు గల యవశ్యకతను గూర్చియు వివేకముగ్గల వారలమై యుండవలయును.

జేసునాథుని సముఖమునకు సమీపించునపుడు మనము నిరుత్సాహులమై యుపేక్షాభావము గలవారలమై యున్నటుల తోచినపుడు, సత్ప్రసాద స్వీకారమునందలి కాంక్ష తీవ్రతచేగాక కేవలము అలవాటుచేత వారిని స్వీకరింప ప్రేరేపింపబడునప్పుడును, మన ప్రభువు ముందు మనము మిక్కిలి దీనులమై కలవర పడుటకు గొప్ప కారణము గలదు—తమను స్వీకరించుటకై యే మానవుడు తనకు సాధ్యమగునంత వరకు తయారగుటకు శ్రమపడునో, యట్టి మానవుని హృదయ నివాసులరై యుండుటయే తమ వాంఛ యని తాము చెప్పుచున్నచో, తమ యందలి భక్తిహీనతచే రొండి బీటబారియున్న నా స్థితియందు నా గతి యెటులుండెడిదియో కదా! దివ్య సత్ప్రసాద పరిగ్రహణమునకు ఎట్టి భక్తియు కాంక్షయు మనయందు లేదని తోచుటచే మనము అట్టి దేవ ద్రవ్యానుమానమును సమీపించుట మానుకొని యుండతగదు. కావున పవిత్రమగు మహాదివ్యసత్ప్రసాదమును లోకొనుటకు సాధ్యమగునంత యుత్తమరీతిని మనము తయారగుచు, "రోగపీడితులకేగాని ఆరోగ్యవంతులకు వైద్యునితో నవసరము లేద" ని జేసునాథస్వామి చెప్పియుండిన విషయమునుగూర్చి మనస్సున చింతించుటకన్న మిక్కిలి సులభమును యెక్కువ యూరటను గలిగించు విషయము మరియొకటి లేదు.

---

## 4 వ అధ్యాయము

### భక్తితో దివ్యసత్ప్రసాదమును స్వీకరించువారలకు అమిత ఫలములు ప్రసాదింపబడును.

1. శిష్యుడు:- నా యేలినవారా! నా దైవమా! తమ బీద సేవకుడనైన నేను మహనీయమగు దివ్యసత్ప్రసాదమును స్వీకరించుటకు తగిన

రోగ్యతతోడను, భక్తితోడను, తమ్మును సమీపించుటకుగాను, మాధు ర్యమగు మీ యాశీర్వాదములను నాకు ముందుగా దయచేయుడు. నా హృదయము తమయం దనురాగబద్ధమై తమదిశకు మరలునటు లనుగ్ర హించి సోమరితనమునుండి నన్ను కాపాడుడు. మహా దివ్యసత్ప్రసాద మను చలమునందు గుప్తమైయున్న దివ్యామృతమును నాహృదయము రుచిచూడగలుగుటకుగాను, తమ దర్శనమును నాకనుగ్రహింపుడు. ఇట్టి యుత్కృష్టమగు రహస్యమును గ్రహించుటకు నా నేత్రములకు ప్రకాశ మును దయచేసి, సంశయ రహితమగు విశ్వాసముతో దానియందు నమ్మ కము గలవాడనై యుండుటకు తగిన బలమును నాకు ప్రసాదింపుడు. ఏలయనగా ఇదియంతయును తమపనియై యున్నదిగాని, మానవమాత్రుని సామర్థ్యముచే జరుగునదిగాదు. ఈ దివ్యసత్ప్రసాదము తమచే స్థాపింప బడినదిగాని, మానవునిచే కల్పన చేయబడినదిగాదు. ఏలయనగా: దేవ దూతలయొక్క సూక్ష్మబుద్ధికి సహిత మతీతమైయున్న యీ పరమరహ స్యములను యే మానవుడు తనంతటతాను తెలిసికొని గ్రహింపగలడు? కనుక అరోగ్యుడను, పాపియునైయున్న నేను, మృత్తికామాత్రుడను బూడెదతో సమానమగు నేను, అట్టి మహోన్నతమగు దివ్య పరమరహస్య మునుగూర్చి యెటుల యోచింపజాలుదును?

2. ఓ నా యేలినవారా! నిష్కాపట్య హృదయముతోను అచంచల మగు విశ్వాసముతోను తమ ఆజ్ఞలయెడల విధేయతతోను, తమయందే మిక్కిలి యాశగలవాడనై భయభక్తులతో తమ సాన్నిధ్యమునకు వచ్చుచున్నాను. తాము తమ దేవస్వభావముతోను, మనుష్య స్వభా వముతోను యీ దివ్యసత్ప్రసాదములో వేంచేసియున్నారని నేను దృఢ ముగా నమ్ముచున్నాను. నేను తమతోగూడా ప్రేమబద్ధుడనై తమను స్వీకరించుటయే తమ కోర్కెయై యున్నది. కనుక నాయందు దయా ళురై యుండుడని తమను మిక్కిలి దీనత్వముతో వేడుకొనుచున్నాను. నేను తమయందు పరిపూర్ణముగా లీనమై, తమ ప్రేమయందు మునుకలు వైచుచు, ఎవ్వరినుండియూ నెట్టిసౌకర్యము కొరకును నేమాత్రమును వెదకుకొనకుండునట్టి ప్రత్యేకవరమును నాకు దయచేయుడని తమను ప్రార్థించుచున్నాను. ఏలయనగా: ఈ మహానీయమైన దివ్యసత్ప్రసా దమే నా ఆత్మశరీరముల కారోగ్యమైయున్నది, సకల యాధ్యాత్మికా

రుగ్మతలకు దివ్యౌషధమై యున్నది. దీనివలన నాయందలి దోషము అన్నియును నివారింపబడును. నా మానసిక వికారములన్నియు నదుపు నందుంచబడును. మోహములన్నియును జయింపబడును. సుగుణములు పెంపుగాంచును. విశ్వాసము సుస్థిరమగును. నా హృదయమున త్యాగము ప్రజ్వరిల్లి విస్తరించును.

3. ఏలయనగా, మానవులయందలి లోపమును సవరించి, బాగుపరచి ఆంతరంగిక ఆరుదలలను ప్రసాదించునట్టి నా ఆత్మకు ఆధారభూతుడవగు ఓ నా దైవమా! మిక్కిలి భక్తిశ్రద్ధలతో మహా దివ్యసత్ప్రసాదమును స్వీకరించు తమ ప్రియులందరికిని, యీ దేవద్రవ్యానుమానము నందు తామనేక మేలులను దయచేసియున్నారు. ఏలయనగా, వారికి సంప్రాప్తించుచుండు పలుసంకటములందు వారిని కాపాడుటకొరకు తాము యెక్కువగ వాటిని యాచరించుచున్నారు. వారు మిక్కిలి నిరుత్సాహులై యుండునపుడు యుత్సాహపూరితులుగ నొనర్చి, తాము వారిని కాపాడుదురను నమ్మకము కలిగియుండునటుల చేయుచున్నారు. నూతనవరములిచ్చి, మనోహృదయవిశ్రాంతి ననుగ్రహించి, వారికి వికాసము నొడగూర్చుచున్నారు. మీరటు లనుగ్రహించుచుండుటచే దివ్యసత్ప్రసాదమును స్వీకరించుటకు పూర్వము మనోవ్యాకులతను దేవర వారియెడల హృదయానురాగమును లేనివా రందరును, సత్ప్రసాదమును ఆరగించిన పిమ్మట వారుయోగ్యమగు స్థితికి వచ్చినటు లనుగ్రహింతురు. మీ సహాయములేనిచో వారెంత బలహీనులై యుండునదియును తమ దయవలన వారెన్ని లాభములను పొందుచున్నదియును తమ ప్రియులు యనుభవ పూర్వకముగ గ్రహించి అంగీకరించుటకుగాను, తామటుల చేయు కుతూహలము గలవారై యున్నారు. ఏలయనగా: సహజముగ వారు నిరుత్సాహవంతులు; మందమతులు; భక్తిహీనులు. కాని వారు తమచే ఔత్సుక్యముగల వారుగను, యుల్లాసమును దైవభక్తిని గలవారుగను చేయబడుచున్నారు. ఏలనంటే: అమృతతుల్యములగు వరములకు మూలాధారులగు తమ్ము మిక్కిలి దీనభావముతో సమీపించి తమ వలన ఉన్నతమగు వరములను పొందకుండపోవు మానవు డెవ్వడైనను గలడా? లేక ప్రజ్వరిల్లుచున్న అగ్ని సమీపమున నిలుచుండి దానినుండి కొంచమైనను వేడిని పొందకుండు వా డెవడైన నుండునా? అట్లగుటచే తాము

యెల్లప్పుడును పరిపూర్ణమై ప్రవహించుచుండు వరప్రసాదమునకు మూలాధారులై యున్నారు, యెల్లప్పుడును ప్రజ్వలించుచుండు అగ్నియై వెలయుచున్నారు.

4. అందుచే ఇట్టి చలమయొక్క విస్తారతనుండి నేను చేదుకొన జాలకపోయినను, లేక తనివిదీర త్రాగజాలలేక పోయినను, నా కుత్తుక యెండిపోకుండు నటుల నా దాహమును చల్లార్చుకొనుటకై దివ్యమగు వరప్రసాద నీటిగొట్టపు ముఖద్వారము యొద్ద దానినుండి జారిపడు చుండు బిందువులనైనను సేవించుటకుగాను నా నోరు తెరచుకొని యుందును. దేవదూతలవలెను జ్ఞానప్రభావముగల అతిదూతలవలెను ప్రజ్వరిల్లువాడను కాకపోయినను, జీవప్రదమగు యీ దివ్య సత్ప్రసాద మును మిక్కిలి దీనహృదయముతో స్వీకరించుటవలన దివ్యాగ్నినుండి అగ్ని జ్వాలను పొందుటకుగాను నా హృదయము నాయత్తము చేసికొని భక్తికాంక్షలు గలవాడనై యుండుటకు ప్రయత్నము చేయుదును. ఓ సుగుణరాశి ! "భారమును మోయుచు శ్రమపడుచున్న వారలారా ! మా యొద్దకు రండు. మేము మీ సేద దీర్చెదము" ను తమ వాగ్దానము లను పురస్కరించుకొని, నా యందే లోపమున్నను తమ యౌదార్య కనికర భావముచే దానిని తీర్చివేయుడు.

5. నిశ్చయముగ నా నొసటినుండి చెమట కారునటుల శ్రమపడు చున్నాను. హృదయ వ్యసనముచే పీడింపబడుచున్నాను. పాపభారముచే కృంగిపోవుచున్నాను. ప్రపంచ విషయ వ్యామోహములచే కలత బెట్ట బడుచున్నాను. అనేక దుష్ట మనో వికారములు నన్ను నులిమివేయు చున్నవి నాకు సాయముచేయు వారెవ్వరును లేరు. నా దైవమా ! నా రక్షకా ! నన్ని పాపభారమునుండియు ప్రపంచ వ్యామోహముల నుండియును మనో వికారములనుండియును రక్షించుటకు తాము తప్ప మరెవ్వరును లేరు. తాము నన్ను పోషించి శాశ్వత జీవితము గలవానినిగ చేయు ననుగ్రహించుటకు, నన్నును నా సర్వస్వమును తమకు సమర్పించు కొనుచున్నాను. నా యాహార పానీయములకుగాను తమ శరీరమును, తమ రక్తమును తయారుజేసియుంచినట్టి తమను శ్లాఘించుటకును, తమ మహిమను స్తుతించుటకును నన్ను తమ సన్నిధికి చేకొనుడు. ఓ నా పాలిటి

దైవమా! పలుమారు యీ దివ్య సత్ప్రసాదము స్వీకరించుటచే తమను
గూర్చిన ధ్యాన్య నిష్ఠయందలి నా యుత్సాహము పెంపొందునటుల
కరుణింపుడు.

---

## సారాంశము

పావనమగు దేవద్రవ్యానుమానమున జేసునాథుడు నిజముగా
వేంచేసి యున్నారను సజీవనమ్మకమును వారియెడల మిగుల గాఢమైన
ప్రేమయును, మనకు దయచేయుడని జేసునాథస్వామిని ప్రార్థించుదము.
ఓ నాయేలినవారా! నేనిపుడు స్వీకరించుటకు సిద్ధముగానున్న దివ్య సత్ప్ర
సాదమునందు తాము పరిపూర్ణముగ వేంచేసి యున్నారని నేను విశ్వసించు
చున్నాను. తమయందు వెలయుచున్న మానవ ధన్యత్వమువలని
యోగ్యతలయందు నేను భాగస్తుడనై యుండునటుల, తమ పరిపూర్ణ
దైవత్వమునందు నాకు హక్కును దయచేయుటకు కరుణింపుడు. అందు
కొరకై నా ప్రభువా! నాయందు దుష్టవించియున్న యలక్ష్యభావమును,
హృదయ యుదాసీనతను, తమను ప్రేమించి సంతృప్తిపరచుచు తమను
పొందవలయు ననెడి గాఢమగు కాంక్షగా మార్చివేయుడు. తమ
పవిత్ర ప్రేమాగ్నిచే నా హృదయమును ప్రజ్వరిల్ల చేయుటకై వేంచేయు
దేవరవారి యెడల గౌరవముగ ప్రవర్తించునటుల నాయెడల దయ
చూపుడు. మానవుడు గ్రహింపజాలనంత యెక్కువ యగోచరమై
యున్న పరమ రహస్యమునందలి విశ్వాసమునందు నే నెంత స్థిరపడి
యున్నానో, దానినంతటిని పరిపూర్తిచేయుడు. మనోహరమగు తమదివ్య
దర్శనానుభవముతో నాకు యుల్లాసమును గలిగించి, రంజింపజేయుడు.
నాహృదయము దేవరవారిని తన పాలిటిదైవముగను, రక్షకునిగను, తన
పరమ పితగను, నమ్మకముతోను ప్రేమతోను స్వీకరింప గలుగునటుల
ప్రసాదింపుడు. ఓ నాయాత్మా! నీకన్నివైపుల ప్రేమ మిక్కిలి గాఢముగ
నావరించియున్నది. పవిత్రదైవ ప్రేమాగ్ని మధ్యనుండియును, నుత్సా
హమును, భక్తియును లేనిదానవై మంచువలె చల్లబడి యున్నావే?
అయ్యో! స్వామీ! నన్ను నేను తృప్తిపరచుకొనుటయందు మిక్కిలి
పట్టుదల గలవాడనై, దేవరవారిని సంతృప్తిపరచుటయందు మిక్కిలి

యుదాసీనతను వహించియున్నాను. నేనెంత దౌర్భాగ్యుడను ? యెంత పాపిని ? నా యేలికా ? తాము దయదలచెదరేని నాయందలి యుదాసీనత యనెడు రోగమును నివారింపచేయగలరు. తమనుజూచి యొకానొక కుష్ఠురోగి ప్రార్థించునపుడు తాము వానికి" మే మనుగ్రహించుచున్నాము. నిన్నావరించియున్న జాడ్యము నివారించుగాక" యని చెప్పినట్లు నాకును చెప్పి నా యుదాసీనత్వమనియెడు కుష్ఠువ్యాధిని నివారింప జేయుడు.

---

## 5. వ అధ్యాయము

## దివ్య సత్ప్రసాదముయొక్క ఘనత, గురువుల శ్రేష్టత్వము.

1. జేసునాథస్వామి:- దేవదూతలవలె నీవును పవిత్ర ప్రవర్తన గలవాడవైయున్నను, బప్తిస్తుజ్వాన్నేసుగారి వలెనే పరిశుద్ధుడవై యున్నను యీ దివ్య సత్ప్రసాదమును స్వీకరించుటకుగాని ముట్టుకొనుటకుగాని నీవు అర్హుడవు కావు.

ఏలయనగా:- రక్షకునిచే స్థాపితమైన దివ్యపూజచేయుట గాని, దివ్య సత్ప్రసాదమును స్పృశించుటగాని, దేవదూతల అప్పమును ఆహారముగా స్వీకరించుటగాని, మానవుని సుగుణసంపదలనుబట్టి జరుగునది కాదు. ఈ దేవ రహస్యము మిక్కిలిగొప్పది. దేవదూతలకు సహితం మను గ్రహింపబడియుండని యధికారమును పొందియున్న వేదగురువుల అంతస్తు మిక్కిలి ఘనమైనది. ఏలయనగా: పరిశుద్ధ కతోలిక సభలో స్థాపిత మైన గురుపట్టముగల గురువులు మాత్రమే దివ్యపూజచేయుటకును, దివ్య సత్ప్రసాదమునిచ్చుటకును అధికారముగల వారలైయున్నారు. నిశ్చయముగ గురువన దేవుని ప్రతినిధి. దైవాధికారము ననుసరించి వేద నియమమును పాటించి వారు బోధనలను గావించుచున్నారు. కాని దీనికంతను ముఖ్యకారకుడు కనుల కగోచరుడై కార్యనిర్వహణ కర్తయైయున్న దేవుడేసుమా! గురువు కోరునదంతయును దైవాధికారమునకు లోనై యుండును. దైవాజ్ఞలకు సర్వమును అనుకూలపడి యుండును. గనుక

నీ యింద్రియానుభవమునందును బాహ్య విషయములందును గాక ఈ మహోన్నత దేవద్రవ్యానుమాన విషయమున సర్వశక్తివంతుడగు సర్వేశ్వరుని వాక్యములందే విశ్వాసము గలిగియుండుము. దివ్యసత్ప్రసాదమును లోగొనునపుడు నీవు మిక్కిలి భయభక్తులతో ప్రవర్తింపుము. నిన్నుగూర్చి నీవు మిక్కిలి జాగరూకుడవై యుండి, మేత్రాణులవలన నెట్టి ఆచార్యత్వము యొసంగబడినదో గమనింపుము. ఇదిగో నీవొక గురువుగా నియమింపబడినావు. దివ్యపూజసల్పుటకై వినియోగపరుపబడియున్నావు. గనుక లోపము లేవియు లేకుండ విశ్వాసముతోను, భక్తితోను దేవునికి బలి సమర్పణ గావింపుము. నీభారమును నీవు తగ్గించుకొని యుండలేవు. నీవిప్పుడింకను యెక్కువ కట్టుబాటులకు లోనై, క్రమశిక్షణయం దుండవలసియున్నది. ఇంకను పరిపూర్ణమగు పరిశుద్ధతను పొందవలసి యున్నావు.

2. పవిత్ర వస్త్రధారియగు గురువు తనకొరకును, జనులందరికొరకును వినయముతోను దీనత్వముతోను దేవునికి స్తుతిచేయుటకు జేసునాథుని యొక్క ప్రతినిధియై యున్నాడు. జేసునాథు డనుభవించియున్న శ్రమలన్నియును సర్వదా మనమునం దుంచుకొని ధ్యానించుటకై, తాను ధరించు పూజవస్త్రమునకు ముందుభాగమునను వెనుకభాగమునను శ్లీవ చిహ్నములుంచబడినవి. ఇతరులవలన తనకెట్టి సంకటములు, దుస్థితులు సంభవించినను దేవునికొరకై వానినన్నిటిని మిక్కిలి శాంతముగ సహించియుండవలయునను అంశము నెల్లప్పుడును జ్ఞప్తియందుంచు కొనుటకుగాను వారి పూజవస్త్రములపై వెనుకభాగమున శ్లీవ చిహ్నమును ధరించి యున్నారు. తానాచరించిన పాపకృత్యములను తలంచుకొని దుఃఖించుటకుగాను తన ముందుభాగమున శ్లీవ చిహ్నమును గలిగియున్నారు. ఇతరుల పాపములనుగూర్చి జాలినొంది దుఃఖించుటకును, దేవునికిని పాపికిని తాను మధ్యవర్తిగా నియమింపబడి యున్నాననెడి విషయమును మానసమునందు స్మరించుకొనుటకును వెనుకభాగమునందు శ్లీవను ధరించి యున్నాడు. తాను ప్రార్థించుచున్న దేవుని ప్రేమయు వరప్రసాదమును తనకు లభించువరకు దైవప్రార్థననుండియును దివ్యపూజ సమర్పణనుండియును విరమింపతగదు. గురువు పూజ సల్పునపుడు దేవునికి స్తుతి కలుగజేయుచున్నాడు. దేవదూతల కానందము గల్గించుచున్నాడు. తిరు

సభను జ్ఞానవంతముగా నొనరించుచున్నాడు. జీవించియున్న మానవులకు సహాయము చేయుచున్నాడు. మరణించియున్న వారలకు శాంతి నొడగూర్చుచున్నాడు. ప్రతి యోగ్యతయందును అతడు పాలిభాగస్థుడై యనుభవించుచున్నాడు. ప్రతి పుణ్యమునందును ఆయన కొంత భాగమును పొందుచున్నాడు.

---

## సారాంశము

దివ్యపూజ చేయునప్పుడు గురువు పాటింపవలసిన పవిత్ర నియమములు: అట్టి సమయమున సహాయకారిగ నుండు భక్తుడు అనుసరించవలసిన నియమములు.

తానొక గురువుగ నియమింపబడుటవలన, గురువు దైవమునకు పూజబలిని సమర్పింప యధికారమును స్వీకరించి యున్నాడు. అందుచే అర్చ్య. అగుస్తీనుగారు వక్కాణించి యున్నటుల గురువు మాటప్రభావముచే "దేవుడే తిరుగ యవతరించి నూతన జీవితము ధరించుచున్నాడు" ఒక విధముగ ఈ శక్తిచే నాతడు దేవదూతలకన్న నధికుడగుచున్నాడు. సృష్టియందలి జీవులన్నిటికన్న నెక్కువ శ్రేష్టత్వముగలవాడై స్తుతిపాత్రుడగుచున్నాడు. సర్వశక్తిగల "దేవుని పీఠము నలంకరించి యుండెడు ఓ గురువా! మీ రిట్టి స్తుతిపాత్రమగు అంతస్తును వహించి యున్నారు గనుక, మీ రెట్టి గొప్ప బాధ్యతలు గలవారై యున్నారు! దైవపీఠము సన్నిధికి మీ రెట్టి తలంపులతో, యెట్టి భావములతో సమీపింప వలయునో అట్టి తలంపులను భావములనే దినమంతయును మీ యందు వర్ధిల్ల చేసికొనుటకు ప్రయత్నము గావించుకొనవలయును. దైవవరప్రసాదములందు నమ్మకము గలవారలై మీ విధులన్నిటి యందును శ్రద్ధవహించి, పాటుపడి పరిశ్రమచేయుచు వారి సముఖమున స్మరియించుకొనుచు దేవునితో స్థిరముగ ఐక్యమగుడు. దేవునియొక్క ఘనతకొరకును ఆత్మలయొక్క ముక్తికొరకును పరిపూర్ణముగ సమర్పింపబడు దివ్యపూజలో జేసువుయొక్క జీవమును భావమును నీ యాత్మయందు చెడతెగక అభివృద్ధి గావించుకొని, వాని నన్నిటిని జేసునాథునికే సమర్పింపుము. పవిత్రమగు పూజను యథావిధిగ జరిగించునపుడు దైవ

పీఠముపైని జేసునాథు డేమి నిర్వహించియుండిరో దానిని ఆరంభమున నీ అంతరంగమునందు నిర్వహించుటకై ప్రయత్నము చేయుము. అత్యంతమగు దీనభావమును వహింపుము. నీవు దేవునికి మనవి చేసికొనియెడు విన్నపములందు నిన్ను వారికి బలిగా సమర్పించుకొనుము. తదుపరి నీ యాత్మబలిని జేసునాథుని శరీర రక్తబలితో కలిపివేయుము. వారి భావములందును సంకల్పములందును లీనమైపొమ్ము. మానవుల ముక్తి కొరకై జేసునాథుడు శాశ్వతుడై వెలయుచున్న తన పితకు తనను సమర్పణ గావించుకొనుటలో నీ పూజబలియందు నిన్నెటుల మతాచార్యునిగా చేసికొని యుండిరో, ఆటులనే నీ చేతులలో నాహుతి యగుచున్న రక్షకునికి నిన్ను నీవు బలిగా సర్పణ చేసికొనుము. నీ హృదయమునందు వారు దివ్య సత్ప్రసాదముద్వారా నిలచియుండి నీ ముక్తి కొరకై కావింపవలసిన ఘనకార్యమును పూర్తిచేయుటకుగాను, దైవపీఠముపైని వారు తమను పరిపూర్ణముగ నీ కొరకై యర్పించుచు నీ స్వంతమై పోవుచున్నారు గనుక, నీవును నీ యందలి నీ హక్కునంతయును విసర్జించి, నిన్ను నీవు పరిపూర్ణముగ వారి కర్పించుకొనుము. దేవుని శరీరముతోడను, రక్తముతోడను పోషింపబడి పెంచబడు మతగురువు దేవునికొరకే జీవించి యుండవలయునని "అర్చ్యశిష్ట అగుస్తీనుగారు వక్కాణించియున్నారు. లోకేశ్వరుడగు దేవునికి జంతుబలిని ధూపము నర్పించియున్న కాలమున, పురాతన నిబంధనల ననుసరించి నియమింపబడిన మతాచార్యులు పవిత్ర జీవనము చేయువలసిన వారలై యున్నచో, ప్రతి దినమును దేవునిని దేవునికే యర్పణచేయుచున్న యీ నూతన నిబంధనల ననుసరించి నియమింపబడిన మతాచార్యులు ఇంకనెంత పరిపూర్ణమగు పావన జీవితముగలవారలై యుండవలయును! భూలోకమునందు మనుష్యుడై యవతరించిన జేసువుయొక్క శరీరమును బలియిచ్చుచున్న హస్తము, మిక్కిలి పవిత్ర జీవముగలదై యుండవలయు"నని అర్చ్య. క్రిసోస్టముగారు చెప్పుచున్నారు. 'జేసునాథుని రక్తపానముచే అరుణవర్ణముగల నాలుక, నోరు యెంత కళంకరహితమై యుండవలయును! మానవావతారమెత్తిన జేసువును దివ్యపూజలో యర్పింప నియమించబడిన గురువుయొక్క హృదయమెంత పవిత్రముగా నుండవలయును! సృష్టికంతటికిని ఏలికయగు, దేవునిచే నియమించబడియున్న

మతాచార్యా, జేసునాథస్వామియే నీద్వారా దివ్యపూజ చేయుచున్నా రనియు, దివ్యపూజచేయు నధికారము వారినుండియే నీవు స్వీకరించు టచే నీ హృదయము వారి పవిత్రతో పూరితమై, వారి దివ్యమార్గము ననుసరించి నీవు ప్రవర్తింపవలయు ననియును గ్రహింపుము. సమర్పణ జపమును చెప్పునపుడు నీవుచ్చరించు వాక్యములతో గూడా నీ హృదయ మును నీసర్వస్వమును దేవునికర్పింపుము.

గురువులును. జనులును ఆరాధనను యథావిధిగ జరిపిన పిమ్మట ఐహికానందములను, బూటకములు నిస్సారములగు ప్రపంచ విషయము లను విసర్జించి, కామక్రోధాది మనోవికారముల నాశనమొనర్చుకొని, తమ విధులను నెరవేర్చుటయందే పరిపూర్ణముగ నిమగ్నులై యుండవల లెను. అర్చ్య॥ అగుస్తీనుగారు నుడివిన విధమున "మతాచార్యులు ఆ ధ్యాత్మికముగ తమను దేవునియొక్క మతాచార్యులుగను, ఐహికముగ తమను దేవతులకు బలులుగా నియ్యబడియెడు ఉపాహారములుగను చేసికొనవలయును." తక్కిన క్రీస్తు జనులోయన, దైవ పీఠముపై యధి ష్ఠించియున్న జేసునాధుని భావములు గలవారలై, అధికారమునందు గాక, అడకువయందు మతాచార్యులను బోలిన జీవనము సల్పువారలై యుండవలయును. కలుషములై యున్న తమ జీవితములను మార్చుకొని తామాచరించిన పాపములకు దుఃఖమును కలవారలై జ్ఞానమార్గమునందు ప్రవేశించి, కల్వరిగిరినుండి క్రీస్తునాథుని యందు భక్తి విశ్వాసములతో మరలివచ్చితిమని జ్ఞప్తియందుంచుకొనవలెను.మతాచార్యులారా! కల్వ రిగిపై సమర్పింపబడిన బలియేయగు యీ దివ్యపూజ ముగిసిన పిమ్మట, మీరెంత యెక్కువగ పవిత్ర జీవములను జీవింపవలసి యున్నారో, యోచించు కొనుడు.

దేవారాధనకు వేంచేసియున్న మానవులారా ! పూజను గాంచిన పిమ్మట మీరాచరించియున్న నేరములను గూర్చి మీరెంతయెక్కు వగా పశ్చాత్తాపము పొందవలయునో, జేసునాథుని యందు యెక్కువ విశ్వాసమును, ఆశయును గలవారలై మిమ్ము బలులుగా సమర్పించు కొనవలయునని, యెంతయెక్కువ సంకల్పమును గలిగి యుండవలయునో ధ్యానించి చూడుడు.

—

## 6 వ అధ్యాయము

## దివ్యసత్ప్రసాదమును లోకొనుటకు పూర్వము చేసికొనవలసిన ఆత్మపరీక్ష

1. శిష్యుడు:- ఓనాయేలికా, తమ ఔన్నత్యమును గూర్చియు నా నీచత్వమును గూర్చియు నే నాలోచించు కొనునపుడు, భయముచే కంపించుచు నాలో నేను భ్రమ జెందిన వాడనగుచున్నాను. నేను తమ సముఖమునకు రాకుంటినా ! జీవమునుండి పారిపోవలసిన వాడనగుచున్నాను. అవసర సమయములలో నాకు సలహాలను దయచేసెడి నా ఆలోచనకర్తా ! యీ సంవత్సరమున నేను చేయవలసినదేమి?

2. నాకు చక్కని ప్రవర్తనా మార్గమును గరపుడు. ఈ దివ్యసత్ప్రసాదమును స్వీకరించుటకు నేను తయారగుటకు చేయవలసిన కొద్దిపాటి క్రియలను సాధనచేయుటయందు నన్ను నియమింపుడు. ఫలప్రదాయిని యగు దివ్యసత్ప్రసాదమును స్వీకరించుటకును, ఘనమగు దివ్యపూజను చేయుటకును, నేను నా హృదయమును భక్తిప్రపత్తులతో గూడిన దానినిగా యేవిధముగ నొనర్చుకొనవలయునో నేను గ్రహించునటు లొనర్పుడు.

---

## సారాంశము

"దివ్యసత్ప్రసాదమును తగిన యర్హతగలవాడనై స్వీకరించుటలో మనసునం దుంచుకొనవలసిన ముఖ్యమగు భావములతో మన హృదయములం దెల్లప్పుడును జేసునాథుడే రాజ్యమేలుచున్నాడు." అని సంకల్పించుకొని యుండుట యొకటి. అన్ని విషయములందును మనము జేసునాథునికి విధేయులమై యుండవలయును. మననుండి వారు కోరునదేమియును తిరస్కరింపతగదు. ఏలయనగా: వారు రాజ్యాధికారమును వహించి సర్వమేలులను యుదారస్వభావముతో ననుగ్రహించెడు ప్రభువువలె మనదగ్గరకు దయచేయుచున్నారు. కామక్రోధాధి మనోవికారములమీదను, మనయందు పెచ్చుపెరిగియున్న ప్రపంచ విషయాను

రాగములమీదను అధికారమును వహించుటకుగాను వారు మన ఆత్మ లోనికి ప్రవేశించుచున్నారు.

---

## 7 వ అధ్యాయము.

## ఆంతరంగిక పరిశోధన, దానిని క్రమపరచుకొనవలయునను ధృడసంకల్పము.

1. జేసునాథస్వామి:- అన్నిటికంటె నెక్కువగ మిక్కిలి హృదయ దీనత్వముతోను, వినయ విధేయతలతోను, పరిపూర్ణ విశ్వాసముతోను, దేవుని ఘనతనుగూర్చిన పవిత్ర భావముతోను, దేవునిచే నియమింపబడిన గురువు యీ దేవద్రవ్యానుమానమును పాలించుటకును, యీ మహాదివ్య సత్ప్రసాదమును తన హస్తములతో నంటుకొని స్వీకరించుటకును రావలసియున్నాడు. నీ మనశ్శాంతికి భంగము కలిగించి, నీవు యీ దేవద్రవ్యానుమానమును సమీపించుటకు విఘ్నకారిగానుండు విషయమేదైనను లేకుండుటకై నీ హృదయమును సంపూర్తిగా పరీక్షించి, దుఃఖమువలనను, మరల పాపసంకీర్తనము వలనను దానిని పరిశుద్ధపరచి, పవిత్రవంతమైన దానినిగా చేసికొనుము. సామాన్యముగ నీ వొనరించియున్న సర్వపాపములనుగూర్చి పరితపించుము. అందుకు ముఖ్యముగ ప్రతిదినమును నీవాచరించుచున్న దోషములనుగూర్చి దుఃఖించుము. నీకింకను విరామముండునేని, నీ మానసిక వికారములచే సంప్రాప్తించుచున్న దురవస్థలనుగూర్చి నీ హృదయాంతరంగమున రహస్యముగ దేవునికి మొర పెట్టుకొనుము.

2. ఇంకను నీవు విషయాసక్తుడవై ప్రపంచ విషయాలోలుడవై యున్నందుకును, నీ మనోవికారములనింకను నదుపునం దుంచుకొనజాలనందుకును, కామ వికారచేష్టలయందు మునిగి తేలుచుండినందుకును, నీ యింద్రియ వ్యాపారములనుగూర్చి తగినంత కాపుదల చేసికొనలేనందుకును, వృధాడంబరమగు మనోకల్పిత భ్రమలయందు చిక్కుబడి యుండినందుకును, బాహ్యవిషయములయెడల మిక్కిలిప్రీతిగలవాడవై యున్నం

దుకును, ఆంతరంగిక విషయములనుగూర్చి మిక్కిలి యలక్ష్యభావమును
వహించి యుండినందుకును, పరులను పరిహాసముచేయుచు పోకిరివై దుష్ప్ర
వర్తియ నిగళతయందు చురుకుదనము గలవాడవై యుండినందుకును,
నీ పాపములగూర్చి కనులనీరు గార్చుచు పరితాపమును పొందకుండునంత
కఠినహృదయుడవై యుండినందుకును, సులభముగ అభ్యమగునట్టి సౌఖ్య
సంబంధమగువిషయములయం దెక్కువ యాశగలవాడవై యున్నందుకును
సుఖవిసర్జనయందును మనఃపూర్వకతయందును సోమరివైయుండినందుకును,
నూతన సమాచారములు వినుటకును, శృంగార దృశ్యములు గాంచుటకు,
మిక్కిలి జిజ్ఞాసాపరుడవై యుండినందుకును. హీనమగునట్టియు గర్హ్య
మగునట్టియు విషయములను మానుకొనుటయందు నిరసన భావముతో
నుండినందుకును, యెక్కువ సంపదలు కలిగియుండ వలయుననెడి
దురాశా పీడితుడవై యుండినందుకును, దానముచేయుటలో నీయందలి
లోభత్వమునకును, నీ ఆస్తి విషయమున మిగుల లోభితనముతో ప్రవర్తిం
చినందుకును, నీ సంభాషణలయందు అవివేకివై యుండినందుకును, లేశ
మైనను మానమువహించి యుండజాల నందుకును, నీ నడతయం
దెక్కువ క్రమము తప్పినవాడవై యుండినందుకును, భోజనప్రియుడవై
యున్నందుకును, దేవుని నీతిబోధలకు చెవియొగ్గ నందుకును, విశ్రాంతి
యనుభవించుట కాతురత కలవాడవై యుండినందుకును, కష్టపడుట
కిష్టపడక యుండినందుకును, ప్రొద్దుపోక సల్పుచుండెడు సోమరి సుద్దు
లను వినుటయందు నిదురపోవక జాగరూకుడవై యుండినందుకును,
దైవసేవకై జాగరణచేయుట యందెక్కువ నిదురమంపుగల వాడవై
యుండినందుకును, ప్రార్థనల నతిస్వల్పములోనే ముగింపవలయునని
యెక్కువ తొందరగలవాడవై యుండినందుకును, ప్రార్థనలయందే
మానసము నిలిపియుంచక, యెక్కువ పరధ్యానము గలవాడవై యుండి
నందుకును, నీ ప్రతిదిన జపము గావించుకొనుటలో నెక్కువ యలక్ష్య
భావము గలవాడవై యుండినందుకును, అతిత్వరితముగ మానసిక
చంచలత్వము కలవాడవగు చుండినందుకును, ఆంతరంగిక చింతనెన్నడు
చేసికొనకుండి నందుకును, మిక్కిలి సులభముగ నహంకారావేశుడవగు
చుండినందుకును, పరుల మానసములను నొప్పించుచు వారికి మనస్సం
తాపమును కలిగించు వాడవుగ నుండినందుకును, పరులచర్యలను గూర్చి,

అక్రమ తీర్మానములు చేయువాడవై యుండినందుకును, పరదోష ఖండన యందు కాఠిన్యత గలవాడవుగ నున్నందుకును, భోగభాగ్యలోలసుడవై యుండినందుకును, కష్టకాలములయందు మిక్కిలి బలహీనమగు మానసము గలవాడవై క్రుంగిపోవు వాడవుగ నున్నందుకును, యోగ్యమగు విషయములను పలుమారు సూచించినను వానిని లేశమాత్రమైనను కొనసాగింప జాలకుండినందుకును, మిక్కిలి నిట్టూర్పులు విడచుచు దుఃఖించుము. అదియే నీకు శ్రేయస్కరము.

3. పైని చెప్పబడినవే గాక ఇంకను నీయందుండెడి యితరలోపముల నంగీకరించుచు, వీనిని గూర్చి ప్రలాపించుము. నీ దౌర్బల్యత యందసహ్యభావము గలవాడవై నీ జీవితమును సవరించుకొని, చక్కపరుచుకొనుము. సద్గుణ సంపాదనయందు వృద్ధిగాంచవలయు ననెడి దృఢసంకల్పమును గావించుకొనుము. అంతట పరిపూర్ణదృఢ సంకల్పముతో మన స్ఫూర్తిగ మాస్తుతికొరకై నీ హృదయమనెడి దివ్య పీఠముపైని నీ యాత్మను, శరీరమును, మాకు బలిగా సమర్పించుకొనుము. అటులచేయుదువేని, బలి సమర్పణచేయుటకై దేవుని సమీపించుటకును, నీ ముక్తికొరకై నా శరీరమును దివ్యసత్ప్రసాదము ద్వారా స్వీకరించుటకును తగిన యోగ్యతగలవాడవగుదువు.

4. పూజబలి సమయమునందును, దివ్యసత్ప్రసాద స్వీకారమునందును జేసునాథస్వామి శారీర సమర్పణతో గూడా నిన్ను నీవు పరిపూర్ణముగ సమర్పించుకొనుటకన్న, నీ పాపములను కడిగివేయగల యోగ్యమగునట్టి సమర్పణ మేదియును లేదు. వరములు పొందుటకై యెవరు నిజమైన మనస్తాపముతో మా యొద్దకు వచ్చుదురో, అట్టివారు నిర్భాగ్యమరణమును పొందవలయునని మేము కోరము. అట్టి మానవుడు జ్ఞానమార్గానువర్తనుడై జీవించవలయుననియే వాంఛింతుము. వాని పాపములను మేము మరచిపోదుము. అన్ని పాపములను క్షమింతుము.

దివ్య సత్ప్రసాద స్వీకారమునందు ఆవశ్యకమగు మొదటి సద్గుణ మేదియన: హృదయ పవిత్రత;- అది యెట్టిదనిన:- బుద్ధిపూర్వకముగ నెట్టి పాపమును చేయకుండుటయు, అట్టి పాపకృత్యములు చేయవలయు ననెడి స్వభావమునే గలిగియుండక, ప్రపంచ విషయముల కంటియుండక పోవుటే హృదయ పవిత్రత యనబడును. గురువులతోను దివ్యసత్ప్రసాద

స్వీకారమును చేయుచున్న వారలతోను సంభాషించుచు, మన మందర
మును నిర్దోషత్వమనియెడు యుడుపును ధరించి దేవుని దివ్యపీఠమును
సమీపింపవలయు”నని అగ్చ్య. అగుస్తీనువారు సూచించియున్నారు.
గనుక యీ దివ్య దేవప్రసాదమును లోకొనుటకు ముందుగ నీవు సామాన్య
ముగ చేయుచుండు తప్పిదములను గూర్చి విపులముగా నీ మనస్సాక్షిని
మిక్కిలి జాగరూకతతో పరిశీలన గావించుకొనవలయును. దేవుని
సముఖమున నీవు నిలచియుండునపుడు, నీ యాత్మయం దేదియును ఘోర
మగు పాపము లేకుండునటుల జాగ్రత్తపడుము. లేక దానియందు
ఘోరపాప మేదేని యున్నచో నిష్కాపట్యమగు దుఃఖముతో దాని
యంగీకరించి ఆయత్తము చేయుము. ఏలయనగా: యీ సందర్భమున
కేవల పరితాపము చాలదనియును, పవిత్రమగు దేవద్రవ్యానుమానమును
సమీపించుటకుముందు పాపసంకీర్తనము చేయవలయుననియు త్రెంటు
సమావేశము వారు చెప్పుచున్నారు. “తన శాశ్వత వినాశనమునకుగాక
యీ దివ్యాప్పమును స్వీకరించుటకుగాను తాను తగినవాడని ప్రతి
వ్యక్తి వ్యక్తము చేసికొనునుగాక” అని అర్చ్య. చిన్నప్పగారి వాక్య
ములై యున్నవి. అటుల చేయుదువేని, దైవసంబంధమగు యీ అప్పమును
మిక్కిలి యోగ్యతతో స్వీకరించవచ్చును. అటుల ఆయితేముగాక దివ్య
సత్ప్రసాదమును స్వీకరించుటకు తగినయోగ్యత లేకయే లోకొను
నేని, ఆతడు దోషియై శిక్షార్హుడగును. ఇట్టి కష్టము ప్రాప్తించకుండు
నటుల ముందుగనే అతని యోగ్యతను మేము పరిశీలన గావించెదము.

---

## సారాంశము

ఏదేని ఘోరపాపము చేసియున్నావని నీ మనస్సాక్షి నిన్ను కలత
పెట్టుచున్నదా లేదాయను విషయమును మాత్రము పరిశీలించుకొని
అంతటితో తృప్తినొంది యుండకుము. దేవుని సముఖమునందు సైతము
యాత్మపరీక్ష గావించుకొనుము. మిక్కిలి సులభముగ నీవాచరించు
చుండెడి అల్ప పాపకృత్యమును సైతము ద్వేషించుకొనుము, అందును
ముఖ్యముగ నీవు బుద్ధిపూర్వకముగ యాచరించిన పాపకృత్యముల
యెడల మిగుల ద్వేషముగలవాడవై యుండవలయును. ఈ విధముగనే
నీవు ద్వేషించవలసిన మరికొన్ని విషయము లీక్రింద చెప్పబడును.

(a) మామూలుగా గావించెడు పాపములు.
(b) అనురాగమువలన గావించెడు పాపములు.
(c) స్వభావము ననుసరించి చేయు పాపములు.
(d) ఇతరులను పురికొల్పి వారిచేత చేయించెడు పాపములు.
(e) ఇతరులతో గూడా కలసి వారును నీవును చేసినపాపములు.
(f) రహస్యముగ చేసెడు పాపములు.

నీవు జేసునాథస్వామిని స్వీకరించునపుడు, నీ యీ పాపములన్నిటిని క్షమింపుమని వారిని ప్రార్థింపుము. ఈ పాపములన్నియును సవరించుమనియును, అట్టిపాపముల నాచరించినందుకు నిన్ను శిక్షించవలసినదనియును ప్రార్థింపుము.

---

## 8 వ అధ్యాయము

## క్రీస్తునాథుని స్లీవబలి–మన ఆత్మ సమర్పణ

1. జేసునాథస్వామి:- దేవుని మహోగ్రమగుయాగ్రహ శాంతికొరకై బలి సమర్పించుటలో నాయంగేమియును దాచియుంచుకొనకుండులాగున దిగంబరినై, కొరతమాను పైని నాహస్తములను చాచుకొని, మీ పాపములను తొలగించుటకై నా పరమ పితకు నన్ను నేను మనఃపూర్వకముగ సమర్పించుకొని యున్నాను. అదేరీతిని మీరును ప్రతిదినమును పూజబలి సమయములో మీకు సాధ్యమగునంత హృదయ పూర్వకకతతో మీకుగల శక్త్యానురాగములతో నిష్కల్మషముగు బలిగా మిమ్ము నా కర్పించుకొనుడు. మిమ్ము మీరు పరిపూర్ణముగ మాకుసమర్పించుకొనుట కంటె నేను మీనుండి కోరునదేదియు నుండబోదు. మిమ్ము తప్ప మీరు మాకితర మేమర్పించినను, మేము దానిని లెక్కచేయము.

2. మమ్ము తప్ప మీ కితరవిషయములన్నియును గలియుండినను, మాకటుల యవి చాల కుండునో, ఆదేరీతిని మిమ్ము మీరు మాకర్పింపకుండునంత కాలము మీరు మాకితర మేమి యర్పించినను, అదిమాకు సంతృప్తి నొడగూర్ప జాలదు. మిమ్ము మాకర్పించుకొని మిమ్ము పరిపూర్ణముగ దేవునికై వినియోగించుకొనుడు. మీరటుల గావించుదు

లేని, మీ రర్పించెడు బలి యంగీకరింపబడును. మేము పరిపూర్ణముగ మీ వారమై యుండుటకును, మీరు పరిపూర్ణముగ మా వారలై యుండుటకును, మీకొరకై పరిపూర్ణముగ మా తండ్రియగు దేవునికి సమర్పించుకొనియున్నాము. మా సర్వాంగములతో గూడిన శరీరమును, మా రక్తమును మీకు భోజనముగ సమర్పించియున్నాము. ఐతే మీరు మామీదనే యాధారపడుటయందే కాంక్షగల వారలై, మా యిష్టప్రకారము మిమ్ము మాకర్పించుకొన నిష్టపడరేని, మీరు సమర్పించెడు బలి పరిపూర్ణమగు బలి కాజాలదు. కనుక మీరు ఆత్మస్వాతంత్ర్య కాంక్షగలవారలై దైవవరముల నాశింతురేని, మీ రాచరించెడి కార్యము లన్నిటికంటె ముందుగ దేవుని దివ్యహస్తములలో మిమ్ము బలిగా సమర్పించుకొనవలయును. కొలదిమంది మాత్రమే జ్ఞాన ప్రకాశము గలవారలై, అంతరంగిక స్వాతంత్ర్యము గల వారలగుచున్నారు. ఏలయనగా: "పెక్కుమంది పరిపూర్ణత్యాగము గావించుకొనుచుండుటలేదు. మానవుడు పరిపూర్ణ పరిత్యాగము చేసినగాని, మా శిష్యుడు కాజాలడు" అనెడు మా వాక్యము స్థిరమైనది. కనుక నీవు మా శిష్యుడవు కాదలంచితివేని నీ సర్వానురాగములతో నిన్ను మాకర్పించుకొనుము. పలుమంది క్రైస్తవులు దివ్య సత్ప్రసాద స్వీకార సమయమున తమను దేవునికి పరిపూర్ణముగ నర్పించుకొనుచున్నను, క్షణములో తిరుగ స్వకాంక్షగలవారలై పోవుచున్నారు. వీరు ప్రవర్తించుచున్న రీతిని ప్రవర్తింపకుము. వీరి జీవితములు పాపకర్మలచే వెంబడించ బడుచున్న అయోగ్యమగు తలంపులతోనే గడచి పోవుచుండును. ఒక నిముసమున యోగ్యమగు సంకల్పములు గలవారై యుందురు; వెంటనే వాటిని విసర్జించి పాపకర్మల నాచరించెదరు. తిరుగ మరుసటి నిముసమున మంచి కాంక్షలు గలవారై వెంటనే తిరుగ పాపకర్మలనే యాచరించెదరు. వీరి జీవితమంతయు నిటులనే సాగిపోవుచుండును. కనుక యిట్టి ప్రవర్తనగల వారలెప్పుడు దైవభీతియందుగాని, లేక దైవప్రేమయందుగాని అధికులు కాజాలరు. వెనుక ముందు చూడక అతివ్యయము చేయువారివలె, దేవుడు కొంతమందికి వరప్రసాదములు దయచేయుచున్నారు. అట్టి దయామయుని యెడల యీ మానవులు మిక్కిలి నీచప్రవర్తనగలవారై, లేశమైనను యుదారస్వభావములేని వారలై పోవుచున్నారు. ఇట్టి వారిని గూర్చి ప్రస్తావనచేయుచు దీర్ఘదర్శులీక్రింది విధముగ చెప్పియున్నారు.

"మానవుడు చూపెట్టుచున్న న్యాయవిరుద్ధములకు అత్యాశా కారణముచే, వానియందు మాకు ఆగ్రహము గలిగి వానిని మేము దండించుచున్నాము. నిన్ను చూచుటకు మాకు నసహ్యముగ నుండుటచే నీవైపునకు చూడక మేము ముఖము త్రిప్పుకొనుచు, నీయందాగ్రహము వహించియున్నాము. ఆతడు హృదయ చంచలత్వము గలవాడై దేశ ద్రిమ్మరియై పోవుచున్నాడు." (ఇజయాసు 7-17)

---

## 9 వ అధ్యాయము.

### మన సర్వస్వముతో మనలను మనము దేవునికి పరిపూర్ణముగ సమర్పించుకొని, అందరి మానవుల రక్షణకొరకై దేవుని ప్రార్థింపవలయును.

1. శిష్యుడు:- ఏలినవారా! ఇహ పరలోకములయందుండున దంతయును తమ స్వంతమై యున్నది. స్వేచ్ఛాపూర్వకమగు బలి సమర్పణగ నన్ను నేను తమకు సమర్పించుకొని, సర్వదా నేను మీవాడనై యుండ వలయునను కాంక్ష గలిగియున్నాను. నా ప్రభువా! నేను సర్వదా తమకు సేవచేయుటకును, తమ శాశ్వత స్తోత్రముకొరకై నేను బలియై పోవుటకును, నిష్కపటహృదయముతో యీదినము నన్ను తమకు సమర్పణము చేసికొనుచున్నాను. అగోచరులై తమచుట్టును పరివేష్టించి యున్న తమ దేవదూతల సముఖములో నా మోక్షము కొరకును, విశ్వమునందలి సర్వమానవుల ముక్తికొరకును, యీ దినము నేను సమర్పించుచున్న అమూల్యమగు తమ శారీరబలితోగూడ, నన్నును తమ కర్పించుకొనుచున్నాను.

2. ఏలినవారా! నేను పాపకృత్యము లొనరింపగలిగిన దినమునుండి యీ గడియవరకును తమ సముఖమునను, తమ దేవదూతల సముఖమునను నేనాచరించిన పాపములను, నేరములను ప్రాయశ్చిత్త బలిపీఠముపైని తమకర్పించుచున్నాను. తమ త్యాగాగ్నిచే వానినన్నిటిని దగ్ధముగావించి క్షయమొనర్పుడు. నా పాపకల్మషము నంతయు తొలగించి

వేయుడు. నా నేరములన్నిటినుండి నా యంతరంగమును పరిశుభ్రపరచుడు. నా దుష్కృత్యముల నన్నిటిని పూర్తిగా క్షమించి నాయందు పరిపూర్ణ కనికరము గలవారలై, నేను శాంతసౌఖ్యము ననుభవించునటు లొనరించి, పాపముచే కోల్పోయియున్న మీ యిష్టప్రసాదమును తిరుగ నాకు ప్రసాదింపుడు.

3. నాపాపములన్నిటిని యంగీకరించి వానినిగూర్చి దుఃఖించుచు వానిని క్షమించి నాయందు దయచూపుడని యెడతెగక తమ్ము ప్రార్థించుటకన్న, నా పాపములనుగూర్చి నేను చేయగలదేమిగలదు? ఓ నా దైవమా! నేనిపుడు మీ సన్నిధానమున నిలచియున్నాను. నాయందు దయ గలవారలై, నా మనవిని ఆలకించుడని తమను ప్రార్థించుచున్నాను. నేనాచరించియున్న పాపములన్నిటినిగూర్చి తలంచుకొనిన నాకు మిక్కిలి యసహ్యము కలుగుచున్నది. నేనింకెప్పటికిని యీ పాపముల నాచరింపను. వానినిగూర్చి నేను మిగుల చింతించుచున్నాను. నేను జీవించి యుండునంత కాలము వానిని తలంచుకొని దుఃఖము నొందుచుండెదను. వానికి పరిహారార్థముగ నేను మంచిజీవితము నవలంభించి కాయక్లేశము ననుభవించి, నాకు సాధ్యమగునంతవరకు నా పాపములన్నిటినిగూర్చి తమకు తగిన తృప్తిని గలిగింప కాంక్షించుచున్నాను. దైవమా! నన్ను క్షమింపుడు. నా పాపములన్నియును తమ ఘనతకొరకై క్షమింపుడు. అమూల్యమగు తమ దివ్యరక్తముచే తాము విమోచనము గావించిన నా యాత్మను రక్షింపుడు. నన్ను తమ దయకు వదిలివేసికొనుచున్నాను. నన్ను తమ హస్తముల కర్పించుకొనుచున్నాను. నా యందలి క్రూరత్వమునకును, నా అన్యాయ అక్రమ ప్రవర్తనకును తగినటుల నన్ను దండింపక, తమ దయానుసారముగ నన్ను వీక్షింపుడు.

4. నా యందలి మంచి కృత్యములన్నియును, అవి స్వల్పములును లోపభూయిష్టములై యున్నను వానిని తమకే యర్పణ చేయుచున్నాను వానితో తృప్తిగాంచుడు. అవి తమ కంగీకారముగ నుండునటు లొనర్పుడు. ఇంకను మిక్కిలి మందమతినై, సోమరినై నిష్ప్రయోజకుడనై నిర్భాగ్య పాపిష్ఠినైయున్న నన్ను యోగ్యమగునట్టి స్థితికి గొంపోవుడు.

5. నా తలిదండ్రుల యొక్కయు, స్నేహితులయొక్కయు, సోదర సోదరీల యొక్కయు, నా సర్వప్రియుల యొక్కయు, నా యుపకారుల యొక్కయు అవసరముల నన్నిటిని తమ కర్పణ చేయుచున్నాను. తమ వరప్రసాదము వలని సహాయమును, తమ ఓదార్పు వలని లాభమును, అన్ని అపాయములనుండి రక్షణను, బాధలనుండి విముక్తిని తాము దయచేయ వలెనని ప్రార్థించుచు, వారి యవసరముల నన్నిటిని తమకు నివేదించు చున్నాను.

6. అంతేగాక ముఖ్యముగ నే సందర్భమునందైనను, నాకు దోషము లను గావించి నన్ను దుఃఖముల పాలుచేసిన వారి కొరకును, నాకు కష్టములను కలిగించి నా కసంతృప్తిని గలిగించి యున్నవారి కొరకును, వారి పాపపరిహారార్థముగ నీ బలిని నా ప్రార్థన పూర్వకముగ తమ కర్పించు చున్నాను. ఇదే విధముగ నే నెప్పుడైనను ఎవరికైన తొందర కలిగించి, అపకారము లాచరించి, మాటలవలనగాని, కార్యరూపమునగాని, తెలిసి గాని, తెలియకగాని నింద అవమానముల పాలుచేసి యుంటినో వార లందరికొరకును నేనీ బలిని సమర్పించుచున్నాను. మే మందరము యొండొరుల యెడల గావించుకొని యున్న మా పాపములను అపచార ముల నన్నింటిని తాము క్షమించుటకొరకై, నేనీ బలిని సమర్పణము గావించుచున్నాను. "ఓ నా యేలినవారా! మా హృదయములనుండి మాత్సర్యమును, కోపమును, ఆగ్రహ తీవ్రతను, కలహ ప్రియత్వమును, త్యాగశీలతకు భంగము కలిగించునట్టియు, నా పొరుగువారి యెడల నేను గలిగియుండవలసిన ప్రేమను తగ్గించునట్టియు ప్రతి అంశమును మీకు సమర్పించుచున్నాను. మమ్ము కరుణింపుడు. తమ కరుణకొరకై మొర పెట్టుకొను వారలందరిని దయచూడుడు. తమ వరప్రసాదము లెవరి కవసరమై యున్నవో, వారల కందరికిని వానిని ప్రసాదింపుడు. తమ వరప్రసాదములను పొందుటకు యోగ్యత గలవారమై శాశ్వత జీవిత మును పొందజాలు నట్లనుగ్రహింపుడు."

## సారాంశము

కామ క్రోధాది మనో వికారములకు బానిసలమై ప్రవర్తించుట యందలసట జెందినవారమై మనో వాంఛలయందలి నిష్ప్రయోజకత్వ ముచే సొమ్మసిల్లియుండు నపుడెల్లను, మన మెప్పుడును నెరవేర్పని

యనేక ప్రతిజ్ఞలు చేసియున్నాము. స్వపరిత్యాగము గావించుకొనకయె ఐహికానురాగములను, ప్రపంచాడంబరములను వదలకయే, మనస్సును ఆవరించియున్న ఘోరపాపిష్టి భ్రమవలన మనము మోసపోకయుండు నటుల స్థిరసంకల్పమును చేసికొనవలయును. ఓ రక్షకా! తమ దయ కొరకై యేర్పరుపబడిన తమ పవిత్ర రక్తముచే విమోచనము చేయబడి నట్టి నా హృదయము తన యందలి స్వార్థమునంతటిని విడిచిపెట్టి, పరిపూర్ణముగ తమ స్వంతమై పోవలసిన సమయమిదియే. ఇదియే నాపట్టు దలగల తీవ్రకాంక్షయని తమకు మనవి చేయుచున్నాను.

స్వామీ! నా హృదయము తమను స్వీకరించియున్నది. దైవ పీఠముపైని తాము వహించిన నూతనజీవమునంటి జీవమునే కలిగి తమకు బలిగా సమర్పింపబడుటకు తయారుచేయవలయునను కాంక్షగలవాడనై యున్నాను. ఆవిధముగా తమ పవిత్రజీవమును పాపముతోనున్న నా జీవముతో కలిపి, తమ పరమపితకు బలిగాసమర్పింపుడు. ఈ విధమున నేను తమను పరిపూర్ణముగ సమర్పణచేయుచున్న యీ హృదయమును తిరుగ నెన్నడు నేను కావలయునని కోరుకొనకుండునటు అనుగ్రహింపుడు.

---

## 10 వ అధ్యాయము

### దివ్యసత్ప్రసాద స్వీకారమును సులభముగ నెన్నడును వదలివేయ తగదు.

1. జేసునాథస్వామి :- కామక్రోధాది మనోవికారము అనబడు దుష్కృత్యములను మానుకొనుటకును, పిశాచము నీయెడల గావించు చుండెడు మోసకృత్యములనుండి తప్పించుకొనుటకును, అవసరమగు బలము, జాగరూకత గలవాడగుటకు దేవుని ప్రార్థింపవలసి యున్నది. దివ్యసత్ప్రసాద స్వీకారమందుగల గొప్ప ప్రయోజనమును నీ శత్రువు గ్రహించినదై, అన్నివేళలయందును, అన్నివిధములుగను అట్టి వరప్రసాదస్వీకారమునుండి భక్తివిశ్వాసములుగల మానవుల నాటంకపరచు టకై గట్టిప్రయత్నములు చేయుచుండును.

2. కొందరు దివ్యసత్ప్రసాదమును స్వీకరించుటకు తయారగుచుండు నపుడు, పిశాచమువలని ఘోరమగు తాకుడులచే బాధల ననుభవించు

చుందురు. జోబుని గ్రంథమున వ్రాయబడియున్నరీతిగా, యీ క్రూర స్వభావముగల పిశాచము, తన కలవడియున్న దుష్టస్వభావము ననుసరించి, "దైవపుత్రులలో జొచ్చి" వారికి మిక్కిలి భయమును కలుగ జేయును.. వారికిగల దైవభక్తిని క్షీణింపజేయుటకై యటులొనర్చును. తన తాకుడువలన దేవునియెడల వారికిగల విశ్వాసమును తొలగించి, దివ్యసత్ప్రసాదమును బొత్తిగా మానివేయునటులను లేదా మందగము నులై యుండునటులను చేయును. అయితే పైశాచక జిత్తులును సూచనలును యెంత రోతపుట్టించునవై యున్నను, యెంత దుష్టమైన వైనను లక్ష్యముచేయు నవసరములేదు. దాని ప్రయత్నముల నన్నింటిని తిరుగ త్రిప్పి, దాని నెత్తిమీదనే కొట్టవలయును. ఆ దుష్టపిశాచమును తృణీకరించవలయును. దాని కపటోపాయములకును, జిత్తులకును వెరచి దివ్యసత్ప్రసాదస్వీకారమును విడచివేయరాదు.

3. అనేకపర్యాయము లీవిషయమున బాహ్యభక్తిశేదను ఆందోళనయు, చేసిన పాపసంకీర్తనములో మితిమీరిన సందేహమును విఘ్నకారులుగా పరిణమించుచున్నవి. అట్టిసమయములందు జ్ఞానులగువారి సలహాలను పొంది నీ యాతురమును, సందేహములను అన్నింటిని విడచివేయుము. ఏలయనగ: అవి దైవభక్తిని చెరచివేయును. స్వల్పసంకటములును, వ్యసనములును కలిగినంతమాత్రమున, దివ్యసత్ప్రసాద స్వీకారమును వదలివేయుక, తక్షణమే గురువులదగ్గరకు పాపసంకీర్తనము చేయుటకు వెళ్ళుము. అంతేగాక పరుల దోషములగూర్చి వారిని మనస్ఫూర్తిగ క్షమింపుము. నీ వితరుల నెవరినైనను చిన్నబుచ్చి, వారలకు కోపము గలిగించియున్న యెడల, మిక్కిలి దీనత్వమును వహించి యట్టి లోపమునకుగాను నిన్ను క్షమించుమని వారిని వేడుకొనుము. నీ వటుల చేయుదువేని దేవుడువెంటనే నిన్ను క్షమించును.

4. చాలకాలము నీవు పాపసంకీర్తనము చేయక యుందువేని, నీ కెంత ప్రమాదము? దివ్యసత్ప్రసాదము పుచ్చుకొనక వదలివేయుచున్న నీ కేమి ప్రయోజనము? శీఘ్రముగ నీ పాపములన్నిటిని, విసర్జించి ఆత్మ శుద్ధిని గావించుకొనుము. పాపమనియెడు విషమంతయును కక్కివేయుము. ఈ ఔషధరాజమును కలకాలము వరకు సేవింపక యుండుటకంటె దినదినము సేవించుటయే యెక్కువ యుత్తమమని నీవు తెలిసికొనుము.

ఈ దినమునందేదియో యొక కారణముచేత దివ్యసత్ప్రసాదమును నిలిపితి-
వేని, రేపటి దినమున నింతకన్న గొప్ప విఘ్నమొకటి కలుగవచ్చును.
కనుక నీవు చాలకాలము వరకు దివ్యసత్ప్రసాదము లోకొన ఆటంక
పరుపబడినవాడవైనచో యింకనెక్కువ అసమర్థుడవును అయోగ్యుడవునై
పోవుదువు. నీకు సాధ్యమగునంత త్వరితముగ హృదయభారమును సోమరి
తనమును విదలించివైచుకొనుము. ఏలయనగా: చిరకాలమువరకు
ఆయాసమునందే పడియుండుటవలనను, సంకటములయందు తగుల్కొని
యుండుటవలనను, ప్రది దినమును కలుగుచుండు ప్రతిబంధకముల వల్లను
దేవరహస్యములను గ్రహించుటయందు వెనుకబడి యుండుటవల్లను ఎంత
భాగ్యహీనుడవగుచున్నావో యూహించుకొనుము. అంతేగాక అది
నీకు మిగుల యపాయకరమగును. ఏలయనగా: అటుల చేయుటవలన
నీవు సాధారణముగ యుత్సాహశూన్యుడవై మందమతివై పోయెదవు,

5. అయ్యో! కొంతమంది సోదరులును, నీరసహృదయులును తమపాప
సంకీర్తనమును వెంటనే గావించుకొనక, నా నాటికి వాయిదా వేయుట
యందే యిచ్ఛగలవారై యున్నారు. తమ నడతయందెక్కువ శ్రద్ధ
వహించి యుండవలసి వచ్చునని వారు అటుల చేయుచున్నారు. ఇంత
సులభముగ దివ్యసత్ప్రసాదమును నిలిపివేయుటకు కారణము దేవుని
యెడల వీరికిగల బలహీనమగు ప్రేమయేగదా! గురువుల అనుమతి బడసి
ప్రతి దినమును పరులవలన గమనింపబడకుండగనే దివ్యసత్ప్రసాదమును
స్వీకరించుటకు యోగ్యమగు మానసము గలవాడై, సంసిద్ధుడై యుండు
నటుల తన మనస్సాక్షిని పవిత్రముగ నుంచుకొని, పవిత్ర జీవనమును
జీవించు మానవుడే అదృష్టవంతుడు. అట్టివాడే దేవునికి మిక్కిలి
ప్రియుడై యుండగలడు. కొన్ని సమయములందు మానవుడు మనో
దీనత్వమువలనగాని, లేక న్యాయమైన యితర ఆటంకముల వలనగాని
దివ్యసత్ప్రసాదమును స్వీకరింపజాలక పోవచ్చును. అట్టివాని భయభక్తు-
లను గౌరవమును శ్లాఘింపవలసి యున్నది. అయితే అందువలన అతనికి
మాంద్యత యేర్పడిన యెడల అతడు తనకు సాధ్యమగునంత వరకు తనను
తానే పురికొల్పుకొన ప్రయత్నించవలెను. అట్టి మానవుని సద్బుద్ధికి
ముఖ్యముగ దేవుడు సంతసించి వాని యోగ్యకాంక్షను పవిత్రపరచును.

6. ఆ మానవుడు దివ్యసత్ప్రసాదమును తీసుకొనజాలకుండునటుల సరియైన కారణములచే యాటంకపరుపబడినను, ఆతడెల్లప్పుడును యోగ్యమగు మానసము గలవాడై యుండవలయును. సత్ప్రసాదమును లోకొనవలయునను కోర్కెను సర్వదా కలిగియుండవలయును. ఆతడటుల చేయునేని, ఆ దేవద్రవ్యానుమాన ఫలము నాతడనుభవించ గలుగును. ప్రతి దైవభక్తుడును, ప్రతిదినమును, ప్రతిఘడియయందును, యెట్టి ఆటంకములు లేకయే తన యాత్మకు మిగుల లాభకరమగునటుల జ్ఞానవిధముగా జేసునాథుని స్వీకరింపవచ్చును. ఐనప్పటికిని కొన్ని దివసములందును, నియామకము చేయబడిన కాలములందును, హృదయానురాగ పూర్వకమగు భక్తిగౌరవములతో తన పాపవిమోచనాకర్తయొక్క శరీరమును దేవద్రవ్యానుమానమూలముగ స్వీకరింపవలసి యున్నాడు. అటులచేయుటలో ఎక్కువగ దేవునికి శ్లాఘ్యత గౌరవమును చేకూర్పు యుద్దేశము గలవాడై లోకొనవలయును. ఎందుకనగా: ఆతడు యెన్నిమారులు జ్ఞానవిధమున దివ్యసత్ప్రసాదమును లోకొని ఆంతరంగికముగ పోషింపబడునో, అంతయెక్కువ భక్తితో నాతడు క్రీస్తునాథుని మనుష్యావతార పరమరహస్యమును, శ్లీవపైని శ్రమలను ధ్యానింపగలిగి దైవప్రేమచే ప్రజ్వలించును.

7. తనంతట తానే, దివ్యసత్ప్రసాదమునకు బుద్ధిపూర్వకముగ సిద్ధమై యుండని మానవుడు యేదియొక యుత్సవదినము సమీపించునప్పుడును, లేక దివ్యసత్ప్రసాదమును మామూలుగా లోకొనవలసిన దినము వచ్చినప్పుడును తయారై యుండుట సంభవించదు. తానెన్ని మారులు దివ్యపూజ చేయునో లేక దివ్యసత్ప్రసాదమును స్వీకరించునో, అన్నిపర్యాయములును తనను దేవునికి బలిగా సమర్పించుకొను మానవుడు యదృష్టవంతుడు. చాలతొందరగా గాని, లేక అమిత నిదానముగా గాని దివ్యపూజచేయుటకు ప్రయత్నింపకుము. తోడివారి ననుసరించి యోగ్యమగు సాధారణ మార్గమునే అవలంభించుము. నీవు దివ్యపూజ చేయునప్పుడు యితరులకు విసుకుకరముగను సంకటకారిగాను నుండ తగదు. నీ నియామకముల ననుసరించి సామాన్యమార్గము నవలంభింపుము. నీ భక్తికాంక్షల ననుసరించిపోవుటకన్న ఇతరుల యవసరముల ననుసరించుటయం దిచ్ఛగలవాడవై యుండుము.

## సా రాం శ ము

ఈ యధ్యాయమునందు దివ్యసత్ప్రసాద స్వీకారమునకు సంబంధించిన పరిపూర్ణ సిద్ధాంతమును కనుగొనుచున్నాము. అందు ముఖ్యముగ మతాచార్యులలో ఒకరగు అర్చ్యశిష్ట క్రిసోస్టం అనువారిచే యోగ్యమైనవని మెచ్చుకొనబడిన వివేకవంతములగు నిబంధనలు తెలిసికొనుచున్నాము.

ఇంకను పాపమునకు బానిసలైయున్న వారలనుగూర్చి దురభ్యాసముల కలవడియున్నట్టి, పాపకార్యములయందే పట్టుదలగలిగియుండునట్టి, ఇతరులయెడల శత్రుత్వమును, పగను తమ హృదయములయందు బెంపొందించుచున్నట్టి, తమ పొరుగువారలతో సమాధానముగా కలిసియుండుట కంగీకరింపనట్టి, తాము అక్రమముగ గడించిన సొత్తును తిరుగ యిచ్చివేయుట కిష్టములేనట్టి, ఇతరుల శరీరములకుగాని, వారి ఘనతకుగాని, వారిసొత్తులకుగాని తాము కావించియున్న నష్టమునకు పరిహారము చేయకుండునట్టి, పరులనుగూర్చి అపకీర్తికరములగు వదంతులు వ్యాపింపజేసి అందుకు పరిహారోక్తి గావింపనట్టి మానవులను గూర్చి యీయధ్యాయమునం దేమియును ప్రస్తావింపబడియుండలేదు. ఈపైచెప్పబడిన పాపముల నాచరించుచుండు వారందరును తాము మునిగియున్న యీపాపిష్ఠి స్థితిని విసర్జించుటకై, చేతనగువన్ని మంచి ప్రయత్నములను చేయవలసియున్నారు. వీరలిట్టి దుస్థితియందు బడియుండగా యీ దివ్య సత్ప్రసాద విందున కాహ్వానింప బడవలయుననెడి యుద్దేశము సహితము మానసమునందు పెట్టుకొని యుండలేరు. అట్టి యుద్దేశము అర్చ్యశిష్టులకును, పవిత్రమగు మనస్సాక్షిగలవారలకును మాత్రము గలిగియుండును. దైవసేవకొరకై నివేదింపబడిన పవిత్రజీవము సల్పుటయే తమపనిగా గలిగియున్న మానవులను గురించి మాత్రమే మనగ్రంథకర్త చెప్పుచున్నాడు.

## 11 వ అధ్యాయము

### జేసునాథుని దివ్యశరీరమును, పవిత్ర వేదగ్రంథము లును విశ్వాసముగల యాత్మల కత్యవసరములు

1. శిష్యుడు:- మిక్కిలి మాధుర్య మూర్తివగు ఓ జేసునాథా! తాము దయచేయు విందులో తమతో గూడా విందారగించెడు భక్తిగలయాత్మ యెంత మాధుర్యము ననుభవించుచున్నది! తాము దయచేయుచున్న యీ విందులో ఆత్మకై భోజన మేదియన: దానికి మిగుల ప్రియుడవై యున్నట్టియు, దాని హృదయానురాగము లన్నిటిచే యొక్కవగ ప్రేమింపతగిన వారగునట్టియు, తమరేగాని యితర మేమి యును గాదు. నిశ్చయముగ తమ సముఖములో నా పరిపూర్ణహృదయ ముతో కన్నీరు కార్చుచు, భక్తురాలగు మరియ మగ్దలేనమ్మవలె నా కన్నీటితో తమ పాదములను కడుగుట యన నాకు మిక్కిలి సంతోష కరమై యుండును. అయితే అట్టి యుత్తమభక్తితో అట్టి పావనమగు కన్నీటిధారలను కార్చువారెవరు? నిశ్చయముగ తమ కనులయెదుట పావన చరితులగు తమ దేవదూతల సముఖమున నాహృదయమంతయు భక్తియనెడు అగ్నిచే ప్రజ్వరిల్లి సంతోషముతో కన్నీరు గార్చవలసినదై యున్నది. ఏలయనగా దివ్య సత్ప్రసాదమునందు అప్పరూప గుణా ములలో తాము గుప్తమై యున్నను, తామచ్చట వేంచేసియున్నారని నే నెరుగుదును.

2. తాము తమ దివ్యవికాసముతో వెలుగుచుండగ, నా నేత్రములతో గాంచజాలను. ఈసర్వప్రపంచము తమ దివ్యమహిమ ప్రకాశము ముందు నిలువజాలదు. కనుక నాయందలి దుర్బలతకుగాను, నాయెడల తమకు గల కరుణతో తమ తేజోమయ రూపమును యీ దివ్య సత్ప్రసాదమున మరుగు పరచుకొని యున్నారు. మోక్షవాసులు పూజించెడు సృష్టికర్తను నేను నిశ్చయముగా నారాధింప గలిగియున్నాను. నేను తమను విశ్వాసముచే పూజించుచున్నాను! దేవదూతలన్ననో, తమను ప్రత్యక్ష ముగ గాంచుచు, తమను పూజించుచున్నారు. వాస్తవమగు విశ్వాస వికాసముచే మాత్రము తృప్తిగాంచుచు, అట్టి విశ్వాసప్రకాశమునందు శాశ్వత ప్రకాశోదయము కలుగు నందాక, అటుల ప్రవర్తింపవలసిన

వాడనై యున్నాను. పరిపూర్ణోదయము కాగానే, దేవద్రవ్యాను మా
ములతో యవసరముండదు. ఏలయనగా: దైవ ప్రభావముతో నానందిం
చుచుండువారలకు దేవద్రవ్యానుమానములను ఔషధముతో పని లేదు.
దైవమహిమను తమ నేత్రములతో ప్రత్యక్షముగ ముఖాముఖిగా గాంచుచు
సర్వదా వారానందించుచుందురు. విశ్వాస ప్రకాశమునుండి మార్పు
జెంది మానవుల వివేకమున కగోచరమగు దేవుని మహిమా ప్రకాశాను
భవము గలవారలై మనుష్యాకారమెత్తిన రెండవవ్యక్తియగు సుతుడైన
సర్వేశ్వరుడు ఆరంభమునుండి నెట్టివారలై యుండిరో, యిక ముందె
ప్పుడు నెటులుండెదరో, యటులనే వారిని దర్శించుచు వారియం దానం
దించుచుందురు.

3. వింతగొల్పెడు యీ విషయములను నేను నా మానసమందు
తలంచుకొనునపుడు, ఆధ్యాత్మిక సౌకర్యము సైతము నాకు మిక్కిలి
యాయాసకరమైనదై విసుగును కలిగించుచున్నది. నా యేలిన వారిని
నేను వారి మహా ప్రతాపముతో ప్రత్యక్షముగ చూడనంతకాలము, యీ
ప్రపంచమునందు నేను విని, చూచుచున్న విషయముల నేమాత్రమును
లెక్కచేయను. నా దైవమా నేనెవరిని గూర్చి సర్వదా ధ్యానింపవల
యునను కాంక్షగలవాడనై యున్నానో, అట్టి తాము తప్ప మరియే
యితర విషయమును నాకు ఆరుదల నొడగూర్ప జాలదు. సృష్టియందలి
యేవిషయమును నాకు విశ్రాంతి నొసంగజాలదు. దీనికంతకును మీరే
సాక్షీభూతులై యున్నారు. మిక్కిలి తాళిమిని వహించి, నా సర్వకాంక్ష
లయందును నేను తమకు వశవర్తుడనై విధేయతతో ప్రవర్తించుచుందును.
ఓ దైవమా! స్వర్గము నందినపుడు తమతో గలిసి సంతోష మనుభవించు
చున్న అర్చ్యశిష్టులు సైతము వారి మర్త్యలోకము నందుండునపుడు మీ
మహిమ ప్రతాపమును గాంచుటకై విశ్వాసముతోను, శాంతముతోను
కనిపెట్టుకొని యుండిరికదా! వారు విశ్వసించియున్న దానినే నేనును
విశ్వసించుచున్నాను. వారు తమ యాశను నిల్పుకొని యున్న దాని
యందే నేనును నా యాశను నెలకొల్పుకొని యున్నాను. వారెచ్చో
టికి పోయి చేరియుండిరో నేనును ఆ ప్రదేశమునకే తమ దయా ప్రసా
దమువలన పోయి చేరగలుగుదునని నమ్ముచున్నాను. ఈ లోపల అర్చ్య
శిష్టులు చూపియున్న మాతృకలను అనుసరించి, తమ యందలి విశ్వాస

ముతో జీవయాత్ర సల్పుచుండెదను. అంతేగాక, నా ఓదార్పు కొరకును నా జీవయాత్రయందు నేననుసరింప వలసిన మార్గములను గ్రహించుటకును తమదివ్యగ్రంథములను చదువుకొను చుండెదను. వీనియన్నిటికంటె నింక నధికముగ నాకు ప్రశస్తముగు యౌషధరాజమును, నాశరణ్యమును నగు దివ్యసత్ప్రసాదమును భుజియించు చుండెదను.

4. జీవితమునందు నాకు రెండు విషయములు ముఖ్యముగ నవసరమై యున్నవి. శరీర కారాగారమున బంధితుడనై యున్నంతకాలము నాకు ఆహారము, వెలుతురు, అను రెండును ముఖ్యావసరములని గ్రహించుచున్నాను. అవిలేకున్న యీ పాపిష్టి జీవితము దుస్సహమైనది గనుక నే బలహీనుడనై యున్న నాకు ఆహారముగను పవిత్రమగు తమ శరీరమును యీ జీవమార్గమున సురక్షితముగా నడచుటకు తమ దివ్య వాక్యమును వెలుగు నాకనుగ్రహించి యున్నారు. ఈ రెండును లేక నేనీ ప్రపంచమునందు యోగ్యముగ జీవింపజాలను. దేవుని వాక్యము నా యాత్మకు వెలుగును, దివ్యసత్ప్రసాదము నా పోషణమునకు అప్పమై యున్నది. ఈ రెండును పావనమగు తిరుసభయొక్క బొక్కసమునందు యిరుపార్శ్యముల యుందుంచబడిన బల్లలని చెప్పవచ్చును. అమూల్యమగు అప్పముంచబడిన దైవపీఠమనియెడు బల్లయొకటి; నిజమగు విశ్వాసమును బోధించుచు దేవాలయమున తెఱమరుగుననుండు మహా పవిత్ర స్థలమునకు సహితము నడుపుకొని పోగల దైవ చట్టమను బల్లయొకటి. నిత్యప్రకాశమునకు ప్రకాశమైన స్వామీ! తమ సేవకులగు దీర్ఘదర్శుల వలనను, అపోస్తుల వలనను, యితర బోధకుల వలనను తాముమాకు దయచేసిన పావనమగు బోధనలకుగాను తమకువందనము లర్పించుచున్నాను.

5. సర్వమానవ రక్షకా! తమ ప్రేమను ప్రపంచమున కంతకును బహిరంగ పరచుటకై మహోన్నతమగు విందును తాము యేర్పాటుచేసి యున్నారు. ఆ విందునందు మేమారగించుటకై కేవలము చిహ్నముగ నుండు నొక గొర్రెపిల్లనుగాక మిక్కిలి పవిత్రమగు తమ శరీరమును, రక్తమును మా ముందుంచి యున్నారు. స్వర్గసౌఖ్యములను మోక్షానందమును సమకూర్చునట్టియు, పావనమగు దేవదూతలు సైతము మిక్కిలి మక్కువతో మాతో కలసి యనుభవించునట్టియు దివ్యమగు యీ విందు

నందు అందరికి యానందము నొడగూర్చియున్నారు. స్వామీ! యిందు కొరకై తమకు మా కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాము.

6. ఆహా! పావనములగు దైవవాక్యముల నుచ్చరించుచు దైవ మహాత్మ్యమనురాజప్రతాపమును వహించియున్న యేలినవారినే స్వప్రసాదముగ సమర్పణ చేయుటకును, పెదవులచే తమ్మును శ్లాఘించుచు నుతించుటకును వారి హస్తములచే స్పృశించుటకును, తమ్మును హస్తముల యందుంచుకొనుటకును, వారు భుజించుటకును యితరులకు తమ్మును భుజించుటకై ఇచ్చుటకును, దేవరవారు గురువుల కధికారము ననుగ్రహించి యున్నారు. గురువులయొక్క అంతస్తు యెంత ఘనమైనది! యెంత గౌరవము గలదై యున్నది! పవిత్రత కంతకును కర్తయగు దేవుడు పలుమారులు గురువుల హృదయములో ప్రవేశించుచున్నారు. వారి హస్తములెంత పావనమై యుండవలయును. వారి శరీరమెంత కల్మష రహితమైనదై యుండవలయును. గురువుల హృదయమెంత పవిత్రమైనదై యుండవలయును. పలుమారులు జేసునాథుని పావన శరీరమును, రక్తమును స్వీకరించుచున్న గురువు వాక్కులనుండి పావనమగు వాక్యములు తప్ప యితర వాక్కులేమియును బైలుదేరరాదు.

7. జేసునాథుని దివ్యశరీరమును వీక్షించు మతాచార్యుల నేత్రములు మిక్కిలి నిష్కపటములై, కళంకరహితములై యుండవలయును. ఇహ పరలోకములకు సృష్టికర్తయగు దేవుని స్పృశించుచుండెడు వారి హస్తములు పవిత్రములై పరలోకము వైపునకే సూచించునవై యుండవలయును. ముఖ్యముగ గురువులకు దేవు డేమని వక్కాణించుచున్నాడనగా:

"మీపాలిటి దైవమును యేలికయునై యున్న మేము పావన మూర్తులమైయున్నాము. గాన మీరును పావనులై యుండవలయును."

8. సర్వశక్తులైన దైవమా! గురుత్వమును గైకొనియున్న మేము, తగిన యర్హతతోను భక్తి యుక్తముగను, పవిత్రహృదయముతోను రోగ్యమగు మనసాక్షి గలవారలమై తమ సేవచేయునటుల మాయందు దయార్ద్ర హృదయులై మమ్ము వినియోగింపుడు. మేమెంత నిష్కపటముగ, నిష్కళంకముగ ప్రవర్తింప వలయునో, అంత నిష్కపటముగను నిష్కళంకముగను ప్రవర్తింప జాలనియెడల మేమాచరించియున్న

పాపములనుగూర్చి, దుఃఖించుచు కన్నీరువిడచుచు, దీనభావమును వహించి యోగ్యమగు సంకల్పముగలవారలమై, యికమీదట యొక్కువ భక్తికాంక్షలతో తమకు సేవచేయ గలుగునట్లుల అనుగ్రహింపుడు.

---

## సారాంశము

దివ్య సత్ప్రసాద స్వీకారమునకు మనము ఆయత్తమగు నప్పుడు కలిగియుండవలసిన భావములు పరిశుద్ధ గ్రంధపఠనమువలన కలుగును. దివ్య సత్ప్రసాదముచే లభించెడు ఫలమును మన యాత్మయందు పదిల పరచుటకును పవిత్ర గంధ పఠనమే తగినమార్గము. ఇంతకుపూర్వము యెడారియందు నివసించుచున్న ఇస్రయేలులు వాగ్దత్తభూములకు ప్రయాణముచేయునపుడు, వారికి దారి చూపుటకై ప్రకాశముకొరకు ఒక యగ్ని స్తంభమును, వారి ప్రయాణభత్యముగ మన్నా భోజన మును దైవము వారలకు దయచేసి యున్నాడు. అదేవిధముగ మనకు జ్ఞానవికాసమును కలిగించుటకై పరిశుద్ధ గ్రంధములను మన స్వర్గ ప్రయాణములో మార్గమున మన పోషణకొరకనవసరమగు యాహార ముగ దివ్య సత్ప్రసాదమును మనయేలిక మనకు దయచేయుచున్నారు. మనము స్వర్గలోకమును సురక్షితముగ చేరుటకై దేవుడు మనుకనుగ్ర హించియున్న యీరెంటిని విరివిగా సుపయోగించు కొనుదుముగాక. మనము దారితప్పి పెడమార్గములందుబడి పోకుండుటకై సద్గ్రంథ పఠన ముగావించుకొనుచు స్వర్గమునకు గొంపోయెడు యిరుకుమార్గమునందు ప్రయాణము చేయునప్పుడు తగినంత బలము గలవారలమై యుండుటకు దివ్య సత్ప్రసాదము నారగించుదముగాక.

---

## 12 వ అధ్యాయము

## దివ్యసత్ప్రసాదము స్వీకరింపబోవునప్పుడు జేసునాథుని రాకకై యెక్కువ శ్రద్ధతో సిద్ధము కావలయును.

1. జేసునాథస్వామి:- పవిత్రతను ప్రేమించువారము మేమే. పవిత్రతను గ్రహించువారము మేమే. నిర్మల హృదయముగల మానవుడు మాకు ప్రియుడై యున్నాడు. మా విశ్రమ ప్రదేశము పవిత్ర హృదయము. మా రాత్రి భోజనమునకై పెద్దగది నొకదానిని సిద్ధముచేసి యుంచుము. మా శిష్యసమేతముగ మేము నీతో పాస్కాను భుజింతుము. మేము నీకడకరుదెంచి నీతో చేరియుండవలయునను కోర్కెను కలవాడవైన యెడల, నీయందలి పాత దుర్గుణములన్నిటిని విడిచిపైచి నీహృదయమందిరమును పవిత్రముగ నుంచుకొనుము. ఐహిక విషయానురాగములను దుర్గుణములవలని అలజడిని నీహృదయమున చేరనీయకుము. ఇంటికప్పుపైని నేకాంతముగ కూర్చునియున్న పిచ్చుకవలె ఏకాంతముగ నుండి, నీవాచరించియున్న దోషాధిక్యతను గూర్చి తలంచుకొనుచు దుఃఖించుము. ప్రతి మానవుడును తానెక్కువగ ప్రేమించెడు తన ప్రియునికొరకై యుత్తమమును సుందరము నగునట్టి గదిని తయారుచేసి యుంచును. అందుమూలముగ నాతనికి ఆతడాహ్వానించుచున్న స్నేహితుని యెడలగల యనురాగము విదితమగును.

2. ఐనప్పటికిని యితర తలంపు లేమియును లేక నీవొక సంవత్సర కాలమువరకు ప్రయత్నములు గావించినను, నీ క్రియలయందలి యోగ్యతచే నీవు తగినంత యెక్కువగ నిన్ను నీవు తయారు చేసికొన జాలవని గ్రహింపుము. ఐతే నొక బీదవాడొక సంపన్నునిచే విందుకొరకై యాహ్వానింపబడునేని, అందువలన బీదవాడనుభవించెడు లాభములకు ప్రతిఫలముగ నాతడేమియు నీయజాలడు. గాని అటులతని నాహ్వానించినందుకుగాను యాతడు దీనత్వమును వహించి యా సంపన్నునకు వందనము లర్పింపవలసి యున్నాడు. అదేరీతిని కేవలము మాకు నీయందుగల దయానుగ్రహముచేత మాతో కలసి విందారగించుటకై

నిన్ను పిలిచి యున్నాము. నీకు సాధ్యమగునంతవరకు తయారగుము. నీ ప్రయత్నములందు మిక్కిలి చురుకుదనమును, శ్రద్ధయును వహించి వర్తింపుము. అలవాటు చొప్పున, లేక యవసరమునుబట్టిగాక, భయముతోను నీవు ప్రేమించుచున్న రక్షకుని లోగొనుము. నిన్నాహ్వానించుచున్నది మేమే. నీవు రావలసినదని యాజ్ఞాపూర్వకముగ చెప్పినదియు మేమే. నీయందలి కొరతలన్నిటిని క్రమపరచుకొని మా విందునకు వచ్చి మమ్ము స్వీకరింపుము.

3. దైవభక్తి యనెడు వరమును నీకు మేమనుగ్రహించునపుడు నీ దైవమునకు వందనము లర్పింపుము. మేము నీకీ వరము ననుగ్రహించుట నీయందలి యోగ్యతను బట్టికాదు కాని, నీయందు మాకుగల ప్రేమచే మేమనుగ్రహించుచున్నాము. దైవభక్తి యనెడు వరమును నీవు మా వలన పొందక భక్తిహీనమగు హృదయుడవైన యెడల, మమ్ము ప్రార్థించుట మానివేయకుము. నీయందలి లోపమును తలంచుకొని నిట్టూర్పులిడుచు, మొరపెట్టుచు దయామయుడగు దేవుని ద్వారముకడ తలుపును తట్టుచుండుము. ముక్తికి తోడ్పడు నా వరములలో నొకంటినైనను నీకనుగ్రహింపబడు వరకు ప్రయత్నములను వీడకుము. నీకు మాతో నవసరము గలదుగాని, మాకు నీతో నవసరము లేదు. నీవు మమ్ము పవిత్రపరచు నవసరము లేదు. కాని మేమే నిన్ను పరిశుద్ధపరచి నీ స్థితిని బాగుపరచుటకై వచ్చుచున్నాము. పవిత్రపరుపబడి మాతో చేరియుండవలయుననియు, మా వలన నూతన వరములను పొంది యుత్సాహము గలవాడవై, నీ ప్రవర్తనను క్రమపరచుకొనుటకు మా సముఖమున కేతెంచుచున్నావు. ఇట్టి మా నూతనవరముల నలక్ష్యము చేయకుము. మిక్కిలి శ్రద్ధతో నీ హృదయమును తయారుచేసికొని, నీవు ప్రేమించుచున్న దైవమును అందు ప్రవేశపెట్టుకొనుము.

4. దివ్య సత్ప్రసాదమును లోకొనుటకు ముందు భక్తియుక్తుడవై తయారై యుండుటయేగాక, యీ ప్రసాదమును స్వీకరించిన పిదప సైతము, ఆ దైవభక్తిని నీయందు కాపాడుకొనుచుండుము. దివ్య సత్ప్రసాద స్వీకారమునకు ముందెంత భక్తికాంక్షలతో తయారైయుంటివో, అటులనే లోగొనిన తరువాత గూడ యుండవలెను. కారణ మేమన: దివ్యసత్ప్రసాదము స్వీకరించిన పిదప యెక్కువ శ్రద్ధాభక్తులు గలిగి

యుండుటచే, యింకను యెక్కువ ఉత్కృష్టములగు వరములను బడయ గలవు. దివ్య సత్ప్రసాదము స్వీకరించిన తక్షణమే బాహ్య విషయముల వలన సంతృప్తిని పొందవలయునని వెతకుకొను మానవుడు, అట్టిగొప్ప వరములను పొందుటకు తగిన పరిస్థితి యందుండజాలడు. మితిమీరి అధిక ప్రసంగములు సేయక జాగరూకుడవై యుండుము. ఏకాంతమున మౌనమును వహించియుండి, నీ దైవమునందే ఆనందించుము. వారు నీ హృదయవాసియైయున్నారు. ప్రపంచమంతయు నొకటియైనను నీనుండి దైవమును వేరుచేయజాలదు. నీవు నీ సర్వమును నర్పింపవలసినది మాకే. నిన్ను నీవు మాకు పరిపూర్ణ సమర్పణము గావించుకొనియెదవేని, నీవు నీయందు జీవింపక మాయందే జీవింతువు.

---

## సారాంశము

జేసునాథుని శరీరమును భుజించి రక్తమును పానముచేయుట మన ఆత్మ పోషణకు అగత్యమై యున్నది. అందుమూలముగ సర్వేశ్వరుడు మనలో నివసింతురు. గనుక మనమందరము దివ్య సత్ప్రసాదమును స్వీకరింప బోవునపుడు దేవునియెడల సజీవభక్తియును, వారి యందు సుస్థిరమగు యాశయును, జేసునాథ స్వామియెడల గాఢమగు పవిత్ర ప్రేమయును మనవెంట గొనిపోవలయును. ఈ మూడు గుణముల యందేదైన లోటుపాటు లున్నయెడల, వారే వానిని సవరింతురని నమ్మి యుండవలయును.

నుతింపతగిన మన రక్షకునివలన మనకుగల యన్ని యవసరములు తీర్చబడును. గనుక మనము వారిని స్వీకరింపవలసియున్నాము. పూర్వకాలమున వేదసిద్ధాంతములకొరకై తమజీవములుసైత మర్పించియున్న పావన చరితులు, తమను విమర్శించెడు న్యాయాధికారుల న్యాయపీఠముల దగ్గరకు తమ విశ్వాసప్రకటన చేయుటకై గొనిపోబడుటకు ముందుగా దివ్యసత్ప్రసాదమును స్వీకరించెడు ఆచారము గలవారలై యుండిరి. "ఏలయనగ వేదవిషయములలో మరణదండన విధించబడునపుడనుభవింప వలసియున్న వేదనలనుభవించుటకుగాను, దివ్యసత్ప్రసాద స్వీకారముచే తమకు తగిన బలముగ సిద్ధించునని ధృడనమ్మకముతో నుండిరి." అని

అర్చ్య॥ సీరియక్ గారు వక్కాణించియున్నారు. ఇదేరీతిని, కామ క్రోధాది మనోవికారములతో పోరాటము సల్పుటకును, పిశాచము కల్పించుచుండెడు వ్యామోహముల నెదిరించుటకును భక్తులందరును తమ పోషణకొరకై జేసునాథుని శరీరమును రక్తమును స్వీకరించుటత్యావశ్యము.

---

## 13 వ అధ్యాయము

### భక్తిగల ప్రతి యాత్మయు యీ దివ్యసత్ప్రసాదమును పరిపూర్ణ హృదయానురాగముతో లోకొని, జేసునాథునియందైక్యము కావలయునను కాంక్షగలిగి యుండవలయును.

1. శిష్యుడు:- నా యేలినవారా! నేను తమ్మును కనుగొని తమకు నా హృదయమును విశదపరచుకొందును. నా యాత్మ తన కోర్కె తీరునటుల తమయందానందము ననుభవించును. ప్రపంచముతో నాకనురాగము లేకుండ, స్నేహితుడు తన ప్రాణస్నేహితునితో సంభాషించుచు, ఆతనితోగలసి విందారగించునటులను, తాము నేను యేకాంతముగ నొండొరులతో సంభాషించుచు విందారగించెడు భాగ్యమును నాకు చేకూర్చుడు. తమతో నేను పరిపూర్ణ ఐక్యతను పొందియుండవలయుననియు, ప్రపంచవిషయముల యెడల హృదయానురాగ శూన్యుడనై యుండవలయుననియు దివ్యసత్ప్రసాద స్వీకారము వలనను, దివ్యపూజను పలుమారులు చేయుచుండుటవలనను స్వర్గసంబంధమగు నిత్యసత్య వినయ జ్ఞానమునందెక్కువ యభిరుచిగలవాడనైయుండ, నేను కోరుచున్నాను. నా స్వామీ! నేనెపుడు మీతో పరిపూర్ణ ఐక్యతను పొందగలుగుదును? మీలో నెపుడు లీనమై నన్ను నేను మరచియుందును? నేను తమయందును, తాము నాయందును ఐక్యమై యుండునటుల అనుగ్రహింపుడు.

2. నిశ్చయముగ నేను సర్వమునందు యెన్నుకొనియున్న నా ప్రియులు తమరే. నా యాత్మ సర్వదా తమతో గలసియుండవలయు నని ఆశించుచున్నది. నిశ్చయముగ నాకు శాంతమును దయచేయు వారలు తమరే. తమయందే మహోన్నతమగు శాంతము, వాస్తవమగు విశ్రాంతియు గలవు. తాము లేనియెడల శ్రమయును, సంకటము, అంతు లేని దౌర్భాగ్యస్థితియును తప్ప మరేమియును రాబోవు. వాస్తవముగ తమరే గుప్తమైయున్న దైవము. దుర్మార్గులతో మీరెప్పుడును సంభాషించుమరు. మీ న్యాయమునందలి మాధుర్యమును తమ బిడ్డలకు రుచిచూపుటకై, స్వర్గమునుండి క్రిందికి దిగివచ్చెడు సజీవమగు అప్పము మీరలే! తమయందు విశ్వాసముగల మానవులకందరకు వారి ప్రతిదిన సౌకర్యములకొరకును, వారి హృదయములను తమదెసకు లేవనెత్తుట కొరకును తమనే వారు లోకొని సంతసించుటకై తమను తాము సమర్పణ చేయుచున్నారు. మా దైవమగు తాము నిశ్చయముగ తమయందు విశ్వాసముగల మానవులకు ఎంత సమీపవర్తులై యున్నారు! ఎవ్వరు తమ దైవము నింత సమీపమున గలిగియున్నారు?

3. మీ భక్తులకుతప్ప యితరమానవ సంఘమువారల కిట్టి భాగ్యము గలదా? దయాళుడగు దేవుడు తనమాంసముతోనే పెంచి, పెంపొందింపచేయుటకై తమ విశ్వాసుల యాత్మయందు వేంచేయుచున్నారే! భక్తి విశ్వాసములుగల యాత్మకన్న యీ ప్రపంచమున దేవునికి యెక్కువ ప్రియమగున దెద్దియును లేదు. దైవమా! తమ దయాళుత్వమును వర్ణింప నెవరితరము! స్వల్పులమగు మాయెడల తమదయను చూపుటకై, తామింత దీనులై యిట్టికార్యమును నెరవేర్చుటకై సమ్మతించుచున్నారు. నీచ మానవునియెడ నపారమగు ప్రేమను చూపుచున్న ఓ దయామయా! తమ అపార ప్రేమకును త్యాగమునకును ప్రతిఫలముగ నేను మీకేమి సమర్పించుకొనగల్గుదును? నా హృదయమును పరిపూర్ణముగావించి, మిక్కిలి చేరువలో మీతో కలసియుండుటకన్న నెక్కువగ నేను మిమ్ము తృప్తిపరుపగల విషయము లేదు. ఈ రీతిగ నా హృదయమును వారికి పరిపూర్ణార్పణము గావింతునేని, అప్పుడు నాహృదయమున కమిత సంతసము గల్గును. ఎప్పుడు నాయాత్మ పూర్తిగా దేవునియం దైక్యమై యుండునో, అప్పుడు వారు

"నీవు మాతో యుండు వేని మేమునీతో చేరి యుందుము" అని చెప్పెదరు. "ఓ నా యేలినవారా ! నాతో నెల్లప్పుడు నైక్యమైయుండుట కనుగ్రహింపుడు. నేను మనస్ఫూర్తిగా తమవాడనై యుందును" అని వారికి జవాబుచెప్పుదును. నా హృదయము మీతో నైక్యమై యుండ వలయుననియే నా సంపూర్ణమగుకోర్కె.

---

## సారాంశము

జేసునాథుడు దైవపీఠమునందు వేంచేయు టెందుకనగా:-

(a) వారినిగూర్చి మనముచేయు ప్రార్థనల నాలకించి దయతో వానిని స్వీకరించుచూ తాము మానుపైని కొరత వేయబడునపుడు దైవమునకు మనకును మధ్యవర్తిగా యెటుల ప్రవర్తించియుండిరో, అట్టి మధ్యవర్తిత్వమును జరుపుటకును.

(b) మన సన్మానములను, దర్శనకాలములయందు మన మర్పించెడు వందనములను, సంధింపులను, చూపెడు విధేయతను, చేయుఆరాధనలను స్వీకరించుటకును, వారు మనపీఠములపై వేంచేసియున్నారు. గనుక మిక్కిలి యుపేక్షాభావముతో,భక్తిశూన్యతతో యరుదుగ వారిని దర్శించెడు భక్తులందరును, తమ రక్షణకర్తయు, జీవితములను పరిశోధించెడు న్యాయాధికారియునగు వారియెడల మర్యాదగాని,ప్రేమగాని, భయముగాని చూపకయే వారిని దర్శించు చున్నందుకుగాను నిందార్హులై యుందురు.

c) మనము దుఃఖములందు చిక్కుబడి యుండునపుడు మనల నాదరించుటకును, మనము కష్టదశలందు నుండునపుడు మనలను కాపాడుటకును, మన సందేహములన్నిటిని మనకు వివరించి తెలిపి వానిని నివర్తింపజేయుటకును;

d) మన ప్రపంచ జీవయాత్రయందు మనకు తగిన పోషణకొరకై తమను మనకు నిచ్చుటకును, అవసానకాలమునందు ఆదరువుగా నుండుటకును, జేసునాథుడు దైవపీఠముపై వేంచేయుచున్నారు.

---

## 14 వ అధ్యాయము.

### భక్తులు కొందరు జేసునాథుని స్వీకరింపవలయునను గాఢమగు కాంక్ష గలవారై యుందురు.

1. శిష్యుడు:- నా యేలినవారా! తమయెడల భయభక్తులు గలవారై వర్తించుచుండు వారికొరకై తమరు దాచియుంచిన దివ్యామృత మెంత మధురముగ నున్నది? ఘనమగు భక్తితోను, హృదయానురాగముతోను దివ్య సత్ప్రసాదమును స్వీకరించుటకు వచ్చుచున్న కొంతమంది భక్తులను గూర్చి తలంచుకొనునపుడు నేను పలుమారు భ్రమజెందుచు, తమ దివ్యపీఠము చేరుటకు నేనింత సోమరిగను యుత్సాహహీనుని గను. ఈ దేవద్రవ్యాను మానమున కరుదెంచినందుకు నాలో నేను సిగ్గుపడుచున్నాను. సత్ప్రసాద స్వీకారమునందు నేనింత భక్తిశూన్యుడనై హృదయాను రాగములేనివాడనై యున్నందుకు సిగ్గగుచున్నది. నా ప్రభువా! దేవరవారి సముఖములో నేను హృదయపూర్వక పవిత్ర ప్రేమాగ్నిచే నన్ను దహించుకొనక, దివ్యసత్ప్రసాదము యెడల తీవ్రమగు కాంక్షలేక యున్నాను. తమ యందలి ప్రేమవల్ల కన్నీరు గార్చుచు తమభక్తులు పరిపూర్ణ సంతోషముతోను, ఆశతోను తమను స్వీకరించుటవలన గాక, యితరవిధముగ వారి యాకలిని తీర్చుకొని తృప్తిజెందుటకు అశక్తులై, జీవన మూలాధారుడును శాశ్వతుడై వెలయు చున్న తమదైవముయొద్దకు జ్ఞానప్రాప్తిని పొందవలెనను హృదయాను రాగముతో, తమ్మును స్వీకరింపవలయునను ఆశతో, గాఢమగు భక్తితో తమసన్నిధి కరుదెంచుటను జూచి, వారివలె గాఢమగు భక్తికాంక్షలు లేనివాడనైతినే యని, నాలో నేను తలంచుకొనుచు తలవంచుకొను చున్నాను.

2. ఈభక్తుల గాఢవిశ్వాసము దివ్య సత్ప్రసాదమున తామ నిజముగానే వేంచేసియున్నారని రూఢిపరచుచున్న ప్రబల గురుతై యున్నది. జేసునాథునితో కలిసియుండుటచే వారిహృదయములు స్నేహాగ్నిచే దీప్తినొంది, దివ్యసత్ప్రసాదమున తమకర్తను వారు గుర్తించ గలిగి యుందురు. ఇట్టి హృదయానురాగము దైవభక్తి, ప్రజ్వరిల్లుచున్న ప్రేమ

పలుమారు నాకు మిగుల దూరమునందున్నవి. స్వామీ నాయెడల కనికర హృదయులై యుండ ననుగ్రహింపుడు. నేను తమ బీద యాచకుడను. తుదకు కొన్ని సమయములందైనను దివ్య సత్ప్రసాద స్వీకార సందర్భమున భక్తులయెడ తాము చూపుచున్న హృదయానురాగమును లవమాత్రమైనను నే ననుభవింప గలుగునటు లనుగ్రహింపుడు. తామట్టుల దయచేయుదురేని, తమయెడల నాకుగల విశ్వాసము ధృఢమైనదై నా యాశ యధికమై మీయందు నాకుగల ప్రేమ పరిపూర్ణత నొందగలదు.

3. నే నాశించెడు వరప్రసాదమును నా కనుగ్రహించుటకును, తమ యిచ్ఛవచ్చినపుడు నాయందు తమకుగల ప్రేమచే నాకు తమ దివ్యదర్శన భాగ్యము నొడగూర్చుటకును, మీ కృప శక్తి కలదై యున్నది. ఏలయనగా: తమ యెడల నంత భక్తిగలిగి యుండువారివలె ప్రస్తుతము నా హృదయ మంత ఘనమగు భక్తికాంక్షలచే ప్రజ్వరిల్లకపోయినను, తమ యెడల ప్రేమగలిగి యుండెడు భక్తులతోపాటు నేనును పాలిభాగస్తుడుగ నుండవలయుననియు, నన్నును వారిలో నొకనిగా యెన్నవలయుననియు కోరుచు తమను ప్రార్థించుచున్నాను.

---

## సారాంశము

యోగ్యముగ జ్ఞానవిధమున దివ్యసత్ప్రసాదమును లోకొనుటయెట్లు

ఈ దేవద్రవ్యానుమాన స్వీకారమునకు ప్రత్యామ్నాయముగా త్రెంటు సభవారిచే నామోదింపబడి ఘనముగ శ్లాఘింపబడి అనుసరణీయమని పూజింపబడినట్టి జ్ఞానవిధ స్వీకారమును అన్ని వేళలయందును, అన్ని స్థలములందును జరుపవచ్చును. జేసునాథస్వామిని కుమారునిగ పొందగల్గిన భాగ్యశాలియగు పరిశుద్ధ మరియమ్మగారి ఘనతనుగూర్చి నమస్కారము లాచరించుచు, ఆ మహాతల్లి జేసునాథుని తన పవిత్ర గర్భమున ధరించియుండినపుడు యెట్టి భావయుక్తురాలై యుండెనో, అట్టి దివ్యభావములతో మనమును జ్ఞానవిధమున దివ్యసత్ప్రసాద స్వీకారము నెప్పటికప్పుడు జరుపుకొనవచ్చును. దీర్ఘదర్శి దానియేలుగారు

దేవాలయమునెడల యెట్టి హృదయానురాగములు గలవాడై యుండెనో, మనమును అట్టి హృదయానురాగములనే జేసునాథుని యెడల కలిగి యుండవలయును. మనము వారికి సర్వ సమర్పణమును గావింపవలయును. మహనీయమగు దివ్యపూజసమయమున జేసునాథస్వామి నిజముగ నచట వేంచేసి యున్నారనియెడు యుల్లాసముచేతను, నిశ్చయమగు నమ్మకముచేతను, వారితో నైక్యము నొందవలయుననెడి గాఢమగు కాంక్షచేతను ప్రేరేపింపబడవలెను. తన్ను దీనునిగ తగ్గించుకొనుచు, వారికి తనయెడల గల విశ్వాసమునకును, ప్రేమకును కృతజ్ఞత చూపవలెను. ఈవిధముగ చేయగల క్రైస్తవుడు "నేనిపుడు జీవించియున్నాను. నేను కాదు. జేసునాథస్వామే నాయందు నివసించుచున్నా" రని అపోస్తులగు అర్చ్యశిష్ట చిన్నప్పగారివలె చెప్పగలుగును.

---

## 15వ అధ్యాయము.

### హృదయ దీనత్వమువలనను, ఆత్మనిగ్రహము వలనను, దైవభక్తిని సంపాదింప గల్గుదుము.

1. జేసునాథస్వామి:- భక్తికొరకై నీవు మనఃపూర్వకముగ ప్రయత్నము చేయుచు దానికొరకై శ్రమపడ వలయును.

దానికొరకై మనఃపూర్వకముగా ప్రార్థింపవలయును. మిక్కిలి శాంతియుతుడవై గాఢవిశ్వాసముతో దానికొరకై కనుపెట్టుకొని యుండవలయును. అది యనుగ్రహింప బడినపుడు కృతజ్ఞతాపూర్వక వందనములతో స్వీకరింపవలయును. మిక్కిలి హృదయ దీనతను వహించి అనుగ్రహింపబడిన యీ వరమును కాపాడుకొనుచు, తెలివితేటలతో దానిని జాగరూకుడవై యుపయోగించుకొనవలయును. నీకీవర మనుగ్రహించుటకు నీదగ్గరకు రావలయునను తలంపు వారికి కలుగువరకు, వారు సంధింప దలచిన కాలమునను, సంధింప వలసిన పద్ధతిని వారికే వదలివేయుము. లేశమాత్రమైనను భక్తిలేనటుల గాని, లేక యొకానొక సమయమందుండినను, మిగుల స్వల్పముగ నున్నటుల గాని

అంతరంగికముగ నీవు గ్రహించునపుడు, నీవు దీనత్వమును వహింపవల యును. కాని చింతచే గ్రుంగుబాటు చెంద తగదు. మితిమీరి దుఃఖింప తగదు. దేవుడు చాలకాలమువరకు వరము ననుగ్రహింపక తిరస్కరించినను, కొన్ని సమయములందు దయచేయుచుండును. ప్రార్థనారంభమున యీయని వరమును వారు ప్రార్థనాంతమున అనుగ్రహించుదురు.

2. ఈ వరము తక్షణమే, లేక కోరిన వెంటనే యనుగ్రహింపబడినచో దుర్బలుడగు మానవుడు దానిని భరింపజాలడు. గనుక భక్తి యనెడు వరము కొరకై మిక్కిలి యాశతోను, దీనత్వముతో గూడిన శాంతముతోను కనిపెట్టుకొని యుండవలయును. ఐతే అట్టి వర మనుగ్రహింపబడకుండినపుడును, లేక యొకానొక సమయమున నీకు ప్రసాదింపబడి తిరుగ తొలగించబడినపుడును, అటులౌనట్లు బహుటకు నీవును, నీ పాపములే కారణములని ఆ లోపములను నీకే యారోపించుకొనుము. కొన్ని సమయములందేదియో యొక స్వల్ప కారణముచేతనే ఆ వరము నీకు యీయబడక పోవుట సంభవించు చుండును. అంత ఘనమగు వరప్రసాదమున కభ్యంతరము గావించుచున్న విషయము స్వల్పమైనదైనను అది యొక గొప్ప విషయముగనే యెంచవలయును. ఐతే నీకు విఘ్నకారియగు విషయమెంత స్వల్పమైనను, గొప్పదైనను దానిని నీవుతొలగించివైచుకొని, పరిపూర్ణముగ జయింపగలుగుదువేని, నీ కోర్కె సఫలీకృతమగును.

3. ఏలయన: నీవు పరిపూర్ణ హృదయముతో దేవునికి నిన్నర్పించుకొని నపుడెల్ల, నీ యిచ్ఛవచ్చినటుల నీ తృప్తి ననుసరించి నీ కది కావలయుననియు, నిదికావలయుననియు కోరిక కలుగును. పరిపూర్ణముగ దైవ యిష్టానుసారముగ నెరవేర్ప బహుటకై యాసింతువేని, నీవు వారితో నైక్యమై, శాంతము ననుభవింప గలుగుదువు. ఎందుకన: దేవునికి ప్రీతికరముగ ప్రవర్తించుట వలన నీ వనుభవింపగల యానందమునకన్న యెక్కువ ఘనమగునదేదియును లేదు. కనుక యే మానవుడైనను ఏకదీక్ష వహించిన, తనవాంఛలన్నిటిని దేవుని దిశకే మరల్చుకొని, సృష్టి వస్తువుల యెడ తనకు గల మితిమీరిన ప్రేమ లేక ద్వేషమును తన హృదయము నుండి తొలగించుకొను నాతడు మాత్రమే దైవభక్తి యనెడు వరమునకు అర్హతగలవాడు. "ఏ పాత్రలు ఖాళీగానుండునో ఆ పాత్రలనే

దేవుడు తన వరప్రసాదములతో నింపును" ఐహిక విషయములను మానవుడెంత యెక్కువ విసర్జించివైచునో, అంత యెక్కువగ నా మానవుడు స్వనిగ్రహము గావించుకొని యహంకార శూన్యుడగును. అట్టి మానవునకు శీఘ్రకాలముననే దైవ వరప్రసాదము లభించును. అట్టి వానికి స్వాతంత్ర్యము నొసగి, వాని నెక్కువ యున్నతస్థితికి గొనిపోవును.

4. అపుడాతడు తన కనుగ్రహింపబడిన వరప్రసాదమును గాంచి, దాని విస్తారతకు తనలో తానానందానుభవము గలవాడై యుండును. దాని విస్తారతను తలంచుకొని, యాతడు దేవుని మహిమను గూర్చి తలంచుచు పొగడుకొనుచుండును. వాని హృదయ మానందముచే నుప్పొంగును. ఎలయనగా దేవుని దివ్యహస్తము తనకేడుగడయైయున్నది. ఆతడు తనను శాశ్వతముగ దేవుని హస్తములయం దర్పించుకొనుచున్నాడు. ఏ మానవుడు తన పరిపూర్ణహృదయముతో దేవునికొరకై వెతకుకొనునో, యామానవుడు దేవుని దీవెనలను పొందిన భాగ్యశాలి. ఇట్టి మానవుడు దివ్యసత్ప్రసాద స్వీకారమువలన దేవునితో నైక్యమగును. ఏలయనగా ఆతడు తనస్వంత తృప్తిని తన యూరటలను లక్ష్యముచేయక దేవునియొక్క గౌరవమును మహిమను మాత్రమే గణించు చుండును.

---

## సారాంశము

దివ్య సత్ప్రసాద స్వీకారమువలన మనముపొందు ఫలములు:-

జేసునాథునితో మనము మిక్కిలి యన్యోన్యముగ చేరి యుండుటకును, వారిసద్గుణములను సద్భావములను మన ఆత్మయందు నిల్పుకొనుటకును దివ్య సత్ప్రసాదమును లోకొనవలసియున్నాము. అందుచేతనే పరిశుద్ధపాపుగారు, పూజనీయమగు నీ దేవద్రవ్యానుమానము జేసునాథుని మానవావతారముయొక్క విస్తృతమని నుడివిరి.

1. దివ్య సత్ప్రసాద స్వీకారమువలన, జేసునాథుని సద్గుణ భావములు మనయాత్మయందును, మన మనస్సునందును, హృదయమునందును ముద్రింప బడును.

2. వారి సహాయముచేత, వారికొరకును మనము జీవించి యుండునటుల చేయును. అనగా వారి ప్రేమప్రభావముచే ప్రేరేపింపబడి, వారిని తృప్తిపరచుటకు మాత్రమే మన జీవయాత్రను సల్పునటుల చేయును.

3. మన మెల్లప్పుడును పవిత్ర జీవనమునే జీవించుటకు శక్తినిచ్చును. అన్నివిషయములందును వారికొరకై వారియందే హృదయానురాగము గల వారమై ప్రవర్తింతుము.

4. బుద్ధిపూర్వకముగ నెట్టిపాపములను చేయక, తొలగియుండగలము. అట్టి పాపముల యెడల మనమేమియు, యనురాగము గలవారమై యుండక పరిపూర్ణ పరిత్యాగ మొనర్చుకొని, యహంకారమును చంపుకొని, వైరాగ్యమును వహించి యుండగలము.

---

## 16 వ అధ్యాయము.

## మన యవసరము లన్నిటియందు జేసునాథునికే మనవి చేసికొని, వారిదయకై ప్రార్థింపవలయును.

1. శిష్యుడు: ఓ మనోహరమూర్తి! పరిపూర్ణ భక్తితో తమను స్వీకరింపవలయునని నేనిపుడు కోరుచున్నాను. నాయందలి దుర్బలతయును నా యవసరములును మీకు తెలిసే యున్నవి. నేనిపు డెన్ని దుస్థితులందును, పాపము లందును మునిగియున్నది, నేనెంత యొక్కువగ శోధనల పాలై మోహములయందు తగుల్కొని సంకటము ననుభవించుచు కల్మషుడనై పోవుచున్నది, తమకు విశదమయ్యే యున్నది. వీని యన్నింటికి పరిహారోక్తి కొరకై తమ సముఖమునకు వచ్చుచున్నాను.

సర్వజ్ఞులరగు తమకు నేనిపుడు నా యాంతర్యమంతయును విశదము చేయుచున్నాను. నాకు సర్వసౌకర్యముల ననుగ్రహించి సాయము చేయగలవారలు తామే. నాకు మిక్కిలి యవసరమై నాయందు కొరతపడియున్న సద్గుణములు తమకు చక్కగా యెరుకయై యున్నవి.

2. నేనిపుడు నిరుపేదనై, దిగంబరినై తమదయకొరకు ప్రలాపిం చుచు, తమ వరప్రసాదము కొరకై యాశించుచున్నాను. ఆకలిచే దహించి పోవుచున్న యీ బీదయాచకుని కింత ప్రసాదమిడి పోషిం పుడు. ప్రేమజ్యోతి! నా అంధకారమును బాపి, జ్ఞానవికాసమును కలుగ జేయుడు. ప్రపంచ విషయములన్నిటిని ద్వేషింపగలిగెడు వివేకమును నాకుపదేశింపుడు. దుఃఖకరమగు విషయములను గూడ సహించి యుండ గలట్టి శాంతిని నాకు నేర్పుడు. ప్రపంచ విషయముల తృణీకరింపగల ఉదారభావమును నాకనుగ్రహింపుడు. నా హృదయమును తమదెసకు మరల్పుడు. విషయానురాగములయందే బడి ద్రిమ్మరుచు కొట్టుకొన కుండునటుల కాపాడుడు. తామే నా ఆహార పానీయములు. తామే నా ప్రేమానందములు. తామే నా మాధుర్యము, నా సర్వశ్రేయస్సును! అందుచే నికముందు సర్వదా తాము మాత్రము నా మనోరంజకులుగా నుండుడు.

3. తమతో ఆంతరంగిక మైక్యతను బడసిన వాడనై, గాఢమగు ప్రేమాగ్నిచే దహించి తమతో నేయుండునటుల నన్ను తమలోనికి మార్చుకొనుడు. తమ సముఖమునుండి ఆకలి దప్పులతో నన్ను వెనుకకు పోనీయకుడు. తమ అర్చ్యశిష్టులయెడల తామెటుల ఘనకార్యముల నాచరించియుండిరో, అటులే నా యెడలను ఆచరింపుడు. తమ ప్రేమా గ్నిచే నా హృదయమును పవిత్రపరచి, జ్ఞాన వికాసమును గలిగించెడు ప్రేమాస్వరూపులై యున్నారు. కావున నేను తమ ప్రేమాగ్నిచే రగి లింపబడి, అహంకారమును చంపుకొని యుండగలుగుదునన్న నొక వింత గాదు!

---

## సారాంశము

జేసునాథస్వామి మనకు నీతిబోధలు సల్పి, తాము బోధిం చిన నీతిమార్గముల నన్నిటిని తాను నిదర్శన ప్రాయముగ ననుస రించి మనకు జూపి, మనముక్తి కొర కవసరములగు సద్గుణము లన్ని టిని, మనకు తమ వరప్రసాదముచే యనుగ్రహించి, తామే స్వయముగ నరుదెంచి యీ సద్గుణముల నన్నిటిని మనయందు ముద్రించుట కొరకై

పూజనీయమగు దివ్యసత్ప్రసాద దేవద్రవ్యానుమానమును స్థాపించియున్నారు. మన కుండవలసిన సద్గుణములన్నిటియందును,

మొదటిది దీనత్వము:-

దీనినిగూర్చి వారు యీ మహాదివ్య సత్ప్రసాదమున మనకు ప్రబల దృష్టాంతమై మార్గదర్శియై యున్నారు. ఈ దేవద్రవ్యాను మానమున వారెవరికిని గోచరము గాకుండ, వేంచేసియుండెదరు. వారు మానవావతారమును వహించియుండునప్పుడు వారి దైవత్వము మరుగుపడియుండెను. ఐతే, మహాదివ్య సత్ప్రసాదమున వారి మానవత్వముగూడ, గుప్తము చేయబడినదై యున్నది. విశ్వాసనేత్రములకేగాని మనుష్యావతారమును ధరించిన దేవుని లక్షణములేవియును గాన్పింపవు.

కావున మనప్రవర్తన

1, గోప్యమై, నికృష్టమై యుండవలెను.

2. పరులవలని శ్లాఘ్యత, ఖ్యాత, గౌరవము మొదలగు వానియెడల విముఖతగలిగి, పాపులగు మనయెడల పరులు తృణీకార భావమునే చూపుచుండవలయునని కోరుకొను చుండవలయును.

3. మనయందలి సద్గుణముల నాడంబరముగ ప్రపంచమునకు ప్రదర్శింపుకొనక, దేవుని తృప్తికొరకు మాత్రమే చేయువలెను.

4. దేవుని సముఖమున మనలను నీచపరచుకొని, దీనత్వమును వహించి ప్రవర్తించుటచేత తప్ప, వేరువిధముగ వారిని గౌరవింపజాలమను నమ్మకమును గలిగి యుండవలయును.

5. మానవుల మెరమెప్పులకుగాక, దేవునియెడల మనకుగల భక్తి మర్యాదలతో మెలగవలయును.

---

## 17. వ అధ్యాయము

### జేసునాథుని స్వీకరించుటకై గాఢమగు ప్రేమను, బలమగు కాంక్షను గలవారలమై యుండవలయును.

1. శిష్యుడు:- పవిత్రజీవనము సల్పుటవలన తమకు మిక్కిలి ప్రియులమగుదుమని, తీవ్రమగు భక్తితో అర్చ్యశిష్టులు దివ్యసత్ప్రసాదమును లోగొనుచుండిరి. వారివలెనే నేనును, మిక్కిలి ఘనమగు భక్తితోను, ప్రజ్వరిల్లుచున్న ప్రేమతోను, హృదయపూర్వకతతోను, అనురాగముతోను, తమను లోగొనవలయునను కాంక్ష గలవాడనై యున్నాను.

2. ఇట్టి భక్త్యానుభవమును గలిగియుండుటకు తగిన యోగ్యత లేనివాడనైనను, నాకోర్కెలన్నిటిని నా పరిపూర్ణ హృదయానురాగమును తమకే యర్పించుచున్నాను. అంతేగాక దైవభక్తిగల మానవుడు, యోగ్యముగ తన మానసమున యోచించుకొనగలినట్టియు, కాంక్షింపగలినట్టియు సర్వమును మిక్కిలి మర్యాదతో తమకు కానుకగా నేనర్పించుచున్నాను. నాయందేదియును నాకొరకై దాచియుంచుకొనక, నన్ను నా సర్వస్వమును ధారాళముగను మిక్కిలి సంతోషముతోడను తమకర్పణ చేయుచున్నాను. నా రక్షకా! మిక్కిలి పూజనీయురాలగు తమ ప్రియ జననియు కన్యకయునగు మరియమ్మగారికి తమ మనుష్యావతార పరమరహస్యమునుగూర్చి దేవదూత తెలియపరచినపుడు "లోకేశ్వరుడగు మహోన్నతుని దాసురాలను, నీవు తెలిపియున్న ప్రకారము నా యందు జరుగునుగాక." అని ఆమె మిక్కిలి దీనత్వముతోను, భక్తితోడను చెప్పియుండెనుకదా! ఆమె తమను కోరి స్వీకరించిన విధమున నేనును అట్టి యనురాగముతో, స్తోత్ర గౌరవములతో, కృతజ్ఞతతో, ప్రేమతో, నమ్మకముతో, పవిత్రతతో నీ దినమున మిమ్మును స్వీకరింపవలయునని కాంక్షించుచున్నాను.

3. అర్చ్యశిష్టులలో నగ్రగణ్యుడును మీకన్న ముందు మీదూతగా నరుదెంచియున్న బప్తిస్త జ్వాన్నెసు తన తల్లిగర్భమునందుండగనే స్పిరితుసాంక్తువలన పరిశుద్ధుడై, తమ సాన్నిధ్యమునందు సంతోషముచే గంతులువైచెను. పిమ్మట తమరు మానవులతో గలసి తిరుగుచుండగా

గాంచి, మిక్కిలి దీనత్వముతో "స్నేహితుడు పెండ్లికుమారుని సముఖ
మునకు చేరి పెండ్లికుమారుని కంఠధ్వనిని మాటలాడుచుండగా విని
మిక్కిలి సంతోషముచే నుప్పొంగును." అని చెప్పియున్నాడు. అదే
రీతిని నేనును, సంతసింప నాశగలవాడనై యున్నాను. కావున భక్తి
పూర్ణహృదయులగు వారలయొక్క ఆనందమును, తీవ్రమగు వారి హృద
యానురాగములను, పొగడశ్యతలను, స్వాభావాతీత జ్ఞానవికాసములను
దైవదర్శనములను యీలోకమునందును, పరలోకమునందును పొందు
చున్నట్టియు ముందు పొందగలట్టియు, స్వర్గవాసులస్తుతితో నాస్తుతులను
చేర్చి నా శ్రేయముకొరకును ప్రార్థింపుమని నన్నడిగిన వారలకొరకును
తమ కర్పించుచున్నాను. అందరిచేతను తమరు మిక్కిలిగ నుతింపబడి
మహిమ పరుపబడుటకై నేనటుల చేయుచున్నాను.

4. ఓ నా దైవమా! తమను సర్వదా నుతించుచు, పొగడుచుండ
వలయునను నా కాంక్షలన్నిటిని స్వీకరింపుడు. వర్ణింపనలవిగాని తమ
మహోన్నతమగు ఘనతకు తగినట్లుగా నేనట్టి కోర్కెలను, స్తుతు
లను, పొగడ్తలను, న్యాయముగ తమకు నర్పింపవలసిన వాడనై
యున్నాను. ప్రతి దినమును, ప్రతి నిముసమును తమకర్పింపవలయునను
యాశ కలవాడనై యున్నాను. నాతోగలసి తమను స్తోత్రించుటకును
తమకు వందనము లర్పించుటకును, స్వర్గనివాసులగు యోగ్యులనందరిని
ప్రార్థింపుచు, విశ్వాసముగల వారలనందరిని హృదయానురాగముతో
బ్రతిమలాడుకొను చున్నాను.

5. సకల జాతులును, పలువిధ భాషలు మాటలాడు వారలును
తమను స్తోత్రముచేయుదురుగాక! పావనమును మనోహరమగు తమదివ్య
నామమును వారలు మిక్కిలియానందముతో, జయజయ గానములతో,
తీవ్రమగు భక్తితో పొగడుదురుగాక! భయభక్తులతో యెవరు దివ్య
పూజ నర్పించి, పరిపూర్ణ విశ్వాసముతో దివ్య సత్ప్రసాదమును స్వీక
రించుదురో, వారు తమ దివ్య హస్తములనుండి అనుగ్రహమును, కరు
ణను పొందుట కర్హులగుదురుగాక. పాపినగు నాకొరకై మిక్కిలి
దీనత్వమును వహించి తమను ప్రార్థింతురుగాక. వారు కాంక్షించు
దైవభక్తిని సంతోషకరమగు దైవ ఐక్యతను బడసి, పవిత్రమగు నీ దివ్య
విందునుండి ఆదరణను పొందుదురుగాక.

దివ్య పూజయందు పవిత్ర పదములను గురువు ఉచ్చరించిన తోడనే, మీరు ఆచార్యునియెడల అద్భుత విధేయతను కనుపరచుచు, దైవపీఠముపైకి వేంచేసి, మానవులు మిమ్ము తమ యాత్మలలోనికి స్వీకారముచేయువరకు, అచ్చటనే కనిపెట్టుకొని యుందురే! దివ్యసత్ప్రసాదమునకు మేము చూపవలసినప్రవర్తనను పరిపూర్ణ విధేయతను మీరు మాకు చూపుచున్నారు. సర్వస్వతంత్రుడవగు దేవా! మానవుడు తమయెడల విధేయుడై ప్రవర్తించుట కంగీకరింపక, తప్పి వర్తించుచుండగా, తాము జగత్కర్తలైయుండియు లేశమాత్రమేనియు కాలయాపనముచేయక, మానవునకు విధేయులై వర్తించుచున్నారు. ఇదియంతయు మాకు మిగుల సంభ్రమమును ఆశ్చర్యమును కలిగించు విషయముగ నున్నది. ఈ మహాత్కార్యమును మేము గ్రహింప జాలకున్నాము. ఈ దివ్య దేవద్రవ్యానుమానమునందుండు జేసునాథునియెడల, కొందరు హేయభావమును, కొందరు అలక్ష్యతను, మరికొందరు అమర్యాదను కనపరచు చున్నారు. వీరందరును దేవునియెడల లేశమాత్రమేనియు భక్తిగలిగియుండక, స్వప్రేమయందును, ప్రపంచ విషయములందును అనురాగము గలవారలై యున్నారు. ఐయినప్పటికిని, జేసునాధు డీసందర్భములో మిక్కిలి తాలిమిని వహించియుండి, మనకు తమ మార్గమునే బోధించుచు, తాలిమిగలిగి యుండవలయునని సద్బోధగావించుచు ప్రోత్సాహించుచున్నారు. మరణమును తెచ్చిపెట్టెడు పాపవిషయములందును, పాపకరములగు యలవాటులయందును మునిగి యుండుటచే, దోషములై యున్నట్టియు మోక్షసంపాదనకే మాత్రమును సహాయకారులు కానట్టియు జీవయాత్రలు సలుపుచున్న అనేకులకు జేసునాథస్వామి విధేయత తాళిమియను పాఠములను నేర్పుచున్నారు. మానవ మాత్రులందరును వారియెడల యీరీతిని దుష్టవర్తనులై వర్తించుచున్నను, తప్పిపోని పవిత్ర తాళిమితో, దౌర్జన్యముల నన్నింటిని యోర్చుకొని, అందుమూలముగ మనమును వారివలెనె, పరులు మనయెడల చూపెడు వైరుధ్యములను, మనకు కావించెడు యపకారములను సహించి యుండవలయునని బోధించుచు, అట్టి సహనమునే మనయందును లేపెట్టుచున్నారు.

## 18 వ అధ్యాయము.

### మానవుడు దివ్యసత్ప్రసాద మందలి రహస్యము నెరుంగ వలయునను జిజ్ఞాసాపరుడై యుండక, దీనత్వమును వహించి, తన యింద్రియ జ్ఞానము తన పవిత్ర విశ్వాసమునకు లొంగియుండు నటుల చూడవలయును.

1. జేసునాథుడు:-నీవు సందేహాంబుధియందు మునిగి పోకుండవలయు ననిన, అగాధమును మిగుల గంభీరమైన దివ్యసత్ప్రసాద దేవద్రవ్యానుమానమును గూర్చి నిష్ప్రయోజనమైన పరిశోధనలను గావింపక, జాగరూకుడవై యుండుము. దైవ మహిమలను పరిశోధింప దలచువాడు దైవ మహిమాప్రభావముచే ముంచివేయబడును. మానవుడు గ్రహింపజాలని దానికన్న, దేవుడెక్కువ పవిత్రుడై యున్నాడు. ఆదినుండి వేదశాస్త్రిలు బోధించెడు సిద్ధాంతముల నాలకించి, వారి యుపదేశముల ననుసరించి ప్రవర్తించుట కెల్లప్పుడును సిద్ధమై యుండువారలు, పావనమగు దీనత్వమును వహించి సత్యాన్వేషణకు గడంగవచ్చును.

2. వివాద మార్గములను విసర్జించి, స్పష్టమైన సత్యములను దైవ నిబంధనల ననుసరించుచు ప్రవర్తించు మానవుడే భాగ్యశాలి. అనేకులు మహోన్నతమగు విషయ జిజ్ఞాసల యందుబడి, దైవభక్తిని కోల్పోవు చున్నారు. నీవు దేవునియందు విశ్వాసము గలవాడవై నిష్కపటమగు జీవయాత్రను చేయవలసియున్నావు. బుద్ధితో దేవుని మహిమా రహస్యములనుగూర్చి లోతుగ పరిశోధనలు చేయగలవాడవు కాదు. సాధారణ విషయములనే నీవు గ్రహించి మనసున కెక్కించుకొనజాల కుండునపుడు, నీ బుద్ధి కతీతమగు అంశముల నెటుల గ్రహింపగలవు? దేవుని యెడల విధేయత గలవాడవై వారికి నిన్నర్పించుకొని, నీ యింద్రియానుభవమగు జ్ఞానమును దేవుని యెడల ప్రేమకు లొంగియుండ చేసికొనియెదవేని, నీ కవసరమగునంత జ్ఞానప్రకాశము నీ కనుగ్రహింపబడును.

3. దివ్య సత్ప్రసాదరహస్యమును గురించి కొందరు ఘోరముగ పరిశోధింప బడుచున్నారు. అయితే ఇట్టి స్థితి వారల యందలి లోపముల వలన సంప్రాప్తింపక పోవచ్చును. వారి శత్రువుయొక్క పనియై యుండవచ్చును. ఇటుల నీ మానసమున తట్టుచుండు తలంపులకు మనోవ్యాకులత నొందకుము. నీ యోచనలతోడ నీలో నీవు వాద ప్రతివాదన పెట్టుకొనకుము. పైశాచిక ప్రేరేపణచే నీ మానసమున తోచుచుండు సంశయములకు జవాబులు కనిపెట్టు ప్రయత్నమును గలిగియుండకుము. దైవ సద్బోధలయందు మాత్రము విశ్వాసమును గలిగియుండుము. అర్చ్యశిష్టులును, దీర్ఘదర్శులును బోధించియున్న అంశములందు నమ్మకము గలవాడవై యుండుము. క్రూరుడగు నీ శత్రువు నీ దగ్గరనుండి పలాయనమై పోవును. పై విధముగ దైవ సేవకులు పలుమారులు బాధలు పడుచుండుటయే మిగుల లాభకరము. ఏలయన: పిశాచము యిదివరకే తాను వశపరచుకొని యున్న విశ్వాసహీనులను పాపులను మోహమునందు ముంచి పరిశోధించుటలేదు. కాని దేవునియందు విశ్వాసమును భక్తినిగల వారలనే మోసము చేయుచు తొందరపెట్టుచు, ననేకరీతుల వారికి ఉపద్రవములను కలుగ జేయుచుండును.

4. కనుక నిష్కపటమును, నిస్సంశయమును అగునట్టి విశ్వాసముతో ముందుకు సాగిపొమ్ము. దివ్యసత్ప్రసాద స్వీకారమునకు మిక్కిలి దీనత్వమును వహించి భయభక్తులలో మెలగుము. నీవు గ్రహింపజాలని విషయము లేవిగలవో వానినన్నిటిని భద్రముగ సర్వశక్తుడగు సర్వేశ్వరున కర్పింపుము. దేవుడెపుడును నిన్ను మోసము చేయడు. ఏమానవుడు తన్ను తాను అమితముగ నమ్ముకొని యుండునో, ఆ మానవుడు మాత్రమే మోసగింపబడును. నిష్కపటవర్తనులతో కలిసి, దేవుడు తిరుగాడుచుండును. దీనత్వమును వహించి యుండువారలకే దేవుడు తన దర్శనమును దయచేయును. అల్పులకు మాత్రమాయన విషయగ్రహణశక్తి నొసంగును. పావన మానసులకు జ్ఞానకవాటములను దెరచును. జిజ్ఞాసులకును గర్వులకును తమ వరప్రసాదముల ననుగ్రహింపక దాచియుంచును. మానవుని యోచనాశక్తి మిక్కిలి బలహీనమైనది. అందుచేనది మోసగింపబడుచుండును. అయితే దేవుని యందలి సత్యమగు విశ్వాసమెపుడును మోసగింపబడదు.

5. మానవ వివేకమును స్వాభావిక పరిశోధనయును, విశ్వాసము నను సరించి పోవుచుండవలయును గాని, దానికి ముందుగ గాని, లేక దానికి వ్యతిరేకముగ గాని పోరాదు. ఏలయన యీ సందర్భమున విశ్వాసము ప్రేమ మిక్కిలి ప్రధానము లైనవి. మిక్కిలి పావనమును అమోఘమున గునట్టి యీ దివ్యసత్ప్రసాదమునందీ రెండును నిగూఢమై, పరుల కగో చరమగు మార్గముల ద్వారా పనిచేయుచుండును. శాశ్వతుడును, అగమ్యా గోచరుడును అపారశక్తివంతుడునగు దేవుడు ఇహపరలోకములందు మన మూహింపజాలని ఘనకార్యములను చేయుచున్నాడు. వారాచరించెడు వింతకార్యములను పరిశోధింప నెవ్వరికిని సాధ్యము కాదు. నిర్మాణ కార్యములు మానవుని వివేచనాశక్తిచే గ్రహింప బడగల వగుచో, అవి మిక్కిలి విస్మయ భరితములనియును, వర్ణనాతీతములనియును భావింప వీలుపడదు.

---

## సారాంశము

పైని చెప్పినరీతిని విశ్వాసరహస్యమునందు మానవుని వివేచనా శక్తిని జిజ్ఞాసను దేవుని వరముల ననుసరించి దివ్యసత్ప్రసాదములోని మన విమోచనాకర్తయగు జేసునాథుని యొక్క పవిత్రప్రేమకు బలిగా సమర్పించుటయే మిక్కిలి యానందకరమైన విషయము. అర్చ్య॥ బెర్నా ర్డుగారు వక్కాణించియున్నటుల, దివ్యసత్ప్రసాదమున జేసునాథస్వామి మనయందరియొక్క పరిపూర్ణ ప్రేమయై యున్నారు. ట్రెంటుసభ చెప్పిన ప్రకారము యీదేవద్రవ్యాను మానమున వారుతమ పవిత్రప్రేమా భాగ్యము నంతయును మన హృదయములందు నింపివేయు చున్నారు. వారనుగ్రహించెడు ప్రేమ, మిక్కిలి యపారమైనది. అట్టి పరిపూర్ణ ధారాళ ప్రేమచే పూర్తిగా తమ్మునే మన కర్పించునటుల ప్రేరేపింపబ డుచున్నారు. తమ్ము లేశమాత్రమైన దాచియుంచుకొనక, అతి వ్యయ ముచేయు మానవునివలె వారు తమను మన కర్పించుచున్నారు. తమ ప్రాపంచిక జీవితమును ముగింపు చేయబోవుచుండు సమయమున, వారు స్థాపించిన యీ దేవద్రవ్యాను మానమునందు, వారు మనయెడ జూపిన ప్రేమ అట్టిదై యున్నది. ఐక్యపరచుకొనుటచే మన హృదయములను వారి స్వాధీన మందుంచుకొని అందుమూలముగ మనము దైవజీవనమును

జీవింపగలుగుటకై వారలటు లాచరించి యున్నారని పవిత్ర గ్రంథము చెప్పుచున్నది. దివ్యప్రసాద దేవ ద్రవ్యానుమాన స్థాపనయందలి జేసు నాథుని శ్లాఘనీయమగు యోచనలివియై యున్నవిగాన, అట్టి దేవద్రవ్యానుమానమును మిక్కిలి యోగ్యముగ వినియోగించు కొనుచు, వారి యుద్దేశముల కనుగుణ్యముగ ప్రవర్తించుట మన విధియై యున్నది.



సంపూర్ణము